రైతు వాల్మీకి ప్రజాకవిశేఖర

# శ్రీమాన్ వానమామలై జగన్నాథాచార్యుల కావ్యములు రైతురామాయణము పరిశీలన

కాకతీయ విశ్వవిద్యాలయం వారి

డాక్టరేటు పొందిన సిద్ధాంత గ్రంథము


డా॥ డింగరి రామాచార్య

ఎం.ఏ., పి.హెచ్.డి.

ఆంధ్రోపన్యాసకులు,

ప్రభుత్వ జూనియర్ కళాశాల, కోరుట్ల.

Vanamamalai Jagannadha Charyula Kavyamulu

# RAITU RAMAYANAMU-ANUSHEELANAMU

A Critical Study of Vanamamalai Jagannadha Churyulu's Raitu Ramayanamu & his other warks by

Dr. DINGARI RAMA CHARYA
M.A., Phd.
Lecturar in Telugu Govt. Jr. College
KORATLA-505 326, Dist. Karimnagar

వానమామలై జగన్నాథాచార్యుల కావ్యములు

# రైతురామాయణము - పరిశీలనము

డా॥ డింగరి రామాచార్య

ప్రథమ ముద్రణ: వేయి ప్రతులు

శ్రీధాతనామ సంవత్సర చైత్రం

మార్చి 1996



ప్రచురణ: "మయూర" ప్రింటర్స్, మిషన్ హాస్పిటల్ ఎదురుగా,
కరీంనగర్-505 002.

వెల: 120/- రూపాయలు

ముద్రణ: చైర్మన్ కోరుట్ల గ్రూప్ ఆఫ్ కంపనీస్, కోరుట్ల-505 326.

ముఖ చిత్రం: శ్రీ బి.యస్. నారాయణ

ప్రతులకు:
శ్రీమతి వైజయంతిమాల
1) 157, హౌజింగ్ బోర్డు కాలనీ,
కరీంనగర్. (ఆం.ప్ర.)



రైతు వాల్మీకి ప్రజాకవిశేఖరులు

## శ్రీమాన్ వానమామలై జగన్నాధాచార్యులు

**జననం: 12-6-1907** **నిర్యాణం: 28-6-1995**

# స్మృత్యంజలి

వియత్తలం మారుమ్రోగ
విశ్వమానవత మేలుకొనగ
ఝళిపించిన మీ కలం
నినదించిన మీ గళం
మూగవోదు మరుగు పడదు
తరతరాలకు ఊపిరులు పోస్తుంది
సర్వాభ్యుదయ కావ్యాలకు పురుడులు పోస్తుంది
మేము-మీ
ఎట్లు మరతుము మీ
అనవద్య మనోజ్ఞమౌ గాంధర్వ గానకళారసధుని
సరస కవితా పిపాసులకది ఆమని,
ఎట్లు మరతుము మేము మీ

తిరుమణి తిరునామ తిరుముఖ
రసభావ దరహాస భాగ్యోదయ రేఖ
విశిష్ట సదాచార సంప్రదాయ ప్రతీక
తెలంగాణోద్యమ ప్రజాకవిశేఖరా
రైతు వాల్మీకీ-రైతుకవీ।
అనేక సాహితీ పురస్కారాలతో
సాహితీ జగత్తులో వేవెలుగుల వెలిగిన భాస్వన్మూర్తి।
సత్కర్మిష్ఠి, కృషి తేజస్వీ
వ్యథార్త జీవిత యథార్థ దర్శన
కావ్య రచనా మనస్వీ
గాంధీజీ కలలుగన్న రామరాజ్య స్థాపనకు
కావ్యహృదయావిష్కరణంజేసిన మహాకవీ।
వనమాలి పద్యసన్నిధి చేరిన-వానమామలై జగన్నాధాచార్యా
అంజలులూ స్మృత్యంజలులూ।





కృతిపతి

శిరోమణి వికాస్, ప్రైడ్ ఆఫ్ ఆంధ్ర అవార్డుల గ్రహీత

చైర్మన్ కొరుట్ల గ్రూప్ ఆఫ్ కంపనీస్

ప్రముఖ పారిశ్రామిక వేత్త శ్రీపోతని చంద్రశేఖర్

B.Sc., (Hons), M.Ed.

# అంకితము

శ్రీదము సకల కళా విలసితము
కరినగరపు కోట కోరుట్ల వీట
వైద్య విద్యామణి కిరీటం
భిషగ్వర పోతని వంశ సుధాబ్ధిసోమా।
శ్రీమతి విజయలక్ష్మి సమేత సంపల్లలామా।
పుత్ర కళత్ర భృత్య బంధుమిత్ర
సంసేవిత సంభావిత ప్రేమాభిరామా।
అనవద్య హృద్య వచోభిరామా
స్నేహశీలీ-ధీరోదార వితరణశీలీ।
కరుణార్ద్ర హృదయా।-మృత్యుంజయా
సంతోష ప్రియా
మాన్యశ్రీ చంద్రశేఖరా।
కవి పండిత కళాకారులకు కల్పతరువు
నీదారమే జీవినాధారమేధాత్రి
నీ సూత్రమే మాకల్ల నిజము మంగళ సూత్రమన్న
పద్మశాలి సంఘాధ్యక్షా। స్వజనరక్షణ సంకల్పబలుడు
కృషి కతవస్వి ప్రధానాచార్యా। అధ్యాపన విరాజిత మనస్వీ
దేవాలయ నిర్మాదిక దాన సద్ధర్మ
ఆధ్యాత్మిక చింతనా తేజస్వీ
ఉద్యోగ కల్ప బహుకార్య సాధక
ఫైనాన్సు ఇండస్ట్రి గృహవసతి స్థాపక యశస్వీ
ఎందరో అశ్రాంత దరిద్ర పీడితులకు
ఎందరెందరో బంధు జనులకు
ఆశ్రిత కల్పతరువై అంకస్థ పేటివై
కరుణా సింధువువై కొంగు బంగారమవై
గృహస్థాశ్రమ సద్ధర్మ కర్మాచరణుడవై

లోకసభాధ్యక్ష శివరాజ పాటిల్
మల్లికార్జున బలరామ జక్కర్
కేంద్రామాత్య మహోదయులచే
సన్మాన సత్కృత బిరుదాంచితుడైన
శ్రీ పోతని చంద్రశేఖరా మీకు విజయోస్తు!
అద్దిరా! "ప్రైడ్ ఆఫ్ ఆంధ్రా" బిరుదాంచితా!
భళిరా! రాజీవ్ ఎక్సెలెన్స్ అవార్డ్ గ్రహీతా!
వహ్వారే! శిరోమణి వికాస పురస్కార రంజితా!
జయహో! రాష్ట్రియ కృషి ఉద్యోగ సమ్మాన విభ్రావితార్థ!
అన్వర్థాభిధాన చంద్రశేఖరా!
విజయోస్తు-సన్మంగళాని భవంతు! |||
ఏమా! పలుకరింపులలో మధుర
మధుబిందు చిలకరింపులు
వదాన్యతలో రంతి శిబిదధీచి కర్ణ కనికరింపులు
స్ఫూర్తిలో రవిశశి కాంతి నిగారింపులు
కనుచూపులో కరుణ కాంతెరీ విదర్భా లాలకరింపులు
రోటరీ క్లబ్, టీచర్స్ క్లబ్, యంగ్‌మెన్స్ క్లబ్ అధ్యక్షా
సత్కీర్తి సాపేక్షా! దేశోన్నతి కరణ దీక్షా దక్షా
సకలార్థ సాధక ఫైనాన్స్ సంస్థాపక
లక్ష్య లక్షణ మార్గదర్శక కార్యనిర్వహణా దక్షా
దారిద్ర్య రక్షో సంపీడిత ఆపన్న దీనావనా దీక్షా
మీ నడవడి శ్రమశక్తికి రాచబాట
మీ నిండు మనసు అశ్రితులకు పెట్టనికోట
అలుపన్నది లేక విరామమెరుగక
పరిశ్రమించే మీ ఆదర్శ మూర్తిత్వం
సత్కర్మాచరణ శీలురకు మార్గదర్శకం
పారిశ్రామిక వైవిధ్యంలోని
ప్రతి అంచు మీ మేధకు పట్టుబడియె
నిరుద్యోగ అయోమాపుర నర్తకి

గుండియలు వీళ్లు బడియె
ఆస్ట్రియా, అమెరికాది దేశాల్లో మీకీర్తి చాటవడియె
జన జీవన చేతన రోచిస్సులలో
మహోన్నత ప్రగతి శిఖరాల అంచులపై
నవజీవన కేతనాలెత్తి
మహోదయ జీవన వ్రిస్తారాన్ని ఆహ్వానిస్తూ
జీవన రేఖల్లో ప్రగతి ఉషస్సుల విరజిమ్ముతూ
అదుపు పొదుపు మడుపుగల
ఆదర్శ కుటుంబం ఎదుగుదలలో
నూతన శకానికి నాందీ పలుకుతూ
ఏకవింశచ్ఛాఖా పరివ్యాప్త
కోరుట్ల గ్రూప్ ఆఫ్ కంపనీస్ కల్పద్రుమ
చ్ఛాయా పరిశ్రాంత సంపత్‌యుతా!
ఇంటింటికి దీపమై అంకిత సేవా భావంతో ముమ్ముందుకు నడుస్తున్న
ఆగ్రో ప్రొడక్ట్స్ జింక్ ఇండస్ట్రి, కోరుట్ల ఇండస్ట్రి, ఇండియా స్పిన్నింగ్
మిల్స్, సహకార కళాశాలాది సంస్థాపక సద్వినుతశీలా!
మీ స్వచ్ఛరిత్ర బహుధా శ్లాఘనీయం.
కళ కళకొఱకు గాక
సమాజ వికాసం కొఱకని
ధనార్జన ధనం కొఱకుగాక
సకల సంపత్సమాజ సమృద్ధి కొఱకని
ఆధ్యాత్మిక రక్తి భక్తి ముక్తికేగాక
పాప నిష్కృతికి, సర్వాత్మక చైతన్యానికని
దీన హీన మ్లాన పేద భేధ భావమెంచక
అందర ఔన్నత్య వికాసాలకు
అంతో ఇంతో ఎంతో దానధర్మాలొనరస్తూ
మంచికి నికేతనమై
మానవతా కేతనమై
జాతిదీప్తి పతాకమై ఒనర్చె

మీ సేవలు త్రికాలాలకు మానవా దర్శాలు
సర్వ జన సుఖాయ
సమస్త ప్రజ హితాయ
పల్లె వాకిళ్ళను తట్టి
ఎదఎదల బాధల లిదెసి జీవనజ్యోతుల వెలిగిస్తూ
వినిమయ వినియోగ దారులకు వద్దకు
సంపద జేర్చే మీ ఆశయం
ముందు తరానికి స్ఫూర్తి
విపణి వినిమయ సంస్థలకు పునాది
నా జీవితానికి వెలుగై
నా సాహితీ కృషికి అదరువై
దాతవై కృతి భర్తవై
రైతు వాల్మీకి రైతురామాయణ
ప్రజాకావ్యాన్ని అంకితంగొన్న
పీవిజీ బాట నడచి
నా యీ సిద్ధాంత గ్రంథాన్ని స్వీకృతి గొనుమా
సాహితీ లోకాన్ని రసానంద సుధలు పంచిన
అభినవ కృష్ణరాయా।

మాన్యశ్రీ పోతని చంద్రశేఖరా।
మీకు ఆనందతుందిల జనస్పందన
అభినందన చందనాలు. సర్వేశ్వరుని సత్కృపచే మీకు సదా కలుగుగాక ఆయురారోగ్య ఐశ్వర్య సర్వాభ్యుదయ నిశ్శ్రేయసాలు.



# స్వీకృతి

"రైతురామాయణము తెలుగుజాతి యెంతకాలముండునో తానంతకాల ముండును. రైతు లేనిది భారతజాతి లేదు" అన్న తెలంగాణోద్యమకవి సింహం కళాప్రపూర్ణ దాశరథి మాటలు అక్షరసత్యాలు. ప్రజాకావ్యం రైతు రామాయణం ప్రధాని మాన్యశ్రీ పి.వి. నరసింహారావుకు అంకిత మివ్వ బడింది. శ్రామిక, కర్షక, కార్మికలోక కళ్యాణాన్ని కాంక్షించే ఈ కావ్యంలో తెలంగాణా గ్రామీణ జీవన వికాసం ఎన్నెన్నో అంచులు తీరుకుంది. ఈ మహాకవి సత్తమునకు రైతు వాల్మీకి ప్రజాకవి శేఖరులు అనే బిరుదా లిచ్చిన సాహితీలోకం ఎంతయు అభినందనీయం. జనన్నాథాచార్యాల కృతుల అనుశీలనమునకు కాకతీయ విశ్వవిద్యాయలం డా॥ డింగరి రామాచార్యకు డాక్టరేటు ప్రసాదించినందులకు హర్షిస్తున్నాను.

పల్లెపట్టులు పట్టణాలకు ఆయువు పట్టులన్న విషయం, గాంధీజీసమాజ వాదం, ధర్మ కర్తృత్వ సిద్ధాంత విశ్లేషణం, నిజాం రాష్ట్ర మైన తెలంగా ణాను స్వర్గసీమగా తేజరింప జేయాలన్న ఆకాంక్ష, మానవతావాదం శిఖ రాయమానంగా సువ్యవస్థితంగాప్రతిపాదింపబడి అనుశీలంపబడిన సిద్ధాంత వ్యాసం గంథరూపం పొందాలన్న తపనపరిశోధకునికోరిక నెరవేర్చబడింది మిత్రులు, సద్విమర్శకులు ఉపన్యాసకులు డా॥ డింగరి రామాచార్య నన్ను అభిమానించి ఈ కృతిని నాకు అంకితమిస్తున్నందులకు సంతోషం, ఈ పరిశోధన గ్రంథం పారిశ్రామికలోకాన్ని సభ్యసమాజాన్ని కర్తవ్యో న్ముఖం జేస్తుంది. సమజ శ్రేయస్సును కాంక్షిస్తుంది భావి పరిశోధకులకు మార్గదర్శనం జేస్తుంది. అను ఉద్దేశంతో సాహిత్య కళాభినందనలతో స్నేహపూర్వకంగా ఈ కృతినిస్వీకరిస్తున్నాను.



# మాతాపితృ సంస్మరణాంజలి

వినిర్మల మనస్సుతో
ఆత్మీయతను ఆప్యాయతను పంచి
ప్రతి అడుగు అడుగు జాడకావాలని
ప్రతి నడక నడవడికి ఒరవడి కావాలని
ప్రతినుడి జీవిత పొత్తానికి మున్నుడికావాలని
నలుగురిలో దీపాలై వెలగాలని
నడుము గట్టుకొని పెంచి
మమ్ము తీర్చి దిద్దిన అమృతమూర్తి
కరుణామయి - ప్రేమమయి
శ్రీరంగ భట్టరార్య శ్రీమదాచార్య సమాశ్రయణ
లబ్ధ భక్తి ప్రపన్న సత్సంప్రదాయిని
శ్రీ మన్నాంపెల్లి శ్రీ లక్ష్మీనరసింహస్వామి
పాదారవింద చింతనామయి
చదువుల తల్లి కరుణకు పాత్రుల జేసిన-మా అమ్మ
కీ॥శే॥ గోపాల రత్నమ్మ
నాన్న కీ॥శే॥ శ్రీ రంగాచార్యుల దివ్యచరణారవిందములకు
భక్తితో నమస్సుమాంజలులు

—రచయిత



రచయిత

**డా॥ డింగరి రామాచార్య**



డాక్టరేట్ పొందిన రచయితను ఉత్తమ ఉపన్యాసకునిగా

శ్రీ చింతకింది రాజభూమయ్య గారు సన్మానిస్తున్న దృశ్యం

# రచయిత పరిచయం

## పేరు : డా॥ డింగరి రామాచార్య

పుట్టిన తేది: 14-1-1948

జననీ జనకులు: కీ॥శే॥ గోపాలరత్నమ్మ - కీ॥శే॥ శ్రీరంగాచార్యులు

జన్మస్థలం: గ్రా॥ కోరపల్లి, జిల్లా కరీంనగరం

ప్రాథమిక విద్య: కనపర్తి, కరీంనగరం జిల్లా.

మాధ్యమిక విద్య: వీణవంక, కరీంనగరం జిల్లా.

ఉన్నత విద్య, డిప్లొమా: తెలుగు, శ్రీసంస్కృతాంధ్ర కళాశాల, ఓరుగల్లు.

విద్య-పరిశోధన: బి.ఓ.యల్. తెలుగు, యం.ఎ. తెలుగు (ఉస్మానియా)
ఉపాధ్యాయ శిక్షణ, పి.హెచ్.డి. (కాకతీయ)

అనుభవము: వీణవంక, మొలంగూర్, మెట్‌పల్లి, ఉన్నత పాఠశాలలో
12 సంవత్సరముల ఆంధ్రోపాధ్యాయుడుగా బోధన.

కళాశాల సంబంధాలు: ప్రభుత్వ డిగ్రీ కళాశాల మంచిర్యాలలో 5 సం॥ల
అనుభవం. ప్రభుత్వ జూనియర్ కళాశాల కోరుట్ల
కరీంనగర్ జిల్లాలో 12 సం॥ ఆంధ్రోపన్యాసకులుగా
బోధనా-వ్యాసంగం.
1990 నుండి జాతీయ సేవాపథకంలో (N.S.S.)
ప్రోగ్రాం ఆఫీసర్, U.T.A. ప్రోగ్రాం ఆఫీసర్.

కౌన్సిలర్: 6 సంవత్సరాలు S;DLC కాకతీయ విశ్వవిద్యాలయ విద్యా
బోధన.

కౌన్సిలర్: 5 సం॥ డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వ విద్యా
లయంలో విద్యాబోధన.

సంస్థాగత సంబంధాలు:-

ఉపాధ్యక్షుడు- శ్రీ సరస్వతీ కళానికేతన్-మంచిర్యాల.

కార్యనిర్వాహక సభ్యుడు- భారతీ సాహిత్య సమితి, కోరుట్ల.

కార్యదర్శి: సాహితీ గౌతమి, కరీంనగర్.

జిల్లా ఉపాధ్యక్షుడు-శ్రీ సరస్వతీ విద్యాపీఠం (ఆం.ప్ర.)

నిజాం రాష్ట్ర ఆద్యశతావధాని శ్రీమాన్ శరీఫ్ నహళ్ శతావధాని కృష్ణమాచార్యుల సన్మానసమితిగౌరవ సాహితిమిత్రమండలి సభ్యులు వారులు.

సామాజిక: జిల్లాలోని విద్యాలయాల్లో ప్రధానవక్తగా, వ్యాఖ్యాతగా పలు సామాజిక కార్యక్రమాల నిర్వహణం.

రచనలు-ముద్రితములు: 1) వ్యాసమంజరి
2) శ్రీ వానమామలై జగన్నాథాచార్యుల వారి కావ్యములు. రైతురామాయణము-పరిశీలన

అముద్రితములు; 1) తెలుగు కావ్యాల్లో మాండలిక పదసౌందర్యము.
2) గేయ సంపుటి.
3) సులభ వ్యాకరణం.

అభిరుచులు ; 1) విద్యాబోధన.
2) సాహిత్య సాంస్కృతిక కార్యరంగాల్లో పాల్గొని సామాజిక స్పృహను విస్తృత పరచుట. జాతీయ సేవా పథకం ద్వారా సామాజిక సేవ.

# ఆశీస్సు

విశ్లేష్టుం ధ్వని వాచ్య వాచక గుణాలంకార భావౌచితీం
వస్తూద్దేశ మపి త్వయా కవి జగన్నాథస్య రామాయణమ్
శోధేస్మిన్నధి కృత్య సూక్ష్మ దృశయా శ్లాఘాస్పదం కౌశలమ్
రామాచార్య కృతం, గవేషకమణే శోధ స్సమింధాం తవ

వానమమాల వంశస్య మౌక్తికేన మనస్వినా
జగన్నాథేన రచితం రైతు రామాయణమ్ ప్రతి
అంతర్దృశా త్వయా సేయమ్ - సమీక్షా వివరీ వృతా
గవేషణమనో విశ్వే - సరీ ప్రష్టు స్వికాం స్థితిమ్

కవి చక్రవర్తి
శ్రీ శ్రీభాష్యం విజయసారథి



# ఆశీరభినందన

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత,
పద్మభూషణ్

**డా॥ సి. నారాయణరెడ్డి**

మట్టిలోని మాణిక్యం అనే మాట ప్రశంసా పరంగా తరచుగా వింటూ వున్నా అది ప్రత్యక్షర సార్థకత వహించింది. శ్రీ వానమామలై జగన్నాథాచార్యుల విషయంలో ఆచార్యులు గారు పల్లెటూల్లో పుట్టి పెరగడం మాత్రమే కాకుండా రైతును నాయకుడుగా మలచుకుని "రైతురామాయణం" అనే దేశీయ కావ్యం రచించిన నిసర్గకవి.

"అభినవ పోతన" వానమామలై వరదాచార్యులు గారి అగ్రజులైన జగన్నాథాచార్యులు గారు పద్య శిల్పంలో, తెలుగు పలుకుబళ్ళ పోహళింపులో, ప్రకృతి సన్నిహితమైన భావాల కూర్పులో ఆ తమ్ముడికి దీటైన అన్నయే.

రైతు జీవితాన్ని రామాయణ గాథా రేఖలతో వివిధ రస భరితంగా చిత్రించిన సుదీర్ఘ కావ్యం "రైతురామాయణం".

డా॥ డింగరి రామాచారి "రైతురామాయణం"లోని వస్తు భావ రస సంవిధానం గురించి విశ్లేషణాత్మకంగా రచించి డాక్టరేట్ పట్టం పొందిన గ్రంథమిది.

జగన్నాథాచార్యులు గారి సాహిత్య జీవితాన్ని గురించి, కావ్యరచన ప్రేరణలను గురించి ఈ కావ్యరచన నాటి నిజాం పాలనా వ్యవస్థను గురించి ఈ గ్రంథం ప్రారంభంలో చక్కని సమాచారం పొందుపరిచాడు ఈ రచయిత. రామాయణ కథ లోని అంశాలతో ఈ కావ్యగత విషయాల కున్న సాధర్మ్యం వివరించి చూపడం సముచితంగా ఉంది.

ఈ కావ్యంతోపాటు ఆచార్యుల వారు రచించిన "శ్రీవ్రతగీతి" "శ్రీఆది వరాహ సప్తశతి" "తెలుగుబిడ్డ" అనే కృతులను గురించి అనుశీలించడం బాగుంది. జగన్నాథాచార్యుల వారి రచనలను గురించి గణనీయ సిద్ధాంత వ్యాసాన్ని రూపొందించిన డా॥ రామాచారిని ఆశీఃపూర్వకంగా అభినందిస్తున్నాను.

ప్రొఫెసర్. నాయని కృష్ణకుమారి
వైస్ ఛాన్సలర్
తెలుగు విశ్వ విద్యాలయం

# ముందు మాట

శ్రీ డింగరి రామాచార్యులు వెలువరించిన పరిశోధన గ్రంథాన్ని చూచాను. వానమామలై జగన్నాథాచార్యులవారి రైతురామాయణం అనే అంశం మీద ఇందులో చక్కటి అనుశీలనం జరిగింది. ఆయన కృతి రైతు రామాయణం గాంధీజీ జీవన తాత్వికతకు అనుగుణమైన రచన. దీనికి ఒక కావ్యంగా ఆయన తీర్చిదిద్దిన పద్ధతి రమణీయంగా కనిపిస్తున్నది.
ఇందులోని వర్ణన, వస్తువు, రస నిర్వహణ, పాత్రచిత్రణ, చివరగా ఈ కావ్యం జనులకు అందించే ఉపదేశం, హర్షించదగ్గ రీతిలో, ఈ సిద్ధాంత గ్రంథంలో ప్రస్ఫుటమైనాయి. రైతువాల్మీకి, ప్రజాకవిశేఖర అనే అన్వర్థమైన బిరుదులు పొందిన వానమామలై జగన్నాథాచార్యుల వారిని పరిశోధకుడు జనసందోహానికి పరిచయం చేయడం హర్షించదగ్గ విషయం.

అందుకు రచయిత అభినందనీయుడు. ఈ పరిశోధన గ్రంథాన్ని విమర్శక లోకం మధ్యకు హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాను.

# రైతురామాయణం – తెలంగాణ - ఉద్యమ చరిత్ర బింబం

ఆచార్య మాడిరాజు రంగారావు
కాకతీయ విశ్వవిద్యాలయము

తెలంగాణా ప్రాంతంలో ఆధునికయుగంలో తెలుగు కవిత్వం ప్రముఖంగా సంప్రదాయ వాతావరణ బంధురంగా విలసిల్లింది. ఆపైన అభ్యుదయ మార్గంలో ప్రయాణించింది భావకవిత్వానికి సంబంధించిన దశ దృశ్యాదృశ్యంగానే ఉంది. ఈ అంశాన్ని సాహిత్య చరిత్రకారులు గుర్తించవలసిన అంశం దీనికి కారణం ఒకటి ఉందితెలంగాణాలో,సామాజిక వ్యవస్థలో త్వరిత గతిలో మార్పులు రాకపోవడమే రాజులపాలనతో ఆవ్యవస్థకు సంబంధించిన రీతులతోనే కొనసాగింది. సంఘ సంస్కరణ మొదలైన ఆధునిక భావజాలం కొంత ఆలస్యంగా ప్రవేశించింది. అయితే గ్రంథాలయోద్యమం మొదలైనవి తమ పాత్రను నిర్వహించాయి. ఉన్నట్లుండి ఒక్కమారు ఈ ప్రాంతం రాజకీయమైన పరివర్తనను చవిచూచింది అదే స్వాతంత్ర్యోద్యమం. నిజాం పాలన నుండి స్వాతంత్ర్యంకై పోరాటం మొదలైందిదీని ప్రభావఁసంప్రదాయ కవిత్వంతోవిలసిల్లినవాతావరణంపై బడింది. ఉద్యమ ప్రధాన మైన కవిత్వం అభ్యుదయ భావ జాలంతో ప్రవర్తించింది. దీని కనుగుణంగానే సాంఘికమైన పరివర్తన చోటుచేసికొంది. మహాకవి వానమామలై జగన్నాథాచార్యుల వారి రైతురామాయణం ఆకాలంనాటి రాజకీయ సామాజిక రీతులకు ప్రాతినిధ్యంవహిస్తుంది. ఈ మహాకావ్యం యొక్క క్రొత్తదనం ఏమిటంటే సంప్రదాయబంధురమైన మార్గంతో ఒక కాపు కౌటుంబిక జీవితం ఆధారంగా అటు అర్షధర్మాన్ని ఆదర్శ రూపంలో ఇటు వాస్తవ జీవితాన్ని యథాతథంగాను చిత్రిస్తుందీ కావ్యం.ఇది ఒక విధంగాను చారిత్రికమైన అంశాలకు నిలయంగాను,రెండు సామాజిక మైన స్థితి గతులకు దర్పణంగాను, మహాకవి వాల్మీకి రామాయణ మహాకావ్యంలోని ఆదర్శాల ప్రేరణలతో ఇంకా గాంధీజీ సిద్ధాంతాల ఆలోకనంతో కొన్ని పరిమితుల్లో సంప్రదాయ వ్యవస్థలోని క్షతి లేని మార్పు

లపై అభిలాషతో ఈమహాకావ్యం ఆధునిక యుగంలో ప్రత్యేకతను కలిగి యుంది. పరిశోధకులు డా॥ డింగరి రామాచార్య ఈసిద్ధాంత గ్రంథంలో శ్రమ, జిజ్ఞాస, ఆలోచన, అవగాహన, మొదలైన గుణాలతో జగన్నాధా చార్యుల వారి సాహిత్య జీవితం మొదలు కొని. అనుభవ పరంపర, ఆధ్యాత్మిక చింతన మొదలుగా ఈ సిద్ధాంత గ్రంథంలో సమాలోచనంజేశారు.

ఇక మహాకావ్యంలోని రస, భావ, పాత్ర ఆదర్శ మొదలైన విషయాలు చక్కగా విశ్లేషణతో - సముచిత మైన వ్యాఖ్యానాలతో జగన్నాధాచార్యుల వారి ఉత్తమ సంస్కార సంపన్న మైన సాహిత్య హృదయాన్ని ఆవిష్క రించే ప్రయత్నం సమర్థవంతంగా చేయబడింది సిద్ధాంత వ్యాసంలో. దీనికి అనుబంధంగా శ్రీవ్రతగీతి, శ్రీఆదివరాహ గుప్తశతి. తెలుగుబిడ్డ - ఒక్కొ క్కటి ఒక్కొక్క మణిఖండ - ఈమణుల కాంతుల్ని, వాటి అందాన్ని చూపే ప్రయత్నం జరిగింది ఇవి రైతురామాయణ మహాకావ్యసౌందర్యానికి అను బంధంగా చేర్చబడి, వానమామలై జగన్నాధాచార్యుల వారి కావ్య స్వరూ పానికి సంపూర్ణత్వాన్ని సిద్ధింపజేస్తున్నాయి, గాంధీజీ ఆదర్శానికి ప్రతి బింబంగా గ్రామీణ జీవితానికి ప్రాతినిథ్యం వహించే ఈ కావ్యం అర్థధర్మానికి, ఆయువు పట్టుగా ఉంది. ఈ అంశాల్ని ఈ పరిశోధకుడు చక్కని విశ్లేషణతో ఉచితమైన వ్యాఖ్యానాలతో-వివరణలతో సిద్ధాంత గ్రంథాన్ని సిద్ధంచేయడం జరిగింది. ఈ కృషికి పరిశోధకుని అభినందిస్తూ-ఈపరిశోధనావ్యాసంగం మునుముందుకొనసాగాలని ఆకాంక్షిస్తూ శుభాశీస్సులతో....



ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య
ఛైర్మన్ బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఇన్ తెలుగు
కాకతీయ విశ్వ విద్యాలయము

# మంగళాశాసనం

తెలంగాణాలోని ఆధునిక సాహిత్యవికాసంలో వానమామలై సోదరుల కృషి ప్రత్యేకంగా గణుతింపదగ్గది. శ్రీమాన్ వానమామలై వరదాచార్యుల వారి "పోతన చరిత్రము" ఇప్పటికే ఆధునిక సాహిత్యంలో ప్రత్యేకతను గడించుకొన్నది. వారి అగ్రజులు శ్రీజగన్నాధాచార్యుల వారి రైతు రామాయణం పఠన పాఠనాలలోనికి రావలసి ఉన్నది. తెలంగాణాలో తెలుగు సాహిత్య సంస్కృతులు పరపాలనలో అణగారకుండా రక్షించుకోవడానికి ఈ సోదరుల వంటి వారెందరో కృషి సల్పినారు. శ్రీ జగన్నాధాచార్యులు గారు మంచి వ్యుత్పన్నులు, ప్రతిభ గలవారు, గాయకులు, హరికథకులు, కాలక్షేపపరులు, మీదు మిక్కిలి పరమ భాగవత ప్రతిపత్తి కలిగినవారు.

శ్రీ జగన్నాధాచార్యులు గారు చాలా కాలం ఖండకావ్యాలతో, హరికథలతో తమ రచనా శక్తిని ప్రకటించారు. వారి 'కార్పాసలక్ష్మి' పద్యాలు గోలకొండ పత్రికలో ముప్పైలలో ప్రచురితం అయ్యాయి. నిజాం పాలనలో మ్రగ్గిన రైతు సోదరుల బాధలను ఇతిహాస బద్ధం చేయటానికి రైతు రామాయణ కావ్యం నలభైల చివరి సంవత్సరాలలో ప్రారంభం అయినా అరవైలలో పూర్తయింది. "పోతన చరిత్రము" రచనలోని సాత్త్విక భావానికన్న రైతురామాయణ కావ్యంలో ఒక విధమైన రాజస భావ సామీచాన్యం కానవస్తుంది. శ్రీ వరదాచార్యులు గారు అభినవ పోతనయై భక్తి మరందప్రవాహాన్ని అందించగా, శ్రీ జగన్నాధాచార్యులు గారు "రైతు వాల్మీకి"యై వాల్మీకి రామాయణ మార్గంలో రైతురామాయణాన్ని నిర్మించారు.

శ్రీ జగన్నాథాచార్యుల కావ్యం రెండు అంతస్తులలో కొనసాగుతుంది ఒక గ్రామంలో రైతుగాథ ఒకవైపు; రెండోవైపు రామకథ. తెలుగుకవుల రామకథాకథన లోభం ఇందుకు ప్రధాన కారణంకావచ్చు. ఆరుద్ర ఎప్పుడో ఒక చిన్న కథగా ఇలాగే "గ్రామాయణం" అని రామ/గ్రామ కథల రెండంతస్తుల రచన చేసినారు.

శ్రీ జగన్నాథాచార్యుల కావ్యం వస్తువులో రెండంచుల కత్తివంటిదే అయినా భాషా నిర్మాణంలో ఒక స్వతంత్ర మార్గాన్ని అవలంబించింది. తెలంగాణాలో వ్యవహారంలో ఉన్న భాషాసంపద ఆంధ్రప్రదేశ్ అవతరణ వల్ల క్రమంగా అంతరించి పోతూవచ్చింది. ఈ మాండలికాన్ని కావ్యరూపంలో రక్షించడం కూడా రైతు రామాయణకర్త ప్రధానంగానిర్వహించిన కార్యం

రైతు రామాయణం రచించ బూనుకునే నాటికి తెలుగు ప్రాంతంలో ప్రగతి వాద కవితా ధోరణులు వ్యాపించి ఉన్నాయి. తెలంగాణా విముక్తి పోరాటం జాతీయ మార్గంగా, సామ్యవాద మార్గంగా రెండు త్రోవలుగా కొనసాగింది. జాతీయ శక్తులు విజయం సాధించి 1948 లో హైదరాబాదు సంస్థానం భారతదేశంలో విలీనమైంది. రాజకీయంగా స్వాతంత్ర్యం లభించినా సంక్షేమం కోసం అన్ని రంగాలలోను ప్రయత్నం కొనసాగవలసే ఉన్నది. దేశ పునర్నిర్మాణానికి గాంధీజీ ప్రవచించిన సామ్యవాదం దిక్సూచిగా అంగీకరించబడింది. అయినా భారీ పరిశ్రమలు ప్రణాళికలు మొదలైన "మాదిరు"లు చిన్నరైతులు, చిన్న పరిశ్రమలు ప్రధానంగా ఉన్న దేశానికి సరిపడనివి దిగుమతి అయి సమస్యలను రోజుకు రోజుకూ జటిలం చేస్తూ పరిష్కారాన్ని పది ఆమడల దూరంలో ఉంచుతూ వచ్చాయి.

గాంధీ పథానికి దూరమై నెహ్రూ ప్రవచించిన సోషలిస్టు పద్ధతిలోని ప్రజాస్వామ్య లౌకిక వ్యవస్థవల్ల క్రమంగా మన రాజ్యవ్యవస్థ నైతిక విలువలకు ఏ మాత్రం స్థానం లేని రాజ్యస్థితి ఏర్పడి ఈనాటికి పనిచేస్తున్న అరాచకం (Working Anarchy) అన్న దశకు చేరుకున్నది. రైతురామాయణ కర్త అందుకే తన గ్రంథంలో సామ్యవాదం చెప్పే మార్గంకన్న గాంధేయ సోషలిస్టు మార్గాన్ని లక్ష్యంగా ఎంచుకొన్నాయి. మన దేశాని

కనుగుణంగా ఉండే సామ్యవాద సిద్ధాంతాన్ని మనమవలంబిద్దాం అన్న గాంధీజీ పల్కుల ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పవలె. గాంధీజీ దాన్నింకా ముందుకు తీసుకుపోయి ధర్మ కర్తృత్వ సిద్ధాంతంగా సర్వోదయ సిద్ధాంతంగా ప్రవచించారు.

"తన యింటంగల నిల్వ ధాన్యముల మొత్తమ్ముక స్వకీయ ప్రజా
వినియోగమ్ము నకై మహామహుడు తావెచ్చించె రాముండు"
అందువల్లనే రైతురాముని నేతృత్వంలో శ్రీరామపురం—
''అన్నమ్ము లేని వాడాయూరనేకిడ పారవేయడ పెంట నెవండు
పనిలేనివాటనువనరాడు మచ్చుకేక పనివాఅంతయు నందు గను తెరుగము
చింకి పాతననే కుచేలుడక గనరాడ నిలువలుంచిన కుచేలులు లేరు

ఈ విధంగా గాంధీజీ ఆశించిన సంక్షేమ రాజ్యస్థితిని శ్రీ జగన్నాథాచార్యులవారు రైతురామాయణంలో సాక్షాత్కరింపజేశారు.

మా మిత్రుడు మా విశ్వవిద్యాలయంలో పరిశోధకుడై శ్రీ జగన్నాథాచార్యుల వారి రైతురామాయణాన్ని ఇతర రచనలను పరిశీలించి డాక్టరేటు పట్టా పొందిన శ్రీ డింగరి రామాచార్యులు ఈ పరిశీలనలో శ్రీజగన్నాథాచార్యుల గారి కవితా చైతన్యాన్ని సమగ్రంగా దర్శింపజేశారు.

శ్రీ రామాచార్యులు మంచి వ్యక్తున్నాడు. సాహిత్య కార్యదక్షుడు. కోరుట్ల సాహితీ సమితి కార్య నిర్వాహకుడు. కరీంనగరంలో గౌతమీసాహితి ఉపాధ్యక్షుడు. ఆ జిల్లా శ్రీ సరస్వతీ శిశుమందిర్ సంస్థల సమితికి ఉపాధ్యక్షుడు.

శ్రీ జగన్నాథాచార్యులు గారి రచనలను పరిశీలించేప్పుడు కావలసిన సాహిత్య సామగ్రి సమగ్రంగా కలిగి యుంచి మొత్తం పదిహేడు అధ్యాయంలో వారి రచనలను పరిశీలించాడు.

రైతురామాయణ పరిశీలనలో తాత్త్వికమైన గాంధీయ సోషలిస్టు భావాధారాన్ని నెలకొల్పి కావ్య రంగం లోకి ప్రవేశించాడు పరిశోధకుడు. ఈ కావ్యంలో ఉన్న మార్గదేశి సంప్రదాయాల సంయోజనను పట్టుకొన్నాడు. అందుకే దీన్ని తొలి జానపద కావ్యంగా నిరూపించాడు. ఇది తొలి రైతుకావ్యం కూడా అయింది. ఇంతకు పూర్వం దువ్వూరి రామిరెడ్డి

"కృశీవలుడు", గంగుల సాయిరెడ్డి "కాపుబిడ్డ" అన్న కావ్యాలు ఉన్నా రైతు చరిత్రాన్ని ఇంత విపులంగా మహాకావ్యంగా నిర్మించిన సన్నివేశం ఇదే మొదలు.

ఇది తొలి జానపద కావ్యం అవడం వల్ల 'కొండలికాలను బండ్ల కెత్తడం' చాలా ఉచితమైన సన్నివేశమైంది. అలాకాకపోతే ఇదేదో నిఘంటు ప్రాయమైన రచన అయ్యేదే. మాండలిక భాష ఈ వస్తువిన్యాసం వల్ల దీనిలో ప్రాణం పోసికొన్నది.

ఈ రచనలో పరిశోధకుడు తాను ఈ కావ్యాన్ని అనేక పార్శ్వాల నుంచి పరిశీలన చేయడం జరిగింది. ఇటువంటి కావ్యాలలో రసనిర్వహణాంశం కొంచెం క్లిష్టమైందే ప్రధాన వస్తువునకు అంతర్భాగంలో స్ఫురించే రామకథ దీని భావనా దశలో ప్రతిఫలించడం వలన పాఠకుని మనస్సు చెదిరే అవకాశం ఉన్నది.

ప్రధానంగా ఈ పరిశోధకుడు రైతురామాయణాన్ని స్వీకరించిన ఆచార్యుల వారి "శ్రీవ్రతగీతి"ని విపులంగా పరిశీలించాడు. శ్రీగోదాదేవి తిరుప్పావై రచన శ్రీ వైష్ణవ గృహాలలో ధనుర్మాసంలో నిత్యానుష్ఠేయమైన వ్రతం. దీనిని తెలుగులో దాదాపు నలభై దాకా పరివర్తనలు ఉన్నాయి. శ్రీజగన్నాథాచార్యుల వారి పరివర్తన ఉత్తమమైన అనువాదాల లోనికి వచ్చేదే.

ఆదివరాహస్వామి స్తుతిని గూర్చి తెలుగుబిడ్డ అన్న రచన గూర్చి కూడా రామాచార్యులు చర్చ చేశాడు.

శ్రీరామాచార్యుల రచన సరళం ఒక ఆత్మీయతమైన అభినివేశంతో కూడా ఉన్నది. ఒక విధంగా రైతురామాయణానికి ఇది కరదీపికలాంటి ఈ గ్రంథం.

ఈ గ్రంథం వెలుగులోకి రావటానికి సహకరించిన పారిశ్రామిక కర్తలు శిరోమణి వికాస్ రాజీవ్ ఎక్సెలెన్స్ అవార్డు గ్రహీతలు కోరుట్ల గ్రూప్ ఆఫ్ కంపనీస్ అధ్యక్షులు శ్రీపోతక చంద్రశేఖర్ అభినందనీయులు.

శ్రీ రామాచార్యులు ఇతోధికంగా సాహిత్య సమర్జన చేస్తూ భారతీయ సంస్కృతికి సేవ కొనసాగించవలెనని మంగళాశాసనం చేస్తున్నాను.

# ఆప్తవాక్యం

డా॥ అందె వేంకటరాజము
ఎం.ఏ., పి.హెచ్.డి
తెలుగువిశ్వ విద్యాలయ ప్రతిభా పురస్కార గ్రహీత,
"కవిశిరోమణి" "అవధాన యువకేసరి"

ఆధునికాంధ్రసాహిత్యజగత్తులో వానమామలై సోదర మహాకవుల ప్రశస్తి దిగంత విరాజిత మైనది. చంద్రసూర్యుల వలె వారాంధ్రావనిని ప్రకాశింపజేసినారు. సాంప్రదాయిక విద్వద్వంశంలో ఉద్భవించిన జగన్నాథాచార్యులవారు రైతురామాయణము రచించి రైతువాల్మీకి బిరుదాంచితులైనారు. వారి అనుజులు మద్గురుదేవులు వరదాచార్యులవారు పోతన చరిత్రము విరచించి అభినవపోతనగా విఖ్యాతులైనారు. విశ్వనాథవారొక సభలో కొనియాడినట్లు జగన్నాథాచార్యుల వారు సిద్ధులు, వరదా చార్యుల వారు ప్రసిద్ధులు.

నే నొక సందర్భంలో జగన్నాథాచార్యుల వారికి ఇలా సంస్మరించినాను.

"పాథోధి ప్రతిమానపాండితియు, శుంభద్ హైమశైలోపమ
ప్రాథాన్యోరు కవిత్వమున్, అమృతధారా దివ్య సంగీతమున్,
శ్రీధుర్యామల తత్త్వబోధలయు మూర్తిన్‌గొన్న శ్రీమజ్జగ
న్నాథాచార్యుల కంజలింతును జగన్మాన్యాంఘ్రులన్ భక్తిమై."

జగన్నాథాచార్యుల వారంతటి మహనీయులు.వారు గ్రామసీమలలో వసించి హాలిక జీవనం సాగించినవారు కర్షకుల కష్టనిష్ఠురాలను స్థితిగతులను,అప్పటి నిజాం నిరంకుశ పాలనలోభూస్వాముల దౌర్జన్యాలలో చితికి పోయిన రైతుల దుర్భరజీవితాలను కనులారగాంచి పరితపించి తదీయసముద్ధరణకు గ్రామ సురాజ్య రామరాజ్యావిర్భావాకాంక్షతోరైతురామాయణ మహాకావ్యం రచించినారు. ఒక రైతు జీవితగాథతో రామయకల్పంగా సమగ్రమహాకావ్యం రచించినది బహుశః ఈ రైతురామాయణ మొక్కటే. ఇంత విశిష్ట మైన రైతురామాయణాన్ని, ఆచార్యులవారి ఇతర లఘుకృతులను

ప్రియ మిత్రులు శ్రీ డింగరి రామాచార్యులు గారు చక్కగా పరిశోధించి సిద్ధాంతగ్రంథం రచించి డాక్టరేటు పట్టం సంపాదించినారు.

రామాచార్యులు గారు విద్వద్వరేణ్యులు, కవి వతంసులు, సహృదయ లలాములు, ఉత్తమ అధ్యాపకులు, మా భారతీసాహిత్యసమితి సభ్యులు. పిహెచ్.డి.కి రైతు రామాయణంపై పరిశోధన చేయవలెనన్న సత్సంకల్పం కలిగినప్పటి నుండి వీరి పరిశ్రమవ్యవహారం నాకు సువిదితం. మాన్యులు ఆచార్యమాదిరాజు రంగారావుగారి పర్యవేక్షణ వీరి కృషినిఫలవంతం చేసినది.

ఈ పరిశోధన గ్రంథం 2 భాగాలలో 17 అధ్యాయాలలో సంతరించబడినది. జగన్నాథాచార్యుల వారి జీవిత సంగ్రహం, రైతురామాయణ కావ్యరచనాప్రేరణలు,అప్పటి సాంఘికరాజకీయాది పరిస్థితులు,కావ్యంలోని నివస్తుశిల్పం రసపాత్రపోషణాదులు కావ్యోపదేశం మున్నగునవి సమగ్రంగా సమర్థంగా నర్వహించబడినవి. తొలిజానపదాంధ్ర కావ్యంగా, తొలి తెలుగు రైతుకావ్యంగా నిరూపించిన విషయం ప్రత్యేకంగా శ్లాఘించదగినది జగన్నాథాచార్యులవారు ఒక సామాన్య కర్షకుని జీవితగాథను కల్పించు కొన్న ఉత్పాద్యవస్తువునకు మహాకావ్య గౌరవమిచ్చి దానికి రామాయణ ప్రశస్తి కలిగించగా ఆమహావిషయాన్ని సహృదయపాఠకలోకానికిసుగమం చేయడానికి అనుశీలనాత్మకమైన పూలబాటవేసిన రామాచార్యుల వారి కృషి ప్రసంసనీయమైనది. దీనిలోని రెండవ భాగంలో చేర్చిన శ్రీవ్రతగీతి, శ్రీఆదివరాహస్వామి అష్టోత్తరశ, తెలుగుబిడ్డ అనేల కృతులను సైతం చక్కగా చర్చించినది ముదావహం. మొత్తం మీద ఈ పరిశోధనగ్రంథం ప్రతిభకు విమర్శకు అద్దం పట్టి భావి పరిశోధకులకు మార్గదర్శనం చేస్తున్నది.

ఈ పరిశోధనగ్రంథాన్ని ఆత్మీయులు ఆప్తులు మహాపారిశ్రామిక వేత్తలు మహాదాత కోరుట్ల గ్రూప్ ఆఫ్ కంపనీస్ చేర్మెన్ శ్రీపోతని చంద్రశేఖరు గారికి అంకితంచేయడం అత్యంతానందకరం. పరమేశ్వరి కృతి భర్తకు కృతికర్తకు చిరాయురారోగ్యభాగ్యాలను అభ్యుదయ పరంపరలను ప్రసాదించవలెనని ప్రార్థింతును.

డా॥ అనుమాండ్ల భూమయ్య
హెడ్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు
కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్.

మిత్రులు డా॥ రామాచారి గారి పరిశోధన గ్రంథమిది. జగన్నాథాచార్యుల వారు రైతురామాయణ కావ్యకర్తగా సుప్రసిద్ధులు. వ్రతగీతి మొదలైన ఇతర కృతులు కూడ వారు రచించినారు. తెలుగు భాషకు అంతకంటే సాహిత్యానికి ఆదరణ లేని తెలంగాణంలో ఈ విధమైన రచనలు చేయటం గొప్ప. వారి జీవితం కూడ విశిష్టమైందే. ఆచార్యుల వారి కృతుల మీద పరిశోధన చేయటానికి పూనుకోవటం సంతోషం.

రైతురామాయణం మహాకావ్యమని లక్ష్య లక్షణ సమన్వయం చేసి చూపటంలో, "తొలి జానపదాంధ్ర కావ్య"మని "తొలి తెలుగు రైతుకావ్య" మని తగిన ఉపపత్తులతో నిర్ధారించటంలో రామాచారిగారి పరిశోధన పటిమ ప్రస్ఫుటమవుతుంది. కావ్యంలోని రసభావాలు, వర్ణనం శిల్పాన్ని గురించి విషయాలు కవి హృదయాన్ని అవగతం చేసికొని పాఠకునికి అందజేయటంలో రామాచారిగారు తన లక్ష్యసాధనతో కృతకృత్యులైనారు. కవి ఇతర కృతులను కూడ వీరు చక్కగా పరిశీలించినారు.

ॐ

# హృదయోల్లాసము

డా॥ వజ్ఝల రంగాచార్య
అధ్యక్షులు
పద్యసాహితీ సదస్సు, కరీంనగర్.

శ్రీ వానమామలై జగన్నాథాచార్యులు రచించిన రైతురామాయణము మరియు ఇతర కావ్యముల గూర్చి డా॥ డింగరి రామాచార్య విపులమైన సిద్ధాంత గ్రంథాన్ని రచించి ప్రకటించడం నాకు ఎంతో సంతోషాన్ని కలిగించింది. నాకే కాక సహృదయులందరికీ ఈగ్రంథం హృదయోల్లాసాన్ని కలిగిస్తుందనడంలో సందేహం లేదు. శ్రీ జగన్నాథాచార్యుల హృదయాన్ని వారి ఆలోచనలను ఈ గ్రంథము విప్పి చెప్పింది. నిసర్గ జానపద జీవన సౌందర్యాన్ని ఆరాధించే వారికి ఈ సిద్ధాంత వివేచన సంతృప్తిని కలిగిస్తుంది. రైతురామాయణకావ్య విమర్శతోపాటు ఇతర కావ్యాలలోని భక్తి ప్రవత్తులను విశదీకరించడం ద్వారా సిద్ధాంత గ్రంథ ఉదాత్తత ఇనుమడించింది.

ముఖ్యంగా రైతురామాయణ కావ్యసృష్టిలో జగన్నాథాచార్యులవారి రచన చతుర్ముఖాలుగా సాగింది.

1. సంప్రదాయ సాహిత్యమార్గం
2. అభ్యుదయభావం
3. జానపద సౌందర్యం
4. అభివ్యక్తి నిరూపణం

రామకథను రైతురాముడి జీవన గాధతో కలిపి చెప్పడం, కావ్య, ప్రబంధ, ఇతిహాస లక్షణయుతంగా రైతురామాయణాన్ని నిర్మించడంలో సంప్రదాయ సాహిత్య మార్గం గోచరిస్తుంది.

గాంధీజీ ప్రతిపాదించిన గ్రామాభివృద్ధి, సమాజ సామ్యవాద లక్షణం జమిందారీ వ్యవస్థపై తిరగబడి పోరాడే విధానం అభ్యుదయ భావాలుగా ప్రకటించబడ్డాయి.

గ్రామ జీవన సౌందర్యం ఆయా ఋతు, ప్రదేశ, జీవ, జంతు, స్వరూప, స్వభావ, సంచార వర్ణనలల్లో, ఉపమానాలలో, సామెతలలో, పలుకు బడులలో నిసర్గ రమణీయంగా ప్రవహించింది.

కవితాభివ్యక్తి పద్యశిల్పంగా, భావశిల్పంగా అనేకానేక విన్యాసాలను విలాసాలను ప్రదర్శించింది. రీతిలో శయ్యా సౌభాగ్యంలో పద్యశిల్పం అనేక వగలు పోయింది. జానపద మరియు సమకాలిక వ్యవహారంలోని ఉదాహరణలెన్నో అలంకార సామాగ్రిగా భావశిల్పంగా కవిత్వంగా ఒదిగిన తీరు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది.

డా॥ డింగరి రామాచార్య ఈ విధమైనవస్తువిన్యాసాన్ని సౌందర్యాన్ని తన సిద్ధాంత గ్రంథములో విశ్లేషించి చూపే ప్రయత్నం చేశాడు.

డా॥ డింగరి రామాచార్య సహృదయుడు ముఖ్యంగా సంప్రదాయ సాహిత్యాన్ని చక్కగా చదివిన వాడు. ఆధునికమైన సామాజిక మార్పులను గౌరవించేవాడు. గ్రామస్థాయి జీవితం నుండి మధ్యతరగతి జీవనంలోకి ఎదిగి వచ్చినవాడు. సాహిత్యాన్ని జీవితం లోనికి అనుక్షణం పరివర్తనం చేసుకుంటూ అందరి మన్ననలను పొందుతున్నవాడు. అందుకే అతనిని రైతురామాయణం ఆకర్షించింది. ఆకావ్యంలోని సంప్రదాయ సాహిత్య రహస్యాలను, ఆధునిక భావ సదాస్యాలను ఆకళింపు చేసుకొని తనదైన విమర్శ శైలిలో విశ్లేషించాడు.

రైతురామాయణంలో రామకథాను సరణాన్ని తులనాత్మకంగా సమీక్షించాడు. మహాకావ్య లక్షణాలను, ప్రబంధ లక్షణాలను రైతురామాయణం ఏ విధంగా కలిగి ఉన్న లక్ష్య లక్షణ సమన్వయంతో సమర్థించాడు తన అలంకారశాస్త్ర పాండిత్యంతో రైతురామాయణలోని రస నిర్వహణాన్ని, వర్ణనావైచిత్రిని సోదాహరణంగా నిరూపించాడు.

ముఖ్యంగా రైతురామాయణం తొలి జానపదాంధ్ర కావ్యమని నిరూపించిన తీరు రామాచార్య విమర్శనా ప్రతిభకు గీటురాయి. కావ్యంలోని జానపద వాఙ్మయ చమత్కారోక్తులను ఎత్తిచూపుతూ, తన ప్రతిపాదనకు

పండితుల, విమర్శకుల అభిప్రాయాలను ప్రోది చేసుకున్న తీరు సముచితంగా ఉంది.

"శ్రీ భూగోకుల నిత్యసేవన శ్రమ శ్రీభాగ్య నిక్షేపు" అనే ప్రారంభ పద్యాన్ని రామాచార్య వ్యాఖ్యానించిన తీరు ప్రశంసా పాత్రము. సంప్రదాయ పరంగా, శ్రీ, భూ, నీళలని, నిత్యశబ్దానికి నిత్యులని భాగ్యనిక్షపు డనగా షాడ్గుణైశ్వర్య సంక్షిన్ను డని, సత్కలాపుడనగా పరవ్యూహాదికములు కలవాడని, ప్రగతి స్ఫూర్తి క్రియాటోపుడనగా అవతారములు ధరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసేవాడని చెప్పిన తీరు యుక్తియుక్తంగా ఉంది.

శ్రీ-సంపద, భూ-భూమి, గోకుల-పశుసంపద, అంటూ శ్రమచేత భోగ భాగ్యాలకు నిక్షేపం లాంటివాడని, ఉత్పత్తి కొఱకు చేసేకృషి కలాపాన్ని సత్కలాపమని, కరువు-కాటకాల రక్కసులను సంహరించే ప్రతాపం కలవాడని, ప్రగతిస్ఫూర్తి క్రియాటోపుడని లోకరక్షకుడైన కాపురైతుపరంగా పద్యాన్ని వ్యాఖ్యానించిన పద్ధతి కవి హృదయాన్ని ఆవిష్కరించిన తీరు రామాచార్య పాండిత్యానికి, ప్రతిభకు అద్దం పడుతున్నది.

"తన ఇంటగల నిల్వ ధాన్యమ్ముల మొత్తమున్ స్వకీయ ప్రజా వినియోగమ్ముకై మహామహుండు దావెచ్చించె రాముండు" అని జగన్నాథాచార్యులు వర్ణించిన రైతురాముని దానదయార్ద్ర దృష్టిని పరిశోధకుడు గాంధేయ సమాజవాదంలోకి "ధర్మకర్త" సిద్ధాంతానికి అన్వయించి రైతు రామాయణంలో గర్భీకరించబడిన సామ్యవాద సమాజ లక్షణాన్ని సహేతుకంగా ఆయా ఘట్టాలలో విశ్లేషించినాడు.

ఇంకా రైతురామాయణంలోని శ్లేష, యమక, ఉత్ప్రేక్షాది ప్రాబంధిక మార్గప్రయోగాలను, జానపద జీవన చిత్రణంలోని ఉక్తి వైచిత్రిని వర్ణనా సౌందర్యాన్ని ప్రత్యేకంగా కావ్యసౌందర్యంగా వివరించవలసి ఉన్నది. భవిష్యత్తులో డా॥ డింగరి రామాచార్య మరొక పుస్తకం ద్వారా ఈ అంశాన్ని వివరిస్తాడని ఆశిస్తున్నాను. స్నేహ ధర్మాన్ని పాటించి పరిశోధన కృషి యజ్ఞోదీపపనలో పఠితగాఅవకాశాన్ని కల్పించినందులకు వారికి నా కృతజ్ఞతలు. రైతురామాయణాన్ని గూర్చి శ్రీ జగన్నాథాచార్యుల ఇతర కావ్యముల గూర్చి హృదయోల్లాసాన్ని కల్గించే పరిశోధన గ్రంథాన్ని రచించి ప్రచురించి నందుకు హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

# విజ్ఞప్తి

పీణవంక ఉన్నత పాఠశాలలో శ్రీమాన్ జగన్నాథాచార్యులవారి రైతురామాయణ కావ్యగానాన్ని విని ముగ్ధులమైన విద్యార్థులలో నేనొకణ్ణి. పల్లెటూరులో పుట్టినవాణ్ణి. పల్లె ప్రజల అండదండలతో పెరిగినవాణ్ణి అందు జానపదులనటే నాకిష్టం. బాల్యంలోనే రైతురామాయణం లోని కథ నన్నా కర్షించింది. స్వాతంత్ర్యోద్యమ గాథను. రజాకార్ల కబుర్లను కథలుకథలుగా చెప్పుకొనగా వినేవాన్ని. స్వగ్రామానికి సమీపంలోనే శ్రీమాన్ జగన్నాథాచార్యులవారి నివాస గ్రామం కావున తఱచుగా వెళ్ళి వారితో ముచ్చటించి ఆశీస్సులను పొందేవాణ్ణి. ఉపన్యాసకునిగా పదోన్నతి పొందినప్పటి నుండి రైతురామాయణ కావ్యానుశీలనం చేయాలనే ఆకాంక్ష బలపడింది.

నేను ఓరుగల్లు సంస్కృతాంధ్ర కళాశాలలో డిప్లొమా పొందినప్పుడు నాకు స్ఫూర్తిని ప్రసాదించిన నా గురువరేణ్యులు శ్రీ శ్రీభాష్యం విజయసారథి గారి బోధనా పటిమతో కావ్యవిమర్శ పట్ల ఆసక్తి ఏర్పడింది. గురువు గారికి నా సుమనోంజలులు.

నా మాతా పితృల ఇష్టదైవ బలం, శ్రీసరస్వతీదేవి కరుణా కటాక్షం వల్ల గురుజన శుభాశీస్సులతో ఆచార్యుల వారి కావ్యానుశీలనం చేయాలన్న చిరకాలంగా ఉన్న కోరికతో ఆచార్యమాదిరాజురంగారావుగారినిసంప్రదించి వారి అనుమతితో 1987లో ప్రారంభించితిని. డా॥ అందె వేంకటరాజంగారి ప్రోత్సాహమెంతో దోహదపడింది. జాతికి వెన్నముక ఐన కర్షకుని జీవిత వృత్తాన్ని సాధ్యమైనంత వరకు అనుశీలించడం జరిగింది. పరిశోధనకు తోడ్పడిన గ్రంథ రచయితలందరికి నమస్సుమాంజలులు కృతజ్ఞతలు.

ఈ పరిశోధన ఈ విధంగా ఫలవంత మవడానికి ఆచార్య మాదిరాజు రంగారావు గారి వాత్సల్యం,ఆదేశం, ఉపదేశం స్ఫూర్తి నిచ్చాయి. నిండు మనస్సుతో నాకు మార్గదర్శనం చేసి తీర్చి దిద్దడం వల్ల నా సిద్ధాంత వ్యాసం పరీక్షించిన పర్యవేక్షకుల అనుమతితో "వైవా" లేకుండగనే డాక్ట

రేటు ప్రదానం జేయబడింది. ఎక్జామినర్సుగా సాహిత్య తపస్వి ఆచార్య మాడిరాజు రంగారావు గారికి నాహార్ధిక సుమనోంజలులు. ఆశీస్సులనొసగి నన్ను ప్రోత్సహించి నా పరిశోధనకు వలసిన సహకారాన్ని ఇచ్చిన డీన్ ఆచార్య లక్ష్మణమూర్తి గారికి నా హృదయపూర్వక నమస్సులు. మొదటి నుండి నాన్నాశీర్వదించి ఉత్తేజ పరచి సత్సలహాలనిచ్చిన తెలుగు సభాధ్యక్షులు ఆచార్య హరి శివకుమార్ గారికి నమస్సుమాంజలులు. రైతు వాల్మీకి రైతురామకథ అనుశీలన యోగ్యమైందని ప్రకటించి వలసిన ఆత్మస్థైర్యాన్నిచ్చి సలహాల నిచ్చిన ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులకు నా నమస్సుమాంజలులు. ఈ పరిశోధనకు అనుమతించిన కాకతీయ విశ్వవిద్యాలయ అధికారులకు గ్రంథాలయాధికారులకు ఈ సిద్దాంత వ్యాసానికి సమయాన్ని పొడిగించిన వైస్ ఛాన్సలర్ ఆచార్య జయశంకర్ గారికి నా హార్ధిక కృతజ్ఞతలు. ఈ సిద్ధాంత వ్యాసాన్ని గ్రంథంగా ముద్రించుకొనుటకు అనుమతి నొసగిన వైస్ ఛాన్సలర్ వైకుంఠం గారికి హృదయ పూర్వక ధన్యవాదములు.

నేను కోరుట్లలో 1984 నుండి ఉద్యోగరీత్యా ఉండటం వల్ల నాపైన ప్రేమాదర భావం ఏర్పడం వల్ల కలిగిన చనువుతో మాన్యశ్రీ పోతని చంద్రశేఖర్ గారితో ముద్రణ విషయం ప్రస్తావించినపుడు అందులకు వారు అంగీకరించి గ్రంథ స్వీకృతికి అంగీకరించిరి. కోరుట్ల గ్రూప్ ఆఫ్ కంపెనీస్ చైర్మన్‌గా పలు పరిశ్రమల స్థాపించి కేంద్రామాత్యులచే బిరుద సత్కారాలు పొందిన శ్రీ చంద్రశేఖర్ గారు వితరణ శీలురు దయా స్వభావులు. నాకెంతో ధన సహాయం చేసి నన్నొక రేవుకు చేర్చారు. ఈ గ్రంథ ముద్రణకు వలసిన ధన సహాయాన్ని విరాళంగా ఇచ్చారు. వీరికి నేను సదా కృతజ్ఞుడను. అట్లే శ్రీచింతకింది రాస భూమయ్య వైస్ చైర్మన్‌గారు చింతకింది గణేష్ వైస్ చైర్మన్‌గారు, శ్రీ కోడూరి లక్ష్మినారాయ వైస్ చైర్మన్ గారు ముద్రాణకార్యం ఫలవంతం జేసిరి. వారికి నా హార్థిక కృతజ్ఞతలు.

సర్వవైధిక సంస్థానం అధ్యక్షులు సద్గురువరేణ్యులు ఆచార్య

శ్రీభాష్యం విజయసారథి గారు ఆశీస్సులు ప్రసాదించినందుకు వారికి సాష్టాంగ దండ ప్రణామములు అర్పించుచున్నాను. ఆశీరభివందనలు తెలిపిన జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డి గార్కి, "మంగళాశాసనము" కృపజేసిన కాకతీయ విశ్వ విద్యాలయము బోర్డు ఆఫ్ చైర్మన్ ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులకు, రైతురామాయణం తెలంగాణా ఉద్యమ చరిత్ర బింబం గ్రంథ ప్రాశస్త్యాన్ని తెలిపి ఆశీర్వదించిన ఆచార్య మాదిరాజు రామారావు గార్కి, ముందుమాట వ్రాసి కావ్య విమర్శకులకు పరిచయం చేసిన తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ఆచార్య నాయని కృష్ణకుమారి గార్కి, గ్రంథ ముద్రణకు విశ్వవిద్యాలయం నుండ అనుమతినిప్పించడమే గాక "అభినందనం" వ్రాసి సిద్ధాంత గ్రంథ గౌరవం సాహితీ లోకంలో ఉండాలని ఆకాక్షించిన కాకతీయ విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు డా॥ హనుమాండ్ల భూమయ్య గారికి, వానమామలై జగదీశ వరద సోదర జంట కవుల్లో అభినవ పోతన కావ్యాలను అనుశీలనం చేసి రైతు వాల్మీకి కావ్యాల అనుశీలనానికి ప్రోద్బలపడి ఆప్త వాక్యంతో గ్రంథ విశిష్టాన్ని తెలిపిన మధురకవి అవధానకేసరి డా॥ అందె వెంకటరాజం గారికి, డాక్టరేటు లభించేంత వరకు వెన్నుతట్టి ప్రోత్సహించి గ్రంథం సమగ్ర రూపానికి దోహదపడి ఆవిష్కరణానికి హృదయోల్లాసంతో గ్రంథాంతర విషయాల్ని సద సద్వివేకంతో చర్చించిన మిత్రులు డాక్టర్ వజ్ఝల రంగాచార్యకు, ప్రూఫులు చూచి నాకు తోడుగా ఉన్న అచ్చి విజయకుమార ఆచార్యకు, గ్రంథాన్ని ముద్రించి ఇచ్చిన "మయూర" ప్రింటర్స్ కరీంనగర్ ప్రొప్రైటర్ వట్టెపల్లి సంజీవయ్య గార్కి మరియు కంపోజింగ్ చేసిన గోవర్ధనం శ్రీనివాసాచార్యులకు, కె. రాజు, రాజేందర్, జి.కె. రాజు, కవర్ పేజి ముఖచిత్రలంకరణ గావించినఆర్టిస్టు బి.యస్. నారాయణ గార్కి, పి.హెచ్.డి. పరిపూర్తికి సహకరించిన దాతలకు మిత్రులకు కృతజ్ఞతలు.

ఫలవంత మగుటకు ప్రోత్సహించిన గౌరవనీయులు బి. రామచార్యంగారికి, మా కళాశాల ప్రిన్స్‌పాల్ శ్రీ వైకుంఠం గారికి, అధ్యాపక

మిత్రులకు, ఈ డాక్టరేటు పొందడం, గ్రంథాన్ని ముద్రించడం ఈ మహా యజ్ఞానికి అన్ని విధాల సహకరించుచున్న మా అన్నయ్య శ్రీమాన్ డింగరి ఉపేంద్రాచార్య గారికి నా నమస్సులు. అపూర్వ సోదరమైత్రిగల అన్నదమ్ముల ప్రేమాదరాలకు నేను దన్యున్ని, అల్లుండ్లు మేనల్లుండ్లకు వినిర్మల మనస్సుతో నా కష్టసుఖాలు పంచుకుంటూ నా కార్యసాధనకు తోడ్పడుతున్న నా జీవిత భాగస్వామి చి॥ల॥సౌ॥ వైజంతిమాలకు నా చిరంజీవులకు సుభాశీస్సులు.

పద్యసాహితీ సమితి ఆధ్వర్యంలో గ్రంథావిష్కరణకు అధ్యక్షత వహించిన మాన్యశ్రీ జువ్వాడి గౌతమరావు గారికి, గ్రంథావిష్కరణం చేసి ఆశీర్వదించిన పద్యసాహితీసమితి రాష్ట్ర ఉపాధ్యక్షులు ఆచార్య శ్రీమాన్ కోవెల సంపత్కుమారాచార్య గారికి, బ్రహ్మశ్రీ పార్వెళ్ళ గోపాలకృష్ణ అష్టావధాని గారికి, ప్రముఖ స్వాతంత్ర్యయోధులు గ్రంథాలయోద్యమ, సర్వోదయ నాయకులు గౌరవశ్రీ బోయినపల్లి వేంకటరామారావు గారికి, గౌరవశ్రీ కె. దేవేందర్‌రావు, కరీంనగర్ మున్సిపల్ చైర్మన్ గారికి, గ్రంధ సమీక్ష అభినందించిన డా॥ లక్ష్మణరావుగారికి, కరీంనగర్ జిల్లా పద్యసాహితి సమితి సాహితీ గౌతమి, సమతాసాహితిసమితి, సమైక్యసాహితీ సమతి,అధ్యక్ష కార్యవర్గాలకు, భారతీసాహితీ సమితి కోరుట్ల, జాతీయ కళాపరిషత్ మెటుపల్లి అధ్యక్ష కార్యవర్గాలకి, శ్రీ ఎన్నమనేని పాపారావు గారికి,శ్రీసరస్వతీ విద్యా పీఠం ఆం.ప్ర. అధ్యక్ష కార్యనిర్వాహక వర్గానికి, వానమామలై జగన్నాధా చార్యుల స్మారక ట్రస్టీ కార్యదర్శి శ్రీమాన్ వి, జగన్మోహనాచార్యులకు ప్రభుత్వ జూనియర్ కళాశాల కోరుట్ల ప్రిన్సిపాల్, అధ్యాపక, అధ్యాపకేతర సిబ్బందికి, ప్రభుత్వ జూనియర్ లెక్చరర్ల సంఘం కరీంనగర్ అధ్యక్ష కార్యనిర్వాహక వర్గానికి, జిల్లా వినియోగదారుల మండలి అధ్యక్ష కార్య నిర్వాహక వర్గానికి, జిల్లా ఎయిడెడ్ లెక్చరర్ల సంఘ అధ్యక్ష కార్యనిర్వాహక వర్గానికి, నా ఉన్నత విద్యార్జనకు తోడ్పడి ఆశీర్వదించిన బోధగురువులు శ్రీ ఎస్. రాజన్న గారికి, ప్ర.ఉ.లు కీ॥శే॥ శ్రీ వి.వి.ఎస్. శర్మ గారికి, శ్రీ రాధాకృషన్ గారికి, శ్రీ యం. తిరుపతిరావు గారికి. శ్రీ కె. మాధవరెడ్డి గారికి, శ్రీ ముకుందం గారికి నా కృతజ్ఞతాంజలులు.

# మొదటి భాగము

* విషయ సూచిక *



# రెండవ భాగం

## శ్రీమాన్ వానమామలై జగన్నాధాచార్యుల ఇతర కృతులు 223

# శ్రీమాన్ వానమామలై జగన్నాధాచార్యుల వారి సాహిత్య జీవితం

## ఒకటవ అధ్యాయము

"అరుణారుణ నవ భాస్వద్
వరకుంకుమ తిలకదీప్తవదన సువర్ణాం
బర సమలంకృత కటితటి
వరాంగి ప్రాక్సతి సునూత్న వధువటు తోచెన్"1

"చీకటి ప్రభుత్వములు మాసి చిన్న చిన్న
గను వెలుంగుల రాచరిక మొదవెనన
సంతసములు తొలగి తేజః ప్రసార
మింతెయింతె పెరుగుచు వ్యాపించెడిశల"2

"రైతు వాల్మీకి" వానమామలై జగన్నాధాచార్యుల వారు సాంప్రదాయమార్గ కవిత్వంలోను, నవ్యకవితాపథంలోను, జానపదజీవన చిత్రణంలోను, దేశికవితలోను, కవిత్వం జెప్పి మెప్పించిన ప్రతిభాశాలురు. తమకావ్యం రైతు రామాయణంలో ప్రాచీన కవితా కళారహస్యాల నావిష్కరించి, సామాజిక తత్త్వాన్ని సమ్యక్‌దృష్టితో కవితామయం గావించారు. సామాన్య రైతు కథావస్తువుగా ప్రజాకావ్యాన్ని మనోజ్ఞంగా వెలయింప జేశారు.

ఇరవయ్యో శతాబ్దం విశ్వాత్మను మేల్కొల్పింది. వినూత్నమైన ఉత్తేజాన్నిచ్చి, నవ్యశకానికి నాంది పలికింది. స్వాతంత్ర్యభానుడు

---

1 రైతురామాయణము-కళ్యాణ కాండము- 124 పుట-1వ పద్యం
2 రైతురామాయణము-విజయకాండము- 20 పుట-1వ పద్యం

చైతన్యదీప్తులతో భారతావనిని ప్రభావితం జేశాడు. సాహిత్య జగత్తు బాని సత్త్వ శృంఖలాల దెగ్రించుకొని స్వేచ్ఛా వాయువును పీల్చింది. భావదీప్తి అభ్యుదయానికి వెలుగుల విరజిమ్మింది. "వ్యక్తి చైతన్యం సంఘ చైతన్యం పరస్పరంగా సంఘటితమై జాతి చైతన్యానికి ఊపిరుల నిచ్చింది"1

"కాల్పనికోద్యమానికి పితగా పరిగణింపబడిన రూసో ప్రభావంతో కాల్పనిక కవిత్వం విశ్వరూపాన్ని దాల్చి విశ్వవ్యాప్తిని పొందింది. వర్డ్స్ వర్తు, షెల్లీ, కీట్సు, బైరను, కాలెరిడ్జ్, బ్లేకు, భాసరు, మైకేల్, బర్న్స్ మొదలగు కాల్పనిక కవుల రచనలు। భారతదేశంలో వివిధ భాషలపై ప్రభావాన్ని నెరపాయి. దీనితో కవిత్వ స్వరూపం మారింది. ఆధునికతను పొందింది.

కాల్పనికోద్యమ ప్రభావంతో తెలుగుసాహిత్యంలో గురజాడ, రాయ ప్రోలు, దేవులపల్లి, నాయని, వేదుల, దువ్వూరి, మొదలైన కవులు, తమ రచనల్లో వస్తు నవ్యతను, సంతరింపజేశారు. దీనితోపాటు శైలీనవ్యతను, అభివ్యక్తి వైచిత్రిని ప్రవర్తింపజేశారు. "సంఘసంస్కరణ మానవతావాదం, వాస్తవికతావాదం, అధివాస్తవికతావాదం, ప్రతీకవాదం" మొదలగు పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలు, అభిప్రాయాలు ఆధునిక కవులకు స్ఫూర్తి నిచ్చాయి"2 ఈ స్ఫూర్తి తేజః ప్రపంచంలో— మార్క్సు ప్రభావంతో

---

1 మహతి (యువభారతి పబ్లికేషన్స్) పుట 74

"వ్యక్తి చైతన్యం సంఘానికి, సంఘ చైతన్యం వ్యక్తికీ మార్పిడి అయ్యే దశలో వ్యక్తి శక్తికి పర్యాయపదం కాగలుతాడు. వ్యక్తికి బహువచనం శక్తి కాగలుగుతుంది. ఇది 1947 నాటి ఉజ్వలమైనదశ"

1 ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు. డా॥ సి. నారాయణరెడ్డి-196వ పుట.

2 ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు డా॥ సి. నారాయణరెడ్డి, 243వ పుట. గురజాడ మానవతావాదము- "శ్రీశ్రీ పైరియలిజము, మార్క్సిజము, సింబాలిజము, సర్రియలిజము

"వ్యక్తి చైతన్యంతోపాటు సంఘ చైతన్యానికి సమానాధికారంతో ప్రవచించే అభ్యుదయ కవితోద్యమం"1 ఆంధ్రదేశమంతటా విజృంభించింది. ఈ మార్క్సు ప్రతిపాదించిన గతి తార్కిక భౌతికవాద భూమికతో అభ్యుదయ కవిత్వం సామ్యవాద విప్లవోద్యమం ప్రభావంతో కావ్యజగత్తును సంపూర్ణంగా మార్చివేసింది. చైతన్య ప్రస్థానం వైపు పురోగమింపజేసింది.

"అరుణారుణ నవభాస్వత్ క్రాంతి చైతన్యాలతో" వ్యక్తి స్వాతంత్ర్యం స్వేచ్ఛా భావముతో పాటు సామ్యవాద దృష్టితో, ప్రజాస్వామ్యపు భావనతో 1. నవ్యసాహిత్య పరిషత్తు, 2. అభ్యుదయ రచయితల సంఘం 3. తెలంగాణా రచయితల సంఘం మొదలైన సాహితీ సంస్థలు ఆవిర్భవించాయి. ఈ సంస్థలు తమ క్రియాత్మకతచేత జనజీవన చైతన్యాన్ని జాగృతం జేయడానికి పుంఖాను పుంఖంగా రచనలు వెలువరించాయి. "విశ్వనాథ, పింగళి కాటూరి కవులు, గడియారం, మధునాపంతుల, వానమామలై సోదర జంటకవులు మొదలైన నవ్య సంప్రదాయ కవులును," శ్రీశ్రీ, దాశరథి, ఆరుద్ర, తిలక్, కాళో"1 ప్రముఖ అభ్యుదయ కవులు, తమతమ లక్ష్య సాధనలో, తెలుగు కవిత్వ వికాసానికి దోహదం జేశారు. తెలుగు సాహిత్య గగనంలో భాస్వన్మూర్తులుగా వెలుగొందారు.

ఈ ఒరవడిలోనే ప్రాచీన కవిత్వ రహస్యాలతో, ఆధునిక భావనలతో, పరిపుష్టమైన నూత్న సంస్కృతీ మహోదయ మహాశకంలో విలసిల్లిన "ప్రజాకవిశేఖరులు" వానమామలై జనన్నాథాచార్యులవారు.

ఈ కవి కవిత్వానుశీలనంలో వైయక్తిక స్వరూపాన్వేషణకు, వారు స్వయంగా చెప్పిన విషయాలు, కావ్యావతారికలు, ఆశ్వాసాంత గద్యలు మొదలగునవి ఉపకరిస్తాయి. కవుల రచనలపై వారి జీవితం–వ్యక్తిత్వం ప్రభావాన్ని నెరపుతాయి,

---

మున్నగు అనేక ధోరణుల ప్రభావమున్నది"–

1 ఆధునికాంధ్ర కవిత్వము–సంప్రదాయములు–ప్రయోగములు–
డా॥ సి. నారాయణరెడ్డి – పుట–522, 523 పుటలు

1 మహతి (యువభారతి పబ్లికేషన్స్) 59 పుట.

# I కవి వంశ చరిత్రం

ఆచార్యులు కవి పండిత వంశానికి చెందినవారు. వీరి రైతురామాయణంలో—

"తాత పండితుడు, తండ్రి శాస్త్రజ్ఞుడు
అన్నదమ్ములును మహాకవులట
ఇట్టి వంశమందు పుట్టు పుణ్యంబుండ
ఏమిగాక పోవుటేమి నేను?"[1] అని తెలియజేశారు ఆచార్యులవారు.

వానమామలై వంశం మూల పురుషుడు నారాయణప్ప. వీరు వైదిక నిష్ఠాగరిష్ఠులు. వైద్య విద్యావిశారదులు. షట్ శాస్త్రవేత్తలు. మొదట వీరి ఇంటిపేరు "వాసాలమట్టివారు" భారద్వాజస గోత్రులు - వైదికులు. ఆపస్తంబ సూత్రులు. ఒకమారు నారాయణప్ప వానమామలై పీఠాధిపతులును శ్రీమదుభయ వేదాంత ప్రవర్తకోత్తములును, ఐన స్వామి జీయంగారితో శాస్త్రచర్చలు జరిపి పందెంలో ఓడిరి. పందెపుటొప్పందం ప్రకారం నారాయణప్ప శ్రీ వైష్ణవ మతాన్ని స్వీకరించారు. స్వామి జీయంగారితో ఉపదేశ దీక్షలను పొందారు. అప్పటి నుండి వీరి వంశం వాసాలమట్టి నామమునగాక "వానమామలై" పేర వాసిగాంచింది.

నారాయణాచార్యుల పుత్రులు సింగరాచార్యులు. వీరు శ్రీ రామానుజ మతావలంబకులు. శ్రీమద్భగవద్గీతను నిత్యం పారాయణం జేసేవారు. వీరి పెద్ద కుమారుడు లక్ష్మణాచార్యులు, తాతతండ్రుల శాస్త్రపాండితీవైదుష్యాలను, నిండుగా జీర్ణించుకున్న వీరు కవితా కళాపారంగతులు. ఈ లక్ష్మణాచార్యుని సుతులు వేంకయశాస్త్రిగారు. వీరు మన ఆచార్యుల తాతగారు. వేంకయశాస్త్రులు రసాలంకార శాస్త్రాలలో పారము ముట్టిన విద్వాంసులు. మహాప్రజ్ఞాలురు. నాటి రోజులలో ఎందరో శిష్యులు వీరివద్ద పంచ మహాకావ్యాలను అభ్యసించి యుండిరి. "వీరింటిముందరి పందిరి గుంజలు సైతం కవిత్వం జెప్పెడి"వని లోకోక్తి. వేంకయశాస్త్రి గారి పుత్రులు శ్రీ లక్ష్మీనృసింహాద్రులు బక్కపలుచగా నుండుటచే "బక్కయశాస్త్రి"గా ప్రసిద్ధి పొందారు.

---

1 రైతురామాయణము, వంశ ప్రశంస– 15 పుట–4వ పద్యం

వీరే మన జగన్నాథాచార్యుల వారి పితృదేవులు. బక్కయశాస్త్రి గారికి బాల్యంలోనే పితృ వియోగం జరిగింది. వీరి మాతృమూర్తి అరుట్ల జగన్నాథాచార్యుల వద్ద వీరికి విద్యను నేర్పించారు. అరుట్లవారు వేంకయశాస్త్రి గారి శిష్యాగ్రణి. బక్కయశాస్త్రి సునిశితమైన ప్రజ్ఞగలవారు. సంగీత సాహిత్యాల్లోను, జ్యోతిర్వేదంలోను మహా విద్వాంసులు.గొప్ప పౌరాణికులు. పండితులను, పామరులను పరవశింపజేస్తూ, పురాణాలను శోత్రపేయంగా వినిపించేవారు. జంబురా గళంతో సభాస్థలి ఘూర్ణిల్లునట్లు గానంజేసి రంజింప జేసేవారు. "వింటే బక్కయశాస్త్రి పురాణాలనే వినాలి, తింటే గారెలే తినవలె''నని జనులు వినోదంగా జెప్పుకొనేవారు. పండొల్చి పెట్టినట్లుగా పురాణకథను ప్రవచింపగా, రసజ్ఞశ్రోతలు చిత్తరువులవోలె నుండి పోయెడి వారట. సకలకళాకోవిదులైన బక్కయశాస్త్రిగారు అనేక సన్మానాలందుకొన్నారు. వీరి ధర్మపత్ని సీతామహాసాధ్వి అన్నపూర్ణ. నిత్యాన్నదానసత్ర దీక్షతో, అతిథి అభ్యాగతులకు లేదనక దానం జేసేవారు. ఇటువంటి ఆదర్శ దంపతులకు నోములపంటగా నలువురు పుత్రులు, ఇరువురు కూతుళ్ళు జన్మించారు.

పుత్రులలో పెద్దవారు వేంకటాచార్యులు, రెండవవారు లక్ష్మణాచార్యులు, మూడవవారు శ్రీ రామాయణ మహా కావ్యకర్తలు మన ఆచార్యులు, కనిష్ఠులు అభినవ పోతన వరదాచార్యులు.

## II. ఆచార్యుల బాల్యం—విద్యాభ్యాసం :

ఆచార్యులవారు తాతముత్తాతల స్వస్థానం ఆదిలాబాదు జిల్లాలోని చెన్నూరు మండలం. కాలక్రమంలో "మడికొండ ప్రభువులు తౌటిరెడ్డి గోపాల్‌రెడ్డి బక్కయశాస్త్రి గారి ప్రశస్తి విని, వారిని ఆహ్వానించి, సకల సౌకర్యాలు సమకూర్చి, పోషింపగా, శాస్త్రిగారు "మడికొండ"లో స్థిర నివాసమేర్పరచుకొనిరి"1 ఈ విధంగా ఆచార్యుల జన్మస్థలం 'మడికొండ' యైనది. ఈ మడికొండనే 'మణిగిరి', "ముడిగొండ" అనేవి నామాంతరా

---

1 వానమామలై వరదాచార్యుల వారి కృతులు-అనుశీలనం
డా॥ అందె వెంకటరాజం – పుట -6

లున్నవి. ఇది కాకతీయ వైభవాలను చాటే ఓరుగల్లు పట్టణానికి సమీపంలో ఉంది. పింగళి వంశీయులు, నియోగి బ్రాహ్మణులైన 'దేశముఖులజాగీరు' ఈ మడికొండ పట్టణం, కొప్పరపు కవులు, ఆంధ్రదేశపు ఆస్థాన కవులైన శ్రీ పాద కృష్ణమూర్తి గారు ఇచ్చట సత్కరింపబడినారు. నిజాం రాష్ట్ర ప్రథమ శతావధాని యని పేరుపొందిన వీరవల్లి నృసింహాచార్యులు మడికొండమణిపతె ప్రకాశించారు.ఆధ్యాత్మ రామాయణాన్ని రచించినమోతుకూరి పండరీనాథకవి అభిజననము ఈ మడికొండయే.

వర్తమాన సాహితీ జగత్తులో అభివర్ధమానులై, సుప్రసిద్ధులై వాసి గాంచుచున్నట్టి డా॥ బిరుదు రాజు రామరాజు, డా॥ పల్లా దుర్గయ్య, ప్రజాకవి డా॥ కాళోజి నారాయణరావు, డా॥ అనుముల కృష్ణమూర్తి, మోతుకూరి వేంకట నరసింహారావు మొదలగువారు మడికొండ వాస్తవ్యులే. ఏవం విధమైన ప్రశస్తిగన్న కవిపండిత కళాకారులకు గనియై విరాజిల్లుచున్న మడికొండలో ఆచార్యులవారి బాల్యం గడించింది.

ఆచార్యులవారి పెద్దన్నగారు వేంకటాచార్యులు వీరు కడు నిరాడంబరులు. అచ్చమైన గాంధేయవాదులు. సంస్కృతాంధ్ర తమిళాది భాషల్లో పాండిత్యం గడించినవట్టి అప్పటి ఉస్మానియా మెట్రిక్ పట్ట పరీక్షలకు ఉర్దూ, ఆంగ్లం, గణితశాస్త్రాలను బోధించి, అనేకులకులగు శిష్యులను తీర్చి దిద్దిన గురువతంసులు శాంత గంభీరతలు, తొణకని, తుళ్ళిపడని, దూకి పడని సౌమ్యతలు వీరి సొత్తు. వ్యాస భగవద్గీతకు శుద్ధాంధ్ర పద్యానువాదాన్ని, జ్ఞానేశ్వరి భగవద్గీతకు వచనానువాదాన్ని గావించారు. భండార్కర్ సంస్కృత వ్యాకరణాన్ని రెండు భాగాల్లో అనువదించారు. నేడవి అలభ్యాలు.

బాల్యంలో మన జగన్నాథాచార్యులు పెద్దన్న వద్దనే విద్యనభ్యసించారు. తండ్రి తర్వాత తండ్రిగా వేంకటాచార్యులు మిక్కిలి బాధ్యతతో తమ సోదరులకు విద్యను గరపి సుశిక్షితులుగా తీర్చిదిద్దారు. రైతు రామాయణాది మహాకావ్యాలవి నిర్మాణానికి గురుపరంపరగా ఆశీస్సుల నొసంగినారు. పెద్దన్నగారిని సంస్తుతిస్తూ రైతురామాయణంతో కృతజ్ఞతలు తెలిపారు మన ఆచార్యులు.

"తమ్ములమగు మాలోన గు
ణమ్మునను బెద్దని యున్న నమ్మెడియది స
ర్వమ్మున్న యదే; లవలే
శమ్మును మాఱిడియులేదు సత్యమ్మరయన్"1

వేంకటాచార్యులు కరీంనగరం జిల్లా హుజూరాబాదు మండలంలో గట్ల నర్సింగాపురం జమీందారు గుండవరపు జగన్నాధరావుగారి ఆస్థాన పండితులుగా ప్రశస్తిని పొంది కీర్తిశేషులైనారు.

లక్ష్మణాచార్యులు రెండవ అన్నగారు వీరు బుద్ధి పాండితిలో బృహస్పతి. బహుభాషలలో కవి పండితులు. సంస్కృతాంధ్ర భాషల్లో పదికి పైగా కృతులను వెలయించారు శ్రీ పతి సంజీవని, గోదాసతియను సంస్కృత రూపకాలను, సతి అనసూయ, తిక్కన చరితము, అను ఆంధ్ర కావ్యాలను, "ఆముక్తమాల్యద, రామాశ్వమేధం" అను నాటకాలను, "సంస్కృతిః" యను నవలను గాక, 'తానికీ శిక్ష' యను 600 సూత్రముల సూత్ర గ్రంధాన్ని కూడా రచించారు. వీరు హిందీలో 'రామాయణ్ కే భక్త్' అను కావ్యాన్ని రచించారు. లక్ష్మణాచార్యులు మహారాష్ట్ర చాందా జిల్లాలోని "ఆహిరి" రాజావారి సంస్థానంలో చిరకాలము ఆస్థాన విద్వాంసులుగా నుండిరి. పాణిని పతంజలులను తలపించే వీరు కోయభాషకు లిపిసారస్వతాలను సృష్టించి, చిరకాల యశస్సును ఆర్జించిరి. పిదప వీరు కరీంనగర్ జిల్లా పెద్దపల్లి మండలంలో సంస్కృత పాఠశాల యందు ప్రాచార్యులుగా సేవలొనర్చి ఐదు దశాబ్దాల క్రితం దివంగతులైరి.

వరదాచార్యులు ఆచార్యులవారి కనిష్ఠ సోదరులు, వీరు పోతన మహాకావ్యాన్ని రచించి 'అభినవ పోతన' బిరుదాంచితులై ఇటీవలనే కీర్తిశేషులైనారు. రైతురామాయణంలో సుమారు ముప్పది పద్యాల్లో వీరిని ప్రశంసించారు ఆచార్యులు.

---

1 రైతు రామాయణము–గురుమూర్తి భాతృ ప్రశంస–7వ పుట–1వ పద్యం

2 రైతురామాయణం–ద్వితీయాగ్రజ ప్రశంస 7వ పుట.

"సిద్ధహస్తుడు త్తమ కావ్యశిల్పమందు
బద్ధహస్తుడు వాగ్దేవి పదము ముందు
అపర భక్తపోతన్న తదాత్మ వెన్న
తెలుగు వెలుగన వానమామల వరవదన"1

వరదాచార్యులవారి ప్రతిభా పాండితీవైదుష్యాలను శ్లాఘించి, కాశీ విశ్వవిద్యాలయం వారు "విద్యావాచస్పతి" బిరుదంచే సత్కరించారు. చెళ్ళ పిళ్ళ వేంకటావధానులు, "ఆంధ్రకవి వతంస" అని శ్లాఘించారు. వీరు "ప్రాచ్య షేక్స్పియరు" అని కీర్తించబడినారు. మణిమాల, విప్రలబ్ధ, శ్రీసూక్తి వైజయంతి, స్తుతిశతి పంచకము, జయధ్వజం, వైశాలి నాటకం మొదలగు అనేక కావ్యాలను రచించి యశోవిరాజితులైనారు.

అభినవపోతన వరదాచార్యులకు కరీంనగర్ జిల్లా కోరుట్ల పట్టణంలో ఘనమైన సన్మానం జరిగింది. అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, నేటి భారతప్రధాని, శ్రీ పి.వి. నరసింహారావు వీరికి గండపెండారాన్ని తొడిగి సత్కరించారు. ఆచార్య దివాకర్ల వేంకటావధాని ఘంటాకంకణమిడి సంభా వించారు. కరీంనగర్ జిల్లా పరిషద్ అధ్యక్షులు శ్రీ శ్రీనివాసరావు కనకాభి షేకం గావించి సన్మానించారు. వీరి శిష్యులు డా॥ అందె వెంకటార్జం ఈ సన్మానోత్సవ నిర్వహణకు ఎనలేని కృషి గావించారు. పోతన చరిత్రము, ఇతర కృతులను అనుశీలించి కాకతీయ విశ్వవిద్యాలయం వారిచే డాక్టరేటు పట్టాను పుచ్చుకున్నారు.

తొలి దశలో జనన్నాథాచార్యులును వరదాచార్యులును కలసి జంటగా కవితాగానములు గావించుటచే వీరు 'జగదీశ వరద జంట కవులు"గా పేరెన్నికగన్నారు. ఆచార్యులు తమ సోదరుణ్ని శ్లాఘిస్తూ—

"పోతనలు కాళిదాసులే పోనునింక
ఎందరెందరు కవులు నీ యందు గలరో

1 రైతు రామాయణం - కనిష్ఠ భ్రాతృ ప్రశంస-
10వ పుట 8వ పద్యం

ఏదవెఱఁగుదు రొక్కొక నీ కవితలోన
నొక్కొక్క మహాకవి మనీషి యుద్గమించు1

అని అభినవ పోతనను అభివర్ణించారు.

ఏవం విధమైన కవితా పాండితీ ప్రాభవం గడించిన వానమామలై వంశమునందు శ్రీమాన్ జగన్నాథాచార్యులుద్భవించి మహాకవులుగా ప్రశస్తి గొందినారు. ఇదే విషయాన్ని ఆచార్యులు తమ రైతు రామాయణంలో ప్రస్తావించారు.

"వంశ గుణము దేవి వరప్రసాదమ్మును
పూర్వజన్మలోని పుణ్యలవము
పరమ గురుని శిక్షబలము నిన్నియుగూడి
నేనొక పదార్థమై నిలిచితి"2

ఈ విధంగా ఆచార్యులు మహాకవులుగా రాణించుటకు ఆభిజాత్యం, వంశగౌరవం ప్రబలంగా దోహదపడ్డాయి.

## III. కవితా ప్రాదుర్భావం–తద్వికాసం

డా॥ పల్లా దుర్గయ్య, కాళోజి నారాయణరావు, కాళోజి రామేశ్వరరావు, బిరుదురాజు రామరాజు, అనుముల కృష్ణమూర్తి మున్నగువారు ఆచార్యుల బాల్య స్నేహితులు. బాల్యంలో వీరందరు కలిసి ఇష్టాగోష్ఠిగా కవితా సాహితీ చర్చలు జరిపేవారు. పూవు పుట్టగానే పరిమళించునన్నట్లు పెద్దన్న వేంకటాచార్యుల శిక్షణలో పెరిగిన మన ఆచార్యులకు చిన్న వయస్సునందే కవితా శక్తి యబ్బినది. సంస్కృతాంధ్ర భాషలతోపాటు, తమిళాంగ్ల ఉర్దూ ఇతర భాషల్లో సైతం వైదుష్యాన్ని గడించారు.

మడికొండలో నున్నప్పుడు ఆచార్యులు "కార్ప్పావలక్ష్మి" అను నాటకాన్ని రచించారు.1 అందలి పద్యమొకటి 1934 సం॥లో "గోలుకొండ"

---

1 రైతు రామాయణము–కనిష్ఠ భ్రాతృ ప్రశంస – 15వ పుట 8వ పద్యం

2 రైతు రామాయణము–ఆత్మ ప్రశంస – 4వ పుట–6వ పద్యం.

1 వానమామలై వరదాచార్యుల కృతులు–అనుశీలనం.
డా॥ అందె వెంకట్రాజం – 7వ పుట

సంచికలో ముద్రితమైంది. ఆ పద్యమిది—

"తలదాచు కొనుటకై తగునీడయులేని
యొక చిన్న గుడిసె వారుండు వసతి
య్యాదాయమది రోళ్ళయడుగున బడియున్న
యొక కొన్ని గింజల నూర్చుకొనుటె
భార్యయూ తానొక సాధ్వీమణి
యిలుదాటి పొరుగిల్లు సెరుగదెపుడు
మానమ్ముగాపాడు మాత్రపు జీనుగుడు
పేలికే వారికి చాల కరవు యిట్టి కష్ట
జీవమునసేని నాధుననదు పల్లెత్తుమాటయు,
సైనసెపుడు పతిపదారవిందములె
శ్రీపతి షధారవిందములటంచు లక్ష్మినాపెలసె
భువిని వరదగురు గృహలక్ష్మి కార్పాసలక్ష్మి"

ఆచార్యులవారికి పిన్ననాటనే కర్షక[1] జీవన చిత్రణమొనర్చు జిజ్ఞాస కార్పాసలక్ష్మి నాటక రూపమున మొలకెత్తింది. అది పల్లవించి, కుసుమించి రైతురామాయణ కల్పవృక్షమై ఫలించి కృషిఫలాలను సాహిత్య జగత్తుకు పంచింది. విశ్వకవి రవీంద్ర కవీంద్రుని గీతాంజలి కావ్యగీతాలు వీరికి మిక్కిలి ప్రేరణను కల్గించాయి. విశ్వకవి విశ్వాత్మను దర్శించిన విధానాన్ని అతని రచనలకు సమాజం ప్రభావితమై చైతన్య పొందుచున్నదన్న విషయాన్ని గ్రహించి, స్ఫూర్తిని పొందినారు ఆచార్యులు. దీనికి తోడుగా గాంధీజీ ఆశయాలు ఆచార్యులవారి హృదయాన్ని ఆకర్షించాయి. సహజమైన ప్రకృతి రామణీయకమైన పల్లె పట్టుల్లోని కర్షక ప్రజల జీవన వ్యవహార సర్లళి, వీరి లేత హృదయాన్ని ఆకట్టుకుంది. రవీంద్రుని ఆశయాల రూప కల్పనకు వీరి సుకుమార కవితా హృదయం స్పందించింది కవితాసక్తిగల ఈ ఆవేదనయే "కార్పాసలక్ష్మి"గా అవతరించింది. కాని ఈ రూపకం చిర కాలం వెలుగుచూడక లుప్తమైపోయింది.

---

1 గోలకొండ సంచిక 1934 సం॥ కార్పాసలక్ష్మి-

ఆచార్యుల పెద్దన్నయ్య వేంకటాచార్యులు ఒక పుష్కరకాలం వరకు కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో పుస్తక భాండాగారమునందు ఉన్నతో ద్యోగిగా యున్న సందర్భంలో ఆచార్యులకు అనేక గ్రంథాలను పఠించే సదవకాశం లభించింది. తఱచుగా కవి పండిత గోష్ఠులందు పాల్గొని సాహిత్య చర్చ గావించేవారు. అందువలన వీరి కవితాపాండితి పరిపుష్టత పొందింది. కనిష్ఠ సోదరులు వరదాచార్యులతో కలిసి అనేక సభల్లో కవితాగానం జేసే వారు. 'జగదీశవరద జంట కవులు'గా సోదరులిరువురు అనేక సన్మానాలు పొందారు.

వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లోని పల్లెల్లోనూ, పట్టణాల్లోనూ వీరు అనేక హరికథలు, నాటకాలు, కవితాగోష్ఠులు ఎన్నెని సభల్లోను పాల్గొని ప్రజలను సతంస్కరించుటయే గాక కావ్యానందాన్ని పంచి జనుల్లో జాతీయ భావాన్ని పెంచారు.

## IV. గార్హస్థ్య జీవితం – తెలంగాణా ఉద్యమ పరిభాపం:

వివాహానంతరం ఆచార్యులు కరీంనగర్ జిల్లా హుజూరాబాదు తాలూకా లోని "పోతారెడ్డిపేట" యను గ్రామంలో స్థిరనివాస మేర్పరచుకొన్నారు. ఇచట వీరు వ్యవసాయాన్ని ప్రధాన వృత్తిగా చేకొని, కవితావ్యాసంగాన్ని నిర్వహిస్తూ, తీరిక సమయాల్లో హరికథ కాలక్షేపం జేస్తూ, రైతు జీవితాన్ని గడుపుచున్నారు.

రైతాంగ పోరాటం, రజాకారు ఉద్యమం పతాక స్థాయికి చేరిన కాలంలో వీరు తెలంగాణ విముక్తి ఉద్యమ నాయకులతో గలసి పనిజేశారు. తమ సహజ కవిత్వ పాండితీ ప్రతిభతో, స్వాతంత్ర్య గీతాలాపనలతో, నిజాం వ్యతిరేక పోరాట వీరులకు స్ఫూర్తినిస్తూ తమ రచనా వ్యాసంగానికి సార్థకతను చేకూర్చారు.

ఉద్యమ కాలంలో నొకనాడు "యలబాక" యను గ్రామంలో హరి కథా కాలక్షేపం జేయుచు నిజాం వ్యతిరేక స్వేచ్ఛా గీతాలాలాపించుచున్న సమయంలో రజాకారు దళాలు ఆచార్యులను చుట్టుముట్టాయి. ఎటులో

తప్పించుకొని ఆచార్యులు ప్రవాస జీవితాన్ని గడుపవలసి వచ్చింది"[1] సామ్యవాద ప్రభంజన ప్రభావం వీరిని కూడ ఆకర్షించింది.

ఆచార్యులవారి రచనాగీతాలు స్వాతంత్ర్యయోధులకు స్ఫూర్తి నిచ్చాయి. ఏవం విధమైన ఉద్యమ స్ఫూర్తితో వీరికి రైతులన్నను, వ్యవసాయమన్నను, ఎనలేని అభిమానమేర్పడింది.

"ఏను గర్వింతు తెలుగు మాగాణమందు
తెలుగు మొలకనై పుట్టినందులకుఁ దెలుగు
వెలుగు నీడలఁ బెరిగి నందులకును తెలు
గమ్మ పదసేవ నోచికొన్నందులకును"

తెలుగు మాగాణమందు పుట్టి పెరిగినందులకు,
తెలుగమ్మ పదసేవ నోచికొన్నందులకు
గర్వించిన ఆచార్యులవారి హృదయం నిర్మలమైంది-సువిశాలమైంది-సమున్నతమైంది-ధన్యమైంది.

పోతారెడ్డిపేటలో ఇల్లరికానికి వచ్చిన వీరు శ్వశుర గృహంలోనే స్థిరపడ్డారు. తమ సత్ప్రవర్తనంతో, నిస్వార్థ త్యాగశీలనంతో సకల బంధుజనాదరణాలను పొందియున్నారు. వీరి జీవితం ఆదర్శవంతమైంది. వీరి కుమారులందరును విద్యావంతులై బోధనావృత్తికి వన్నెయు, వాసియు దెచ్చుచున్నారు. వీరి శిష్య ప్రశిష్యకోటి సమున్నత పదవుల్లో నున్నవారు గలరు. ఆచార్యుల వారు ఎంతయు అదృష్టవంతులు.

## V. ఉద్యోగ జీవితం—హరికథాకాలక్షేపం:

మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణులైన వీరు, కొంతకాలం పాటు కరీనగర్లో నాగభూషణం ట్యుటోరియల్ కాలేజిలో ఆంధ్రోపన్యాసకులుగా పనిజేశారు. అట్లే శ్రీరాంపురంలో ఆచార్యులుగాయుండి విద్యాబోధన గావించారు.

---

1 ఇది ఆచార్యులు స్వయంగా తెలిపిన విషయం

1 రైతురామాయణము-ఆత్మ పరిశంస
15వ పుట — 6వ పద్యం.

ఆదిభట్ల నారాయణదాసు భాగవతారు స్ఫూర్తితో హరికథకాలక్షేపాలు జేయుట యందాసక్తి కలిగింది. వీరు సంగీత శాస్త్ర కళాభిజ్ఞులు. జంబూ రాగళంతో శ్రావ్యంగా గొంతెత్తి పాడుచున్న వీరి హరికథా కాలక్షేపం పండితులను, పామరులను ఆనందాబ్ధిలో నోలలాడిస్తుంది. స్వయంగా వీరు పద్యాలు కీర్తనలు రచించి హరికథాగానం జేయుదురు. వీరు గొప్ప పౌరాణికులు.

"అహిర సంస్థాన" పండితులైన వీరి ద్వితీయ సోదరులు లక్ష్మణాచార్యుల ప్రోపుచే వీరికి కూడా ఆయాస్థానంలో ఆశ్రయాదర సన్మానాలు లభించాయి. అందువల్ల ఆదిలాబాదు, మహారాష్ట్ర ప్రాంతాల్లోనూ వీరి హరికథా కావ్యగాన సభలు నిర్వహించబడినాయి. హిందీ, మరాఠీ భాషల్లోనూ హరికథాగానం జేసి అందరి మన్ననలను, ప్రశంశలను, సన్మానాలను పొందారు.

## VI· రైతురామాయణ కావ్యరచన–ఇతర కృతులు:

నిజాం వ్యతిరేక పోరాటం స్ఫూర్తిని పొందిన వీరు సుమారు ఇరువదారు ఏండ్లు కవితా తపస్సొనర్చి, రేబవళ్ళు శ్రమించి రైతురామాయణ మహాకావ్యాన్ని వినిర్మించారు. తెలంగాణా సీమలోని మారుమూల పల్లెల్లోనూ ఉన్నత పాఠశాలల్లో, కళాశాలల్లో వీరి కావ్యగాన సభలు నిర్వహించబడ్డాయి.

అయా సందర్భాల్లో, వేడుకల్లో వీరు ఆశువుగా అనేక మంగళహారతులు కీర్తనలు రచించి గానం జేశారు. నేటికిని యివి భక్తకోటిచే కీర్తింప బడుతున్నాయి. తమిళంలో శ్రీ గోదాదేవి రచించి పాడిన "తిరుప్పావు"ను ఆంధ్రీకరించి "శ్రీవ్రతగీతి" అను కావ్యాన్ని రచించారు. శ్రీ ఆదివరాహ స్వామిని స్తుతిస్తూ భక్తి పారవశ్యంతో "ఆదివరాహాస్తవం" అను శతక కావ్యాన్ని రచించారు. దేశభక్తిని సమర్చనంగా చాటే వీరి "తెలుగుబిడ్డ" యను మరొక ఖండకావ్యం సమాజానికి దర్పణం పంటిది.[1]

---

1 "ఇతర కృతులు–అనుశీలనం"లో ఈ మూడు కావ్యాలు అనుశీలించబడినవి.

## VII. సాహిత్యసేవ:

ఆచార్యులు పలు కావ్యాలను రచించడమేగాక అనేక గేయ నాటికలను నాటికలను, భక్తి, దేశభక్తి గలిగిన గేయాలను, పాటలను, బుర్రకథలను, మంగళహారతులను రచించి గానం జేశారు. అనేక సభల్లో కాలక్షేపాలొనర్చి "ప్రజాకవిశేఖరులు"గా వాసిగాంచారు. మిక్కిలి వయోవృద్ధులయ్యీ ఆచార్యుల వారు ప్రస్తుతం "అరుంధతి" మహాకావ్యాన్ని రచించుట యందు నిమగ్నులై యున్నారు. "ప్రాజ్ఞులు జరామరణములు లేని వారివలె విద్యా విత్తాలు గడింతురు.''

గాంధీజీ మానవోద్యమాన్ని, సమాజ వాదాన్ని జీర్ణించుకున్న ఆచార్యులు గ్రామోద్ధరణాకాంక్షచే, జాతియైక్యతను పెంపొందించాలన్న తపనతో, నైజాం పాలనలోని జమిందారీ ఫ్యూడల్ వ్యవస్థను తొలగించాలన్న ఉన్నతాశయంతో రైతురామాయణాన్ని రచించారు. వీరి కవితాస్ఫూర్తికి కరీంనగర్ జిల్లా యువకవులందరిలో భావదీప్తి కలిగింది. అనేక సాహిత్య సంస్థలు వెలసినాయి. సాహిత్య గోష్టులు నిర్వహింపబడినాయి. ఆచార్యుల వారి కవితాగానాలు, సాహిత్యోపన్యాసాలు సమాజ చైతన్యాన్ని కలిగించాయి. ఈ విధమైన ప్రేరణతో అయా సంస్థల ద్వారా పలు కవుల రచనల సంకలనాలు ఆచార్యులవారికి గౌరవపురస్కారంగా అంకితమివ్వబడినాయి. 1973 జూన్‌లో కరీంనగర్ "కళానికేతన్" సంస్థ 24 మంది యువకవుల యొక్క 28 కవితల సంకలనం ''తరంగిణి"ని ''విలువైన తెలుగుకవి, "రైతురామాయణకర్త"1 యైన ఆచార్యులకు అంకితమిచ్చి అచంచలమైన గురుభక్తిని చాటుకుంది.

"గళమా! కమ్మని పిల్లనగ్రోవికెనయౌ కాదో యశీనాదమో
కలమా! అగని కాంతిరేఖ-యుదికాదో రైతుసేరాగశ్రీమో
తెలుగుం బల్కు పొలంపు హాలికుడ నిన్ దీక్షారశీన్ మాకృతీ
లలనారత్నము చేర్చె మాలగానికేలన్ గొమ్ము ప్రేమమ్మునన్"2

1 కళానికేతన్ సాహిత్య సంస్థ కరీంనగర్ వారు అచార్యులను ఆదరంగా పేర్కొని అంకితమిచ్చారు.

2 "తరంగిణి" పేజీ - 1 - మలయశ్రీ కళానికేతన్ ప్రచురణ - 2 కరీంనగరం

అని భక్తి ప్రేమాదరాలతో ఆచార్యుల కవితా వ్యవసాయాన్ని స్తుతిస్తూ 'తరంగిణి'ని అంకితం గావించారు. ఆచార్యులవారి కవితాభిమానానికి, సాహిత్యసేవకు ఇదొక ఉదాహరణం మాత్రమే.

## VIII. రైతు రామాయణ కావ్యముద్రణ:

ప్రజాకావ్యం రైతు రామాయణాన్ని గ్రంథరూపంలో ప్రజలకందించడానికి కరీంనగర్ జిల్లా "గ్రామాధికారుల సంఘం" వారు విరాళనిధిని సమకూర్చారు. జిల్లా కలెక్టర్ శ్రీ కె.యస్. శర్మ బాధ్యతతో గ్రంథాన్ని ముద్రించి చరితార్థులైనారు. నాటి ముఖ్యమంత్రి, నేటి భారత ప్రధాని మాన్యులు పి.వి. నరసింహారావు రైతురామాయణ మహాకావ్యాన్ని అంకితంగా స్వీకరించారు.

ఈ విధంగా కవి పండితులచే, ముఖ్య గ్రామణులచే, సచివ ప్రముఖులచే సన్మానితులైన ఆరుర్యులవారి యశశ్చంద్రికలు తెలంగాణంనందే గాక యావదాంధ్ర దేశంలోనూ, ఆంధ్రేతర సీమల్లోనూ పరివ్యాప్తమైనాయి

## IX. అభిమాన కవులు-పొందిన పొగడ్తలు-గౌరవ పురస్కారాలు:

ఆచార్యులకు వాల్మీకి వ్యాసకాళిదాసు లనిన వీరికి అమితమైన భక్తి భారత కవిత్రయంతో తిక్కన యన అభిమానం మెండు. తిరుపతి వేంకట కవులు, పింగళి కాటూరి కవులు, ఉత్పల, విశ్వనాథలపై గురుభావం. దాశరథి, శ్రీశ్రీ లన్న స్నేహభావం గల రస హృదయులు ఆచార్యులు.

మంథని, కరీంనగర్ పట్టణాల్లో కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణ గారి అధ్యక్షతలో విద్వత్కవి పండితగోష్ఠులు నిర్వహించబడ్డాయి. ఆ సభలలో "జగదీశవరద జంట కవులు"ను పాల్గొన్నారు. (ఆచార్యులు) వీరు తమ సహజ మాధుర్య గంభీర గళాలతో కవితాగానంతో విద్వత్సభను రంజింపజేశారు. దీనితో సంతుష్టులై, ముగ్ధులై విశ్వనాథ తమ తమ అధ్యక్షో

పన్యాసంలో ఆచార్యులను శ్లాఘిస్తూ "రైతుకవి జగన్నాథాచార్యులను గన్న తెలంగాణ తల్లి మంచి అదృష్టవంతురాలు" అని ఆశీస్సులనొసగినారు.1

ఇటీవలనే తెలుగు విశ్వవిద్యాలయం వారు నాట్య, సంగీత, అవధాన, కవితాది కళారంగాల్లో వర్తమానంలోని ప్రముఖులకు కొందరకు పురస్కారాలను ప్రకటించారు. అందు కవితారంగంలో ఆచార్యులవారి రైతు రామాయణంలోని కవితా ప్రాభవానికి మెచ్చి ఉత్తమ గౌరవ పురస్కారాన్ని నగదు బహుమతితో సత్కరించారు.

కరీంనగర్ జిల్లా కలెక్టర్ మరియు ఉన్నత అధికారులు కలిసి "స్వాతంత్ర్యయోధుల సన్మాన సభలో ఆచార్యులను ప్రత్యేకంగా సన్మానించి, కవిగారిపై ప్రజలకున్న అచంచలమైన ఆదరాభిమానములను కృతజ్ఞతా పూర్వకంగా వెల్లడించారు.

## X. ఆచార్యుల వినయగుణ సంపద:

ఏవం విధమైన ప్రాభవ ప్రాశస్త్యాలను గడించుకొన్నను వీరు సహజంగా వినయగుణశీల సంపన్నులు. తొణకని కుండ. నిగర్వి. నిరాడంబరులు పవిత్ర హృదయులు.

"క్రిందటి యిప్పటి ముందటి
యందటి కవులం దలంతు నంజలియిడుచున్
మందుఁడనగు నా బుద్ధికి
నందని ప్రతిభా సమంచితాద్భుతమతులన్"1

అని సవినయంగా కవితామూర్తులకు అంజలి ఘటించిన సౌమనస్య సౌజన్య స్వభావులు ఆచార్యులు.

కవిసమ్రాట్ విశ్వనాథ, కళాప్రపూర్ణ డా॥ దాశరథి, డా॥ పల్లా దుర్గయ్య, అభినవ పోతన వానమామలై వరదాచార్యులు, ఆచార్య సి. నారాయణరెడ్డి మొదలగు కవిపండిత ప్రకాండులచే మెప్పులు పొందిన కవివరేణ్యులు వానమామలై జగన్నాథాచార్యులు. "రైతువాల్మీకి" 'ప్రజాకవిశేఖర" "అభినవ పాల్కురిక్" బిరుదులచే పురస్కృతులైన కవిత్వోపాసకులు. నిరంతర కవితాసాధకులు.

---

1 ఆచార్యులు స్వయంగా తెలియజేసిన యంశాలు.

1 రైతురామాయణము-దేవతాస్తుతి-3వ పేజి – 1వ పద్యం

# రచనాకాలం నాటి పరిస్థితులు - ప్రేరణలు

## II. రైతు రామాయణం గాంధీజీ సమాజవాదం

"మనకుం బ్రాణము కార్మికుండతని యా మాత్రంపు తోడే లభిం
చనిచో నెక్కడిదక్కడే నిలచి స్తంభించునే నాడొయీ
పనివారల్ పనిసేయునంతవరకే పై మేడలెన్నే న్పునా
దినినాధారము జేసికొన్న వె శ్రమాధీనమ్ము లీలోకమ్ముల్"1

"మన దేశానికనుగుణంగా ఉండే సామ్యవాద సిద్ధాంతాన్ని మనమవ లంబిద్దాం. జమీందారుల దురాశనూ, వారసత్వంవల్ల వంశానుగతంగా సంక్రమిస్తున్న వారి నిరంకుశాధిపత్యాన్ని కూడా మనమిక సహించలేము. పుట్టుకవల్లనే గొప్పవాడుగానూ, నీచుడుగానూ పరిగణించే భేదాలిక ఎంత మాత్రం పనికిరావు"2 అనునట్టి గాంధీజీ ప్రవచనములకు అనుగుణంగా నిజాం దుష్టపాలనకు విసిగిన ప్రజల వ్యతిరేక పోరాటాన్ని కేంద్రబిందువుగా గ్రహించి. తరతరాల నుండి పీడిస్తున్న జమీందారీ, పెట్టుబడిదారీ వ్యవస్థను నిస్తేజంజేయాలన్న ధ్యేయంతో, కర్షక శ్రామిక శక్తికి ప్రాధాన్యతనిస్తూ గాంధీజీ సమాజవాదాన్ని నిరూపిస్తూ రైతురామాయణ మహాకావ్యాన్ని రచించారు ఆచార్యులు.

మానవుని శరీరంలోని అవయవాలన్నీ సమానాలే. విధింపబడిన పనిని ప్రతి అవయవం నిర్వహిస్తే మానసిక, శారీరకవికాసాలు కల్గుతాయి సంపూర్ణ మూర్తిమత్వంతో సర్వతోముఖాభివృద్ధి సంతరింపబడుతుంది.

"మానవ శరీరంపైన శిరస్సు ఉన్నంత మాత్రాన ఇతర అంగాల కంటే ఉత్తమమైనదని భావించరాదు. అలాగే భూమిపై నడయాడే

---

1 రైతు రామాయణము-శిక్షణకాండ-14 షట్-1 పద్యం.
2 గాంధి-గాంధీతత్త్వం-రెండవ భాగం-పుట 22 డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య-అనువాదం-కొడాలి ఆంజనేయులు.

పాదాలు తక్కువ అని చెప్పటకు వీలులేదు. శరీరాంగాలు సమానమయినట్లే సమాజంలోని సభ్యులందరు సమానులు"1

సమాజవాదం అనునది చాల చక్కనిమాట. ఎవరుగాని హెచ్చుకాదు. ఎవరుగాని తగ్గుగాదు. ఇందులో భూస్వాములు-రైతులు, ధనికులు, పేదలు యజమానులు-కార్మికులు వీరంతా ఒకే స్థాయికి చెంది ఒకే శ్రేణిలో వుంటారు. ద్వైతభావం లేదన్నమాట. ఇందులో అంతా ఏకీభావమే. ఇదీ గాంధీజీ చూపిన సమాజవాదం.

'No Robinson Crosoe, on a Solitary island be he a Capitalist or a labourer, can Produce wealth Gandhiji therefore held that Socially produced wealth must be equally divided among allthose who are instrumental in producing it of this is to idealistic a view,socially produced wealth must be equetably diveded. He says "According to me the economic Constitution of India, and for that matter of the world, should be such that no one under it should suffer from want of food and clothing. another words, every body should be able to get sufficient work to enable him to make the to ends meet. And this ideal can be universally realized only if the means of Production of the elementary necessarees of life remain in the control of the masses They should be freely available to all as. God's air and water are or ought to be......................"1

సమాజవాదానికి పునాది ఆర్థిక సమానత్వం శ్రమశక్తి సాధనంగా సంపాదితమైన సమస్త సంపదలు సర్వులకూ సమభోగ్యాలు. దేవుడిచ్చే

---

1 గాంధీ మహాత్ముడు-నూరేళ్ళు-సంపాదకుడు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్-తెలుగుసేత-పొత్తూరి వెల్లయ్య-85 పుట (రచన: కమలాదేవి ఛటోపాధ్యాయ)

1 Gandhiji-this life and thought by J.B. Krupalani Page - 368.

గాలి, వెలుతురు, నీరు, అందరికీ ఎంత సులభంగా లభ్యమౌతవో, లేక లభ్యం కావలసినవో అంత సులభసాధ్యంగా మామూలు జీవితావసర వస్తువులు అనగా కూడు గుడ్డా ప్రజలకు లభ్యం కావలసి వుకటుంది. "కొలది మంది సంపదలతో తులతూగుతూ, అధిక సఖ్యాకులైన ప్రజా బాహుళ్యానికి తగినపాటి తిండికైనా గతి ని ఈ న్యాయవిరుద్ధమైన అసమానత ఉన్నంత వరకూ "రామరాజ్య" స్థాపననునేది అసాధ్యమని"1 అన్నారు గాంధీజీ అందుకే ప్రతి వ్యక్తికీ తన ప్రకృతి సిద్ధమైన ఆవసరాలు తీర్చుకోవడానికి అవసరమైన సౌకర్యాలు, సాధనాలు లభింప జేయడం వల్ల "సమానవితరణ"కు సంపూర్ణ కార్యరూపమేర్పడి సమసమాజ స్థాపనకు సార్థకత కలిగి పరమార్థం చేకూరుతుంది.

"సమసమాజ వ్యవస్థలో సమాన సరఫరా విధానం అన్న సూత్రానికి ప్రాతిపదికగా ధనవంతులందరూ తమకు అధికంగా వున్న ధనానికి తాము ధర్మకర్తలమని మాత్రమేననీ గ్రహించాలి. దీనికి కారణం అట్టి సంఘంలో ఆ వ్యవస్థ సిద్ధాంతాల ననుసరించి, ఏ వ్యక్తికీ తన పొరుగు వారికన్న ఒక్క రూపాయి కూడా ఎక్కువగా వుండకూడదు. కాని యిది ఎలా సాధ్యమౌతుంది అహింసాత్మకంగా సాధించాలి. భాగ్యవంతుల ఆస్తి అంతా వశపరచుకోవాలంటే అది హింసకు దారి తీస్తుంది. దీనివల్ల, సంఘానికి నష్టం కలుగుతుంది ధనం సంపాదించడం ఎలాగో తెలిసిన ఒక వ్యక్తి సంఘానికి యిచ్చే విరాళాలు నిల్చిపోతాయి. అందుచే అహింసా విధానం మంచిది. భాగ్యవంతునికి వాని భాగ్యం ఉండనిచ్చి, తనకు అధికంగా వున్నదానిని సంఘ ప్రయోజనాలకి వినియోగించే ధర్మకర్తగా రూపొందించడం మంచిది"1

ధనికులకూ, శ్రామికులకూ మధ్య లోకమంతటా ఘర్షణ పరిస్థితులేర్పడి వున్నాయి. పేదవారు ధనికులయెడల స్పర్థా పూరితులైయున్నారు. అందరూ సమానంగా భుక్తి శ్రమ అవలంభిస్తే తరతమ భేదాలు అంత

---

1 నా స్వప్నసీమ భారతభూమి- మహాత్మాగాంధీ.
అనువాదకర్త మల్లవరపు విశ్వేశ్వరరావు-పుట-121 హరిజన్-1-6-47.

1 మహాత్మాగాంధీ-సందేశము-సంగ్రహకర్త యు. యస్. మోహనరావు 73వ పుట.

రిస్తాయి. వారసత్వ రీత్యానో,లేక వ్యాపారం వల్లనో, పరిశ్రమలవల్లనో, కలిగిన సర్వసంపదలను జమిందారులు, సంస్థానాధీశ్వరులు, పెట్టుబడిదారులు, భూస్వాములు, ధనవంతులు తమ స్వంత ఆస్తి పాస్తులను సామాన్యమగు హద్దులను మించకుండా చూచుకొంటేచాలు. ఆ సంపదంతా కేవలం తనకొక్కనికే చెందినదని భావించక గౌరవమైన జీవనోపాధికి సరిపోవు పాటిగానుంచుకొని, సంపత్తిలో మిగిలినదంతా సంఘ క్షేమానికి వినియోగం చేయవలెనను "ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని" ప్రతిపాదించారు గాంధీజీ "ఆస్తిపరులైనవారు ధర్మకర్తలుగా వర్తించదలిస్తే నేను చాలా సంతోషిస్తాను. కాని వారట్లు చేయని పక్షంలో వారి ఆస్తులను ప్రభుత్వం ద్వారా సాధ్యమైనంత తక్కువ దౌర్జన్య ప్రయోగంతో వశపరచుకొనవలసి వుంటుందని తలుస్తాను"[1] అన్నారు గాంధీజీ. అంతేగాక ఈ "ధర్మకర్తృత్వం ధర్మకర్త అధికృతను నిరూపిస్తుంది. ఇది పరస్పర వ్యవహారాన్ని నిరూపిస్తుంది. ఒకరి క్షేమం మరొకరి క్షేమం మీద ఆధారపడి వుందని నిరూపిస్తుంది."[2] ఇట్టి సదాశయ సమాన వితరణసిద్ధాంతం అహింసా సమాజ స్థాపనా లక్ష్యాన్ని సాధించగలుగుతుందన్నారు గాంధీజీ.

రైతు రామాయణం కృషి కాండంలో "సమాన వితరణ సిద్ధాంతం" లక్ష్యాత్మకంగా నిరూపితమైంది. వర్షాలు లేక కఱవు కాటుకాలేర్పడినాయి. రైతు కూలీ జనులు కూటికి అలమటిస్తున్నారు. ఆకటికినారుస్తూ పసులు, జనులు గ్రామాంతర మేగుచున్నారు. అన్నార్తులై నకనకలాడే తోటి రైతు కూలీ సోదరులను ఆదుకొను వారెవరూ ముందుకు రాలేదు.

"ఒక్కొకరింట ధాన్యములాహోయని పుట్లకొలది గప్పెలున్
ముక్కుచు మూల్గుచుండ నవి ముట్టరు తీయరు మెత్తులా ధరల్
చుక్కలనంటుదాక ప్రజసు|క్కుచు వక్కుచు బిక్కుచున్నమన్
లొక్కపు మేల్మి పాహిగల నుర్వుల గ్రక్కెడి బూర్జువా దొరల్"[1]

---

1 నాస్వప్న సీమ భారతభూమి-మహాత్మాగాంధీ
అనువాదం-మల్లవరపు విశ్వేశ్వరరావు-పుట 111.

2 గాంధీ దర్శనము-సంకలనము-అనువాదము
శ్రీ ఉప్పలూరి వేంకటసుబ్బారావు- పుట-173.

1 రైతు రామాయణం-కృషికాండం – 3 పుట 3వ పద్యం.

"ధనవంతులు తమవద్దనున్న ధనానికి,సంపదకు ధర్మకర్త" సిద్ధాంత మిచట మరుగున పడింది. తోటి మానవులకన్న అధిక సంపదలు ధాన్యరాసు లున్నవి. కాని భూస్వాములు, దొరలు, బూర్జువాల చెంత వితరణశీలం లేదు శ్రీమంతులైన బూర్జువా దొరలనుండి సంపదలు లాగివేయాలంటే హింసను ఉపయోగించవలసి ఉంటుంది. హింసాత్మక చర్యల వల్ల సమాజానికి లాభం కలుగదు సరికదా నష్టం కలుగుతుంది. ఈ విధమగు సందిగ్ధావస్థలో కావ్య నాయకుడు రైతురాముడు ధర్మాన్ని రక్షించడానికి ద్విగుణీకృతోత్సాహ సంకల్పం గల వాడౌతాడు.

"దేశము నిండ ధాన్యమది దేనికి కర్వుల పాల్పింతమందునన్
దేశ ప్రజార్థమా నిలువదినుసుల నేబది శాతమేన్ క్షుధా
గ్రాసము గొల్చి వారి చనుప్రాణములన్ మరలించసపు రా
కాసులు కాసులే తమకు కాపని కాపును కానరా దొరల్"1

క్షుధాజ్వలిత వ్యధార్తులైన తోడి కర్షక సోదరులకు "గ్రాసముగొల్చి" పోనున్న ప్రాణాలను కాపాడుట కనీస మానవ విధ్యుక్త ధర్మమని కర్తవ్య ప్రబోధం గావిస్తాడు. "కాసులే తమకు కాపు" అను భావమును విడనాడి కాపును రక్షించాలని బూర్జువా దొరలను, ధన సంపదగల వారిని హెచ్చరిస్తాడు. ఈ ఆదర్శానికి వాస్తవిక రూపం కల్పించడానికి సమాజంలో బాధిత సమాజాన్ని మార్చడానికి అహింసా సమాజ స్థాపనా లక్ష్యం వైపు పురోగమిస్తూ, తన వద్దనున్న ధాన్యాన్ని అన్నార్థులకు పంచిపెట్టి వారిని ఆదుకొని రక్షిస్తాడు రైతు రాముడు.

"తన యింటగల నిల్వ ధాన్యముల మొత్తమ్మున్ స్వకీయ ప్రజా
వినియోగమ్మునకై మహామహుడు దా వెచ్చించె రాముండు ని
ర్ధనుడయ్యెన్ తనతోడి సోదరుల బాధల్ చూడలేకవ్వి యొ
క్కనెలాపెన్ ప్రజ మండగర్వన నిదాఘమ్మందు భూవర్షమై"1

1 రైతురామాయణం-కృషికాండం-3వ పుట-4వ పద్యం

1 రైతురామాయణం-కృషికాండం-3వ పుట-2వ పద్యం

":అట్టడుగున పడివున్న సామాన్య మానవునకు కూడా గౌరవ ప్రతి పత్తిని గలిగించడం గాంధీ సిద్ధాంతంలో గమనించవలసిన రెండవ అంశం''2

"జాతి కేవలం భాగ్యవంతంగానేగాక'' నిజంగా బలిష్ఠంగా కూడా కావాలంటే కష్టజీవుల క్షేమంపైన, వారి పరిశ్రమలకు లభించే సహకాంపైన ఆధారపడి వుంటుంది. ఇదే జాతికి ఐశ్వర్యం. ప్రతి దేశంలోనూ అధిక సంఖ్యాకులు పేదవాళ్ళు, కాబట్టి దేశం పేదవాళ్ళది. ఇదే గాంధీ ఉపదేశాల లోని సారాంశం"1 రైతురాముడు ఈ విషయాన్ని గుర్తించాడు.

"మన ప్రజయే మన జీవన
ధనమది తరుగనిది తత్పతనమేవేళన్
మన పతనమే కావున నో
పినవరకును ప్రజకు కూర్చు విభుడే విభుడౌన్"2

అని పేదవాల్లయిన ప్రజలను రక్షించువాడే విభుడన్నాడు "గ్రామం నశిస్తే దేశం నశిస్తుందన్నారు"3 గాంధీజీ "ప్రజాపతనమే దేశ పతన మని నొక్కి వక్కాణించాడు రైతురాముడు. ప్రజలకు ప్రియమైందిగాక వారికి శ్రేయమైన మార్గాన్ని అన్వేశించి, ప్రజల బాగోగులను అరసి రక్షించాలని హెచ్చరించాడు. అధికలాభార్జన గావించి. ధనసంపదల నిల్వ లుంచుకొని, స్వార్థానికి ఉపయోగించుకునే సంకుచితత్వం అంతరించాలనే సదాశయంతో రైతురాముడు తన వద్ద నున్న నిల్వయున్న ధాన్యాన్ని పంచిపెట్టాడు. తోడి సోదరులను కాపాడుకొన్నాడు. 'సమాన వితరణ

---

2 గాంధీ మహాత్ముడు – నూరేళ్ళు – 62వ పుట
జి.ం.సి. బాగా–అనువాదకుడు–పొత్తూరు పుల్లయ్య సంపాదకులు
డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ.

1 గాంధి–గాంధీతత్త్వం, 2భాగం డా॥ పట్టాభి. అనువాదకులు
కొటాలి ఆంజనేయులు పుట 88

---

2 రైతురామాయణం, కృషికాండ [illegible] పుట [illegible] పద్యం.
3 గాంధి దర్శనము [illegible] వేంకటసుబ్బారావు 92 పుట

సిద్ధాంతం' ఈ విధంగా కార్యరూపం దాల్చినప్పుడు మాత్రమే సమసమాజ స్థాపనకు మానసికమైన స్థితిసిద్ధిస్తుంది. సమస్త మానవ కళ్యాణానికి దారి తీస్తుంది.

"వ్యక్తి కేంద్రంగా వుండే ఒక వసుధైక వ్యవస్థను గాంధీజీ ఆశించాడు. ఆయన కలలకు గ్రామమే కేంద్రబిందువు. గ్రామములో నుండే మనుషులంతా స్వేచ్ఛగా సమానులుగా ఉంటారు. ప్రతి మనిషి తన శక్తి మేరకు శరీరశ్రమ చేస్తాడు. ఉత్పత్తి క్రమంలో పాల్గొంటాడు వ్యక్తిలోని నైపుణ్యం, సృజనశక్తి, మేధా సంపదా పెంపొందింపబడుతూ వుంటాయి"1 'హాలికుని హలం "కమ్మరి కొలిమీ, కుమ్మరి చక్రం, జాలరి పగ్గం, సాలెల మగ్గం, సహస్ర వృత్తుల"2 సమర్చనకు నిలయమైంది గ్రామం ప్రకృతి శాస్త్రవిజ్ఞానం అనుమతించిన మేరకు అన్ని వస్తువులు గ్రామంలోనే ఉపలభ్యం కావాలి. ఇట్టి ఆదర్శ గ్రామం సృజన శక్తి, మేధా సంపత్తిగల మనుషుల కూటమిగా ఉంటుందని గాంధీజీ అభిప్రాయం.

కావ్యంలో రైతురాముని కార్యనిర్వహణానికి కేంద్రంగా శ్రీరామపురం అను గ్రామం రూపొందింపబడినది. రైతురాముని నేతృత్వంలో శ్రీరామపురం గాంధీజీ ఆశించిన విధంగా స్వయం పోషకంగా వెలార్చబడింది.

"అన్నమ్ము లేనివాడా యూరనేలేడు పారవేయడు పెంటపైనెవడును
వనిలేనివాడును గనరాడు మచ్చునకేన్
పనికొలంతయు నందు గనుటెరుగము
చింకిపాతల యే కుచేలుడన్గనరాడు నిలువలుంచిన కుబేరులునులేరు
బీదసాదలకు ముష్టిబెట్టని లోభిలే డొరులపై తన బరువూనడెవడు"1

---

1 నవ్యభారతి గాంధీ జయంతి ప్రత్యేక సంచిక అక్టోబర్ 1983
గాంధీ మార్గము పుట 11

2 మహాప్రస్థానము శ్రీశ్రీ

1 రైతురామాయణం పల్లెవర్ణం 12 పుట 4 పద్యం

రైతురాముడు గ్రామాభ్యుదయన్ని గూర్చియు, రైతుసంక్షేమాన్ని గురించియు శ్రద్ధాసక్తులతో ఎప్పటికప్పుడు సమీక్ష చేయుచు అచటి ప్రజలందరను కార్యరంగంలోనికి లాగుచు గ్రామస్తోమత జెంచెను. అచటినేల బారెడు చీమకైనను, మింటపరుగు దీసెడియే కుంటి పక్షికైనను దారివెంట జనుచు ఆగిముచ్చటలాడుటకు తీరదు.2 భావికార్యచింతనముతో నిరంతరం కాలయాపనం జేయక శ్రమతత్వ వృత్తిపనులల్లో నిమగ్నమైనారు.

"ఐదారేండ్లకె గ్రామ కర్షక చరిత్రాభ్యున్నతి స్థాయిలోన్
దాదాపుత్తమశ్రేణి సత్ప్రగతి యుద్భాసించె నన్నింటమే
లౌదైనందిన జీవనక్రమ పథమ్మన్యోన్య ప్రత్యేక మ
ర్యాదల్ స్వచ్ఛమనః ప్రవృత్తియును నేపారెన్ మారెనావల్లెయే"1

శ్రీరామపురంలోని ప్రజానీకం దైనందిన జీవనక్రమపథంలోని వివిధ వృత్తుల్లోను, కృషి కార్య కలాపాలల్లోను, నిమగ్నమై ఉత్తమశ్రేణీ సత్ప్రగతిని సాధించింది. ఐదారేళ్ళలోనే ఆ పల్లె యొక్క స్వరూపమే మారిపోయింది, అన్నింటా స్వయం సమృద్ధిని పొంది స్వయం పోషక గ్రామ రాజ్యంగా విలసిల్లింది. గాంధిజీ స్వాప్నికమైన ఆశయాలకు యధార్థరూప కల్పనం జరిగింది. రైతురాముని నేతృత్వంలో గాంధీజీ కలలుగన్న శ్రేయో గ్రామా రాజ్యానికి ప్రతిరూపంగా శ్రీరామపురం తీర్చిదిద్దబడింది. ఆదర్శ గ్రామంగా పరిఢవిల్లింది.

"ఈ విధంగా గ్రామాలు ఏర్పడ్డనాడు అవి దినదిన ప్రవర్ధమానమైన వలయాలుగా ఏర్పడతాయి. పైదాని బరువు క్రిందిది మోసే స్తంభాకారంలో వుండవు. సముద్రంలోని అలల యొక్క వలయాలు ఒకదానినను సరించి మరొకటి అవ్యక్తమై వుంటాయి. ఈ వలయాలకు పునాదిరాయి వ్యక్తి. అతడు తన గ్రామం కోసం తన సర్వస్వం త్యాగం చేస్తాడు. ~~అలాగే గ్రామాలు, గ్రామవలయాల కోసం త్యాగం చేస్తాయి. అనాడు~~ వ్యక్తులు ఒకరిపై ఒకరు అదికారం చలాయించకుండా స్వతంత్రతతో దేశానికి

---

2 రైతురామాయణం పల్లెపర్వం 7 పుట 3 పద్యం

1 రైతురామాయణం—శిక్షణకాండం 27 పుట 5 పద్యం.

సేవచేయగలుగుతారు. ఒక వలయం యింకొక వలయం నుంచి బలం సాధించు కుంటుంది. ఒకరు ప్రథములు ఒకరు ఆఖరు వారను వ్యత్యాసం ఉండదు"1 గ్రామాల మధ్య సమన్వయం కుదిరి సమిష్టి ప్రయోజనాల కొరకు ఒక సమూహంగా విస్తరిస్తూ మొత్తం ప్రపంచం ఒకే పూర్ణరూపం రూపొందే స్థితి వస్తుంది. ఈ విధమగు గ్రామరాజ్య స్థాపనకు గాంధీజీ నాంది పలికారు. రైతురామాయణంలో ఈ మహదాశయాలను ప్రతిబింబింప జేస్తూ ఆచార్యులు కావ్యాన్ని ఆవిష్కరించారు.

"పంటలక్ష్మికి తొలియాటపట్టు, బక్క
కాపుజనుల పాలి బంగారు గట్టు
కడుపు మొత్తాలు పురికట్టు, కొటకొలు
కరువులరికట్టు, పెరటి కల్పకపు చెట్టు
పట్టణముల యాయువు పట్టు, పల్లెపట్టు
అదియె లేక నగరజీవి యాటకట్టు"1

శ్రీరామపురంలో రైతురాముని నాయకత్వంలో గ్రామ పరిపాలన సర్వసత్తాకమై విలసిల్లింది. తనకు కావలసిన నిత్యావసరాలకు యితరుల పై ఆధారపడక సరిపడ ఆహారధాన్యాలు, ప్రత్తి, పశుసంపద, పాడిపంటలు కలిగి అవసరమగు వస్తూత్పత్తితో సంపూర్ణంగా స్వయం సమృద్ధమై ఒప్పారింది. పుట్టతెక్కన ప్రతిగ్రామ యజమాని యింటిలో ధాన్యరాసులు కనక రాసులు ఎగసినవి. ఆపల్లె "పంటసిరికి పసిడియొల్లె"గా చెలగింది. పల్లె రైతుల రెక్కల సిరులు పండి పట్టణాలకు పెట్టుబడులు పెట్టు స్థాయికి ఎదిగింది రైతురాముని అభిజనం శ్రీరామపురం.

"మనం గ్రామీణ నాగరికతకు వారసులం. మన దేశం యొక్క బ్రహ్మాండమైన వైశాల్యమూ, బ్రహ్మాండమైన జనసంఖ్య, మనదేశపు ఉనికి శీతోష్ణస్థితి ఇవన్నీ మనదేశాన్ని గ్రామీణ నాగరికతకు నెలవగునట్లు నిర్ణ

---

1 మహాత్మగాంధీ సందేశము, సంగ్రహకర్త
యు.యస్. మోహనరావు - 92వ పుట

1 రైతురామాయణం - శిక్షణకాండం 14వ పుట 6వ పద్యం

యించి యున్నవని నా అభిప్రాయం"1 అని గాంధీజీ గ్రామీణ సంస్కృతిని సమగ్ర దేశ సంస్కృతిగా అభివర్ణించారు. ఆచార్యుల లేఖినితో శ్రీరామపురం అచ్చమైన గ్రామీణ సంస్కృతికి అద్దం పట్టే విధంగా, పట్టణాలకు అయువుపట్టుగా సర్వాంగీణ వికాసంతో విలసిల్లింది. భారతీయా ధర్మాల ప్రకారం పల్లె కుటుంబాల జీవితం ఎన్నెన్నో అంచులు తీర్చుకున్నది. పల్లీయుల పాత్రికృతిక స్వచ్ఛత శిథిలం గాకుండా వారి సంసార జీవితం గుట్టుగా నడుస్తూ ఆదర్శప్రాయమై ఎన్నెన్నో మీగడలు పేర్చుకుంది. భారతీయ సమాజానికి పునాదిగా, ఆ శ్రీరామపురమను గ్రామం జాతీయ జీవితానికి ప్రమాణంగా నిలిచింది. జీవితాన్ని సంపూర్ణంగానూ, ఆనందమయంగానూ చేసే అన్ని వృత్తులతోనూ నిండియున్న ఆ గ్రామం ఎన్నెన్నో సొగసులతో అలరారింది. "గ్రామాలు-పట్టణాలు పరస్పర సహకారులై యుండాలన్న గాంధీజీ ఆశయానికి ప్రతీకగా నిలిచింది. ఆచార్యుల కవితా విపణిలో గాంధీజీ ఆశయ ఆదర్శాల ఫలాలు రసాస్వాదనకు అపురూపంగా అమరినాయి.

"ఎక్కువ ఉత్పత్తికాదు-ఎక్కువ మందిచే ఉత్పత్తి" ఇది గాంధీజీ నినాదం, మనిషి వాస్తవమైన అవసరాలను పూర్తిగా తీర్చాలి. దానితో తృప్తి పడాలి అంటారు గాంధీజీ. "అందరికీ కనీసావసరాలు చాలినంత" గుడ్డ, గృహవసతి, చదువు, పారిశుద్యం, ఆరోగ్యం-త్వరగా సాధించే మార్గాలు అన్వేషించాలి". చిన్నతరహా పరిశ్రమల ద్వారా విస్తృతంగా పని పంపకం జరిగితే ఒక వ్యక్తి మరొక వ్యక్తిని దోపిడీ చేసే అవకాశాన్ని బాగా తగ్గించవచ్చు మానవ శ్రమను తొలగించి, ఏ కొద్దిమంది చేతుల్లోనో సాధనాలు కేంద్రీకరించే యంత్రాలకు స్థానం యివ్వకూడదని సూచించారు గాంధీజీ. "సమాజ సమిష్టి అవసరాలకు ప్రాధాన్యం ఉండాలి. సమాజంలో అత్యంత హీనస్థితిలో నున్నవారి కనీస సౌకర్యాలు తీర్చడం తక్షణ బాధ్యతగా గుర్తించబడాలి" దీనినే గాంధీజీ "అంత్యోదయం" అని పేర్కొన్నారు'

1 నా స్వప్నసీమ భారతభూమి-మహాత్మాగాంధి
అనువాదకర్త. మల్లవరపు విశ్వేశ్వరరావు-పుట-258
యంగింయా - 7-11-1929.

1 నవ్యభారతి-గాంధిజి ప్రత్యేక సంచిక అక్టోబర్ 1988 "అంత్యోదయం' తుమ్మల చౌదరి-పుటలు 11 & 12.

గాంధి ప్రవచించిన ఈ సిద్ధాంతానికి అనుగుణంగా రైతురామాయణంలో కృషికాండమున్నది. ఆచార్యులవారు సశాస్త్రీయంగా, చక్కటి యోజనా నైపుణ్యంతో కృషికాండ కథను రచించారు.

వర్షాలు లేక కరవు కాటకాల బారిబడి కర్షక జనం కటకటలాడుతున్నారు. తిండికొరకై గ్రామాంతరాలకు వెళ్ళడం మొదలు పెట్టారు. ఇటువంటి విపత్కర పరిస్థితిలో రైతురాముడు తనవద్ద నిల్వయున్న ధాన్యాన్ని పంచాడు. అన్నార్తులైన కర్షక సోదరుల ప్రాణాలను రక్షించాడు. అంతేగాక భూస్వాములు, దొరలు, గ్రామ ప్రముఖులు మొదలగువారి నుండి ధాన్యాన్ని సేకరించి, సామాన్య ప్రజలకు పంచి ప్రాణాలను నిల్పాడు.

"రైతునకె నీటి యొనరు కర్వైనఁ బంట
లెన్నటికిఁ గర్వౌ, యది విచారించి నేను
రైతులనుఁ గుప్పఁజేసి నిల్వలుగ నీరు
గలుగు నదుపాయమునకై కలలుగంటి"1

కృషీవల జీవితం, వారు నిర్వహించే సేద్యవృత్తి, నీటి వనరుల పై ఆధారపడి ఉండటం సహజం. వర్షాలు లేకుంటే సేద్యం కుంటు పడుతుంది. రైతు జీవితం వర్షాధారం కాకూడదన్న తలంపు రైతు రామునిలో కలిగింది. శాశ్వత ప్రాతిపదికపై నీటి యొనరులను సమకూర్చాలన్న ఆశయం గలిగింది. అందుకై గ్రామ ప్రజల నొకచోట సమీకరించి సహేతుకంగా విశద పరచాడు.

"ఎద్దుల ఛావుదప్పఁ బ్రతియేటఁ గొనందగు కర్చు దప్పునా
యెద్దుల, నీటి యెద్దడియు నెప్పటికై యిక లేనిదౌఁ బొలాల్
వద్దిక నీరు చాలనగ వందురు మిట్టలు దుబ్బలన్ని యున్
నిద్దపు పంటభూములగు నిక్కను రైతునుఁ బాడిపంటలన్"1

ఆనకట్ట గట్టిన అర్థయకట్టు హెచ్చి కరవు కాటకాల కొరతలుడిగి గ్రామ

---

1 రైతురామాయణం—కృషికాండం-21వ పేజి 6వ పద్యం.
1 రైతురామాయణం—కృషికాండం 24వ పుట-4వ పుట.

సీమలెల్ల సస్యశ్యామలాలై రైతుతంతె యింతెంయింతె పెరుగునని ఉద్బోధిం చాడు. శ్రీరామపురానికి సమీపాన నున్న ఇప్పలవాగుపై సేతు నిర్మాణం గావించడానికి కర్షక జనాన్ని ఒప్పించాడు. అనేక వ్యయప్రయాసలకు ఓర్చి గ్రామ ప్రజలందరి సహకారంతో, వారి శ్రమదానంతో, నిర్విరామ కృషితో సేతు నిర్మాణం గావించాడు. అసాధ్యం సాధ్యం జేశాడు. ఆనకట్ట నిర్మాణంచేనీటి యొనరులేర్పడి,శ్రీరామపురసీమసస్యశ్యామలమైసిరిసంపదల కాలవాలమైంది. రైతులకు సత్వరమైన ముఖ్యావసరం నీటి యొనరులను సమకూర్చటం. అట్టి మహాకార్యాన్ని సాధించిన ఉద్యమశీలి రైతురాముడు.

శాశ్వత నీటి వనరులను సమకూర్చు కున్నచో గ్రామసీమలు సస్య శ్యామలమౌతాయని రైతురాముడు బహుళార్థసాధక ప్రయోజనాన్ని సాధింప సెంచాడు. విస్తృతంగా "పని పంపకం" జరిగినచో క్రమవ్యవస్థను సాధించ వచ్చునని భావించి, ఇది ప్రజాహిత కార్యము. ఇందెల్లరమును పాల్గొనవ్వలె నని" హృదయపూర్వకంగా అందరినాహ్వానించాడు. 1

"ఎనిమిది వేల రెక్కలిటు లేకముగాఁ బ్రతిరోజు రాళ్ళతోన్
బెనగొనెనాల్గు మాసములు పిండియుఁ బిండియు రైయహర్నిశల్
కననొక క్రోసుమేరనది కట్టయొ బేర్చిన గుట్ట చాలొనాన్
జనముల దృష్టికద్ది భువి జారిన యా కైలాస మయ్యెదాన్"1

కర్షక సమాజ సమష్టి అవసరాలను తీర్చడానికి కడు బాధ్యతతో సేతు నిర్మాణం గావించడమే గాకుండా రైతురాముడు గ్రామ ప్రజలను దోపిడి నుండి రక్షించడానికి, వారిని చైతన్యవంతులుగ తీర్చిదిద్దే ప్రయత్నం చేశాడు.

"ప్రతి గ్రామమున్నూ స్వయం పోషకమై తన వ్యవహారాలను తానే నిర్వహించుకోగల సమర్థతను కలిగి లోకమంతా ఎత్తివచ్చినా ఆత్మరక్షణ చేసికోతగినంత శక్తివంతంగా వుండాలన్నమాట. బయట నుంచి తన పైకి ఏ విధమైన దాడి వచ్చినాగాని దానిని ప్రతిఘటించి ఆత్మరక్షణ చేసికొనే

1 రైతురామాయణం-కృషికాండం-28వ పేజి 2వ పద్యం.

1 రైతురామాయణం . కృషికాండం – 28వ పుట – 2వ పద్యం.

ప్రయత్నంలో తాను సమూలంగా అంతమొందడానికైనా సంసిద్ధమైవుండు నట్లు అది సుశిక్షితం గావాలి. ఈ విధంగా ఆఖరి లెక్కలలో ప్రామాణికాంశం (Limit) వ్యక్తే అయి యుంటాడు... ........ అట్టి సాంఘిక వ్యవస్థ సహజ సిద్ధంగానే ఉత్తమ సంస్కృతికి నెలవై వుంటుంది"1 అన్నారు గాంధీజీ.

రైతురాముడు గ్రామాల్లోని కర్షక ప్రజల్లో సంఘటిత శక్తినీ, ఎట్టి అవాంతరాలైనా ధిక్కరించి ఎదుర్కొనే ధైర్యాన్ని, తన గ్రామపు గౌరవం కోసం, తన గ్రామ రక్షణ కోసం ధన మన ప్రాణాలను సహితం త్యాగం చేయగల సమర్థతను ప్రతివ్యక్తికీ ప్రసాదింప జేశాడు. సమిష్టి సుఖ దుఃఖాల్లో ప్రతివ్యక్తి పాలు పంచుకొనే ఉత్తమ సంస్కృతిని గరిపాడు.

"రాము నేతృత్వమున ప్రతిరైతుబిడ్డ
చదువు సాములెపోను సంస్కారమూని
సభ్యతము నభ్యసించి వాస్తవిక ప్రగతి
తెచ్చుకో గలిగెనటన్నదె యొక వింత"2

పనిని జ్ఞానాన్ని ఒకరి గుప్పిట నుండనివ్వక అందరకు పంచి సమాజ వికాసానికి రాచబాట వేసిన సంఘ సంస్కర్త రైతురామాయణ కావ్య నాయకుడు.

"నిజమైన ప్రజాసేవకులుగా ప్రవర్తించడమే రాజుల విద్యుక్తధర్మం వారు బయట నుంచి భుక్తమైన హక్కు యొక్క బలం వల్ల పరిపాలనాధి కారాన్ని చలాయించడానికి వీలులేదు. ఖడ్గబలంతో అసలే వల్లకాదు. సేవా హక్కువల్లను, సద్వివేచనార్హత వల్లనూ మాత్రమే పాలన మొనర్చవలసి ఉంటుంది. అప్పుడు వారు తమ అధికార గర్వం యొక్క సంతృప్తికి కాక తమ పాలనలోని ప్రజలయొక్క సంక్షేమ సాధనమే విధిగా భావించి ప్రజలు యిష్టపూర్తిగా యిచ్చిన పన్నులను, అట్లే యిష్టపూర్తిగా ఒసగబడిన ప్రజా సహకారాన్ని పొందగలిగి ఉంటారు. ఈ సులభ సాధ్యమైన ప్రాథమిక

---

1 నా స్వప్నసీమ భారతభూమి-మహాత్మాగాంధీ
అనువాదకర్త: మల్లవరపు విశ్వేశ్వరరావు 165 పుట

2 రైతురామాయణం-శిక్షణకాండం - 16వ పేజి 6వ పద్యం.

విధిని జమీందారులు రాజులు నిర్వహించినచో రైతాంగం వారి యెడ్ల చూపవలసిన విధుల నుండి విముక్తులై పోతారు. అంతేగాక, ఆ రాజు యొక్క దురాక్రమిత హక్కును ఎదుర్కొన వలసిన విధి కూడా ఆ రైతాంగ నిర్వహించవలసిన వారౌతారు. అనగా ఆ దురాక్రమిత ప్రభుత్వాధికారాన్ని లేక దుష్పరిపాలనాన్ని ప్రతిఘటించే హక్కును రైతులు ఆర్జించిన వారు అవుతారన్నమాట. అయితే, ఆ ప్రతిఘటనం హత్యాకాండ, క్రూరహింస దోపిడీ రూపాన్ని దాల్చినచో అది విధి సూత్ర దృష్టి నుండి మానవత్వం పట్ల అపరాధంగా పరిగణింప బడుతుంది. విధి నిర్వహణం యొక్క సహజ ఫలితంగా జనించే శక్తి సత్యాగ్రహ విధానం ద్వారా రూపొందే దౌర్జన్య రహితమైన అజేయ శక్తి అయి వుంటుంది."1 అని గాంధీజీ రైతాంగ హక్కులను చాటి చెప్పాడు.

ఒక వ్యక్తిగానీ, సమూహంగానీ తమ హక్కుల పరిరక్షణ కోసం తమకు జరిగే అన్యాయానికి పరిష్కారం కోసం సంఖ్యాబలంతో నిమిత్తం లేకుండా పోరాడే అధికారం ఉంటుంది. ఆ పోరాట మార్గమే అహింసాయుత మార్గం. ఆదర్శ గ్రామంలో వ్యక్తి స్వాతంత్ర్యం పునాదిగా సంపూర్ణ ప్రజా స్వామ్యం విలసిల్లుతుంది. రాజుల యొక్క దైవభుక్త పాలనాధికారం అనేది కాని, రైతాంగం తమ ప్రభువులకు తలమొగ్గి విధేయత చూపవలసిన హీన మైన విధి అనేది కాని ఎక్కడా లేదు. సంఘక్షేమానికి హానికరమైన ఈ పారంపర్యమైన అసమానతలు తొలగించుకోవడానికి గ్రామ ప్రజలకు తమ ప్రభుత్వానికి వ్యతిరేకంగా అహింసాయుత సత్యాగ్రహం చేసే అధికారం ఉంటుందని గాంధీజీ నిర్ద్వంద్వంగా ప్రకటించారు.

ఈ సత్యాగ్రహం కేవలం సాధారణ ప్రతిఘటనకే పరిమితం కాదు, ఇది మూడు రూపాల్లో ఉండవచ్చు. అవి 1. సహాయ నిరాకరణం, 2. ప్రజా ప్రతిఘటన, 3. ప్రత్యక్ష చర్య అనేవి. లంచగొండి అమానుష చర్యలకు పాల్పడే ప్రభుత్వాల నుండి సహాయ సహకారాలను ఉపసంహరించుకోవటం

---

1 హరిజన్ 6-7-1947 గాంధీ-
నా స్వప్న సీమ- భారతభూమి - మహాత్మాగాంధి
అనువాదం: ముల్లవరపు విశ్వేశ్వరరావు - 75, 76 పుటలు.

సహాయ నిరాకరణం అటువంటి ప్రభుత్వంపై నిర్దిష్టమైన కోరికలు సాధించుకోవడానికి నిరంతరం పోరాటం జరుపటం ప్రజాప్రతిఘటన. అట్టి ప్రభుత్వమూ దాని వర్గ మిత్రులపై సంపూర్ణ విప్లవమే ప్రత్యక్షచర్య వీటిపై అహింసాయుత సత్యాగ్రహం మిక్కిలి శ్రేష్ఠమైంది.

నిజాం సంస్థానంలో జమీందారీ దోపిడీ రక్కసి రాజనీతి, ఖాసీం రజ్వీకూట నీతి, రజాకార్ల మత దురహంకార దారుణ హింసాకాండ హైదరాబాదు సంస్థానం లోని ప్రజలను నానావస్థలకు గురిచేయుచున్న రోజులవి. కారణజన్ముడు రైతురాముడు కాపులను కూడగట్టుకొని, వారి నేకత్రపరచి చైతన్యవంతులుగా చేయడం అతని లక్ష్యం. వారికి గల హక్కులు, బాధ్యతల గురించి వివరించాడు. గ్రామోద్ధరణం గురించి శ్రమించాడు. శాంతియుత విప్లవాన్ని కొనసాగించేందుకు ఉద్యమించాడు.

> "మనకున్ హక్కులు కొన్ని యుండునని నమ్మండీ ప్రపంచమ్మునన్
> మన సంఘమ్మొకడుండునంచును మదిని నమ్మండి యేదెట్టులేన్
> మనుజుల్‌గా మన హక్కు కొసమయినన్ పశ్యల్ సమాజమ్ములో
> ననినాదమ్మును లేవదీయవలదా నాయన్న వారుండరా!"1

భూమికోసం, భుక్తికోసం పోరాటం సాగించాలని చాటి చెప్పాడు. "కాపు సంఘాలను" స్థాపించి ప్రజల యెదల సాంఘిక చైతన్య బీజాలను నాటాడు. రైతురాముని నేతృత్వం ప్రజల్ని దోచే దొరలకు జమీందారులకు గుండెగాలమైంది.

> "జమీందారీల్ నశియించి తీరవలె బూర్జువా తత్త్వమడుగంటి మొ
> త్తనుకే పెట్టుబడి విధానమది రద్దయిపోవలెన్ కాపు కూ
> లి ముటాలేకముగావలెన్ నడిదలాలీ ఖోరు వ్యాపార సం
> ఘములన్ సంస్థలు నెత్తివేయ బడుతన్ గ్రామాలు వర్థిలుతన్"2

పదివేల కాపువీరులు రైతురాముని నేతృత్వంలో తమ హక్కులను

---

1 రైతు రామాయణం–శిక్షణకాండం 10వ పుట–6వ పద్యం

2 రైతు రామాయణం – కృషికాండం–4వ పేజి–8వ పద్యం.

గురించి పోరాటం సాగించి, నిజాం దుష్టపాలననూ, జమిందారీ బూర్జువా దొరల దుర్నీతిని, నిరసించారు. ఈ విధమైన ప్రజా ప్రతిఘటనోద్యమం అహింసాయుతంగా కొనసాగింది. శాంతి సమరంతో విజయాన్ని సాధించింది ఆశించిన ఆశయం నెరవేరింది.

"తినటానికి తిండి, కట్టడానికి బట్ట, ఉండటానికి ఇల్లు, మొదలగు ప్రాపంచిక సౌఖ్యాలను పెట్టుబడిదార్లు కార్మికులకు కలుగ జేయుటతో సరి పోదు. కార్మికుల నైతికాభివృద్ధికి కూడ దోహదం చేయాలి"1 అన్నారు గాంధీజీ. "సామాన్య ప్రజలు తమ బలాన్ని గుర్తించనంతకాలం, జమిందారులు, పెట్టుబడిదారులు, సంస్థానాధిపతుల ప్రస్తుత అధికారం కొనసాగుతుంది. జమీందారీ పెట్టుబడి విధానాలతో ప్రజలు సహాయ నిరాకరణం కొనసాగితే వాటి అంతట అవి నశించి పోవటం ఖాయం."2 అని నొక్కి చెప్పారు. అంతేగాక "శ్రమంతులు తమ స్వీయధన సంపదలను, తద్వారా కలిగే అధికార బలమును ఇష్టపూర్తిగా వదులుకొని సర్వుల యొక్క సమానాభ్యుదయానికి వినియుక్తం చేయని పక్షంలో ఏదో ఒకనాడు దౌర్జన్యయుతమైన విప్లవమూ, రక్తపాతమూ జరుగక తప్పదు"1 అని గాంధీజీ హెచ్చరించారు.

ఆర్థిక అసమానత తొలగిననాడు, ప్రతివ్యక్తికి తిండి బట్ట గాలీ నీరూ లభించినంత సహజంగా లభించిననాడు, ఈ ప్రాథమిక అవసరాల పైన ఏ దేశమూ, రాష్ట్రమూ, వ్యక్తి లేక సమూహానికి ప్రత్యేకాధికారం ఉండనినాడు "రామరాజ్యం" ఏర్పడడం సాధ్యమౌతుందని గాంధీజీ ఆశించారు.

హైదరాబాదు రాష్ట్రంలో నిజాం పాలనం ప్రజల మౌలిక హక్కులను

---

1 గాంధీ దర్శనము-సంకలనం-అనువాదం
ఉప్పలూరి వేంకట సుబ్బారావు – పుట - 223

2 గాంధీ మహాత్ముడు-స్మారకము-సంపాదకులు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ
తెలుగుసేత – పొత్తూరి పుల్లయ్య హరిజన్ మే 25, 1947 – 93పుట

1 నా స్వప్న సీమ-భారతభూమి-మహాత్మా గాంధి
అనువాదం మల్లవరపు విశ్వేశ్వరరావు – పుట 1!9.

కాల రాచింది. బానిసత్వ సంకెళ్ళను వేసింది. "వెట్టిచాకిరి"తో గ్రామ ప్రజలను జమీందారీ విధానానికి తొత్తుల జేసింది. కూడు గుడ్డ నీడ లేక దిక్కు మొక్కులేని కాపు కూలీ జనానికి రైతురాముడు అండగా నిల్చాడు. కరవు రక్కసి వాతబడిన దీన సోదరజనులను కరుణించి రక్షించడం అవశ్య ధర్మమని జమీందారులతో, దొరలు గ్రామ ప్రముఖులతో విన్నవించాడు కాని వారు తిరస్కరించి పరిహసించారు. తృటిలో రైతు రాముడు పరశు రాముడైనాడు. పదివేల కాపు వీరులతో దండయాత్ర సాగించాడు. ధాన్యం సమకూర్చి ఆపన్న కూలీ జనాలను రక్షించాడు.

"రైతుల దండయాత్రయిది రావుల గద్దెల మిద్దెలన్ గదా
ఘాతల గూల ద్రోయుటకు గాదు రహస్థిత ధాన్యకోశపుం
బాతరలన్ బెకల్చి కడుపాకలి మంటల నార్చుకొంటకే
నైతిక విప్లవమ్మిది వినాశము కోసము గాదు శాంతికే"2

శాంతి పూరిత నైతిక విప్లవంతో ప్రజలను దోపిడి జేసేవారికి జ్ఞానోదయం గావించాడు రైతురాముడు.

"A part from opposing the Poverty imposed up on the masses of India by onperialist Rule Gandhiji was against the exploitation of the poor by the Capitalists foreign or Indian it is well Known that in Ahmedabad, he supported the strike of the textile laboures against the mill owners, It was also against the exploitation of the Kisans by the Government the Planters and the Zamindars that he started his Compaigns in Champaran and in Gujarath. beleiving as he did in Non-voilence, he was ofcourse against the physical liquidation had to end. This ,he belived could be done if the land Lords and the Capitalists acted as trusties of the poor"1

దోపిడీ నుండి సామాన్య మానవుణ్ణి కాపాడాలన్న గాంధీజీ ఆశ

1. రైతురామాయణం-కృషికాండం 5వ పేజి 1వ పద్యం.

1 Gandhiji his life and thought
by J B. Kripalani Page No. 369-370.

"For him the basic Principles of this morality were trulh and Non-voilence. These two priciples we aloiborated in to eleven prir ciples on a verse Contain ing them was recited morning and evening at his prayers. These are:

Amimsa, Satya, Asatya, Brahmana Charya, asangraha, Sharira Shrama, aswada, Sarvatra-bhaya-Uarjana, Sarvadharma, Samanathva, Swadeshi, Sparsha bhavana, (Non-voilence, trulh, trulth, non stealing, chastity Non-possession physical labour, Control of palate, fearless, equality of religions, Swadeshi discarding of untouchabulity")1

ఆదర్శ మానవుని హృదయ పావిత్రినం సచ్ఛీల నిర్మాణ మార్మికత నీతినియమ పాలనం, ప్రవర్తనలోని స్వచ్ఛత విశ్వాత్మ ప్రతిబింబించే విధంగా నైతిక మానవ విలువలను చాటే ఏకాదశ సూత్రినియమావళిని నిత్య ప్రార్థనా గీతంగా ధ్యానించి, సబర్మతి ఆశ్రిమంలో నిత్య పారాయణ శ్లోకంగా అనుసంధానింప జేశారు గాంధీజీ. ఆ ప్రార్థనా గీతమిది.

"అహింసా సత్యమస్తేయం,
బ్రిహ్మ చర్యమసంగ్రిహః
శరీర శ్రమాస్వాదౌ, సర్వత్రి భయ వర్జనమ్
సర్వధర్మ సమానత్వ స్వదేశీ స్పర్శభావనా"

సత్యాహింసల ప్రాతి పదికపైగా, అస్తేయం = దొంగిలింపకుండుట) బ్రిహ్మచర్యం-అసంగ్రిహం, శరీరశ్రిమం, అస్వాదం, సర్వత్రి భయ వర్జనం, సర్వ ధర్మ సమానత్వం-స్వదేశి భావనం, స్పర్శాభావములనునవి ఇవి మానవుని సంపూర్ణ శీల నిర్మాణానికి దోహదపడేవి. వీనిలో సత్యాహింసలు శిఖరాయమానాలు. మానవుని నిత్య జీవితంలో నివి అత్యంత ఆవశ్యకములు. అవశ్యాచరణీయాలు-నైతికంగా పతనం గాకుండా కాపాడే మానవుని శీలరక్షణ కవచాలు. భారతహృదయం, హిందూధర్మం మూర్తీభవించి ప్రతిభాసించే మానవగీత-భగవద్గీతా శ్లోకం గాంధీజీ ప్రార్థనా గీతం.

ఆచార్యులు రైతురామాయణంలో నాయకోపనాయక పాత్రిల ద్వారా గాంధీ తత్త్వంలోని "శీలనిర్మాణ మార్మికత" పై అక్షరాన్ని పాటవంతో

1 Gandhiji his life and thought by J.B. Kripalani Page 338

లక్షింపజేశారు.

> "ప్రాయమ్మందునఁ జిన్నవాఁడయిన సదభిప్రాయమ్మునన్ బెద్దయా
> ధ్యేయౌన్నత్యము, లక్ష్యశుద్ధియుఁ గ్రియా దీక్షా పర్వతమ్ము నా
> న్యాయైకాశ్రయ సత్ప్రవృత్తియును సెన్నందగ్గ యీ దృగ్గుణ
> శ్రేయమ్ముల్ గల రాముఁ జూచికొని గర్వింతెంతొ పల్లీప్రజల్"1

కావ్యనాయకుడు రైతు రాముడు ఉన్నత మానవతాదర్శాలు గల వాడు. లక్ష్యశుద్ధిగలవాడు అనగా సమ్యక్ జ్ఞానము, సమ్యక్ శీలము, సమ్యక్ అవగాహన, సమ్యక్ ప్రవర్తన, సమ్యక్ ఆలోచన, సమ్యక్ ఆచరణములను త్రికరణ శుద్ధిగా నిర్వర్తించాలన్న పవిత్ర హృదయం గల వాడు. లక్షించిన దానిని దీక్షా దక్షతలతో, క్లేషసహనంతో నిర్వర్తించి సాధించువాడు. అతని కార్యాచరణము న్యాయైకాశ్రయమై సత్ప్రవృత్తిగల్గి ధర్మాన్ని ప్రతిష్ఠాపించేదిగా ఉండునది. ఇట్టి ఉత్తమ దృగ్గుణ శ్రేయములు గల తమ నాయకుని మర్యాద గుణశీల సంపత్తిని గాంచి పల్లీ జనాలెంతో గర్వించేవారు. రైతురాముడు జాతీయవాడియే గాక ఆదర్శ మానవతావాది. పరమ ధార్మికుడు.

> "గ్రామపు పెద్ద రైతయిన రాముడు రాముడె యీ వినార్థిక
> స్తోమత కొద్దిదే, యతడు చూపిన త్యాగమపార మ
> ద్భురమ్మా మహనీయమూర్తి యెమనందరికిన్ తగుమార్గదర్శి ని
> ష్కామమహర్షి యాతని సుగాథల గాథము లార్య గణ్యముల్"1

కరవు వాతబడి తల్లడిల్లిన స్వజాతి సోదరుల నాదుకొని, తనవద్దనున్న ధాన్య సంపదను దానం జేసి కాపాడిన త్యాగమూర్తి రైతురాముడు. అతడు సత్యవ్రతుడు. హింసారహితుడు. క్లేష సహనం గల కర్షక ఋషి. పరుల బాధలను జూడలేక తన సర్వస్వాన్ని అర్పించడానికి సిద్ధపడిన నిష్కామ మహర్షి. బ్రహ్మచర్య దీక్షావ్రతుడు. ఆత్మనిగ్రహం గల ఏకపత్నీ వ్రతుడు. సనాతన హిందూ ధర్మానికి వన్నెదెచ్చే పవిత్ర కుటుంబ ధర్మాన్ని అనుష్టించిన ఆదర్శ గృహస్థుడు.

---

1 రైతురామాయణము – శిక్షణకాండ – 27 పుట – 6వ పద్యం.
1 రైతురామాయణం – కృషికాండం – 6వ పుట – 3వ పద్యం.

సమాజ శ్రేయస్సు కోసం సేతు నిర్మాణం గావింప జేసిన అపర భగీరథుడు. సర్వ ధర్మాలకు ప్రాపై, స్వదేశాభిమానం గలిగి దాస్య శృంఖలాలను తెగటార్చి, స్వజాతి సోదరులకు అండగా నిల్చి, వారిని ఆత్మ గౌరవం గల సత్పౌరులుగా తీర్చిదిద్దిన మానవతావాది. సమసమాజ స్థాపనకు, గాంధీజీ ప్రతిపాదించిన ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని విశ్వసించి, జమీందారులు, భూస్వాములు, బూర్జువాల యొక్క హృదయాలలో పరివర్తనం దెప్పించిన సంస్కర్త. భయక్రోధాదులను జయించి, ఆత్మ సంయమనంతో, ప్రజల సహకారంతో జమీందారీ ఫ్యూడల్ వ్యవహారంపై విజయాన్ని పొంది, స్వరాజ్య శాంతి స్థాపనం గావించిన ఉదాత్తమైన ధర్మ కర్మవీరుడు. స్నేహశీలి సహనమూర్తి. క్షమాగుణం గల ఉదారుడు. రైతు రాముడు రైతులకై జనించి రైతుల కొఱకు జీవించి, రైతులకై తుదకు మరణించువాడు."1

ఈ విధంగా గాంధీజీ ప్రతిపాదించిన ఆదర్శ మానవ విలువలకు ప్రతీకలుగా కావ్య నాయకుల్ని నిల్పి రైతురామాయణాన్ని రచించారు ఆచార్యులు.

"స్వార్థ రహిత సేవకు స్త్రీ పెట్టింది పేరు. ఆమె అహింస యొక్క అవరావతారం. మానవుని మాతగా, సృష్టి కర్తగా మౌన నాయకిగా పరిగణింపబడుతుంది. స్త్రీ కూడా పురుషునితో సమానమగు మానసిక శక్తులతో జనించింది. ఆమె పురుషునికి సహచరి. స్వార్థ రహిత సేవకు ఆమెకు సములు లేరు. అందువల్ల స్త్రీని అబల అనటం ఆమెను దూషించడమే. భగవానుని సృష్టిలో ఉత్తమోత్తమమైన జీవి స్త్రీ. అట్టి స్త్రీని కామ వాంఛతో చూచిన పురుషుడు మృగప్రాయుడగును. పురుషుడు మృగప్రాయుడుగా మనుటకంటే మరణించుటయే మేలు."2 "స్త్రీని అణచటం అహింసా దేవతను అణచటం వంటిదే. స్త్రీ పురుషుని కంటె ఉన్నతమైంది. ఎందుకంటే ఆమెలో త్యాగమూ, మౌనంగా కష్టాలను సహించగల శక్తి, వినయం, విశ్వాసం

1 రైతు రామాయణం-కృషికాండం-19 పుట 4వ పద్యం.

2 గాంధీ దర్శనము-ఉప్పులూరు వెంకట సుబ్బారావు తెలుగుచేత – పుట 455-రి 460 పేజీలు

జ్ఞానం మూర్తీభవించి ఉన్నాయి. అటువంటి స్త్రీ జాతియెడల అత్యాచారం చేయడం కంటే ఘోరమైన క్రూరమైన పాపం ఇంకొకటి ఉండబోదు"1 అని స్త్రీని జగన్మాతగా, సహనశీలిగా నిర్వచించారు గాంధీజీ. కావ్యనాయిక సీత పాత్ర చిత్రణంలో ఆదర్శ మహిళా ప్రాధాన్యాన్ని ప్రస్తావించి ప్రస్తుతించారు ఆచార్యులు.

రైతు రామాయణంలో ప్రతినాయకుడు జమీందారు పాపారావు. అతడు నిజాం పాలనలో సామంత ప్రభువు. ప్రజాకంటకుడు. దురహంకారి. వ్యసనలోలుడు, మదాంధుడైన పాపి, ప్రజాకంటకుడు, పరదారాభిలాషి, అపర రావణాసురుడు. ఇట్టి జమీందారుడు రైతురాముని ఇల్లాలు, కావ్య నాయిక కాపుసీతను బలవంతంగా నిర్బంధించటానికి పొన్నయసెట్టితో రహస్య మంతనాలాడినాడు. ఈ సందర్భంలో సెట్టి జమీందారులతో సీమ యొక్క ఉత్తమ సతీత్వ లక్షణాలను కీర్తిస్తాడు.

"ఈ ప్రపంచమంత యొకెత్తు, హేప్రభువర।
ఉత్తమ సతీజన్మమొక్క యొత్తు, నాడు
రావణాదులు'త్తమ సతీ జీవితముల
నట్లు హింసించి నిలువున హతము గారె"2

ప్రపంచమంతా ఒకయెత్తు. ఉత్తమ సతీ జన్మం ఒకయెత్తు. అట్టి ఉత్తమ మసతిని చెఱపెట్టి రావణాదులు హతమైనారు. అని స్త్రీ విశిష్టతను శ్లాఘించాడు. అంతేగాక, రైతురాముని సతిని నిర్భంధిచకూడదని హెచ్చరించాడు.

"ఆ సీతాసతి నిప్పువంటిది సుమీ। యాసాధ్వీ రత్నమ్ము బొం
దాశించం జనడెవ్వడాయువు గలాడాబుద్ధి నీ కెవ్వడ
య్యా సూచించిన పాపి యట్టులని నీ వవ్వాని దుర్బోధకున్
ఖానోహమ్మని లొంగిపోదువటే నిన్ దైవమ్ము మన్నించునా"3

1 నా స్వప్న సీమ–భారతభూమి–మహాత్మాగాంధి
తెలుగుసేత – మల్లవరపు విశ్వేశ్వరరావు–పుట–380.
2 రైతురామాయణం–నిర్బంధకాండ–24వ పుట–5వ పద్యం
3 రైతురామాయణం–నిర్బంధకాండ–25వ పుట–1వ పద్యం

అనిశెట్టి జమీందారునకు తెలిపాడు. "శీలవతి సీతయొక్క పొందాశిం చిన దైవం మన్నించదు. ఆమె పవిత్ర శీలమును చెనకి ఆత్మ వినాశనాన్ని కోరి తెచ్చుకోకూడదు. అని ఆమెను నిర్బంధించే తలంపు విరమించు కొను మని వివరించాడు. ఇట్లెన్ని తీరుల బోధించినను వినక జమీందారు పాపారావు కాపు సీతను నిర్బంధించాడు. మగడుగలట్టి స్త్రీని, శిశుమాతను· పాపకుంబాపి దొంగచాటుగా అపహరించి తెచ్చిన పాప మిట్టె గొట్టి జమీందా రుడు రైతురామునితోడి పోరులో ససైన్యంగా ఓడినవాడై దుర్మరణం పాలైనాడు. ఈ విధంగా గాంధీ నిర్వచించిన ఆదర్శ మహిళా లక్షణాలను సమాజాన్ని పటిష్ట పరచే విధంగా రైతురామాయణంలో దర్శింపజేశారు ఆచార్యులు.1

"లక్షల సంఖ్యలో వున్న నోరులేని పేద ప్రజానీకపు హృదయాలలో వెలసిన పరమేశ్వరునిం దప్ప తదితరమైన దేవుని నేను అంగీకరించను."2 అని దీనుల్లో దుఃఖితుల్లో నివసించే ఈశ్వరుణ్ని దర్శించారు గాంధీజీ.

"నేనెప్పుడో కర్షకుడు ప్రపంచానికి తండ్రివంటివాడని వర్ణించిన ఒక పద్యం చదివాను. భగవంతుడు గనుక "అన్నదాత" అయితే కర్షకుడు అతని హస్తం. మనమా కర్షకుని ఋణం ఎలా తీర్చుకుంటాము? మనం ఇంతవరకు అతను చమటోడ్చి సాధించిన కృషిపై జీవిస్తున్నాము."3 అని కర్షకున్ని భగవంతునిగా ఆరాధించారు గాంధీజీ. ఈ విధమగు భావ సంపదను జీర్ణిం చుకొని ఆచార్యులు కర్షకునిలో ఈశ్వరుణ్ని. భగవంతుని విశ్వరూపాన్ని దర్శించి, దర్శింపజేశారు.

రైతురామాయణ కావ్యం ప్రారంభంలో "శ్రీభూగోకుల నిత్య సేవన శ్రీ భాగ్య నిక్షేపుడు సద్యోభక్తోన్నతి సత్కలాపుడు, కృషి యజ్ఞోద్ధిపుడు"4

---

1 పాత్ర చిత్రణంలో వివరించబడింది.

2 హరిజన్ 11-3-1939 నా స్వప్నసీమ భారతభూమి-మహాత్మాగాంధి అనువాదకర్త: మల్లవరపు రాజేశ్వరరావు-పుట-88

3 మహాత్మాగాంధీ-సందేశం-యు.యస్. మోహన్‌రావు (సంగ్రహకర్త)

4 రైతురామాయణం-ఇష్ట దేవతాస్తుతి-1వ పుట-1వ పద్యం.

అని ఇష్టదేవతా విశిష్టతను ధ్వనింపజేస్తూ "కావు"ను కాపులకు కాపైన విష్ణు మూర్తితో పోల్చి కావ్యార్థ సూచన గావించారు ఆచార్యులు.

"రైతనిన నెవ్వరోకాదు రాత్రిపవలు
నందులను నంటి పెట్టక నడిచపుళ్ళ
త్రిష్ఠవేనుక నిలిచి సుదీర్ఘ తీవ్ర
కృషి తపస్సొనరించెడి గిరశుడతడు"1

రైతును కృషి తపస్సొనరించే గిరీశునిగా అభివర్ణించి రైతువిలువను చాటినారు ఆచార్యులు అంతేగాక। పశుపోషణాన్ని, పాడిని, పంటను వృద్ధి పరుస్తూ సేద్యం జేసికొనే రైతును విష్ణువుగను, బ్రహ్మగను, శివునిగను, సహస్రాక్షునిగను, పరుశరామునిగ, బలరామునిగ, శ్రీరామునిగా అభి వర్ణించి2 రైతును ప్రపంచానికి అన్నదాత, ప్రాణదాత దైవాంశ సంభూతు డని సంస్తుతించారు. ఆచార్యులు రైతుయందు ఈశ్వరున్ని సాక్షాత్కరింప జేసిన తీరు నావ్యతో దర్శనం అచార్యులు గాంధీజీ సమాజ వాదాన్ని తమ కావ్యంతో ప్రతిబింబింపజేసి కాపు గాధను దేశ ప్రగతి స్ఫూర్తి పతాకముగా వెలార్చి అవిష్కరించారు.

"భారతదేశం గ్రామాల్లో నివసిస్తుంది" కావున స్వాతంత్ర్యం అట్టడుగు నుండి ప్రారంభమై ప్రతి గ్రామం సర్వసత్తాకమై, సంపూర్ణాధికారాలు కలిగి యుండాలని, "సువ్యవస్థితమైన సమాజ స్థాపనకు పిలుపునిచ్చారు గాంధీజీ. రైతురామాయణం బూర్జువా జమీందారీ విధానంపై రైతు విజయాన్ని గానం జేసింది. ప్రజా ఘటనతో, శాంతి విప్లవ పోరాటంతో నిజాం పాలన నుండి తెలంగాణం లోని గ్రామాలకు విముక్తిని కాంక్షించింది. దేశ సమైక్యతను, గ్రామాల సమగ్రాభివృద్ధిని ప్రధాన లక్ష్యంగా జేసికొని రైతు రాముని ధర్మ వీరోచితమైన జీవితం వృత్తంతో కథను నడిపించారు ఆచార్యులు.

---

1 రైతురామాయణం-కృషికాండం-10వ పేజి-3వ పద్యం.

2 రైతురామాయణం- పల్లె దర్శనం - 17వ పుట 5వ పద్యం.

"భవిష్యత్తులో రాబోయే అహింసాత్మక సామాజిక వ్యవస్థలో భూమి ప్రభుత్వానికి చెందుతుంది, భూమి సర్వగోపాలునిది అని చెప్పియుండిగదా ఆ వ్యవస్థలో కర్షకుడు లేక రైతు వ్యవసాయ కార్మికుడు లేక స్వయంగా భూమిదున్నే చిన్న రైతుదే అగ్రస్థానం. రైతు భూసారం వంటివాడు. న్యాయానికి భూమి రైతునకు చెందినది. రైతుకే చెందాలి కూడా. అంతేగాని గైరు హాజరు భూస్వాములకు జమీందారులకు చెందరాదు"1 అన్నారు గాంధీజీ. గోపాలుడంటే పశులకాపరి. ఆ పదమే దేవుడని కూడ అర్థము వస్తుంది. ఆధునిక పరిభాషలో అది ప్రభుత్వమని అర్థమిస్తుంది. అంటే ప్రజలని అర్థం. "నేను సమాజవాదిని-ఫ్యాక్టరీలన్నీ లాభంకోసం గాక. మానవాభ్యుదయం కోసం పాటుపడాలి."2 "నేను సామ్యవాదిని కూడ. ఇలాంటి కర్మాగారాలను జాతీయం జేయాలని కోరుతున్నాను"3

రైతురామాయణ కావ్యంలో గాంధీజీ సిద్ధాంతాలను జీవితంలో ఎట్లా సాధనీయాలో నిరూపించారు ఆచార్యులు.

రైతురాముని ధర్మ పోరాటంలో పాపి జమీందారు పాపారావు మరణించాడు. అతని ఆధీనంలో నున్న 100 ఎకరాలు మాగాణిని ధర్మారాట్ప్రభువు కైవసం జేసికొని దానిని రైతురామునకు శ్రీరామపుర కర్షకులకు ధారాదత్తం గావించాడు. ఈ విధంగా "దున్నేవాడిదే భూమి" అని కర్షకునకు ప్రాముఖ్యమివ్వబడి కావ్య రచన సాగింది. కావ్యం ప్రారంభం నుండి కావ్యం ముగిసేదాకా కర్షకుని ప్రాతినిధ్యాన్ని, అతని అవశ్యకతనూ, రైతు స్థితిగతినీ అభ్యుదయాన్నీ ఆకాంక్షించి రచన కొనసాగింది.

"చతుర్వర్ణములు మానవుని కర్తవ్య ధర్మమును నిర్ణయించుచున్నవి అంతియ కాని, అధర్మములు, హెచ్చుతగ్గులను దెలుపునట్టివి కావు. ఒకరు తనను గొప్ప అనుకొనుటయు, ఇతరుని తక్కువ అని తలచుట అవివేకము. జన్మ మాత్రముచే మానవునకు ఎక్కువ తక్కువలు లెక్కించుట వేదమతము

1 మహతి యువభారతి పబ్లికేషన్స్-గాంధీవాదం శ్రీప్లుతి యలమంచిలి తాయారు-పుట-115

2 మహాత్మాగాంధీ సందేశము-యు.ఎస్. మోహన్‌రావు సంకలనం-పుట 68

3 నవ్యభారతి-సంపాదక మండలి - పుట - 60

నకు విరుద్ధమని నా తలంపు"1 అని నిర్మొహమాటంగా వ్యక్తం జేశారు. గాంధీజీ ఆశించిన విధంగా ఆచార్యులు కులమత భేదభావం లేని సమసమాజాన్ని ఆహ్వానించారు. శ్రీరామచంద్రుణ్ని శూద్ర రైతుకులంలో రైతు రామునిగా అవతరింప జేశారు. అతనిని కావ్య నాయకునిగా ఆహ్వానించారు. రైతురాముని గాథను కావ్యంలో ఆదర్శంగా వాస్తవికంగా చిత్రించారు.

"బ్రాహ్మణ వంశానఁ బరశురాముండుగా బుట్టి రాజన్యుల పొగరడంచె
క్షత్రియ వంశాన సాకేత రాముడై జన్మించి దుష్టరాక్షసుల దునియె
ఘనమహాత్మగాంధి వైశ్యుడై పుట్టి పాశ్చాత్య శక్తుల పారద్రోలె
ఇక నాలుగవ జన్మమెత్తడే నాల్గవ జాతి సోదరుల కష్టాలు దీర్చ
రాముడఖిల ధాముడు అవతరించరాడె రైతులందొకడుగ"2

గాందీజీని అవతార పురుషుడగను, సామ్రాజ్య శక్తుల పారద్రోలిన వాడుగను విశ్వసించిన ఆచార్యులు గాంధీజీ సమాజవాదాన్ని తమకావ్యం నిండా నిబద్ధించి నవ్యతను సాధించారు.

"గాంధీజీ మానవోద్యమమును వ్యక్తి స్వాతంత్ర్య పరిధి నుండీ సమిష్టి మానవ శ్రేయః పథములో ప్రవేశ పెట్టిన మహనీయుడు. మతము వివాహము మున్నగు సమస్యలకన్న సంఘములోని ఆర్థిక దుస్థితిని, భావ దారిద్ర్యమును తొలగించవలెనని ప్రతిపాదించినాడు. జాతికి రాజకీయంగా ఆర్థికముగా సాంఘికముగాస్వాతంత్ర్యం వచ్చినపుడే మానవునికి మానవునికి గల సంబంధములు దృఢ పడునని అభిప్రాయపడినాడు. జాత్యాభ్యుదయమునకు గ్రామ వికాస మత్యవసరమని ప్రబోధించినాడు గాంధీజీ సిద్ధాంత ములు ప్రభావము నవ్య కవులలో కొందరిపై విశేషముగ ప్రసరించినది'3 అని ఆచార్య సి. నారాయణరెడ్డి పేర్కొన్నట్లుగా ఆచార్యులపై గాంధీ సిద్ధాంత ప్రభావము మెండుగా నుండుటకు ప్రధాన కారణము ఆచార్యుని

1 మానవ జీవితము-గాంధీ మహాత్ముడు
విద్వాన్ రావేళ్ళ రామయ్య-పుట-107.

2 రైతురామాయణం-కృత్యవతారిక - 20 పుట - 3, 4, పద్యాలు

3 ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు, ప్రయోగములు
డా॥ సి. నారాయణరెడ్డి - పుట-449.

వారి పెద్దన్న, గురుదేవులు కీ శే॥ వానమామలై వేంకటాచార్యులు. వీరు ప్రసిద్ధ శుద్ధ గాంధేయవాదులు. చిన్ననాటి నుండి వీరి పెంపకంతో, పోషణంలో, శిక్షణలో స్ఫూర్తిని పొందిన ఆచార్యులు గాంధీ సిద్ధాంతాలను పరిపూర్ణంగా అవగాహన జేసికొని ప్రభావితులైనారు. రజాకారు, నిజాం, జమీందారీ వ్యవస్థ కోరల్లో నుండి తెలంగాణం విముక్తి కావలెనను తపనతో గాంధీజీ నవసమాజ సిద్ధాంతాన్ని ప్రజలకు తెలియజేయాలని సంకల్పించారు. రైతురామాయణాన్ని రచించి జాతికి అంకితం జేసిజాగృత పరిచారు.

"గ్రామోద్ధరణమే శ్రీ గాంధి తాతయ్య
ప్రధాన దృక్పథముగాఁ బూనిగాదే?
గ్రామాభివృద్ధి కార్యక్రమమ్ములకె తా
ప్రాముఖ్యమిడదె? భారత ప్రభుత్వము
కొన్ని లక్షల సంఖ్యకున్న గ్రామాల య
భ్యున్నతి భరతోర్విఁ యున్నతిగదె?
గ్రామాధికారుల గణనీయ పాత్ర తా
భరతోర్వి సౌభాగ్య వరముగాదె?"1

ఈ విధమగు ఉన్నతాశయాలతో రచించబడిన రైతురామాయణ కావ్యాన్ని కరీంనగర్ జిల్లా గ్రామాధికారుల సంఘం ఆర్థిక సహాయం జేసి ముద్రింప జేసింది. గ్రామాధికారుల సంఘం ఒక పవిత్ర యజ్ఞంగా భావించి కావ్యాన్ని ముద్రింప జేయడం ఇదే ప్రథమం. ఈ ముద్రణా మహోద్యమ కార్య కార్యనిర్వహణంతో సర్వసత్తాక గ్రామ వికాసం మహోచ్ఛ స్థాయికి ఎదిగి గాంధీజీ ఆశయ సిద్ధికి దర్పణం పట్టినట్లైంది. ఆచార్యులు "ప్రజాకవి శేఖరులుగా" పొగడ్తలనందుకొన్నారు.

"ధర్మ అర్థ కామ మోక్షములనే నాలుగు సూత్రాల ఆధారంగా హిందూ తత్త్వం నిర్మించబడింది. ధర్మానికి మోక్షాని కంటే గాంధీ ఎక్కువ ప్రాధాన్యతనిచ్చాడు. "మానవుని ప్రారంభ లక్ష్యమూ, కడపటి లక్ష్యమూ,

---

1 రైతురామాయణం-గ్రామాధికార సంఘం-1వ పుట-3వ పద్యం.

కూడ ధర్మమే నంటూ, ధర్మమూ, మోక్షమూ ఒకే ఆశయ సిద్ధికి ఉపకరిస్తాయి"[1] అన్ని ధర్మ ప్రాధాన్యాన్ని చాటి చెప్పారు గాంధీజీ.

ఆచార్యులు ధర్మాన్ని ప్రతిష్ఠాపించాలన్న సదాశయం, ఆవేదన కల్గియున్న వారు, కావున ధర్మవీర రస ప్రధానం గల రైతురామాయణ కావ్యాన్ని[2] గాంధీజీ సమాజవాద దృక్పథంతో రచించి "రైతువాల్మీకి"గా వాసి గాంచారు.

ఆచార్యులకు గాంధీజీ సిద్ధాంతాలపై గల అచంచల విశ్వాసం, అవ్యాజాభిమానం గురించి ఆంధ్రప్రదేశ్ పూర్వపు ఆస్థానకవి, కళాప్రపూర్ణ డా॥ దాశరథి వెలిబుచ్చిన అభిప్రాయమిట ఉటంకించుట సముచితం.

"భారతమాత పల్లెల్లో ఉంటుందన్న మహాత్ముని మాటను కవితా రూపమున తెలిపిన కవీశ్వరుడు మా జగ్గన్న"[3]

ఈ అభిప్రాయం ప్రత్యక్షర సత్యం
పఠితలకిది అనుభవైక వేద్యం

---

1 డా॥ జె.డి. సేఠ నవ్యభారతి సంపుటి అక్టోబర్ 83
గాంధేయ విలువలు-20 శతాబ్దపు సవాళ్ళు
అనువాదం - కె.వి. సత్యనారాయణ-పుట-83

2 "రస నిర్వాహణం"లో వివరింపబడింది.

3 రైతురామాయణం-రైతురామకథ-ప్రజాకావ్యసుధ-డా॥ దాశరథి పుట3



# నిజాం పాలనావ్యవస్థ సామాజిక పరిభావం

## రైతు రామాయణం - కవి ప్రేరణలు

## III నిజాం పాలనా వ్యవస్థ - సామాజిక పరిభాపం

"అవి నిజాము రాజ్య నిరంకుశాధికారి
పటు ప్రచండ శాసన మదోద్భట మహోగ్ర
మత పిశాచ రాణ్మహిషి యున్మాదమూని
ప్రళయ తాండవమ్ములు త్రొక్కుభయదినాలు"-1.

కవి సమకాలీన భావ ప్రపంచానికి ప్రతినిధి. అంతేగాదు, గతానికి, వర్తమానానికీ, భవితవ్యానికీ, మధ్య త్రెంచరాని బంధంగానూ వ్యవహరిస్తాడు. ఆచార్యుల వారి కాలంనాటి పరిస్థితులు రైతురామాయణ కావ్యావిర్భావానికి ప్రేరణనిచ్చాయి. భారతదేశం ఆంగ్లేయుల అధికారంలోను, తెలంగాణా నైజాము ప్రభువుల పాలనలోను ఉన్నాయి. నిరంకుశమైన జమీందారీ దొరల పాలనలో గ్రామాలు తమ ఆస్తిత్వాన్ని కోల్పోయాయి. వెట్టిచాకిరి బానిసత్వపు శృంఖలాల్లో బంధింపబడినాయి. 1947లో భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చినా హైదరాబాద్ సంస్థానం నిజాం పాలకుల నుండి విముక్తం కాలేదు. ఇట్టి దుష్కాల విపత్కర పరిస్థితుల్లో ప్రజలు పడిన యిక్కట్లను ఆచార్యులవారు కళ్ళారాగాంచి విచలితులైనారు. అమితా వేదన పొందారు. వీటిచే ప్రేరితులై రైతురామాయణ కావ్యాన్ని రచించారు. ఈ పరిశీలనలో నిజాం పాలనను గూర్చి వివరించడం సమంజసం.

### * నిజాం రాష్ట్రంలో తెలంగాణాలోని నిజాం వంశపాలనం *

క్రీ॥శ॥ 1518లో "సుల్తాన్ కులీ"2 కుతుబుషాహీ వంశస్థాపకుడై

1 రైతురామాయణం-కృత్యవతారిక- 16 పుట-8 పద్యం.
2 ఈ అంశం వ్రాయుటలో విజ్ఞాన సర్వస్వము Vol III (పుటలు 427-482) మిక్కిలి ఉపకరించినది,

గోలకొండనుపాలించాడు. వీరిలో 'మల్కిభరాంగా' ప్రసిద్ధిపొందిన ఇబ్రహీం కుతుబుషాహి పాలన చరిత్ర ప్రసిద్ధమైంది. తదనంతరం జరిగిన చరిత్ర పరిణామ క్రమంలో గోల్కొండ ఢిల్లీ మొగలాయి చక్రవర్తులచేపతనమైంది కుతుబుషాహి వంశపాలనకు స్వస్తి చెప్పబడింది. మొగలాయిల ప్రతినిధిగా నున్న "నిజాము - ఉల్ - ముల్కు" క్రీ॥శ॥ 1724లో స్వతంత్రించి, హైదరాబాదును రాజధానిగా జేసుకొని, మొదటి "అసఫ్‌జా"గా ప్రసిద్ధి నొందాడు. మహారాష్ట్ర పీష్వాబాజీరావుతో, ఒడంబడికజేసికొన్నాడు. అతని సహకారంతో, సుస్థిరుడై, దక్కనులో అసఫ్‌జా వంశపాలనకు ప్రారంభకుడై నాడు.

III, IV అసఫ్‌జా నిజాముల కాలంలో క్రీ॥శ॥ 1800 సంవత్సరంలో, బ్రిటిష్‌వారి ఆధిపత్యం ప్రబలింది. హెన్రీరసెల్ సైనికదళం హైదరాబాద్ దళానికి నాయకత్వం వహించింది. ఇందులకుగాను బ్రిటిష్ ప్రభుత్వము నిజాం రాష్ట్రం నుండి అమితమైన ద్రవ్యలబ్ధిని పొందింది. ఇదే తరుణంలో "పిండారీల" దాడులతో అరాచకం ప్రబలింది.

క్రీ॥శ॥ 1857-59 సం॥లో అసఫ్‌జా V కాలంలో "సిపాయిల తిరుగుబాటు" జరిగింది. నిజాం ప్రభుత్వం ఆంగ్లేయుల పక్షం వహించింది. సాలార్‌జంగ్ మంత్రి ఆధ్వర్యంలో, నగరంలో తిరుగుబాటు అణచివేయబడింది. అసఫ్‌జా VI పాలనలో, ఈ పరిస్థితుల దృష్ట్యా బహుళంగా, ఆర్థిక మాంద్యం ఏర్పడింది.

VIIవ అసఫ్‌జాగా నవాబు "మీర్ఉస్మాన్ అలీఖాన్" నిజాం పదవి నలంకరించాడు. ఇతని కాలంలోనే రెండు ప్రపంచ యుద్ధాలు జరిగాయి. అపార ధనవ్యయం జరిగింది. అస్తవ్యస్తమైన పరిపాలనతో హైదరాబాదు సంస్థానం అనేకమైన అరాచకాలకు గురియైంది. ఖాసీం రజీవా నాయకత్వములో "రజాకారు ఉద్యమం" చెలరేగింది. క్రీ॥శ॥ 1948 సం॥ సెప్టెంబర్‌లో భారత మేజర్ జనరల్ జె. యన్. చౌదరి నేతృత్వంలో "పోలీసు చర్య" జరిగింది. జనవరి 1950 సం॥లో హైదరాబాదు సంస్థానం భారత సమాఖ్యలో విలీనమైంది. 1957 సం॥లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంగా అవతరించింది.

## * నిజాం పాలనలో - జమీందారి పద్ధతి *

బ్రిటిష్ ప్రభుత్వం యొక్క ఆధిపత్యంలో నున్న నిజాం ప్రభుత్వం కాలంలో పర్మినెంటు సెటిల్మెంటు చట్టం (1802) రెండు రికవరి చట్టం (1865), ఎస్టేట్ లాండ్ చట్టం (1908) అను చట్టాలేర్పడినాయి, జాగిర్దార్లు హవేలిదార్లు, పాళెగాండ్రు, జమీందార్లు నైజాముకు లోబడి ఉండేవారు. వీరికి తమ తమ ప్రాంతాలను పాలించే అధికారమివ్వబడింది. వీరు వంశ పారంపర్యంగా పాలించే అధికారాలను పొందియున్నారు, తమ యధీనంలో నున్న పొంతాల్లోని రైతుల నుండి భూమి శిస్తును వసూలు చేసి, అందులో కొంత భాగాన్ని ఉంచుకొని తక్కిన మొత్తాన్ని నైజాముకు చెల్లించడం వీరి ప్రాధాన కర్తవ్యం. శాంతి భద్రితలను రక్షించే బాధ్యత జమీందారులపై ఉంది1. వీరికి స్వంత సైన్యం, సాయుధ సిబ్బంది, సురక్షితమైన కోట బురుజు లుండేవి. శిస్తు కట్టక ఎదిరించే వారిని సైన్యాన్ని ఉపయోగించి బలాత్కారంగా అనచి వేసేవారు2. స్వార్ధపరులైన జమీందారులు స్వలాభాపేక్షతో రైతుల నుండి నిర్ణయించబడిన దానికన్న మూడు నాల్గు రెట్లు అధికంగా వసూలు చేస్తూ, అమిత ధనవంతులైనారు. తగిన నీటి వనరులు లేక సర్వే లేక భూములు అన్యాక్రాంతాలై రైతులు నిరాశ్రయులగుచుండిరి. ఆర్థిక మాంద్యం హెచ్చి, పంటలు సమృద్ధిగా పండక కరువు కాటకాలతో దారిద్ర్యమేర్పడి నాటి ప్రజలు ఆందోళనకు, అరాచకాలకు గురియగుచుండిరి. దీనికి తోడు నరరూప రాక్షసులైన రోహిల్లాలు, పిండారీలన బడే బందిపోటు దోపిడీదార్లు, ప్రభుత్వపు అండదండలతో, నానా భీభత్స కాండలను సృష్టించేవారు. పిండారీలు, హఠాత్తుగా గ్రామాలపై బడి, చిత్ర హింసలు పెట్టి సమస్తాన్ని కొల్లగొట్టు కొని పోయేవారు. ఈ విధంగా నైజాం రాష్ట్రం అనేక అల్లకల్లోలాలకు గురియైంది3.

---

1 ఆంధ్ర సర్వస్వము-మాగంటి బాపినీడు 1961 సం॥ 169 నుండి 17 పుటల సంగ్రహణం.

2 విజ్ఞాన సర్వస్వము-III 427 నుండి 440 పుటల విషయ సంగ్రహణం

3 చరిత్రలో మరో చీకటి కోణం దిగవల్లి వేంకటరత్నం- ఆంధ్రప్రభ దినపత్రిక 23-10-1988.

"జమీదార్ముఖ్యులు గ్రామనాయకులు సంస్థానాధి నాధుల్ దొరల్
తమ కేనియున్ ముకుగొయ్యలై వరగుగద్దారుల్ రజాకార్లవి
త్తముతో దన్నుచు వంగి వంగి పడి బందాలై సలామ్ సేయుచున్
సమయజ్ఞుల్ స్వకుటుంబ ముఖ్యులనుయూన్యన్ జేర్చిరందాకనున్"[1]

"చాకలి మంగలుల్ సాహెబు దొరల యా
 వెట్టిచాకిరి క్రింద కొట్టువడిరి
స్వారి యెద్దుల బండి సమము కో సులమేర
 ఎరరొప్పుచు పరువులిడి మడసిరి
సుంతజాగైన మెమంత పచ్చడిగొట్టు
 దొరలకు వీపిచ్చి తొలువబడిరి
దొరకెక్కుడుగఁ దానె దొరమయి చప్రాసి
 చెప్పుకాళ్ళం దన్న చితికి పడిరి"2.

రైతురామాయణము నందున్న ఈ పద్యాలు నిజాం కాలం నాటి పరిస్థితులకు అద్దం పట్టుతున్నాయి.

## * రజాకారు ఉద్యమం *

రజాకారు ఉద్యమం హైజాం రాష్ట్ర చరిత్రలో మరపురానిది.

15వ ఆగష్టు 1947 లో భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. భారత ఉప ప్రధాని సర్దార్ వల్లభభాయ్ పటేల్ అన్ని రాష్ట్రాలను భారత యూనియన్‌లో సమైక్యం గావించాడు. కాని, నిజాంనిరాకరించి హైదరాబాద్ రాష్ట్రాన్ని, స్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకొన్నాడు.

నిజాం ప్రభువు తన రాష్ట్రాన్ని సుస్థిర పరచుకోవడానికి, కొంత ముంది ముస్లిం నాయకుల సలహా మేరకు "రజాకార్లు" (స్వయం సేవకులు) అను పేరిట నొక సంస్థను స్థాపించాడు. అందు ముస్లిం యువకులను, ముస్లింలు

1 రైతురామాయణం-కృత్యవతారిక 16 పుట 6 పద్యం.
2 రైతురామాయణం-కృత్యవతారిక 17 పుట 4 పద్యం.

గా మారినహిందువులను రజాకార్లుగా మార్చి, శాంతి భద్రతలు కాపాడుటకు నియోగించాడు. "ఇత్తెహాదుల్ ముస్లిమీన్" కూడ దీనిలో విలీనమైంది.

ఖాశీం రజ్వీ నాయకత్వంలో రజాకార్లు స్వతంత్ర హైదరాబాద్ సంస్థానానికి అనుకూలంగా భయానకమైన రీతిలో ప్రదర్శనలు జరిపారు. నిజాం తనకు కంటకంగా మారిన వామ పక్ష పార్టీని నిషేధించి అణచివేయుటకు అంగీకరించాడు. రజాకారు దళాలు దేశవ్యతిరేక కార్యకలాపాలను విశృంఖలంగా సాగించింది. కాశీం రజ్వీ నాయకత్వంలో ఫాసిస్టు శక్తులు విజృంభించి, ఆటవిక పాశవిక రీతిలో హత్యాకాండ గావించి వీరవిహారం చేశాయి.

"గృహదహనాలు, దోపిడీలు, స్త్రీశిశు హత్యలు, గోవధల్ సతీ
మహిళల మానభంగముల మానుష ఘోర కిరాత కృత్యముల్
మహిగల హైందవ ప్రజల మారణహోమము సేయువ్యూహ ని
ర్వహణములెన్ని యంచు నుడువ న్వశమప్పటి యాదురంతముల్"1
అప్పటి ఆ రజాకార్ల దురంతారలిట్టివి.

అంతేగాక నిజాం ప్రభుత్వం జాతీయ పతాకాలను ఎగురవేడం కూడా నిషేధించింది. ముస్లిములకు వ్యతిరేకంగా నున్న వారిని నరికి వేయండి' అని కాశీం రజ్వీ రజాకారు దళం పిలుపు నిచ్చింది. ఈరజాకార్ల ఉద్యమం విదేశీయులు పిండారీలు జరిపిన ఘోర అత్యాచారాల కన్నా మిక్కిలి ఘోరాతి ఘోరమైన దోపిడీలు, మానభంగాలు, హత్యాకాండ, ముమ్మరంగా సాగించింది, నిజాం ప్రభుత్వంరజాకార్ల ఆధిపత్యానికి, మతదురహంకారానికి లొంగి నిస్తేజమైంది2.

"పేరునకే నిజాముురాజ్యమ్ము పెత్తనమ్ము
మొత్తమును రజాకార్లదే, చిత్తమనుచు
నాకిరాతకులకు నవాబంకితమయి
ఎదురు జెప్పలేనసద దుస్థితికి జాజె"3.

---

1 రైతురామాయణం – కృత్యవతారిక 16 పేజి - 4వ పద్యం.

2 వి.హెచ్. దేశాయ్– ముసలి నక్క చరిత్రలో ముగింపు వాక్యం 1 అన్న వ్యాసం ఆంధ్రప్రభ 18 సెప్టెంబరు 1988 ఉపకరించింది.

3 రైతురామాయణం కృత్యవతారిక 16వ పేజి 4వ పద్యం.

నిజాం దుష్ట పాలనను, రజాకార్ల మారణ హోమాన్ని నిరసిస్తూ ధర్మ విజయానికి గీతం పాడుతూ, నిజాం పాలనకు ముగింపు వాఖ్యంగా రైతురామాయణం రచింపబడింది.

నిజాం పాలనను అంతమొందించే ఉద్యమంలో "ఆంధ్రమహా-సభలు" స్టేటు కాంగ్రెసు పాత్ర అద్వితీయమైంది. ఆంధ్ర జాతిపిత మాడపాటి హన్మంతరావు కృషివల్ల, ఆంధ్రజన సంఘం, గ్రంథాలయాలు వర్తక సంఘాలు నెలకొల్పబడినాయి. 1930 లో సురవరం ప్రతాపరెడ్డి అధ్యక్షతనలో ప్రథమాంధ్ర మహాసభ మెదక్ జిల్లా జోగిపేటలో జరిగింది. ఈ సంఘమే "నిజాం వ్యతిరేక ఐక్య సంఘటనశక్తి"గా రూపుదిద్దుకుంది.

1938లో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ అవతరించింది. నిజాం దుష్ట పాలనను నిరసించి వ్యతిరేకించడం వల్ల నిషేదానికి గురియైంది. 1938 అక్టోబర్‌లో సత్యాగ్రహాలు నిర్వహించి కాంగ్రెస్ వాదులు కారాగార శిక్షకు గురియైనారు. స్వామి రామానందతీర్థ నాయకత్వంలో స్టేట్ కాంగ్రెస్ బలమైన రాజకీయ సంస్థగా రూపొందింది, కాశీం రజ్వీ నేతృత్వంలో నైజామును సమర్థిస్తూ రజాకారు ఉద్యమం బలపడి, అనేక అరాచకాలను సృష్టించగా, వినాయకరావు విద్యాలంకార్ అధ్యక్షతనలో, న్యాయవాదుల నిరసన సంఘమేర్పడి ప్రతిఘటించింది. 1947 అగష్టు 7వ తేదీన స్వామి రామానందతీర్థ భారత యూనియన్‌లో హైదరాబాద్ సంస్థానం విలీన దినం పాటించాలని, నిజాం ప్రభుత్వపు కార్యాలయాలపై జాతీయ పతాకాల నావిష్కరించాలని పిలుపునిచ్చారు. ఈ ఉద్యమం మహోధృతమై నిజాం పాలనా పతాకాల పతనానికి నాంది పల్కింది1.

తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం మరోవైపునుండి విజృంభి-ంచింది. నిజాం పాలనలో ఫ్యూడల్ జమీందారీ వ్యవస్థకు ప్రజల్లో నైరాశ్యం ప్రబలింది. తిరుగుబాట్లు, సంఘర్షణలు, అణచివేతలు అధికమైనాయి. రైతు-జమీందారీ సమస్య జటిలంగా పరిణమించింది. అగ్రవర్ణాల వారు

---

1 మునని నక్క చరిత్రలో ముగింపు వాక్యం- వి. హెచ్. దేశాయ్ ఆంధ్రపత్రిక 18 సెప్టెంబర్ 1988 వారి వ్యాసం ఉపకరించింది.

బ్రాహ్మణులు కూడ విస్తళ్లు కుట్టి సరఫరా చేయడం వంటి వెట్టిచాకిరి పతాక స్థాయికి చేరింది. బానిసలుగా, ఆడ బాపలుగా, బాలికలను సరఫరా చేయడం, వంతులవారిగా కోళ్ళు, గొఱ్ఱెలు, పాలు పెరుగు సరఫరా చేయడం వంటి పరిస్థితులు జమీందారీ వ్యవస్థలో మామూలై పోయినాయి.

"కాపుకూలీల స్వకష్టార్జితమెల్ల దొరలు దొంగలు చుట్టి దోచుచుండ
ఆలుబిడ్డలు కూటికంగ లార్చుచు గంజి నీళ్ళపై పూటలు నెట్టుచుండ
అడుగడుగులన్ ప్రమాదపుటలలు పెద్ద
కొండ మెత్తునన్ లేచుచు గుండెజీల్చ
పెనుదు మారాల నడి కడలిని మునుగుచు
హిందుప్రజల జీవితనావ యుట్టటగుచు"1.

ఇట్టి జనజీవన సరళిని స్తంభింపజేసే నికృష్టపు చర్యలు గలట్టి జమీందారీ వ్యవస్థ నుండి 'విముక్తి కోసం, భూమికోసం, భుక్తి కోసం, బానిస బంధాలముక్తి కోసం, నిజాం పాలనకు ముగింపు కోసం 'వామపక్షకూటమి' కమ్యూనిస్టు పార్టీ నాయకులు - ప్రజలు సంఘటితమైనారు. పర్యవసానంగా 'వీర తెలంగాణా రైతాంగ సాయుధ విప్లవ పోరాటం' 4వ జూలై 1946 అక్టోబర్ 21 వరకు కొనసాగింది.

"కమ్యూనిస్టులు రైతాంగం విముక్తికి వీరోచితంగా, విప్లవాత్మకంగా పోరాడి కొన్ని విజయాలు సాధించారు. ఆరోజులలోనే నిజాం ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీపై నిషేదం విధించింది"2. ఐనను ఈ ఉద్యమం తెలంగాణ మంతటా విజృంభించింది. రైతులు తమ పొలాలకు తామే కౌలుదార్లైనారు. కమ్యూనిస్టు పార్టీ "దున్నేవాడికే భూమి", విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అన్న నినాదాలతో ప్రజానీకాన్ని చైతన్యం జేసింది3.

1 రైతురామాయణం - కృత్యవతారిక 17 పుట 1 పద్యం.

2 డా॥ అందె వెంకటరాజం వానమామలై వరదాచార్యుల వారి కృతులు - అనుశీలనము - 122 పుట.

3 అధ్యయన వేదిక 1984-87 మధిర ప్రత్యేక సంచిక ఉపకరించింది. మరియు ఆంధ్రప్రభ 18 సెప్టెంబర్ 1988 మరియు 14-9-1988 ఆంధ్రప్రభ దినపత్రికలు ఉపకరించాయి.

గాంధీయిజాన్ని ఓ ఆదర్శంగా గాకుండ, ఆర్థిక సామాజిక పరిస్థితులు అన్వయించే ప్రయత్నంతో సాయుధపోరాటం ప్రారంభమైంది. అగ్రశ్రేణి నాయకులు తోడుగా నుండగా శ్రీ రావి నారాయణరెడ్డి హైదరాబాద్ సంస్థానంలో సత్యాగ్రహం జేశారు.

ఫ్యూడల్ వ్యవస్థపై సమరశంఖం పూరించారు. తెలంగాణా రైతాంగ పోరాటానికి నాయకత్వం వహించారు. తెలంగాణా ప్రజలంతా సాయుధ పోరాటం వైపుమళ్ళారు. ఇదొక "ప్రాక్టికల్ గాంధీయిజం"గా పరివర్తనం పొంది ప్రజల బలాన్ని, సహకారాన్ని పొందింది. ఆయుధ సేకరణ జరిగి, గెరిల్లా దండయాత్రగా పరిణామం పొందింది. "విస్నూరు" మొదలగు దేశముఖుల, జమీందారుల మదపూరితమైన పాలనను అణచి వేసింది1.

"వామపక్ష జాతీయ ముద్ర స్పష్టంగా ప్రకటిస్తూ, పోషిస్తు భావన మీద గాంధీ నెహ్రూ ముద్రతో చైతన్య ధనుష్పాణులైన ప్రజలు "సంఘముల" నేర్పరచుకొన్నారు. నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగబడ్డారు. తమ ధనమాన ప్రాణాల నెదురొడ్డి పోరాడినారు. సుమారు ఐదు వేలకుపైగా పోరాట వీరులు అసువులు బాసినారు. అడవులల్లో డెన్‌లలో యుంటూ గెరిల్లా పోరాటం సాగించారు. దేశముఖులు, జమీందారుల నుండి భూమిని కైవసం జేసుకొని ప్రజలకు పంచారు. ఈవిధమైన రైతాంగ పోరాట ఉద్యమం, తెలంగాణాలో సాంఘిక, రాజకీయ, సాహిత్యరంగాలలో చైతన్యాన్ని యిచ్చి, బానిస శృంఖరాల ద్రెంచుటకు దోహదపడింది1. పౌర హక్కుల నిజాం సాధన, నిరంకుశపాలనకు జాగీర్దారుల భూస్వాముల దౌర్జన్యాలకు ప్రతిఘటన, రైతుసంక్షేమం, వెట్టిచాకిరీ నర్మూలనం మున్నగు ఆశయాల స్ఫూర్తితో రైతురామాయణ కావ్యరచన సాగింది.

## పోలీసు చర్య

భారత యూనియన్‌లో లీనమగుటకు నిజాం అంగీకరించలేమ్ము, రజాకారు

1. ఇంద్రజిత్‌తో ఆంధ్రప్రభ అది సాయుధ గాంధీయిజం—
శ్రీ రావి నారాయణరెడ్డి 14-9-1988 ఆంధ్రప్రభ దినపత్రిక.
2 మహతి-యువ భారతి పబ్లికేషన్స్ 72వ పుట.

ఉద్యమంతో తెలంగాణమంతా అస్తవ్యస్థ దుర్వ్యవస్థకులోనైంది మరొకవంక నిజాం పాలనను అంతమొందించడానికి విజృంభించిన సాయుధ రైతాంగ విప్లవ పోరాటం వలన ఏర్పడిన ప్రజా ప్రతిఘటనం ప్రభుత్వ పాలనను స్తంభింపజేసింది, హైదరాబాద్‌సంస్థానం నిస్తేజమైంది. అరాచకం పాలైంది భారత ఉప ప్రధాని సర్దార్ వల్లభభాయి పటేల్ రాజనీతి చాతుర్యంతో హైదరాబాదు రాష్ట్రాన్ని స్వతంత్ర భారతదేశంలో సంలీనం గావించడానికి ఇదే మంచి తరుణమని భావించాడు. 13వ సెప్టెంబర్ 1948న మేజర్ జనరల్ జే.యన్. చౌదరి నేతృత్వంలో భారత యూనియన్ సైన్యం హైదరాబాద్‌ను చుట్టుముట్టింది. ఎనిమిది వైపుల నుండి, సైన్యం మోహరించి పోరాడుతూ 17వ సెప్టెంబర్ 1948 సం॥న సికిందరాబాదుకు చేరింది. గత్యంతరంలేక నిజాం కాల్పుల విరమణకు ఆదేశాలిచ్చాడు. కారాగారాల్లోని నాయకులందర్ని విడుదల జేయించాడు. స్వామి రామానంద మొదలగు అగ్రశ్రేణి నాయకులకు పరిస్థితిని సమీక్షించడానికిని సాదరాహ్వానాలను పంపాడు. శాంతిసుహృద్భావ వాతావరణం నెలకొనడానికి, హైదరాబాద్ రాష్ట్ర ప్రజలకు శాంతి స్నేహపూర్వక సందేశం యిచ్చాడు, పర్యవసానంగా 18-9-1948న జనరల్ చౌదరి హైదరాబాదు రాష్ట్ర సైనిక గవర్నర్‌గా నియమింపబడ్డాడు. హైదరాబాదు రాష్ట్రం స్వతంత్ర భారత యూనియన్‌లో విలీనమైంది. ఈ విధంగా పోలీసు చర్యచే నిజాం రాష్ట్రంలో చిరకాల దాస్యం అంతరించిది. స్వేచ్ఛావాయువులు వీచాయి. శాంతి భద్రతలు నెలకొల్ప బడ్డాయి.

"తెలంగాణా విముక్తి" ఈలాంటి రాజకీయ చైతన్యం, సాంఘిక చైతన్యం, కలుగడానికి, సాహిత్యోద్యమం ఎంతవరకు దోహద పడిందో, పరిశీలించడం సముచితం.

## తెలంగాణ విముక్తికి సాహిత్యోద్యమం:

తరతరాల నిజాం ప్రభువుల పాలనను అంతం కోరుతూ, తెలంగాణ విముక్తికి కవిలోకం సాహిత్యోద్యమంతో ప్రముఖ పాత్రను నిర్వహించింది.

"కవుల కలాలు నాయక ప్రకాండుల గుండె బలాలు నేకమై
రవిలిచె విప్లవాగ్నులను రైతులు కార్మికుల లొక్క పెట్టునన్
మొవులు పవుల్ నినాదముల ముందుకు సాగిరి రౌద్రమూర్తులై
ధివిభువి యేకమైనదన దిక్కుల దట్టె ప్రజాప్రవాహమున్"1

కవుల కలాలు ఝళిపంచబడినాయి. గళాలు విప్పి గర్జించాయి. "నా తెలంగాణ కోటి రతనాల వీణ" అని వెలిగెత్తి చాటినాడు. కవి కంఠీరవం దాశరథి. "నా తెలంగాణతల్లి నను కనిపెంచినట్టి కరుణామయి"2 అని జాతీయోద్యమ భావావేశంతో చాటాడు దాశరథి3. తెలంగాణ పోరాటమున దాశరథి సాక్షి మాత్రులగు కవులుగారు ఆ భయంకర సమరమున పాల్గొని, నిజాం ప్రభుత్వం పెట్టిన దుర్భర బాధలను అనుభవించిన వీరవరులు. అందుకే దాశరథి ప్రళయకాల రుద్రుడై రుద్రవీణ మ్రోగించారు. అగ్నిధార కురుపించారు.4

"మూగవోయిన కోటి తమ్ముల గళాల
పాట పలికించి కవితా జవమ్ము కూర్చి
నా కలానకు బలమిచ్చి నడిపినట్టి
నా తెలంగాణ కోటి రత్నాల వీణ"5

తెలంగాణా ప్రజలపై రజాకారులు జరిపిన దారుణహింసా కాండను వివరిస్తూ—

"అడుగడుగున యెడద నెత్రు
గడగడమని తాగినావు

---

1 రైతురామాయణము-కృత్యవతారిక 10వ పుట-6వ పద్యం
2 రుద్రవీణ – పుట 1- దాశరథి.
3 డా॥ సి. నారాయణరెడ్డి ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు ప్రయోగములు పుట 607.
4 ఆధునికాంధ్ర కవితా సమీక్ష-ఆచార్య కొత్తపల్లి వేంకటరామనరసింహం 350-352 పుటలు
5 రుద్రవీణ-డా॥ దాశరథి – పుట-1.

పడతుల మానాలు దోచి
గడగడమని హుక్కా తాగి
జడియక కూర్చుండినావు.
మడికట్టుక నిలచినావు
దగాకోరు బటాచోరు
రజాకారు పోషకుడవు"1

అంతేగాక, రైతుకు విజయం పలుకుతూ, నిజాంను నిందిస్తూ నినదించిన ఈ పద్యం ఉద్యమ కవులకు స్ఫూర్తి నిచ్చింది.

"ప్రాణములొడ్డి ఘోరగహనాటవులన్ బడగొట్టి మంచి మా
గాణములన్ సృజించి ఎముకల్ నుసిజేసి పొలాలు దున్ని భో
షాణములన్ నవాబునకు స్వర్ణము నింపిన రైతుదే తెలం
గాణము రైతుదే ముసలి నక్కకు రాచరికమ్ము దక్కునే"2

తెలంగాణం రైతుదే అని గర్జించాడు దాశరథి. నిజాం రాజు 'జన్మ జన్మాల బూజు' అని అధిక్షేపించాడు. రైతు విజయాన్ని, జమీందారీ పతనాన్ని నిర్దేశిస్తూ, నిజాం పాలనను "ముసలినక్క రాచరికమ్ము"గా నిలదీసి చాటినాడు దాశరథి.

కాళోజి, పొట్లపల్లి రామారావు, అడ్లూరి అయోధ్య రామకవి, సోమసుందర్, రెంటాల, గంగినేని, కుందుర్తి, రమణారెడ్డి మొదలగు కవి పుంగవులు ప్రజా చైతన్యాన్ని కలిగించే కవితల నందించారు.

కుందుర్తి 18 పర్వాలలో "తెలంగాణా" కావ్య నిర్మాణం గావించి భారతగాధ స్ఫూర్తితో తెలంగాణంలో నవాబుకు వ్యతిరేకంగా కార్మికులు కర్షకులు విప్లవించిన ఉద్యమాన్ని అభివర్ణించారు.

"తెలంగాణ పోరాట గేయాలు'' అను సంకలనంలో ప్రముఖ కవుల నేకులు అనేక ఖండికలను వెలువరించారు అభినవపోతన వానమామలై వరదా

1 డా॥ దాశరథి-అగ్నిధార

2 డా॥ దాశరథి - అగ్నిధార - పుట - 3

చార్యులు. "రాజ ప్రముఖుడు నైజాము" అను ఖండకావ్యంలో నిజాం దౌర్జన్యాన్ని తెగడి, హేళన గావించాడు. కాళోజి తెలంగాణ పోరాటానికి ఉత్తేజితులై రచనలగావించారు.

"మానవాధములను మండలాధీశులను
మరచి పోకుండగ గురుతుంచుకోవలె
కసి ఆరిపోకుండ బుసకొట్టు చుండాలె
కాలంబు రాగానె కాటేసి తీరాలె
తిట్టిన నాల్కలను చేవట్టి కొయ్యాలె
కొంగులాగిన వేళ్ళ కొలిమిలో పెట్టాలె''1

విద్వాన్ విశ్వం రచించిన "తెలంగాణా చైత్రయాత్ర" ప్రజలకు స్ఫూర్తి నిచ్చింది.

"అదిగడిగో అదేఅదే తెలంగాణ రణ రంగం
అది విలయ ప్రభంజనం అది విలయ ప్రభంజనం
అది ప్రళయ విజృంభణం
అది యుగాంత సంధాన రాగం
పొందివికున్న క్రోధేద్రేకం"2

తెలంగాణ వంటి కావ్యాలు, ఖండకావ్యాలే గాక నవలలు కూడ అశేష ప్రజానీకాన్ని ప్రభావితం జేశాయి. ఉన్నవ లక్ష్మి నారాయణ "మాలపల్లి" వట్టికోట ఆళ్వారుస్వామి "ప్రజల మనిషి" ప్రముఖుంగా పేర్కొనదగ్గవి. వీనిలో నాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు, గాంధీ దృక్పథం, బానిసత్వం లోని బాధలు, జమీందారీ విధానం వర్ణింపబడి, జన జాగృతిని గలిగించి, ఉత్తేజితం జేశాయి.

తెలంగాణ విముక్తి పోరాటం కూడా దేశ స్వాతంత్ర్య సముపార్జనలో ప్రధానాంశమైంది. కావున ఇదే తరుణంలో జాతీయ భావాన్ని, స్వాతంత్ర్య

1 ఆధునికాంధ్ర కవితా సమీక్ష-ఆచార్య కాకర్ల-పుట-356 నుండి తీసికొన బడింది. ఈ గ్రంథమంతయు ఉపకరించింది.

2 నవ్యాంధ్ర కవితా సమీక్ష - ఆచార్య కాకర్ల-పుట-354

ప్రీతిని, దేశభక్తిని, హాలిక శ్రమశక్తిని అభివర్ణించే కావ్యాలు రచింపబడినాయి. గడియారం వేంకటశేషశాస్త్రి రచించిన "శివభారతం" హిందూ సామ్రాజ్య నిర్మాత ఛత్రపతి శివాజీ చరిత్రాన్ని ఉగ్గడించిన ప్రబంధకావ్యం అట్లే భారత జాత్యాభిమాన రక్షకుడైన రాణా ప్రతాప సింహుని చరిత్రను దుర్భాక రాజశేఖర శతావధాని రచించారు. ఇదే స్ఫూర్తితో భక్తకవి హాలిక శ్రేష్ఠుడైన పోతన చరిత్రాన్ని డా॥ వానమామలై వరదాచార్యులు వెలయించారు. అంతేగాక నవ్యాంధ్ర కవితా వైతాళికులు గురజాడ, రాయప్రోలు, నాయనివారల రచనలు కవులందరిపై ప్రభావం జూపాయి. ఉత్తేజపరిచాయి. 1

శ్రీమాన్ వానమామలై జగన్నాధాచార్యులు, డా॥ దాశరథి, కాళోజి మొదలగు కవులకు సన్నిహితులు. దేశాభిమానం, జాత్యాభిమానం, గల కవిపండితులు. తెలంగాణా పోరాటంలో స్ఫూర్తినిచ్చే కవితలను ఆశువుగా చెప్పి ప్రచారం జేసి జాగృత పరిచినవారు. తెలంగాణంలో ఆనాడు జరిగిన దారుణ హింసాకాండను ప్రత్యక్షంగా చూచినవారు. 2 రైతు జీవితం గడుపుటచే రైతుల కష్టాలను అనుభవ పూర్వకంగా గుర్తెరింగినవారు కాబట్టి నిజాం పాలననాటి పరిస్థితులకు ప్రత్యక్ష ప్రేరణ పొందారు ఉత్తమ కావ్యాన్ని వెలయించారు.

"దున్నిన వాడిదే పొలము, దున్నిన వానిదే తత్ఫలమ్ము నె
ట్లెన్నటికైనఁ దప్పదది యేలిక మన యా రైతురాముడే
యన్నిట భారత ప్రజల కన్నము ప్రాణము నిచ్చు తండ్రి కూ
లన్నియొ వానికెల్లపుడు నండయు దండయు మేనికండయున్" 3

దున్నినవాడిదే పొలమని గర్జించి కర్షక శ్రామిక శక్తిని ఉగ్గడిస్తూ,

---

1 డా॥ సి. నారాయణరెడ్డి-ఆధునికాంధ్ర కవిత్వం, సంప్రదాయములు-ప్రయోగాలు, మరియు ఆధునికాంధ్ర కవితా సమీక్ష-ఆచార్య కొత్తపల్లి వేంకట రామనరసింహం-అను గ్రంధాలు మిక్కిలి ఉపకరించాయి.

2 ఆచార్యుల సాహిత్య జీవితంలో వివరించబడింది.

3 రైతురామాయణము-కృత్యవతారిక - 19వ పుట-8వ పద్యం.

"చీకటి ప్రభుత్వాలు మాసి చిన్న చిన్నగ వెలుంగుల రాచరిక మొదవెననీ"[1] సుప్రభాత పద్యం పాడుతూ, జమీందారీ రాచరిక వ్యవస్థపై రైతు విజయాన్ని చాటుతూ, రైతురామాయణ మహాకావ్యాన్ని రచించి "రైతుకవి"గా సాహిత్య జగత్తులో ప్రసిద్ధిగాంచారు.

---

1 రైతురామాయణము-విజయకాండం-20వ పుట-1వ పద్యం.



# స్వప్న సాక్షాత్కారం కావ్యావతారిక

## * రైతు రామాయణ కావ్య రచనకు కవి ప్రేరణలు

## IV. స్వప్న సాక్షాత్కారము - కావ్యావతారిక

"మెరసెన్గన్నులలోన నేడొయొక క్రొమ్మిక్కచట్టులా తక్షణ
మ్మెరహిన్మూతపడెం గనుంగవయు మిర్మిట్లాని యా లోననె
మెరపుం గొండలు తగ్గెc గట్టెదుట స్వామిన్ శ్యామలాకారు సుం
దర శ్రీరామ విభుం గనుంగొనితి నుద్యన్మందహాసాననున్"1.

సీతాసమేతుడై శ్రీరా విభుడు స్వప్నమున సాక్షాత్కరించి రైతురామాయణ కావ్యాన్ని రచింపమని" ఆజ్ఞాపించినట్లు2 కావ్యావతారికలో ఆచార్యులవారు తెలిపారు,

యథార్థమరసినచో స్వప్న వృత్తాంతం కవి ఆత్మిక చైతన్యాన్ని ఆత్మిక విచారాన్ని, అంతర్ముఖీనతను వ్యక్తపరిచే కావ్యకళ. తెలుగు మహాకావ్యాల్లో స్వప్న వృత్తాంతం మహాకావ్యావిర్భావానికి ప్రబలమైన హేతువుగా ప్రబంధ లక్షణంగా యెంcచబడుతుంది. తెలుగు కావ్యములలో స్వప్న వృత్తాంతం మొదటి సారిగా, తిక్కన భారతములోనే చోటు చేసుకొన్నది. స్వప్నమున హరిహరనాథ దేవుడు సాక్షాత్కరించి, భారతము నాంధ్రీకరించవలసినదిగా ఆజ్ఞాపించినట్లు అవతారిలో గలదు. రాను రాను ఆంధ్రకవులలో పలువురు దీనినొక సంప్రదాయముగా భావించి, అవసరమున్నను, లేకపోయినను, ఇష్టదేవతయో, పితృపాదుcడో, స్వప్నముగ వచ్చి కావ్య రచన కాదేశించినట్లుగా వ్రాసినారు"3. అని ఆచార్య సి. నారాయణరెడ్డి తమ సిద్ధాంత గ్రంథంలో తెలిపారు.

---

1 రైతురామాయణం స్వప్నసాక్షాత్కారము-30 పుట 1 పద్యం.

2 రైతురామాయణం స్వప్నసాక్షాత్కారము-31 పుట 7 పద్యం.

3 ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు డా॥ సి. నారాయణరెడ్డి పుట 117.

ఈ సంప్రదాయాన్ని అనుసరించిన కవులు కావ్యరచనా ప్రేరణలను కావ్యావతారికలలో స్పష్టపరిచారు. సంస్కృతవాఙ్మయంలో ఆదికవి వాల్మీకి బ్రహ్మ ప్రేరణచే ఆదికావ్యం శ్రీమద్రామాయణాన్ని రచించారు కావ్యారంభంలో నారద మహర్షితో "కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్..........., ఆత్మవాన్, కోజితక్రోధో ద్యుతిమాన్, కోఽన సూయకః, ఏతదిచ్ఛా మ్యహం శ్రోతుం పరం కుతూహలం హిమే".1 అని జిజ్ఞాసతో, అడిగాడు. అప్పుడు నారదుడు' అన్ని గుణముల రూపింప దశరథాత్మజుడు, శ్రీరాముడని తెలిపాడు శ్రీరాముని చరితాన్ని రచించు మని కోరాడు.

వేదవ్యాసుడు బ్రహ్మప్రేరితుడై భారతాన్ని రచించాడు. అట్లే నారద ప్రేరితుడై భాగవతాన్ని రచించాడు.

కవి కావ్య రచనకు కడంగడానికి ప్రధాన ప్రేరణలు వైయక్తిక, దేశ, కాల, సమాజ, సాహిత్య స్థితిగతులు, సమకాలీన సమాజశ్రేయాన్ని అభిలషించి, స్వీయాభిరుచులకు అనుగుణంగా ఆత్మప్రేరితుడై కావ్యరచన చేయవచ్చు. లేదా పరుల ప్రేరణ వల్లనూ ప్రేరితుడు కావచ్చు. లేదా, ఏదేని హృదయావర్జక ఘటన సంఘటించిన వేళలో స్పందించి కానీ కవి కావ్య రచనకు పూనుకొనవచ్చు.

రైతురామాయణ కావ్య రచనకు ప్రేరణ స్వప్న సాక్షాత్కారం. ఇది కావ్యావ తారికలో కవి స్పష్టీకరించడం జరిగింది ............"చిన్ననాటగోలె పితృ పరంపరా ప్రాప్తమైన. కవితావ్యాసంగముచే ప్రేరితుడనై నా అభిమాన విషయమైన, రైతు జీవితగాథను, పల్లె తెలుగు నుడికారపు సొంపులతో మలుచుకొనుటలో, నేను పడ్డ శ్రమ ఇంతా అంతా కాదు. చదువుకొన్నది గీర్వాణకావ్య భాష. వ్రాయదలచినది పల్లెరైతు గాథ. ఒకటికొకటి పర స్పర విరుద్ధములు. పల్లెలోని రైతుకూలీల దైనందిన జీవిత విషాద గాథలలోని బాధలు నాహృదయమును తమవైపు కాకర్షించుకొన్నవి. ఒక ఉత్తమ కావ్యమును తమగురించి వ్రాయుచున్నవి.

1 దక్షిణాత్యప్రతి – వాల్మీకి రామాయణము – బాల కాండము– ప్రథమ సర్గ–శ్లో–2-4 1/2.

నా హృదయము కాదనలేక పోయింది. పల్లెటూరి రైతురాముడు సామాన్య వక్తి అతని గాథ సామాన్యగాథ అయినప్పుడు, కథానాయకత్వమునకుండ దగినయుదాత్తత లేదుగదా యని ఆత్మ శంకించినది. చివరకీ విషయంలో మనస్సే గెలిచికొన్నది, నేను వ్రాస్తానన్నది, పల్లెలో మకాము పెట్టినది. పల్లె జీవితాలను చక్కగా అధ్యయనము చేసినది భాషను మార్చుకొన్నది. తెగువచేసి రైతురామాయణమును వ్రాయపూనుకొన్నది. వాగ్దేవి కరుణా ప్రసారము దానికి తోడుపడ్డది. అభిజ్ఞుల ప్రోత్సాహ వాక్యములు దోహద ములై వెలసినవి"1. గ్రామీణ జీవనంలోని పాదుకొనిఉన్న నిరంకుశత్వం చేసే దోపిడి నుండి సమాజాన్ని రక్షించవలెనను సామాజికాశయంతో ప్రేరితులైనారు ఆచార్యులు.

అధర్మ పీడితుల పక్షం వహించి గ్రామ రాజ్యం రామ రాజ్యంగా విలసిల్లాలనే ఉత్తమ లక్ష్యం రైతురామాయణ కావ్యరచనకు మార్గదర్శక మైంది. దీనికి స్వప్న సాక్షాత్కారంలో పేర్కొన్న ప్రేరణలు సహృదయా వర్జకాలు.

విమర్శకాగ్రేసరులు, ఆచార్యుల బాల్య స్నేహితులు డా॥ పల్లా దుర్గయ్య "తొలిపలుకులను" వ్రాస్తూ, రైతురామాయణ కావ్య రచనా హేతువులను విశదపరచారు............ "ఈ కవి వీరుడు పదునాలుగేళ్లు రైతు జీవితమును గడిపినాడు. ఈ కారణములచేతనే శ్రీ ఆచార్యుల వారికి రైతు లన్నను, వ్యవసాయ మన్నను మిక్కిలి అభిమానము. అందలి లోతుపాతు లను, బాగోగులను, అనుభవపూర్వకముగా గ్రహించినారు. రైతు సంబంధ విషయమును వస్తువుగా గ్రహించి, రైతురామాయణమును వ్రాయుటకును కాపుదనము పట్ల వీరికి గల పరిచయాభిమానములొక కారణము చితికిన రైతుల గతుకుల బతుకులను కావ్య జగత్తులో ప్రతిబింబించుటకును మరియు పల్లెపట్టులము, పల్లె పడుచులము, ముగ్ధమోహన సౌందర్యమును కావ్య బంధమున అందగింపజేయుటకును, కవి ఈ రైతురామాయణమును రచించియుందురు......................జానపద సంపదను ఇట్లు తాము కొల్ల గొట్టిన పల్లె ప్రజల పలుకుబళ్ళను, కావ్యభండారములో భద్రపరచుటకుగూడ

1 రైతురామాయణము-మున్నుడి (కృత్యాద్యవస్థ) 1 పుట.

ఈ కవి రైతురామాయణమును రచించియుండును".1 వ్యవసాయ పద కోశముగను, నుడికారముల కొటారముగను, పల్లీయుల జీవన వృత్తాంతాన్ని వర్ణించారు ఆచార్యులు. కర్షకాభ్యుదయాన్ని, ధ్యేయంగా నిడుకొని, రైతురామాయణాన్ని రచించారు.

"ఇప్పటి కాపెవండొ గమనించితి నేనెలేదే! కవీ! యిదో
రొప్పుడి ముల్లు గోలయిది రువ్వెడి నా శరమే హలమ్ము నా
యప్పటిదౌ హలమ్మె, పదునారని గొడ్డలి యా కుఠారమే
ఎప్పుడు కాపుకావ్యము రచించుట కింకను జంకెదే కవీ!"2

అనుచునానతిచ్చి, అంతర్హితుండయ్యె,
స్వామి యంతలోనెఁ జప్పున నొక
జ్యోతియేదొ యెదను జొచ్చుక వచ్చి
యాత్మనితిడి యిట్టి యలుగు వారె"3

శ్రీరాముని కరుణా కటాక్షం చేత సమకాలీన సాంఘిక స్థితులకు ప్రేరణ పొంది ఆత్మనుండి అలుగులువారి కవితా స్రవంతియైనది.

## కృతి సమర్పణం

రైతురామాయణ మహాకావ్యం ప్రజల కొరకు వ్రాయబడింది. ప్రజల సహకారంచే రూపుదిద్దుకొని ముద్రింపబడింది. ప్రజల మనిషి, కర్షకబంధు విశ్వసాహితీవేత్త, నాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నేటి ప్రధాని పి.వి. నరసింహారావుకు అంకితమీయబడింది. ఆచార్యులవారి ప్రేరణ పర్యవసానం ఆశయాల ఫలరూపం పి.వీకి కృతి సమర్పణంగాను పర్యాప్తమైంది. కవితా జగత్తులో ఇదొక మహా పరిణాహరూపం. నేటి కర్షక జీవన చిత్రణ కావ్యాల్లో రైతురామాయణం మకుటాయమానమైంది.

---

1 రైతురామాయణము-తొలిపలుకు-1పుట డా॥ పల్లా దుర్గయ్య

2 రైతురామాయణము-స్వప్న సాక్షాత్కారము-31వ పుట-7వ పద్యం

3 రైతురామాయణము-స్వప్న సాక్షాత్కారము-32వ పుట-1వ పద్యం

# స్వప్న సాక్షాత్కారం-అనుభూతి మూలిక ఆత్మకళాభ్యాసం

"ఆనాడెందులకో యదేపనిగ కృష్యారంభ నిమగ్నుడౌ
ప్రాణినొక్కని దదంతికమ్మున దివా రాత్రములు గొల్చు క
ళ్యాణిన్ గా పెతరాణి వారి కొఱకే రక్తమ్ము మాంసమ్ముసున్
బ్రాణమ్మున్ బలివెట్టు గోదలగు నవ్వానిన్ దదేకాత్మతన్"1

"స్మృతి పథమునన్ బంతి యెద్దు నెమరు
రీతి మెదడులో మెదలుచు హృదయసీమ
దూయుచును వేదనగ నిల్చి మేమసాగె"2

కవి, కర్మిష్టి, కృతితపస్వి యైన ఆచార్యుల వారొకనాడు, బురదలో నానుతూ, సేద్యపు పనిలో నిమగ్నమైయున్న కాపు జంటను గాంచారు. కృషిభారంతో నడ్డిడుచున్న దుక్కి బక్కలను, నడుము ఉండేలట్టుగ జూవాడ వంగి తొడపు దీయు కాపెతను, ఘర్మాంబుగంగలు దిగువారదున్నుచున్న కర్షకుణ్ని చూచారు. వవలనక రేలనక పొలాల్లో కష్టించే వారి కష్టస్థితిని కనులార గాంచుటచే వారి తీరని వేదన కవిగారి స్మృతిపథంలో పలుమార్లు కదలాడించి. మనస్సును కలచివేసింది. ఆత్మ సంస్కారం గల కవి హృదయం క్షోభిల్లింది. కాపు వ్యథార్త జీవిత యథార్థ సన్నివేశాలు వారిలో తీవ్ర అవేదనను కల్గించాయి. గుండె కరిగింది. వారు పడే పాట్లల్లో పాలుపంచుకోవాలన్న తపన కలిగింది. ఎంత మరుతమన్నను మరపునకు రాక, వారి హృదయసాగరం ఘూర్ణిల్లింది.

"యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవాను పశ్యతి సర్వభూతేషు చాత్మానం తతో నవిజుగుప్సతే"3

"ఎవడు సర్వచరాచర జగద్వస్తుజాలాన్ని తన ఆత్మలోనే దర్శించునో అట్లే సర్వచరాచర జగద్వస్తు జాలంలో తనను చూచుకొనునో అట్టివానికి భేద ఖేదములు లేవు" అని గీత బోధ.

---

1 & 2 రైతురామాయణము-స్వప్నసాక్షాత్కారము-23 వపుట -4, 5పద్యాలు.

3 భగవద్గీత-అధ్యా-శ్లోకం

రైతులోకం, కవిలో లీనమై కరిగిపోయింది. ఆచార్యులు ఆహాలిక జగత్తులో స్పందించి, ఐక్యభావం పొందారు.

"వడకన్ జేరి చిలాకుగాఁ బొరలుచున్ బలిమిగ్గన్నుల్ మూయుచున్
నడిరేయయ్యెడి దాక వేచితిని రానన్నట్టులే చేసి యె
ప్పుడో వచ్చెన్ని దురమ్మ నా హృదయమును మూర్ఛిల్లగాజేసి యె
క్కడికో యేయొక స్వప్నలోకమునకో కన్పప్పి నన్నంపెదాన్"1
"అని మనమున దలపోయుచు
ననిదం పూర్వ మగునెదొయ్యనుభూతిని జెం
దిన వాడ నగుచుఁడ
అను నెత్తి యొకింత స్వామలంగనుచుంటిన్"2

ఆచార్యులవారు అనిదం పూర్వమగు అనుభూతితో జగత్తులో తాదాత్మ్యం పొందడం వల్ల అద్వైతస్థితి పొందారు. అవ్యక్తమైన అనుభూతిమూలక స్వప్నావస్థ పొందారు. ఈ అంతర్ముఖీనతయే ఆత్మకళా సిద్ధికి సోపానం. ఇట్టిదొక బృహత్తరమైనట్టి యోగ సమాధి దశ. ఈ దశలోనే కవికి ప్రతిభావంతమైన దార్శనిక శక్తి వికసిస్తుంది. దీనికి వ్యుత్పన్నత తోడైంది. అభివ్యక్తిచేత చక్కగా ప్రకాశమానమయ్యే అనువైన మార్గమేర్పడింది.

"కలయొ యది సముజ్జ్వల కావ్యకలయొదాన
సకలమును సకలమ్మయి సంస్ఫురించె
కృతియొ యది రసబ్రహ్మ యాకృతియొ యచటి
ప్రకృతి యంతయు రసమయ ప్రకృతి యయ్యె"3

అది కలగాదు సముజ్జ్వలమైన, ఉత్సాహవంతమైన, ప్రకాశవంతమైన, నవనవోన్మేషమైన, ధర్మబద్ధమైన కావ్యకళ. అంతశ్చేతనలో సకలం రసబ్రహ్మమై, రసమయ ప్రకృతియై సంస్ఫురించింది. అనగా ఒక దృగ్వి

1 రైతురామాయణము–స్వప్నసాక్షాత్కారం_24వ పుట-1పద్యం
2 రైతురామాయణం-స్వప్నసాక్షాత్కారం-31వ పుట-3వ పద్యం.
3 రైతురామాయణము_స్వప్న సాక్షాత్కారము-25వ పుట_6వ పద్యం

శేషం ఉద్బుద్ధమైంది. జ్ఞానోదయమై జాగృతమైందన్న మాట. రైతు నాయక జీవితగాధ సంభావ్యమానమైంది. అది కథాప్రమాశిక చేత పరిపుష్టమై, ధర్మవీర రసోపస్కృతమైంది. ఈ విధంగా రైతురామాయణ కావ్యావిర్భావానికి అంకురార్పణం జరిగింది.

"ఆత్మ కళాభ్యాసం లోని వ్యుత్పన్నత తోడి అనుభూతి, ఆత్మిక చైతన్యాన్ని జాగృతం చేస్తుంది. మనిషిని మారుస్తుంది. దృగ్విశేషాన్నిస్తుంది"1 అని శేషేంద్ర వివరించారు. ఈ ఆత్మ విచారం వల్ల వస్తువుల నానా విధాలైన విస్ఫురణ కలిగి అక్లిష్టాలైన పదాలు గోచరించి, కవికి వస్తువులలో నుండి చూచేశక్తి లభిస్తుంది. "అంతర ప్రయత్నం సమాధి. బాహ్య ప్రయత్నం సమాధి. ఆ రెండును శక్తినుద్భాసింప జేయును''2 వాల్మీకి వ్యాసులు రచనోపక్రమము వేళ ఏవంవిధమైన యోగసమాధి స్థితిలో అవ్యక్తానుభూతిని పొందే, విశ్వశ్రేయమైనట్టి, రామాయణ భారత కావ్యాలను సంతరించి పెట్టారు.2

---

1 గుంటూరు శేషేంద్రశర్మ-కవిసేనమానిఫెస్టో-పుట-58

2a వాల్మీకి-రామాయణం-బాలకాండం

"తతః పశ్యతి ధర్మాత్మా, తత్సర్వం
యోగమాస్థితః పురామ త్తత్ర నిర్వృత్తం
పాణనామలకం యథా తత్సర్వం తత్త్వతో ద్వష్ట్వా:..........

2b వ్యాసుడు-సభాపర్వం

''పుణ్యేహిమతః పాదే మధ్యేగిరి గుహాలయే విశోధ్యదేహం ధర్మాత్మా దర్భ సంస్తర మాశ్రితః శుచిః సనిమమో వ్యాసః శాంతాత్మా తపసి స్థితః – భారతేతిహాసస్య ధర్మే నాన్వేక్ష్య తాంగతిః। ప్రవిశ్యయోగం జ్ఞానేన సోపశ్యత్ సర్వ మంతతః"1

---

1 ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ-సాంప్రదాయికరీతి
డా॥ సంపత్కుమార-40వ పుట

## స్వప్న వృత్తాంతము :

ఆచార్యులవారు రైతు జంటను గాంచి, వారి వ్యథార్త పీడిత సన్నివేశాలను స్మృతి పథాన సంస్మరిస్తూ నిద్రాదేవి ఒడిలో మునిగి, స్వప్న లోకంలో తేలియాడారు. ఆ స్వప్నంలో ఒక పెద్ద సభాగ్న ప్రాంగణం. అచటి వేదికపై పుంభావ సరస్వతివోలె, కవిరాజొకడా సీనుడై యున్నాడు, అతని కమ్మని మధురమైన కావ్యగానాన్ని సభాసదులు ముగ్ధులై మైమరచి ఆలకిస్తున్నారు.

కావ్యగానానంతరం అందరు తమతమ యిండ్లకు వెళ్ళారు. ఆచార్యులు కూడా తమ బసకు చేరారు. అచట గుండెకోలు పడిన ఒక హాలికుణ్ణి గాంచారు. ఆహాలికుడు కవిగారితో "తమరును కవిపుంగవులే. కవులు కైతజాలు కష్టజీవుల యెద దప్పిదీర్ప జాలు టెన్నడో కదా" యని దీనంగా అడిగాడు. ధనవస్తువాహనములను ఆశించి, ధనికుల కవితలల్లుట జరుగుతూ వస్తుంది కాని కష్టజీవుల కథలు ఎత్తిర్రాయు కవులు అరుదు" అని విమర్శిస్తూ "పవ్వాడు గలుగు మీకు నెనరెన్నడు వ్రాతురు రైతుగాథ" యని కవిగారిని ఆ కర్షకుడు వేడుకొన్నాడు. రైతు గాథను కావ్యంగా రచించండని అర్థించాడు.

"చిన్నది గాదు కాపుదొర చేతమునందలి దేవిపోతc దో
జిన్నది గాదు నా లలిత చేతన యందలి త్రవ్విపోతయున్
మన్నన లేనిమాట నిజమైననుc గాపు తెడంద అందునున్
కొన్ని పెదెత్తు కోరికలు కోల్మసగుంగద లోనలోననే"1

రైతు వెతల గాథలు కవి హృదయాన్ని కదిలొచ్చాయి. స్పందింపజేశాయి. చేతము నందలి దేవిపోత త్రవ్విపోతల కోరికలు లోన లోననే మసలు చున్నాయి. కవిగారు రైతు బాధలను తన బాధలుగా భావించారు ఇట్టి తాదాత్మ్యమైన సుషుప్తావస్థయోగ స్థితిలో హృదయ సంవాదం జరుగుతుంది. హృదయ సంవాదంచే కవియొక్క చిత్తవృత్తి ఖావ్యమానమైన

1 రైతురామాయణము-స్వప్నసాక్షాత్కారము-28వ పుట-3వ పద్యం

వస్తువు విషయంలో నిమగ్నకారియై, కావ్యసృష్టికి సమగ్రమైన అవగాహనను ఆర్జించుకొంటుంది.1

"నీ కథ రామకథా యది
కాక మహా భారతమ్మ - ఘన భా
గవతమ్మా! కాపురామ కథ గద
లోకము మెచ్చునొకొ సుకవిలోకమటుండన్".2

అని స్వప్నంలో ఆచార్యులు రైతు కథ వ్రాయుమన్న కర్షకునితో అన్నారు.

రామాయణ భారత భాగవతాది గ్రంథాలు బృహన్మానవచైతన్యాన్ని ప్రకర్షింప జేసే సమాదరణీయ కావ్యాలు, ప్రఖ్యాతేతి వృత్త సంకలిత ప్రబంధ కావ్యాలకు మాత్రమే అశేష జనాదరణం అభిస్తుందనేది నాటి నమ్మకం. ఉత్పాద్య గాథా కావ్యాలు ప్రాచుర్యం పొందడం దుస్తరం అని ప్రజా నాడిని దెలిసిన ఆచార్యులు కాపురామ కథను కావ్యంగా రచించడానికి ఆత్మలో వితర్కించుకొన్నారు. అంతే గాక, కాపు రామ కథను వివరించి వర్ణించినచో రామాయణమంత విహాయ సవిపులమనియు, వినదలచినచో మహా భారత గాథా సదృశమనియు, హాలికుడైన భక్త కవి పోతన భాగవతాన్ని రచించడంచే రైతుజీవితం ఉత్కృష్టమైందనియు, భావించారు ఈ వితర్కంలోని విచక్షణాయుత భావరేఖ ఆచార్యులవారి అంతర్ప్రబోధ భావనాపటిమను విద్యమానం జేస్తుంది "భావనా పరంగా ప్రవర్తించు దశలో కారయిత్రి యనియు, వ్యవహారం, భావనాశక్తి యనునది ఒకానొక విధమైన బౌద్ధికకటకం"3 అని సంపత్కుమార వక్కాణ. హృదయనేత్రంతో

---

1 "హృదయ సంవాదాత్ నిమగ్న కారికాతావత్ భవతి చిత్త వృత్తిః" అభినవ భారతి.

2 రైతురామాయణము-స్వప్నసాక్షాత్కారము 27 పుట 8 పద్యం.

3 ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ-సాంప్రదాయిక రీతి. డా॥ సంపత్కుమార - పుట 44.

ధర్శించిన విషయం భావింపబడి, ప్రతిభావంతుడైన కవిచే ఉదాత్తమైన కావ్యమౌతుంది. భావయిత్రి కారయిత్రి అను ఈ రెండు కవి ప్రతిభా శక్తికి నికషోపలాలు భావింప బడిన రైతు జీవిత గాధకు కావ్య రూపాన్ని ఒసగాలనే తపనగల వారైనారు ఆచార్యులు.

"అప్పుడంటి నేఁ బ్రియమ్తిన్నించి చూచెద
సాధ్యమైన వరకు స్వామి కరుణ
కాపు రామ కథలు కాపు రామాయణ
కృతిగఁ దెలుగు నుడి ప్రగతికి గతికి".1

అని ధర్మాను ప్రాణిమైన కాపు రామ కథ ప్రగతి గతికి అవశ్యావశ్య కమని ఎంచి కృతి వినిర్మింప బడింది. ఐనను కాపు కథ లోకవిచారంలో' అనుదాత్త యంశం" అని సంశయాకుల చిత్తులైనారు, ఆచార్యుల వారికి జగన్మాతవాణి స్వప్నంలో సాక్షాత్కరించింది. భాగవతరాద్ధాన మొనర్చిన పోతన హాళాలికుడను యంశము నైనను మది దలంచి రైతు రామ కథ వ్రాయుమని ఆనతిచ్చింది.

"లెమ్ము నీకలమ్ము నుఁ జేంగొమ్ము నీకు
నీ కలమ్ము నకును జయశ్రీ కలదయ
నేను నీ వెనక వెన్కల లేనటయ్య
ఒక నిమిత్త మాత్రముగ నీవుండరాద".2

ఆచార్యులవారి తల పోత కడలిలోని ఒక లయ వలె కల భాసిల్లింది. ఆత్మిక విచారంలో, కాపు కథా కావ్యంలో అంగిరస చింతన కలిగింది. తరంగాయ మానమైన సంచారీ భావాలకు స్థాయిని చేకూర్చు కోవటానికి కవి తపన వ్యక్తం గావింపబడింది. కవి అంతర్ముఖీనుడగుట వలన, అంతశ్చేత-నావృత్తిలో, అహం భావం తొలగింది. భావయిత్రికి, కారయిత్రితో డై కావ్య సామాగ్రి రూపొందించబడింది,

ఏవం విధంగా కవి వ్యక్తావ్యక్తమైన చిద్విశేషస్థితిలో ఉండగా,

1 రైతురామాయణము-స్వప్నసాక్షాత్కారము పుట 28 పద్యం 4.
2 రైతురామాయణము-స్వప్నసాక్షాత్కారము పుట 29 పద్యం 3.

జానకి సమేతుడై శ్రీరామ చంద్రుడు దర్శన మొసగి "తాను కాపుగా వెలసితిననియు, కౌమరక్షోవధార్థం కృతి సాగింపుమ"నియు ఆనతిచ్చాడు, అనగా కావ్యం ధర్మాను ప్రాణిత వీరరస కావ్యంగా ధర్మస్థాపకై రామాయణ కావ్యానుసరణంగా వ్రాయవలెననుట యిట స్పష్టం.

ఈ విధంగా కవి అంతఃశోధనమే కావ్యావిర్భావానికి ప్రబల హేతువైంది. కాపు వానిలో శ్రీరామున్ని గాంచగలిగారు. ధీరోదాత్త నాయకునికి ఉండదగు లక్షణాలను రైతురామునిలో ఉండుట కొరకై ప్రణాళికను సిద్ధం జేసికొన్నారు ఆచార్యులు.

శ్రీరామ బలరామ పరుశురాములను కాపులో దర్శింపజేసికొన్నారు ఆచార్యులు. రాముని శరం రైతు రొప్పెడి ముల్లు గోలమైంది. బలరాముని హలం కాపునకు హలమైంది. పరశురాముని గొడ్డలి హాలికుని కేలకుఠారమైంది.1 ఇట్టి రైతురామున్ని కావ్యనాయకునిగా, ధర్మరక్షణార్థం జనించిన కారణ జన్మునిగా ఉద్భాసింప జేశారు.

"ప్రాప్త కాలము పాస్యతామ్" అని మహద్రష్ట కవి వాల్మీకి ప్రవచించినట్లుగా, ఆచార్యుల వారిలో వైయక్తిక ప్రేరణం, అంతర్లీనమైన సుప్తచేతనం, ఆత్మ సంస్కారం అన్నియు నేకంగా గ్రథింపబడినాయి. దీనికి తోడుగా బాహిరమైన సామాజిక ప్రేరణ ప్రబల కారణమైంది. కవితా హృదయం ద్రవించి జాలువారింది. జిజ్ఞాస మేల్కొన్నది. హాలికుల దైన్య విషాద గాథలలోని బాధలు మిక్కిలి వేదనను శోకాన్ని కలిగించాయి. ఆచార్యుల వారి హృదయం ఘూర్ణిల్లింది. రైతు విషాదగాథను బుద్ధి పూర్వకంగా ఆహ్వానించి, అభ్యసించి, ఆత్మీకరించుకొంది హృదయం ప్రతిస్పందించి, కృషీవల ప్రవృత్తి విచారంలో నిమగ్నమై అన్వేషించింది. ఒక పరిపూర్ణమైన మానసికానుభూతిని పొందింది. "కరంపట్టుకొన్న చెయ్యి, నాగలి పట్టుకొన్ని చెయ్యికన్న గొప్పదేమీ కాదని"2 కర్షక ప్రాముఖ్యతను

1 రైతు రామాయణం-స్వప్నసాక్షాత్కారం-31వ పుట-6వ పద్యం.

1 The hand with the pen in no letter than the hand on the Plough"--
రెంబో మహాకవి-(కవిసేన మానిఫెస్టో-శేషేంద్రశర్మ 18వ పుట నుండి ఉద్ధృతం)

గుర్తించింది. ఏవం విధమైన అనుభూతి మూలక ఆత్మకళాభ్యాసంలో కృషి కృతికి తగిన ప్రణాళిక సిద్ధం జేయబడింది. "కవి యావన్మానవ జాతికి నాయకుడు. యావన్మానవ గాథలకూ, బాధలకూ, ఏకైక ప్రతినిధి. ఈ ఏకైక ప్రాతినిధ్యం కోసం బృహన్మానవ చైతన్యంలోంచి పుట్టినవాడే కవి"2 అని శేషేంద్ర పేర్కొన్నారు.

ఆచార్యులవారు పల్లె పట్టుల్లోనే నివాస మేర్పరచుకొన్నారు. పల్లె జీవితాలను కూలంకషంగా అధ్యయనం జేశారు. జాను తెనుగు జానపద భాషను సమకూర్చుకొన్నారు. తదనుగుణంగా భావాలను మార్చుకొన్నారు. తదంకితంగా బృహన్మానవ చేతనా ప్రేరితులై హాలిక గాథలకూ, బాధలకూ, ప్రతినిధియైనారు. జీవిత సన్నివేశాల్లోనుండి పోగుచేసి కొన్ని అనుభవాలు, సుఖ దుఃఖ వేదనామయ జీవితానుభూతులు అన్నియును ఆత్మనిక్షిప్తాలై చైతన్య మహాసాగరం నుండి పెల్లుబికి, గట్లు ద్రెంచుకొని కవితావేశం పొంగి పొరలింది. రైతురామాయణ కావ్యం ప్రవహించింది.

---

2 కవిసేన మానిఫెస్టో–శేషేంద్ర–20వ పుట–

ఓం

# రైతు రామాయణం - మహా కావ్యం

"అప్పుడంటినేఁ బ్రియత్నించి చూచెద
సాధ్యమైన వరకు స్వామికరుణ
కాపు రాము కథలు కాపు రామాయణ
కృతిగ తెలుగు నుడి ప్రగతికి గతికి".1

"చక్కని నుడికారస్ముల
చిక్కని నుడు జాను తెలుగు జిగిబిగువుల యీ
చొక్కపు చిన్నది సత్కృతి
మక్కువ లిడి యేలుకొనుము మనసిచ్చి ప్రభూ".2

ఆచార్యులు తెలుగు నుడికారాలతో, జిగి బిగి గల జాను తెనుగులో, ప్రగతికి గతికి రచించిన, తమ రైతు రామాయణ మహా కావ్యాన్ని, పివిజీకి అంకితం జేశారు. రైతురామాయణంలో, మహా కావ్య లక్షణాలను అనుశీలించడానికి ముందు, కావ్యాలంకారికులు పేర్కొన్న కావ్య లక్షణాలను పరిశీలించడం సమంజసం.

## మహా కావ్య లక్షణాలు:-

వామనుడు నిబద్ధము, అనిబద్ధమను ప్రభేదంతో పద్య కావ్యం రెండు విధాలని వివరించాడు1. నిబద్ధమనగా వస్త్వైక్యంతో అవిచ్ఛిన్నంగా నిబంధింవ బడిన మహా కావ్యం, ఇక ముక్తకాదులు, ఖండ కావ్యాలు అని బద్ధమువకు చెందినవి. ప్రసిద్ధాలంకారికుడు భామహుడు కావ్యాలు ఐదు

---

1 రైతురామాయణము-స్వప్న సాక్షాత్కారము పుట 28 పద్యం 4

2 రైతురామాయణము-కృతి సమర్పణ || పుట 4 పద్యం

3 'తదిదం గద్య పద్య రూపం, కావ్యమనిబద్ధంచ-" కావ్యాలంకార సూత్రవృత్తి 1-3-27 ప్రథమాధి కరణం, తృతీయధ్యాయము-వామనుడు,

విధాలని పేర్కొన్నాడు.2 అవి

1. సర్గ బంధము } పద్య కావ్యాలు
2. అని బద్ధము
3. కథ } గద్య కావ్యాలు
4. ఆఖ్యాయిక
5. అభినేయార్థము:- రూపక కావ్యం వామన భామహులు పేర్కొన్న నిబద్ధం, సర్గ బంధం అనేవే మహా కావ్య లక్షణాలను కల్గియున్నాయి.

మహా కావ్యాన్ని ఉండదగిన లక్షణాలను సమగ్రంగా నిర్వహించిన ఆలంకారికుల్లో విశ్వనాథ దండ్యాచార్యులు ఎన్నదగిన వారని చెప్పవచ్చును. వీరిరువురు పేర్కొన్న కావ్య లక్షణాలిట పొందుపరచబడినాయి.

1. నిబద్ధము, సర్గబంధం అను కావ్యప్రభేదమైన పద్య కావ్యమే మహా కావ్యం.
2. ప్రఖ్యాత, ఉత్పాద్య, మిశ్రమములలోనేదేని ఒక కథ, ప్రధానేతివృత్తంగా అవిచ్ఛిన్నమై ఉంటుంది.
3. ఇతిహాసోద్భవం గాని, సజ్జనాశ్రయం గాని, ఇతరమునకుగాని చెందిన ఇతివృత్తం కావ్యంలో నిర్వహింప బడుతుంది.
4. దేవత గాని, సద్వంశ సంజాతుడైన క్షత్రియుడు గాని కావ్యంలో నాయకుడై ఉంటాడు. ఈ కావ్యనాయకుడు ధీరోదాత్తుడై ఉంటాడు.
5. వీర శృంగారశాంత రసాలలో నేదేని ఒకటి అంగరసంగాను, తక్కిన రసాలు అంగ రసాలుగాను నిర్వహించ బడుతాయి.
6. నాటకం నందువలె ముఖాది పంచ సంధులు మార్చబడతాయి.
7. ఆశీస్సు, నమస్కారం, వస్తు నిర్దేశం అనువానిలో నొకటితోను, మంగళ

8. దుర్జన (కవి) నింద, సజ్జనస్తుతి కావింపబడుతుంది.

1 "సర్గ బంధోఽ భినేయార్థం తదైవాఖ్యాయికా కథే అనిబద్ధంచ కావ్యాది తత్పునః పంచధోచ్యతే" భామహుడు-కావ్యాలంకారము-ప్రథమపరిచ్ఛేదము -16వ శ్లోకం.

శ్రీతో కావ్యమారంభింప బడుతుంది.

8. దుర్జన (కవి) నింద, సజ్జనస్తుతికావింప బడుతుంది.

9. నాతి విస్తరంగా, ఎనిమది కన్నెక్కువ సర్గల్లో కథ నడుపబడుతుంది.

10 ఒక సర్గలో ఒకే విధమైన వృత్తాలుండి, సర్గాంతంలో అన్యవృత్తాలుంటాయి. క్వచిత్తుగా నానా వృత్తమయాలైన సర్గలు కూడ ఉండవచ్చును.

11 సర్గాంతమున తర్వాతి రాబోవు సర్గ యొక్క కథా సూచన ఉంటుంది.

12 సందర్భోచితంగా, 18 నుండి 22 వరకు నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయాది వర్ణనలు, రసోపస్కారకంగా ఉంటాయి.

13 ధర్మార్థాది చతుర్విధ పురుషార్థాల్లో ఒకటి కావ్య ఫలంగా ఉంటుంది.

14 కవి పేరగాని, ఇతివృత్తం పేరగాని, నాయకుని పేరగాని, లేక ఇతరుని పేరగాని ఔచితీమంతంగా మహాకావ్యానికి నామం పేర్కొన బడుతుంది సర్గలో చెప్పబడిన కథకు తగిన నామం ఆ సర్గానికి ఉంటుంది,

15 రసభావాలంకృతితో, లోకరంజకత్వం కలిగించి, ఆనందోపదేశాలు సహృదయున కందించునట్లుగా ఉంటాయి. ఇట్టి లక్షణాలతో ఒప్పిన మహా కావ్యం కల్పాంతర స్థాయిగా ఆరాధింప బడుతుంది.1 ఈ విధమైన లక్షణాలతో సమన్వితమై మహాకావ్యం రచింపబడుతుంది.

---

1 "సర్గబంధో మహాకావ్యం తత్రైకో నాయకస్సురః
సద్వంశక్షత్రియోవాఽపి ధీరోదాత్తగుణాన్వితః
ఏక వంశభవాభూపాః కులజా బహవోఽ పివాఅదోజ్ఞాపిక.

శృంగార వీర శాంతానామేకో ఽం గిరస ఇష్యతే అంగాని సర్వేఽపి రసాః సర్వే నాటక సంధయః ఇతిహాసోద్భవం వృత్తమన్యద్వా సజ్జనాశ్రయమ్ చత్వార స్తస్య వర్గాః స్యుస్తేష్వేకంచ ఫలంభవేత్ ఆదౌ సమస్క్రియా శీర్వా వస్తునిర్దేశ ఏవవాక్య చిన్నిందా ఖలాదీనాం సతాంచ గుణకీర్తనమ్ ఏక వృత్తమయైః పద్యైరవసానేఽ న్య వృత్తకైః నాతి స్వల్పానాతి దీర్ఘాః సర్గా అష్టాధికా ఇహ నానా వృత్తమయః క్వాపి సర్గః కశ్చన దృశ్యతే సర్గాంతే భావి సర్గస్య కథాయాః సూచనం భవేత్ సంధ్యా సూర్యేందు

ఆ) "సర్గబంధో మహాకావ్యముచ్యతే - తస్యలక్షణమ్
ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవాపి తన్ముఖమ్..................
కావ్యం కల్పాంతర స్థాయి జాయతే సదలంకృతి
న్యూనమప్యత్రయైః కైశ్చిత్ అంగైః కావ్యంనదుష్యతి
యద్యుపాత్తేషుస పత్తిః ఆరాధయతి తద్విదః"
దండి - కావ్యాదర్శము-1-16-19.

విశ్వనాథాద్యాలంకారికులు చెప్పిన ఈ కావ్య లక్షణాలు రైతురామాయణంలో అన్వయించబడినాయి. కొన్ని యంగాలు సమన్వయింపబడకున్నను, అట్టి సందర్భాల్లో నవ్య కవితాలక్షణాలిందు లక్షింపబడినాయి. సామాజిక స్పృహతో, సంప్రదాయ సిద్ధంగా, నవ్య కవితా విలక్షణంగా, మిక్కిలి ఉపజ్ఞావిలసితంగా, రచింపబడింది రైతురామాయణం.

## రైతురామాయణం లక్ష్య లక్షణ సమన్వయం:-

"రైతురామాయణము తెల్గుజాతి యెంత
కాలముండునో తానంత కాలముండు
రైతు లేనిది భారతజాతి లేదు
జగ్గన కవీంద్రు కీరితి తగ్గబోదు"1.

ఆంధ్రప్రదేశ్ పూర్వపు ఆస్థానకవి, కళాప్రపూర్ణ డా॥ దాశరథి హార్దికంగా ఆచార్యులను, రైతురామాయణాన్ని కీర్తించిన గీతియిది. రైతు

రజనీ ప్రదోష ధ్వాంతవాసరాః సంభోగ విప్రలంభౌచ మునిస్వర్గ పురాధ్వరాః రణ ప్రయాణోపయమ మంత్ర పుత్రోదయాదయః వర్ణనీయాయథాయోగం సాంగోపాంగా అమీ ఇహకవేర్వృత్తస్యవా నామ్నా నాయక స్యేతర స్యవానామాస్య సర్గోపాదేయ కథయాసర్గ నామతు" సాహిత్య దర్పణము. 6వ పరిచ్ఛేదము 315-325 శ్లో- దండి కావ్యాదర్శము 1-16-19 విశ్వనాథుడు.

1 డా॥ దాశరథి-రైతురామ కథ-ప్రజా కావ్యసుధ, రైతురామాయణము X పుట.

రామాయణం తెలుగు జాతి ఎంతకాలము ఉండునో అంతకాలము ఉండునని అనుశాసించారు. 'క్షేమరక్షోవధార్థము సాగుముకృతి"1 అని శ్రీరాముడు ఆన తివ్వగా రచింపబడింది. రైతు జీవితగాథ రామాయణంతో సమన్వితి పొంది నిర్మింపబడింది. ఆది కావ్యాన్ని అచంచల భక్తి విశ్వాసాలతో అన్వయించు కొన్న ఆచార్యులు అంతటి భావ స్ఫూర్తితో కల్పాంతర స్థాయిగా మనగలిగే విధంగా మిక్కిలి ప్రత్యయంతో తమ ఈ కావ్యాన్ని వెలయించారు. అందుకే ఆస్థాన కవులిట్లాశంసించుట ఉత్తమమైన మహాకావ్యమే చిరకాలం సహృద-ములచే సమాదరింపబడుతుంది. ఆదికవి వాల్మీకి వివరించిన ఆదికావ్యం శ్రీమద్రామాయణం అది యుగ యుగాలవరకు నిలిచిన మహాకావ్యం అదొక మహాప్రబంధం "రామాయణము ఇతిహాసమనుటకన్నను ఆది కావ్యమును పేరనే మిక్కిలి ప్రసిద్ధమై యున్నది. ఇది అర్వాచీనులగు భాస కాళిదాసాదు లకు రసపోషణ విధానమును నేర్పినది రామాయణము ప్రబంధము కావున రామాయణము ప్రబంధములకు మార్గదర్శకమాయెను"2.

'రామాద్వర్తివత్ నతురావణాత్' రాముని వలె వర్తించుము. రావణుని వలె ప్రవర్తించరాదు" అను ధర్మోపదేశాన్ని యావన్మానవ జాతికందించింది శ్రీమద్రామాయణం. సీతా రామలక్ష్మణులు, హనుమత్సుగ్రీవాది పాత్రలు దైవీశక్తికి మహనీయ, మాననీయ, మానవీయ ప్రవృత్తికి ప్రతీకలైతే రావణ కుంభ కర్ణ శూర్పణఖాది రాక్షసనికాయాలు అసుర ప్రవృత్తికి తార్కాణాలు. అసుర ప్రవృత్తిని నిర్మూలించి, ధర్మాన్ని ప్రతిష్ఠాపించిన శ్రీరాముని విజయాన్ని గానంజేసిన మహా కావ్యం శ్రీమద్రామాయణం. ఇట్టి మహా కావ్యం భాసకాళిదాసాది మహా కవులకు మాత్రమే మార్గదర్శనం జేయలేదు, విశ్వాత్మను దర్శించిన ప్రతిభామూర్తులైన మహా కవులనెందరినో ప్రభావితం జేసింది.

దేశానికి వెన్నెముక, జాతి ప్రగతికి గతియైన రైతు యొక్క దైన్య విషాద గాథల్లోని బాధలకు, మూలకారణం ఐన, నిజాం జమీందారీ వ్యవస్థ లోని నిరంకుశత్వం, దోపిడీ రాక్షసత్వాల నుండి, కర్షకలోకానికి విముక్తి

1 రైతురామాయణము-స్వప్న సాక్షాత్కారము 30 పుట 6 పద్యం.

2 డా॥ పల్లా దుర్గయ్య ప్రబంధవాఙ్మయము పుట 98.

కలిగించాలనే లక్ష్యసాధనతో రైతురామాయణం రచింపబడింది. ఇందుకు తోడు, నాటి తెలంగాణ విముక్తి ఉద్యమం, రైతాంగ పోరాటం ఉద్యమాల్లోని ఉదాత్తమైన ఆశయాలు ఆచార్యులకు స్ఫూర్తి నిచ్చి ప్రభావితం జేశాయి. రామాయణ కథాస్మృతులతో. తదనుసరణ పాత్రలతో, కర్షకజీవన వృత్తాన్ని కావ్యంగా రచించారు ఆచార్యులు. ఇందు సీతా ఊర్మిళలు, రామలక్ష్మణులు, హనుమప్ప ధర్మారాట్ప్రభువులు (హనుమత్సుగ్రీవులు) ఉదాత్త పాత్రలు. జమీందారు పాపారావు (రావణుడు) సుందరమ్మ (శూర్పణఖ)లు రాక్షస వృత్తిగల పాత్రలు. కావ్యనాయకుడు రైతురామునిలో శ్రీరామున్ని దర్శింపజేసి, తరతరాల రాక్షస కిరాత చర్యలకు తావలమైనట్టి జమీందారీ ఫ్యూడల్ వ్యవస్థకు పాలకుడు జమీందారు పాపారావు అతనిపై శాంతి విప్లవ వీరుడు రైతురాముని విజయాల్ని సాధించిన గాధను కీర్తించింది రైతురామాయణం1 కావున ఇదొక రమణీయ కమనీయ కల్పిత మహాకావ్యం.

"నిరంకుశాః కవయః" అని ఆర్యోక్తి. మహాకవులు సమకాలీన భావ ప్రతినిధులు. ఏ కాలమునకా కాలమునందలి సమాజంలోని అనుస్యూతాలైన, అంశాలను స్వీకరించి, నాటి మౌళికత వాసిపోకుండ, తమకాలంనాటి పరిస్థితులకు అనుకూల్యంగానూ, అనుగుణ్యంగానూ అనువర్తింప జేస్తారు' పూర్వం నుండి సంక్రమించిన వానిని, ఉత్తర కాలీనాలతో సమన్వితం గావించుకొని, పూర్వ స్వరూపం నందు కొన్ని మార్పులు, చేర్పులు పొందింపజేసి, పురోగమన శీలంతో విస్తరింపజేసి, కావ్యరచనగావిస్తారు.2 ఇదే ఆశయస్ఫూర్తితో ఆచార్యులు "కాపు కావ్య వస్తువును" ఎన్నుకొని, రామాయణ కథా చాయలతో సామాజిక స్థితి గతులకు అద్దం పట్టుతూ, ధర్మవీర రస పరిపుష్టంగా, రైతురామాయణ మహాకావ్యాన్ని వినిర్మించారు.

---

1 డా॥ పల్లా దుర్గయ్య-ప్రబంధవాఙ్మయము-౧౭వ పుట.

2 "కవినా ప్రబంధము పనిబధ్నతా, సర్వాత్మనా
రసపరతంత్రేణ భవితవ్యం తత్రేతి వృత్తే
యది రసావను గుణాం స్థితిం పశ్యేత్తదేమాం భంక్త్వాపి
స్వతంత్రతయా రసానుగుణం కథాంతరముత్పాదయేత్"
ధ్వన్యాలోకము-బాలప్రియ-౩౩౬.

"కవి క్రాంత దర్శినః" అను అలంకారికోక్తికి ఆచార్యులు నిదర్శనం నాడు త్రేతాయుగాన ఆదికవి రాజారాముని (రామనృప చంద్రుని) పవిత్రమైన కథను గానం చేసి రామరాజ్యాన్ని స్థాపింప జేశాడు. యుగధర్మాన్ననుసరించి నేటి ప్రజాయుగంలో ఆచార్యులు కర్షక కుటుంబంలో రైతు రామున్ని అవతరింపజేసి కర్మభూమియగు భరతభూమిలో; శాంతి సౌభాగ్యాలకు అటపట్టగు కర్షక సామ్రాజ్యాన్ని ఊహించి, గ్రామరాజ్యాన్ని స్థాపించడానికి రైతురామాయణాన్ని రచించారు. ఇది అలంకారికులు పేర్కొన నిబద్ధకావ్యం.

## II. కావ్యంలో ప్రధానేతివృత్తం ఉత్పాద్య వస్తువు

"ప్రఖ్యాతోత్పాద్య మిశ్రమాల్లో1 ఉత్పాద్యానికి చెందినదై కవిస్వకపోల కల్పితమైన రైతురామునికథ అవిచ్ఛిన్నంగా, కథాసంవిధానంతో నిర్వహింపబడింది. ఈ కావ్యమందలి ప్రధానేతివృత్తం సమాజ స్పృహ కలిగి, అనిదం పూర్వంగా, రైతునాయకమైన నవ్యవస్తువుతో (కాపుజంట) భాషా నవ్యతతో (జాను తెలుగు) మార్గదేశి ఛంధొ వైవిధ్యంతో, నిర్వచనారామ శోభితమై శిల్పించబడింది. "కావ్యవస్తువు రస ప్రధానమై యుండవలెను, కాని అది ప్రఖ్యాతమా? ఉత్పాదమా? మిశ్రమా అనునది ముఖ్యం కాదు2 కావ్య వస్తువు రసోచితంగా ఉండడం సముచితం. రసానికనుగుణం కాని వానిని త్యజించి రసోచితమైన కథాకల్పనం జేసికోవచ్చును.3 కేవలం

---

1 ప్రఖ్యాతోత్పాద్య మిశ్రత్వ భేదాత్ తత్ త్రివిధం మతమ్. ఇతి-ఇతిహాస నిబంధనమ్ ప్రఖ్యాతమ్ కవి కల్పితముత్పాద్యం, సంకరాయత్త మిశ్రం చేతి ప్రతాపరుద్రీయమ్-నాటక ప్రకరణమ్-

2 "విభావాను భావ సంచార్యే చిత్య చారుణః
విధిః కథా శరీరస్య వృత్తస్యోత్ప్రేక్షితస్యచ
ఇతివృత్త కథాయాతాంత్యక్త్వాననుగుణాం
స్థితమ్. ఉత్ప్రేక్ష్యోప్యంతరాభీష్టరసోచిత కథోన్నయః
ధ్వన్యాలోకము-3-10-11.

3 "కథాశరీరముత్పాద్యవస్తుకార్యం తథాతథా
యథా రసమయం సర్వమేతత్ ప్రతిభాసతే
ధ్వన్యా-3-14 కా. వృత్తి-పరిశ్లో.

ఇతి వృత్తాన్ని నిర్వహించడమే కావ్యప్రయోజనం గాదు.1 అందుకే కవి తన స్వకపోల ప్రజ్ఞామనీషతో రైతుజీవితాన్ని రామాయణంతో అనుసంధించడం జరిగింది. వాల్మీకి రామాయణ గతమైన ఇతివృత్తంతో, కర్షకజీవన సంగతమైన కథావ్రణాళికతో, రైతు రామాయణం రసమయంగా రచింప బడింది. రామాయణము నందువలె సీతారాములు, ఊర్మిళాలక్ష్మణుల పాత్రలు ఈ కావ్యంలోనూ నిర్వహింప బడినాయి. అట్లే జమీందారు పాపారావు సుందరమ్మలు పాత్రలు రావణ శూర్పణఖలను పోలినవై యిందు పోషింపబడినాయి. రామాయణం నందువలెనే చెల్లెలు సుందరమ్మచే ప్రేరితుడై జమీందారుడు రైతురాముని పత్నిని సీతను నిర్బంధిస్తాడు. ధర్మారావుప్రభువు, హనుమప్పల (సుగ్రీవహనుమల పాత్రల వంటివారు) సాయంతో రైతురాముడు పోరాటంలో జమీందారుల్ని ఓడించి సీతను పరిగ్రహిస్తాడు. రైతునాయకుడుగ సమాదరింప బడుతాడు. శ్రీరామపురానికి పెద్ద రైతుగ గట్టం గట్టింపబడుతాడు. కవి కపోల కల్పితమైన కర్షక కుటుంబగాథ రైతురామాయణంలో ఉత్పాద్య కథావస్తువుగా చెలువొందింది. ఆచార్యుల కావ్యం మహాకావ్యత్వ సిద్ధిని పొందింది.

III ఇతిహాసోద్భవం గాని, సజ్జనాశ్రయం గాని ఇతరము కాని చెందిన ఇతివృత్తం కావ్యంలో నిర్వహించడమనేది మరొక కావ్య లక్షణం రైతురామాయణం శ్రీమద్రామాయణ కథాచాయనుబంధిత వర్ణ్య ప్రబంధకావ్యం. అనల్పకల్పనా చాతుర్యంతో రైతు జీవితగాథ ఇందు వర్ణింపబడింది. నవ్యకవితా ప్రక్రియతో, మహోద్యమ భావంతో వినిర్మింప బడిన కల్పిత ఇతివృత్తమహాకావ్యం రైతురామాయణం. ఆచార్య సుప్రసన్న నవ్యత కలిగిన కావ్య ప్రక్రియను యిట్లు వివరించారు.

"ఒక కావ్య ప్రక్రియ తత్పూర్వ ప్రక్రియను వదలి క్రొత్తదానిని స్వీకరించినపుడు, దానివల్ల కలిగే ప్రయోజనం ఆకర్షించగా, దానినాశ్రయించిన కవులే దానికి ఉద్యమ రూపం ఇస్తారు. ఒక్కొక్కప్పుడు ఒక

---

1 నహికవేరితి వృత్తమాత్ర నిర్వహణేన కించిత్ ప్రయోజనమ్
ఇతిహాసాదేవ తత్సిద్ధేః ధ్వన్యా 3-14 కా. వృత్తిలో

భావమో, ఒక ఇతివృత్తమో, ఒక తత్త్వమో, ఒక ప్రక్రియో ఉద్యమానికి మూలస్థానం ఆక్రమిస్తుంది. కాని ఒక ఉద్యమం సఫలం కావడం దానిని ఆశ్రయించినవారి కృతుల గౌరవాన్ని బట్టి ఉంటుంది.''1

రైతు జీవన సంగతమైన ఇతివృత్తం ఉత్పాద్య కథావస్తువుగా నిర్వహింపబడినను, ప్రఖ్యాతేతి వృత్త సమన్వితమైన శ్రీమద్రామాయణ కథకు అనుసరణీయమైన పాత్రలతో, తత్కథాను గుణమైన కథా ప్రయోజనంతో రసాత్మకంగా, రచనా శిల్పంతో రూపుదిద్దుకుంది, ఆచార్యులవారు రైతురామాయణ మహా కావ్యాన్ని ప్రతిభావంతంగా సర్వాంగ సుందరంగా సమాజానికి కర్తవ్యాన్ని ప్రబోధించే విధంగా తీర్చిదిద్దారు.

IV కావ్యనాయకుడు వేలుపుగాని, సుక్షత్రియుడు గాని ఉండవలెనని పేర్కొనబడింది. ఐతే రైతురాముడు సామాన్యమైన రైతు. నవ్యకావ్యాల్లో కర్షక, హరిజన గిరిజనాది క్రింది వర్ణాల వారిని కావ్యనాయకులుగా గ్రహించుట నవ్యతకు పరాకాష్ఠగా పరిగణింపబడిరది. కాగా, 'నాయకుని వేలుపనిగాని, క్షత్రియుడని గాని నిర్దేశింపక చతురోదాత్తనాయకుడు ఉండ వచ్చునన్నారు దండ్యాచార్యులు తమ కావ్యాదర్శనంలో2 అట్లే సాహిత్య దర్పణకారుడను 'అనుచితమైన దానిని వర్జించి, రసకృతికి నాయకుని కల్పించుకొనవచ్చునని3 పేర్కొన్నాడు ఈ విషయం నవ్యతను ప్రతిపాదిస్తున్నది డా॥ సి. నారాయణరెడ్డి కుల ప్రసక్తిలేని సామాన్యుని నాయకుని జేసిన నవ్య కావ్యాల గురించి యిట్లు తెలియజేశారు.

"మన ప్రాచీన కావ్యములలోని పాత్రలు ప్రాయికముగా దివ్యములు దివ్యాదివ్యములే. ఏ కొన్ని అదివ్య (మానవ) పాత్రలున్నను అవి అగ్ర వర్ణాలకు చెందినవే. బసవ పురాణాదులలో మడివాలు మాచయ్య వంటి

1 డా॥ సుప్రసన్న -సాహిత్యవివేచన 2 పుట.

2 "ఇతిహాస కథోద్భూతమితరద్వాసదాశ్రయం చతుర్వర్గ ఫలాయత్తం చతురోదాత్తనాయకమ్" -దండి కావ్యాదర్శము 14, 15 శ్లోకాలు.

3 'యత్స్యాదనుచితం వస్తునాయకస్య రసస్యవా విరుద్ధం తత్పరిత్యాజ్యమన్యథావా ప్రకల్పమేత్" విశ్వనాథుడు సాహిత్య దర్పణము 6- 60

శూద్ర పాత్రలున్నను, అవి భక్తి ప్రయోజనముగలవి. నవ్య కవిత్వములో క్రింది వర్ణములకు చెందిన పాత్రలు నాయికా నాయకులగుట గొప్పమార్పు ఎంకి పాటలు, వనకుమారి, లవణరాజుకల, మున్నగు వానిలో సామాన్య జనుల జీవితములే చిత్రింపబడినవి"1. రైతురామాయణంలో రైతురామున్ని కావ్య నాయకునిగా స్వీకరించుటలోనే అచార్యుల వారి అభ్యుదయ నవ్యతా భావాలు ప్రకాశమానమౌతున్నాయి. నిజంగా రైతు, జాతి మనుగడకు జీవగఱ్ఱ. సకల పరిశ్రమలకు మేలు కీలుచీల 'కోటి విద్దెన్ గుంటుకు కొంగ్రమించవట"2 అని యెంచి ఆచార్యులు కాపును, కాపులకు కాపగు విష్ణు దేవునితో సరితూచి పోల్చి రైతురామున్ని కావ్య నాయకుని జేశారు.3 పొలాలను హలాలతో దున్ని బంగారు పంటలు పండించే రైతు అన్నదాత. లోకసంతర్పి కృషి యజ్ఞాన్ని దీక్షతో నిర్వర్తించేవాడు. కరవురక్కసిని దునుమాడే ప్రగతి స్ఫూర్తి క్రియాటోపుడు. రైతురామునితో శ్రీరామ బల-రామ పరశురాములను దర్శించారు 4 అంతేగాదు రైతును త్రిమూర్తులుగా, సహస్రాక్షునిగా అభివర్ణించారు. ఈ విధంగా రైతురామునికి దివ్యత్వాన్ని ప్రసాదించారు. ఆచార్యుల వారి రచనలో సంప్రదాయం, అభ్యుదయన వ్యతాసరణులు, పడుగుపేకలవలె జిగి బిగిగా అల్లుకొన్నాయి. ధర్మవీరం అంగిత్వాన్ని పొంది రూపుదిద్దు కొంది.

కావ్య నాయకుడు రైతురాడు ధీరోదాత్తుడు, కాపు-రక్షకుడు - నేత-నాయకుడనగా "నయతి ప్రాప్నోతీతి వృత్తంఫలం వానాయకమ్"5 కావ్య ఫలాన్ని పొందేవాడు నాయకుడు. "కల్పిత ప్రబంధములందు నాయకుడు ప్రసిద్ధుడు గాని, కవి కల్పితుడు గాని కావచ్చును. నాయక వ్యవహారము మాత్రము కవి కల్పితమై యుండవలయునను"నది6 అలంకారి కుల మత

---

1 అధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు-ప్రయోగములు
డా॥ సి. నారాయణరెడ్డి నవ్య కవిత్వ లక్షణముల నవ్యత పుట 181.

2 రైతురామాయణం ఇష్టదేవతాస్తుతి 3 పుట 2వ పద్యం

3 " " 1 పుట 1వ పద్యం

4 రైతురామాయణం స్వప్నసాక్షాత్కారం 31 పుట 7 పద్యం

5 ఆంధ్ర నాట్యవేదము పుట 30

6 ప్రబంధ వాఙ్మయ వికాసము పుట 110 డా॥ పల్లా దుర్గయ్య

మని డా॥ పల్లా దుర్గయ్య సెలవిచ్చారు. అందులకే ఆచార్యులు కాపుమూర్తి లోన కాపు రాముని దివ్యమూర్తిఁ గనుచు కాపు రామాయణ కావ్యానికి శ్రీరామున్ని నాయకునిగా జేశారు.

"ముమ్మూర్తులలోన నాతఁడుఁ దా
ముమ్మూర్తులఁ బోలు దండి మొనగాడవుటన్
కమ్మని కవితకు నాయకుఁ
గమ్మని ప్రార్థింతు కర్షక ప్రభురామున్"1.

అని కర్షక ప్రభురామునికి కావ్యానాయకత్వాన్ని కట్టబెట్టారు. రైతు రామునితో ధీరోదత్త నాయకునకు ఉండవలసిన ఔజ్జ్వల్య ఔదార్యాది గుణాలన్ని మూర్తీభవించి ఉన్నాయి. అవిచ్ఛిన్నంగా కావ్య కథఅంతయూ రైతు రాముని ఆశ్రయించి ఉండుటచే రైతురామాయణం ఒక మహా కావ్య స్థానాన్ని అధివసించియుంది. ఇదే విషయాన్ని ఆచార్య రామకోటి శాస్త్రి యిట్లు తెలిపారు.

"నాయకుడు శ్రీరాముడు కనుక కథ యంతయు వానిని చుట్టుకొనియే యుండవలయును. కావ్యమునకు కావలసినది నాయకుని మనోధర్మము ననుసరించి, అది దాని కనుకూలమైన భావముల చేత తాడితమయ్యును స్థైర్యమును కోలుపోక బడుదొడుకులకు లోనయ్యును, తిరిగి నిలువద్రొక్కుకొనుచు ఎట్లు గమ్యము చేరుచున్నదో నిరూపించుట అనగా నాయకుని మనోవాక్కాయ కర్మ వలన ఉద్దిష్టార్థమును వ్యజ్యమానము చేయుట యందు శ్రద్ధ తీసుకొనిన కవి కర్మ కావ్యమగు చున్నది"1 రైతురామాయణ కావ్యమున రైతురాముడు శాంతి విప్లవ వీరుడు ఇతడు శ్రీరాముడైతే కావ్యప్రతినాయకుడు పాపారావు జమీందారు పాపాలపుట్టయైన రావణుడు. అతని అమానుష ఘోరకిరాతక రాక్షస కృత్యాలకు గురియై వేధింపబడిన గ్రామీణ ప్రజానీకానికి, విశేషించి రైతులకు రైతురాముడు అండగా నిలుస్తాడు. వారిలో శాంతి పూరిత వినూత్న విప్లవ చైతన్యాన్ని కలిగిస్తాడు. ఇప్పుల వాగుపై అనితర సాధ్యమైన అనకట్టను నిర్మింపజేసి నూతన సాగుబడి

1 రైతురామాయణము-స్వప్న సాక్షాత్కారము 32 పుట 6 పద్యాలు
2 తిక్కన కావ్యశిల్పము డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి 10 పుట

పద్ధతులతో పల్లెచేలను సస్యశ్యామలాలుగా మార్చుతాడు. కర్షక నాయకుడై అహర్నిశం పాటుపడి దోపిడీ వ్యవస్థ నుండి సస్యలక్ష్మిని కాపాడుతాడు. క్రాంతి చైతన్య ఉత్సాహాలను గ్రామోద్ధరణం గావిస్తాడు. జమీందారీ ఫ్యూడల్ వ్యవస్థా నిర్మూలనానికి ధర్మబద్ధంగా వీరోచితంగా పోరాడి ఉత్పన్న ధర్మాన్ని పునరుద్ధిస్తాడు. ఇట్టి ధీరోదాత్తుడైన రైతురాముడు కావ్యనాయకుడుగాగల రైతురామాయణం ఒక మహాకావ్యంగా పరివిల్లింది.

V కావ్యంలో వీర శృంగార శాంత రసాల్లో నేదేని ఒకటి అంగిగా వ్యవహరించబడి, తక్కుంగల రసాలు అంగాలుగా నుండవలెనని పేర్కొనబడింది. రైతురామాయణంలో అంగిరసంగా ధర్మాను ప్రాణితమైన వీర రసం సహృదయావర్జకంగా నిర్వహింపబడింది. కావ్యోద్దిష్టఫలం ఉత్పన్న ధర్మోద్ధరణం, గ్రామ పునరుద్ధరణం, జమీందారీ వ్యవస్థపై కర్షక శ్రామిక విజయం రైతురాముని నాయకత్వంలో ఇవి సాధింపబడి అనుభూయమానమైనాయి. కావున కావ్యం మొత్తంలో ధర్మ వీరరసం విరాడ్రూపం ధరించి విస్తరించి ఉంది. రైతు కుటుంబ కథా సంవిధానం గల పాత్రలు ఆలంబనాలుగా తక్కుంగల శృంగార కరుణాద్భుత రౌద్ర భయానక భీభత్స రసాలు, సందర్భ శుద్ధితో అంగ రసాలుగా పోషింవబడినాయి. ఇందు కావు సీతారాముల కళ్యాణఘట్టంలోను, ఊర్మిళాలక్ష్మణుల వివాహ ఘట్టంలోను శృంగార రసం విస్తారంగా పోషింపబడి కావ్యానికి వినూత్న శోభను చేకూర్చింది.2 శిశు శిక్షణ కాండాల్లో శాంత కరుణభక్తి రసాలు కళ్యాణ కాండలో శృంగారం, కృషికాండలో కరుణాద్భుత భయానకాలు, నిర్బంధ కాండలో కరుణాద్భుతాలు, విజయకాండలో రౌద్ర భీభత్స భయానకాలు తస్యమానాలై రసజ్ఞులను రంజింప జేశాయి. కావున రైతురామాయణం మహాకావ్యలక్షణ సమన్వితమైంద.

VI మహాకావ్యంలో నాటకం నందువలె ముఖాది పంచ సంధులుండా లనే లక్షణానికి లక్ష్యాత్మకంగా రైతురామాయణం ఒప్పియుంది. కావ్యోపక్రమ, కావ్యోప సంహారాలతో ఆద్యంతం కథానిర్వహణానికి పంచ సంధులు

1 పాత్ర చిత్రణంలో విపులంగా వివరించబడింది.

2 రస నిర్వహణంలో విపులంగా చర్చించబడింది.

ఉపకరించాయి. పంచావస్థలు, పంచ విధాలైన అర్థ ప్రకృతుల సంయోగం వల్ల క్రమంగా పంచ సంధులు కావ్యంలో నిర్వహించబడుతాయి. ఇట్టి ప్రణాళికతో ఇతి వృత్త మంతయు, క్రమ వికాసం పొంది, నాయక పరివేష్టితమై, నాయకాభ్యుదయాన్ని, లోక శ్రేయస్సును ఆర్జించి, కావ్య ప్రయోగం నెరవేర్పబడుతుంది.

పంచ విధావస్థలు + పంచ విధ అర్థప్రకృతులు = పంచసంధులు

1 ఆరంభ + బీజ = ముఖసంధి

2 యత్న + బిందు = ప్రతిముఖ సంధి

3 ప్రాప్త్యాశ + పతాక = గర్భసంధి

4 నియతాప్తి + ప్రకరీ = అవమర్శ సంధి

5 ఫలాగమము + కార్యము = నిర్వహణ సంధి

ఈ విధంగా సమీకృతమైన పంచ సంధులు రైతునాయకాశ్రయమైన రైతురామాయణము నందు,షట్కాండ పరివ్యాప్తమై,సోప పత్తికంగా నిర్వహింపబడినాయి.

శిశుకాండలో ముఖసంధి నిర్వహింపబడింది, ప్రతినాయకుడు జమీందారు పాపారావు మరియు గ్రామణుల యొక్క కుటిలు కుతంత్రాలకు ప్రజలు పీడింపబడుతారు. కావ్యనాయకుని తండ్రి సాగరయ్య ఎప్పటికప్పుడు వానిని కనిపెడుతూ పీడిత ప్రజలకు అండగా నిలుస్తాడు. అంతేగాదు జమీందారీ దోపిడీ వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రజల సహకారంతో శాంతియుతమైన క్రాంతి పోరాటాన్ని సాగిస్తాడు. జమీందారుని పాచికలు పారక పోవడంచే తోకముడుచుకొంటాడు. సాగరయ్య యొక్క ఈ క్రాంతి పోరాటం ప్రజల్లో బానిస భావవిముక్తికి అంకురార్పణం జేసింది. కావ్యంలో ఆరంభావస్థ వ్యవస్థీకృతమైంది. సాగరుని పత్నులు గంగ మంగమాంబలకు రామలక్ష్మణులు జన్మించారు. ఆ అపూర్వ సోదరులను, తమ వరాలుగా భావించి గ్రామ ప్రజలు మురిసిపోయారు. సాగరుని ధర్మపోరాటం అతనితోనే ఆగిపోకుండ అంతిమ విజయం సాధించడానికి, వారసులు రామలక్ష్మణులు అని తెలిసి పోవడంతో, జమీందారుని దౌష్ట్యంఅంతంగావడానికి,బీజవాహనం జరిగింది.

ఈ ఇట్టి వృత్తాంతతో ముఖసంధిశిశుకాండలో చక్కనికథా ప్రణాళికతో సాధింప బడింది.

శిక్షణ కాండాంతర్గతమైన కథ ప్రతిముఖ సంధికి ప్రతిబలకంగా సాగింది. రామలక్ష్మణులు గురువు వద్ద సకల విద్యలను అభ్యసించారు. రాజనీతి, సాముగరడీలల్లోను, కృషి సేద్య కర్మల్లోను, మంచి నైపుణ్యాన్ని సాధించారు. తండ్రి సాగరయ్య రంగరించి పోసిన చైతన్యంతో క్రాంతి మూర్తులుగా ఎదిగారు. అందువల్ల, రైతురాముడు, గ్రామాల్లో 'కాపు సంఘాలను' స్థాపించాడు. కర్షక శ్రామికులందర్ని సుసంఘటితం జేశారు. వారిలోని నిరక్షరాస్యతను, కుసంస్కారాన్ని రూపుమాపి శాంతి సమరవీరులుగా తీర్చిదిద్దాడు. సువ్యవస్థితమైన ప్రజాశక్తిని క్రాంతి పథంలో నడిపించాడు రైతురాముని ఈ క్రాంతి పోరాట యత్నం, బిందుప్రాయంగా విస్తరిల్లి పల్లెపల్లెకు ఎగబ్రాకింది. రామ లక్ష్మణుల గార్హస్థ్య జీవితం ఆదర్శప్రాయమై నిలిచింది. కర్షకాభ్యుదయాన్ని కోరి నిర్వహించే కార్యదీక్ష రైతురామున్ని ఎదురులేని ఏకైక నాయకునిగా నిల్పింది. దీనితో ప్రతిముఖ సంధి ప్రతిభావంతంగా కావ్యంలో పెలార్చబడింది.

కృషికాండలో గర్భసంధి చక్కగా సమీకరించబడి, ఇతివృత్త నిర్మాణ కౌశల్యాన్ని చాటుతుంది. వర్షాభావంచే శ్రీరామపురం ఆ పరిసర ప్రాంతాల్లో కరవు కాటకాలేర్పడినాయి. కూటికోసం ప్రజలు గ్రామాంతరాలకు వలస పోవడానికి ప్రయత్నించారు. కరవు కోరల్లో చిక్కిన రైతు సోదరులకు తనవద్దమున్న నిల్వ ధాన్యాన్ని దానం జేసి రక్షిస్తాడు. భూస్వాములు దొరలను రైతులను కాపాడండని వేడుకొంటాడు, జమీందారుడు, గ్రామ ముఖ్య ప్రభృతులు పరిహసించి హేళన జేస్తారు. రైతులను కాపాడడానికి ఎవరును ముందుకు రాలేక పోయారు. ఇట్టి విపత్కర పరిస్థితులకు విచలితుడైనాడు. ప్రజా సంఘటనకు, రైతు ఐక్యతలకు భంగంకలుగుతుందేమోనని శంకించాడు. తానాశించిన ధర్మపోరాటానికి విఘాతమెక్కడ ఏర్పడుతుందో వని సంశయించాడు, రైతురామున్ని కలచివేసిన ఈ సంఘటనం ప్రాప్త్యాశకు పరాకాష్ఠమైంది.

రైతురాముని వితరణ శీలం, త్యాగ గుణం, ఔదార్యం సంస్థానాధీ-శ్వరుడు ధర్మారాట్ప్రభువును ప్రభావితం జేశాయి. తత్ప్రేరణతో కరువు బాధితులను చేరదీసి రక్షించడం బాధ్యత అని దొరలకు భూస్వాములకు విశదీకరిస్తారు. రైతురాముని దయాదాన త్యాగగుణములను సంస్తుతిస్తారు. నిల్వ ధాన్యాన్ని దానంజేసి ధర్మోన్న సత్రాలను పెట్టిస్తాడు. రైతురాము నకు అండగానిల్చి అతని ఆశయసిద్ధికి పాటుపడుతాడు. అతని మహనీయ మాననీయ గుణాలను అందరకు వివరిస్తారు.

ధర్మారాట్ప్రప్రభువునుగాంచి దొరలు భూస్వాములకు పరివర్తనం కలిగింది రైతు విలువను గ్రహిస్తారు. వారందరు రైతుసోదరులకు ధాన్యం దానంజేస్తారు. ఇందు ధర్మారాట్ప్రభు వృత్తాంతం పతాకగా సంయోజించ బడింది. అటుపిమ్మట సమయోచితమైన ప్రజ్ఞతో రైతురాముడు కాపుకూలీల సహాయంతో ఇప్పలవాగుపై సేతు నిర్మాణం గావించి పల్లెసీమలను సస్య శ్యామలాలుగా మారుస్తాడు. ఈ కారణంచే పాపారావు జమీందారుకు రైతు రామునిపై ఈర్ష్యాసూయ ద్వేషాలు జనించాయి. తన మాటలు సాగక ఆశా-భంగమేర్పడడంతో కృషికాండంలో గర్భసంధి ప్రకృష్టంగా కూర్చబడి కావ్య కథను పరిపుష్టం జేసింది. అవమర్శ సంధి నిర్బంధకాండంలో నిర్వ హింపబడింది. జమీందారు పాపారావు సోదరి సుందరమ్మ విధవ. ఆమె కామవాంఛతో లక్షణుని పొందుకోరి సమీపిస్తుంది. రామలక్ష్మణులచే తిరస్కృతమై భంగపడుతుంది. వారిపై పగదీర్చుకొనే ప్రయత్నంతో రైతు రాముని ఇల్లాలు సీతను చెఱపట్టి పొందుమని ప్రేరేపిస్తుంది. జమీందారుడు సీతను నిర్బంధిస్తాడు గుండె కోల్పోడి దిగులుతో నున్న రైతురామునికి సేనాని హనుమప్ప వృద్ధస్త్రీ సాయంతో సీత క్షేమ వార్తను తెలిసికొని వచ్చి తెలియజేస్తాడు రైతురామునకు మనః స్థైర్యం కలిగి సీతను పరిగ్రహించ డానికి జమీందారుతో పోరాటానికి సిద్ధమౌతాడు. ఈ విధంగా నియతాప్తి యను కావ్యావస్థ నాయకున్ని ఫలోన్ముఖునిగా జేసింది. ఇందు వృద్ధస్త్రీ, సుందరమ్మ, హనుమప్పల వృత్తాంతాలు ప్రకరులుగా సమన్వయింపబడి అవమర్శసంధి సమర్థవంతంగా నిర్వహింపబడింది.

విజయకాండంలో నిర్వహణసంధి కూర్పబడిఉంది. సీతాపరిగ్రహణానికి

జమీందారుతో పోరాటానికి తలపడిన రైతురామునకు ధర్మారాట్ప్రభువు సమస్త సేనాబలంతో వచ్చి అండగా నిలుస్తాడు. హనుమప్ప సేనాధ్యక్షుడై సైన్యాన్ని నడిపిస్తాడు. రైతాంగమెల్ల రైతురామునకు సహకరిస్తుంది. రైతురాముడు జమీందారు పాపారావుతో పోరాటం సాగిస్తాడు. పోరాటంలో పాపి పాపారావు హతుడౌతాడు. చెఱవిడిపించి సీతను పరిగ్రహిస్తాడు. రైతురాముడు ధర్మారాట్ప్రభువు రైతురామున్ని శ్రీరామ పురానికి రైతునాయకునిగాజేసి, 100 ఎకరాల మాగాణిని ఇస్తారు. ఈ విజయంతో నాయకాభ్యుదయంజరిగి ఇష్టఫలాగమంతో నిర్వహణసంధి సహృదయావర్జకంగా కథను ప్రసన్నంజేసింది.

VII రైతురామాయణ కావ్యం మంగళశ్రీతో, విష్ణుస్తుతితో ఆరంభింపబడింది. ఇందు వస్తు నిర్దేశ్యం గావింపబడింది.

"శ్రీ భూగోకుల నిత్యసేవన శ్రీభాగ్యనిక్షేపు
ద్యోభక్తోన్నతి సత్కలాపుఁ గృషిమసజ్జోద్దీపు క్షామాసురీ
క్షోభానిర్హరణ ప్రతాపుఁ బ్రగతిస్ఫూర్తి క్రియాటోపు, స్వర్
భూభోగాలకుఁ గాపులకుఁ గాపున్ గాపుగాఁ గొల్చెదన్"[1]

అని విష్ణుదేవుని స్తుతించుటలో ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశాలు గావింపబడినాయి, ఈ పద్యంలో ఇష్టదైవాన్ని, కావ్యనాయకున్ని "సద్యోభక్తోన్నతి సత్కలాపుడు అనియు, కాపును కాపులకు కాపున్ కాపుగా గొల్చె-దన్" అనియు అనవద్య హృద్యశ్లేషతో స్తుతించటం జరిగింది. ఈ విధంగా రైతురామాయణంలోని కాపు కథా వస్తువును ధ్వనింపజేసి నిర్దేశించడం జరిగింది.

'నాంది మంగళాచరణం' నాలుగు పద్యాల్లో పార్వతీ పరమేశ్వరులను, వాణీ బ్రహ్మలను, సీతారాములను, పరమ శివున్ని వస్తు రసధ్వని విశేషాలతో స్తుతించడం వల్ల కావ్యం సలక్షణమై ఒప్పొచున్నది

VIII కావ్యంనందు ఆయా సందర్భాల్లో దుర్జననింద సజ్జనస్తుతి-

-గావింపబడవలెనన్న

1 రైతురామాయణము ఇష్ట దేవతాస్తుతి 1 పేజి 1 పద్యం.

లక్షణమున్నది. రైతురామాయణ మహాకావ్యం నందు నిజాం నిరంకుశ పాలనం, రజాకార్ల అవాంఛనీయ రాక్షస కిరాత చర్యలు, సుందరమ్మవంటి కామినుల కాముక ప్రవృత్తి, పరమలోభులు, అత్యాశాపరులైన వ్యక్తులను మధ్యదళాళీకోరు దోపిడీ దారు వ్యవస్థను, సందర్భోచితంగా కావ్యంలో నిందించడం జరిగింది.

భక్తి పారవశ్యంతో భగవన్నుతి గావింపబడింది. కవులను, ప్రజా కవివరేణ్యులను, కర్షక కార్మిక, శ్రామిక వర్గాలను, కృషికర్మ యొక్క శ్రేష్ఠత్వాన్ని, ధర్మారాట్ప్రభు ప్రభృతుల ధర్మాచరణగుణశీలాన్ని, స్తుతించడం జరిగింది. అట్లే భాత్రృ మాతృ పిత్రాదుల గూర్చి స్తుతి, వేదములు స్మృతుల పట్ల ఆదరం, సజ్జన ప్రశంస కావ్యంలో సమాధికంగా ఉంది. ఈ ప్రక్రియ కార్యప్రశస్తిని ఇనుమడింప జేసింది.

IX శ్రీమద్రామాయణ కథాసాదృశ్యంతో రైతు కుటుంబం జీవితం సర్వస్వం ప్రతిబింబించే విధంగా రైతురామాయణ కావ్యం రచింపబడింది కావున ఇందలి ఇతివృత్తం సర్గలు, ఆశ్వాసాలుగా గాక రామాయణంనందు వలె ఆరు కాండల్లో శిల్పించబడింది. అవి శిశు, శిక్షణ, కళ్యాణ, కృషి, నిర్బంధ, విజయ కాండములనునవి. ఈ మహాకావ్యంలో సుమారు మూడు వేల వరకు జాత్యుపజాతి వృత్త పద్యాలు ఉన్నాయి. వీనిలో గీతాలు, కందాలు, ఆటవెలదులు, ద్విపదలు అధికంగా రచింపబడి దేశి కవితా వైభవాన్ని చాటుతున్నాయి. కథా ఘట్టాలననుసరించి ఈ కావ్యంలోని కళ్యాణ కాండం నందు అత్యదికంగా 725 పద్యాలు, నిర్బంధ కాండంలో 622 పద్యాలు, శిశుకాండలో అతితక్కువ 125 పద్యాలు ఉన్నాయి.

X సంస్కృత కావ్యాల్లో ఒక సర్గకు ఒకే వృత్త పద్యరచన ముండడం లక్షణం, కాని తెలుగు కావ్యాల్లో నానా విధాలైన పద్యాలు వర్ణించడం పరిపాటై పోయింది. ఈ భావంతోనే ఈ కావ్యమందలి ప్రతికాండలో ఉత్పల చంపకాది వృత్త పద్యాలేకాక సీసకంద ద్విపకాది జాత్యుపజాతి పద్యాలు కూడ, రసోపస్కారకంగా రచింపబడ్డాయి. ఈ విషయంలో తెలుగు ప్రబంధ కావ్య లక్షణాలను పుణికి పుచ్చుకొన్నది రైతు రామాయణం.

XI రైతురామాయణం సర్గలుగా విభజింప బడలేదు. నవ్యతగళ ఇతి వృత్తంతో ఒప్పియున్నను, రామాయణాను సరణమైన కావ్యం గావున కాండాల్లోనే రైతుకథ నడిచింది. అందువల్ల ప్రతికాండం చివర తర్వాతి కాండంలో జరిగే కథ సూచింపబడింది.

సాగరయ్య గంగా వియోగంతో దుఃఖ సాగరంలో మునిగి జీవితంపై విముఖుడౌతాడు. గంగ చెల్లెలు మంగ అతని రెండవభార్య. అచంచలమైన ప్రేమాదర మర్యాదలతో సాగరయ్యను మామూలు మనిషిని జేసి మార్చి వేస్తుంది. ఆమె అతని జీవిత సర్వస్వ మౌతుంది. మిక్కిలి సహన స్నేహ శీలియై అతనిలోపుత్రాదులయెడ నిర్వర్తించాల్సిన బాధ్యతలను మేల్కొల్పు తుంది. ఈ విషయాన్ని సమర్థిస్తూ శిశుకాండం చివరలో "సతులు పతుల పాలి స్వర్యువతులు"1 అని చెప్పబడింది. అనగా ఉత్తమ సతులు పతులకు స్వర్గ సుఖాలనందించేవారేగాక, ఇంటికి దీపమై గార్హస్థ్య జీవిత ధర్మాలను నిర్వర్తించడానికి పతులకు తోడుగా నుండి జీవిత భాగస్వామినులుగా వ్యవ హరిస్తారన్నమాట. మంగమాంబ అట్టిది. ఈ వృత్తాంతాన్ని కాండం తుదిలో సూచించింప బడటంచే, తర్వాతి శిక్షణ కాండంలో మంగమాంబ సాగ రయ్యకు గంగలేని కొరతను దీర్చి, వారి కుటుంబ గౌరవాన్ని నిలబెట్టి, ఇలు దీర్చే ఇల్లాలుగా తన బాధ్యతలను నెరవేస్తుందని సూచించడం జరిగింది. అంతేగాక, గంగమాంబ కుమారుడన్న భేదభావం లేక రామున్ని మరియు లక్ష్మణున్ని సంపూర్ణమైన మాతృప్రేమతో పోషిస్తుందనియు, వారి పోష ణలో రామలక్ష్మణులు విద్యాబుద్ధులందు సుశిక్షితులు కాగలరు అను భావన కలిగింపజేస్తున్నది ఈ చివరి వాక్యం. తర్వాతి శిక్షణకాండం లోని కథ యును ఇట్లే సాగింది. తిరువేంగళ గురువువద్ద విద్యాబుద్ధులు గడించడం సాముగరడీల్లో, రాజకీయాంశాల్లో నైపుణ్యాన్ని సాధించడం, రామలక్ష్మ ణులు కృషి సేద్య కార్యకలాపాల్లో పరిపూర్ణ జ్ఞానాన్ని సంపాదించడం, రైతురాముని నేతృత్వంలో గ్రామ పునరుద్ధరణం, కర్షకాభ్యుదయం సాధిం చడం వంటికథ శిక్షణకాండంలో నిర్వహింపబడింది.

---

1 రైతురామాయణము - శిశుకాండం 22వ పుట-1వ పద్యం.

శిక్షణ కాండం చివరలో రైతురామ లక్ష్మణులు "ఎదిగిన జోడుగిత్తలుగా, ముచ్చట గొల్పుకొదుమ వయస్సు కుఱ్ఱలుగా, ముద్దుగొల్పెడి వారి యౌవన సౌందర్య రేఖా విలాసాలు వర్ణింపబడినాయి.1 ఈ విధంగా సూచించడం కౌమారాన్ని దాటి రంగాల్లో సుశిక్షితులై యౌవనంలో అడుగిడిన రామ లక్ష్మణులు 'గృహస్థాశ్రమ జీవితానికి అర్హులు" అను భావాన్ని స్ఫురింపజేస్తున్నది, తర్వాతి కళ్యాణకాండంలో వారి వివాహం మరియు గార్హస్థ్య జీవితాల్ని వర్ణించే కథా ఘట్టాల్ని సూచింపజేస్తున్నది. ఈప్రకారం కళ్యాణ కాండంలో సీతారాముల ప్రణయం, పరిణయం, మరియు ఊర్మిళా లక్ష్మణుల వివాహం వారి గార్హస్థ్య జీవితాలకు సంబంధించిన కథ సాగింది. ఇట్లే తక్కుంగల కాండాల్లోనూ భావి కథా సూచన గావింపబడి రైతురామాయణ కావ్యం కావ్య లక్షణాల్ని సంతరించుకొని విరాజిల్లింది.

XII కావ్యంలో సందర్భోచితంగా 18, 22 వర్ణనలుండాలి అను అంశానికి రైతురామాయణం లక్ష్యరూపంలో నిల్చిఉంది. శ్రీరామపురం పల్లెవర్ణనం, విప్రలంభశృంగార వర్ణనం, అంగాంగ శృంగార వర్ణణం, అశ్లీలంగాని శృంగారం, సీతారాముల ఊర్మిళా లక్ష్మణుల వివాహ వర్ణనరి పుత్రోదయ బారసాలల వర్ణనం, ఋతువర్ణనం, చంద్రోదయ, సూర్యోదయ ఉషఃకాల వెన్నెలల వర్ణనాలే గాక కథోచిత్యంగా మఱ్ఱిచెట్టు వర్ణనం, రథ సప్తమీ పండుగ, జాతర వర్ణనలు, తొలిరేయి వర్ణనం కృషిసేద్య కార్యకలాపాల వర్ణనం ఈ విధంగా పల్లె జీవితంలోని పలుఅంశాలు ఉపజ్ఞావిలసితంగా అభివర్ణింపబడినాయి. ఈ వర్ణనలు రైతురామాయణంలోని వస్తు ప్రాధాన్యతను, అందలి పాత్రల విశిష్ఠతను, ధర్మం యొక్క విశేషత్వాన్ని చాటుతూ, వస్త్వైకతకు ఉపరిస్తూ, రసోపస్కార కాలుగా కావ్యాన అందగింపబడి వర్ణింపబడినాయి.

XIII "ధర్మ, అర్థ, కామ, మోక్ష చతుర్విధ పురుషార్థాల్లో నొకటి కావ్య ఫలంగా ఉంటుంది" అనేది కావ్య లక్షణం.

సాగరమ్మ, రైతురాముడు, ధర్మారావ్ప్రభువు పాత్రల జీవన సంఘర్షణంలో వారి కార్య నిర్వహణంలో, ధర్మం ప్రతిపాదింపబడి సాధింపబడింది

1 రైతురామాయణము శిక్షణ కాండం 28 పుట-3; 4 పద్యాలు.

'ధర్మనీతి వర్తనులైన రైతుల కష్ట సాధనంలో, ఊర్జితార్జితంలో అర్థ ప్రాధాన్యత, నాయికానాయకుల అమలిన శృంగారోపేతమైన ఆదర్శ దాంపత్య జీవితంలో కామం సమధికంగా వ్యజ్యమానమైంది. ఇట్లు రైతు రామాయణం మానవ విలువలను, జీవితంలో నిర్వర్తించాల్సిన ధర్మాన్ని ప్రబోధించింది[1] రైతురాముని శాంతి విప్లవ పోరాటం జమీందారీ ఫ్యూడల్ వ్యవస్థకు అంతం పలికింది. కర్షకాభ్యుదయాన్ని సాధించి గ్రామరాజ్యాన్ని స్థాపించింది. ధర్మాన్ని ప్రతిష్ఠాపించింది. అర్థం, కామం సాధించడానికి ధర్మమే మూలమని నిరూపించింది. చతుర్విధ పురుషార్థాల్లో ధర్మసాధనం కావ్యఫలంగా రైతురామాయణం రచింపబడి ధర్మోపదేశం జేసింది.

XIV నామౌచిత్యం కావ్యానికి మరొక విశిష్ట లక్షణం. రైతు రామాయణం శ్రీమద్రామాయణ కథకు ఛాయామాత్రంగా, తత్పాత్రానుసరణ, కథౌచిత్య సంకలితంగా రచింపబడింది. సమకాలిక సామాజిక వాతావరణానికి అనుగుణ్యంగా, దేశానికి వెన్నెముక రైతు కుటుంబ జీవిత సర్వస్వం ప్రతిబింబించే విధంగా, కావ్యరచన సాగింది. రైతురాముని ధీరోదాత్తమైన ఇతి వృత్తంలో రామాయణోద్దిష్ట కావ్య ఫలం ప్రబోధింపబడి రచింపబడటం వల్ల ఈ కావ్యం రైతురామాయణమైంది.

ఈ కావ్యం కవికి గల కావ్య నిర్మాణ కౌశలాన్ని వేనోళ్ళచాటుతుంది ఈ కావ్యంలో రైతుల యొక్కయు, రైతునాయకుడు రాముని యొక్కయు అతన్ని అనుసరించి యున్న పాత్రల యొక్కయు జీవనక్రమ వికాస దశా విశేషాలు స్ఫురింపజేసే సన్నివేశాలున్నాయి. అందుచే యిందలి కథ ఆరు కాండాల్లొ విస్తృతమై ఉంది.

రైతు కుటుంబి సాగరునికి చిరకాలంగా పుత్రులు లేక ఇష్టదైవం యొక్క వరప్రసాదంతో శిశుజననమైంది. రామ లక్ష్మణుల శైశవం వర్ణింపబడింది. కావున మొదటి కాండం శిశు కాండం అను పేరు కలిగి ఉండడం సముచితం. రామ లక్ష్మణుల బాల్యం, విద్యాభ్యాసం, క్రమశిక్షణతో కూడిన కర్షక జీవితం వర్ణింపబడుటచే శిక్షణ కాండం, వారి వివాహం,

---

1 రైతురామాయణం - 'కావ్యోపదేశం' లో వివరించబడింది.

గార్హస్థ్య జీవితం గల కథతో కూడినది గాన కళ్యాణ కాండం, అనియు, రైతు జీవితం, వారి కష్ట సుఖాలు, పాడి పంటలు, కృషిక కార్యకలాపాలు వర్ణింపబడుటచే కృషి కాండం అని పిలువబడింది.

జమీందారుని దుష్టచేష్టలు, అరాచక పాలనం, మరియు సీత కామాతురుడైన జమీందారుచే నిర్బంధ కాండం అను పేర ఒప్పి యుంది-ఇక, సీతా పరిగ్రహణం కొంతకు, జమీందారునితో జరిగిన పోరాటంలో, ఆశయ సాధనలో రైతురాముడు విజయం సాధించాడు గావున చివరి కాండం విజయ కాండం అని పేరు కలిగి ఇందలి కాండములన్నియు ఒడుదొడుకులు లేని కథా గమనానికి మార్గ దర్శనం జేస్తూ, కావ్య కథను పఠితలకు సద్యః ప్రసన్నం చేస్తున్నాయి రైతువిశిష్టమైన జీవితం రామాయణ సంగతంగా చక్కని చిక్కని యోజనాలతో రచింపబడి రైతురామాయణ మహా కావ్యం నామౌచిత్యంతో ఒప్పారి ఉంది. ఈ కావ్యాన్ని నిర్మించిన ఆచార్యులు చరితార్థులు-ధన్యులు.

XV "ఆనందోపదేశాలను అందించి కల్పాంతరస్థాయి ఆరాధింపబడాలి" అనేది కావ్యం యొక్క ప్రముఖ్య లక్షణం పరమ లక్ష్యం.

రైతురామాయణం నానారసభావాలంకారాలతో అలరారుచున్న మహా కావ్యం. లోకరంజకత్వం కలిగించే, జీవితానుభవపు లోతుల్లోంచి తొంగి చూచే సంతోష విషాదాది సన్నివేశాలిందు బహుళ ప్రయోజనాన్ని సాధించే విధంగా రస హృదయులకు అనుభూయం గావిస్తాయి. తక్కుంగల రసాలే గాక ధర్మవీర మందు రస్యమానమై రసపరాకాష్ఠకు చేరింది. సందర్భోచితంగా, తత్త్వవేదాంత భక్తి శాస్త్ర సిద్ధాంతాలు, రైతు జీవనసంగతమైన విషయాలు, మానవ విలువలు, ఆదర్శ గృహస్థుని ధర్మాలు, చతుర్విధ పురుషార్థాలు, ఇతి వృత్తానికి తగిన పాత్రల ద్వారా రమ్యమైన సన్నివేశ కల్పనతో యావన్మానవజాతికి ఆనందోప దేశాలను అందించే మహా కావ్యంగా రైతురామాయణం రచింపబడింది.1 ఇట్టిది ఒక మహా కావ్యంగా కల్పాంతర స్థాయి వర్ధిల్లుతుంది. అని ప్రముఖ కవి పండిత పుంగవులు కొనియాడారు. ఆచార్యులను "ప్రజా కవిశేఖరులు", "రైతు వాల్మీకి", "రైతు కవి",

---

1 రైతురామాయణము-కావ్యోపదేశంలో వివరించబడింది.

"అభినవ పాల్కురికి" అని శ్లాఘించారు.1

---

1 డా॥ దాశరథి, పల్లా దుర్గయ్య, డా॥ వానమామలై వరదాచార్యులు, డా॥ సి. నారాయణరెడ్డి, కాళోజి, గోవిందవరం మురహరిశర్మ ప్రభృతి కవిపుంగవులు.



# రైతు రామాయణం

## తొలి జానపదాంధ్ర కావ్యం (జాను తెలుగుకావ్యం)

"ఏను గర్వింతు తెలుగు మాగాణమందు
తెలుగు మొలకనై పుట్టినందులకుఁ దెలుగు
వెలుగు నీడలఁ బెరిగి నందలకును తెలు
గమ్మ పదసేవ నోచికొన్నందులకును"1

"పోసెడి పోతయుం దెలుగు పుత్తడి పోతగఁ బల్లె తెల్గు క్రొ
మ్మూసలఁ బోసి తీసి వడబోసిన చొక్కపు జాను తెన్గుమేల్
బాసనుఁ గాపు కబ్బమును వ్రాసెదఁ గమ్మని సంస్కృతమ్ముపై
బాసగఁ దోడు సేయుదునుఁ బాలకుతోడటు కొంచె కొంచెమే"2

ఆచార్యులవారు తెలుగు మాగాణంలో పుట్టి పెరిగారు. తెలుగమ్మకు ఉచిత సేవలొనర్చే భాగ్యం లభించటం జన్మ జన్మాల పుణ్యంగా భావించారు. తమకెంతో గర్వకారణమని మురిసి పోయారు. తెలుగువారన్న, వారి భాషయన్న వారికెంతో యిష్టం.

జాతీయోద్యమ భావావేశంతో నున్న వీరికి తెలంగాణా విముక్తి ఉద్యమం స్ఫూర్తి నిచ్చింది. నిజాం నియంతృత్వ పాలనం, జమీందారీలోని వెట్టి చాకిరీ పీడనం వల్ల కర్షక శ్రామిక జనం పడేపాట్లు చూచి పరితపించి పరివేదనం చెందారు. విముక్తి పోరాటంలో స్వయంగా పాల్గొన్నారు మహాకవిగా, తమ వంతు కృషిగా శాంతి విప్లవ పోరాటానికి వత్తాసు పల్కుతూ "దున్నినవానిదే భూమి" "తెలంగాణం రైతాంగినికి చెందిండి" అని ఘోషిస్తూ కర్షకలోకపు కళ్యాణానికి, రైతురాముని విజయాన్ని గానం జేస్తూ రైతురామాయణ కావ్యాన్ని రచించారు.

ఆచార్యుల జీవితం కర్షక జీవనంతో, జానపద సాహిత్యంతో పెనవేసు

---

1 రైతు రామాయణము-ఆత్మ ప్రశంస-15వ పుట-6వ పద్యం

2 రైతురామాయణము-కృత్యవతారిక,
స్వప్న సాక్షాత్కారము-32వ పుట- 4వ పద్యం.

కొని పోయింది. పల్లె ప్రజల నోళ్ళల్లో జీవద్భాషగా బ్రతుకుతున్న తెలు గును క్రొమ్మూసలలో పోసి వడబోసీ కవితామయం జేశారు. జాతీయ నుడి కారాల సొంపును పుడికి పుచ్చుకున్న, చిక్కని జిగిబిగి గల జాను తెలుగు సకు పాలకు తోడటువలె తత్సమ రూపాన్ని ఉపయోగించారు. ఊహలో, పలుకుబడిలో, సంభాషణలో అచ్చమైన దేశిత్వాన్ని అన్వయించుకొన్నారు. విద్వత్త, నైతిక సత్య ప్రతిభలతో, విశాల మానవతా దృక్పథంతో రైతు రామాయణాన్ని "తొలి జానపదాంధ్ర మహాకావ్యంగా"వెలయించారు. ధర్మా నికి ప్రాణప్రతిష్ఠ గావించే సత్సం కల్పంతో ఆచార్యులు కృతకృత్యు లయ్యారు.

"ఇతి శ్రీ సద్గురు వర ప్రసాద కలిత లలిత మధుర మంజు జానప దాంధ్ర భాషాయోషా పహామృతాస్వాదన పరాయణ చిత్తుండు"1 నని కావ్య గద్యలో తెలియజేశారు. జానపదాంధ్ర భాషాంచితముగా కావ్యాన్ని వెలయించి తమ దేశీయాభిమానాన్ని, భాషాభిమానాన్ని, చాటుకొన్నారు. జాను తెనుగులో పల్లె జీవితాన్ని, కర్షక గాథను ప్రజల కొఱకు రచించారు.

తెలుగు సాహిత్యంలో 'జాను తెనుగు'నకు ప్రాచుర్యాన్ని కలిగించిన వాడు నన్నచోడుడు. ఈ కవిరాజు దేశ్యభిమానంతో కుమార సంభవం అను కావ్యాన్ని రచించాడు. ఈ కావ్యంలో కావ్య ప్రబంధ లక్షణాలనేగాక మార్గ దేశి కవితా లక్షణాలను కూడ తెలిపాడు.2 ఇదేకవి–

"సరళములుగాగ భావములు
జాను తెనుంగున నింపుతో బరిగొన వర్ణనల్"3

అని కుమార సంభవ కావ్యాన్ని జాను తెనుగులో రచించినట్లు తెలిపాడు. ఆంధ్రసాహితీ నందనవనాన జాను తెనుగు పారిజాతాన్ని పరిమళింపజేశాడు

---

1 "మునుమార్గ కవిత దేశం
బున వెలయగ దేశి కవితఁ బుట్టించి తెను
గునిలిపి రంధ్ర విషయం
బున జన చాళుక్యరాజు మొదలగు పల్వుర్"
కుమార సంభవం - నన్నచోడుడు.

2 కుమార సంభవం-నన్నచోడకవిరాజు

3 రైతురామాయణం-విజయకాండం – 45వ పుట చివరి పద్యం

నన్న చోడకవిరాజు ఆచార్య సి. నారాయణరెడ్డి జాను తెనుగు స్వభావాన్ని యిట్లు వివరించాడు.

" 'జాను' శబ్దమునకు అందము, సౌందర్యము అను అర్థములు (శబ్ద రత్నాకరము) 'జానుతెనుగు' అనగా అందమైన తెనుగు, ఇంపైన తెనుగు అని అర్థము. 'ఏది ఒకానొక దుర్బోధక విషయమును కూడ సామాన్య జను లకు సైతము సుబోధకముగా సుప్రసన్నముగా అందించునో అది జాను తెనుగు. దేశి శబ్దములను, జన వ్యవహారములో నలిగి పోయిన సంస్కృత శబ్దములను, సముచిత పరిణామములో మేళవించినప్పుడే తెనుగునకు 'జానుతనము' సిద్ధించును నిఘంటువులను మాత్రమే ఆశ్రయించి బ్రతి కెడు పదములను ప్రయోగించినచో ప్రజల కవి బోధపడదు. జనమండలికి సన్నిహితములైన సుందర సంస్కృత ఆంధ్ర శబ్దములనేర్చి కూర్చిన రచనారీతిని" 'జానుతెనుగ'ని నిర్ధారించవచ్చును.1 భావములువస్తుతః సరళ ములుగాక భావ ప్రకటనము సరళముగా నుండవలెను. భావ ప్రకటనము జన వ్యవహారమునకు సహోదరముగా నుండు భాష కావలెను. అదే 'జాను తెనుగు', "ఇంపుపెంపు గలతెనుగు" అని జాను తెనుగును నిర్వచించారు. జాను తెనుగనగా జన వ్యవహారంలోని సరళ భాష. "ప్రవాహినీ దేశ్యా" అని పండితోక్తి అప్పకవీయంలో యిట్లు చెప్పబడింది.

"నిజ దేశంబుల వేశభాషలపయిన్ని త్యాభిమానస్థులై
ప్రజ మెగ్చ న్రసలుబ్ధ బుద్ధులగుచుంబ్రాజ్ఞుల్
స్వదేశంబులే నిజమంచు గొని 2.............. ........

అని అప్పకవి దేశ్యభిమానాన్ని ప్రకటించుటయే గాక, స్వదేశీయుల అభిమానాన్ని చూరగొనే కావ్యాలే రచింపబడటం సముచితమైందని విశద పరచారు. జన వ్యవహారానికి సహోదరంగా నుండు భాష జానపదాంధ్ర జానుతెనుగు ఇట్టి ఇంపుపెంపుగల సరళ భాషలో రచింపబడిన కావ్యం చిర కాలం నిలుస్తుంది. అది నిత్యపల్లవశీలమై సాహితీ వసంతాలను తరతరాలకు అందిస్తుంది.

---

1 అధునికాంధ్ర కవిత్వము – సంప్రదాయములు – ప్రయోగములు – డా॥ సి. నారాయణరెడ్డి

2 అప్పకవీయం- 1 అశ్వా- 60 పద్యం అప్పకవి.

దేశ్యభిమానాన్ని జానుతెనుగును ప్రతిపాదించిన వారిలో నన్నెచోడు డు ఆద్యుడు ఆరాధ్యుడు ఐనను తన కావ్యాన్ని తత్సమ బాహుళ్యంగానే రచించాడు. మరొక కవి పాల్కురికి సోమనాథుడు. ఇతడు తెలుగు పలుకు బళ్ళకు, దేశానికి, జాను తెనుగునకు అగ్ర్యాత్మకంగా బసవ పురాణాన్ని, పండితారాధ్య చరిత్రము రచించాడు. ఈ కావ్యాలను ద్విపద ఛందస్సులో రచించి పండిత పామరులను రంజింపజేసి నవ్యతను చేకూర్చాడు.

"ఉరుతర గద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుతెనుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుట
కూర్చెద ద్విపదలు కోర్కిదైవార"1

"అరూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వ సామాన్యం బుఁ గామి
జాను తెనుగు విశేషము ప్రసన్నతకనియు
కూర్చెద ద్విపదలు కోర్కిదైవార"2

అని ఘంటా పథంగా చెప్పి జానుతెనుగు ద్విపద ఛందస్సులో రచించాడు. కాని బసవేశ్వరుని, ప డితారాధ్యుని జీవిత చరితలు భక్తిరస ప్రధానమైనట్టివి. కావున ప్రబంధ లక్షణాలిందుఁలేవు.

గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణం ప్రసిద్ధ దేశికావ్యం. ద్విపద ఛందస్సులో రచింపబడింది. స్వతంత్ర కావ్యమని పేర్కొనబడినను ఇది వాల్మీకిరామాయణానికి అనుసరణీయమే మొత్తంపై పాలకురికి, గోన బుద్ధారెడ్డి కవీశ్వరులిర్వురునూ దేశి కవితకు, జాను తెనుగునకును పునాదులు వేసినారనుటలో విప్రతిపత్తి లేదు.

శ్రీనాథుని క్రీడాభిరామం ఓరుగంటి సాంఘికజీవితాన్ని ప్రతిబింబింప జేసే కావ్యం. ఈ కావ్యం ప్రేమాభిరామం అను సంస్కృతవీధి కనుసరణీయ

1 బసవ పురాణము 118 పుట పాల్కురికి. (సి.నా.రె)

2 బసవ పురాణము 119 పుట పాల్కురికి. (సి.నా.రె)

మన్న వ్రివాదమున్నది. ఐననూ యిది ప్రబంధ కావ్యం కానేరదు, కవి సార్వభౌమునిదే మరొక ద్విపద కావ్యం పల్నాటి వీర చరిత్ర, ఇది వీరగాధను తెలిపే కథా కావ్యం, ప్రబంధ లక్షణాలు ఇందు పొందపరచ లేదు. కవి బ్రహ్మ తిక్కన "ఆంధ్రావళి యోదం బౌరయు" రీతి భారతాన్ని ఆంధ్రీకరించాడు నన్నచోడుడు ప్రతిపాదించిన "జానతెనుగు" సిద్ధాంతాన్ని పాటించాడు. దేశీయమైన తేటగీతులను, ఆట వెలదులను, కందములను బహుళంగా రచించి దేశ్యభిమానాన్ని చాటాడు. భవిష్యత్కవులకు మార్గదర్శకుడైనాడు. భారతంలో కావ్య లక్షణాలు చాటబడిననూ, సంస్కృతానికిది ఆంధ్రీకరణం అనుడం నిర్వివాదాంశం.

పాలవేకరి కదిరీపతి యొక్క కావ్యం శుక సప్తతి. ఇది సామెతలకు, తెలుగుపలుకుబళ్ళకు, సహజోక్తులకు, నిసర్గ వర్ణనలకు ప్రశస్తమైనట్టిది. కాని ఇదిఅనేక కథల సమాహారమైనట్టి కథాకావ్యం, అయ్యలరాజు నారాయణామాత్య ప్రణీతమైన హంసవింశతి, దేశీయమైన పలుకుబళ్ళ ఉనికిపట్టు, ఇదియును కథా కావ్యమే.

మరొక కథా కావ్యం సింహాసన ద్వాత్రింశిక. కొరవిగోపరాజు ఈ కావ్యంలో జానపదుల అచార వ్యవహారాల్ని, వివిధ వృత్తుల్ని, ఆహారవిహారాదుల్ని వర్ణించిననూ, ఇందు ప్రబంధ లక్షణాలు సమగ్రంగా లేవు. ఇక శ్రీకృష్ణదేవరాయులు రచించిన ఆముక్తమాల్యద ప్రసిద్ధమైన ప్రబంధ కావ్యం, కాని కేవలం విల్లుపుత్తూరు వర్ణన సందర్భంలో మాత్రమే జానపద చిత్రణం గావింపబడింది.

ప్రజాకవి వేమన, భాషలో భావంలో, శైలిలో అచ్చమైన తెలుగుదనాన్ని కల్గి ప్రజల భాషలో శతకాన్ని రచించాడు. సాంఘిక దురాచారాలు ఎత్తిచూపబడి, సంఘ సంస్కరణాభిలాషతో వ్రాయబడిన ఆటవెలది పద్యాలు జానపదుల రసనాగ్రాలపై నర్తిస్తాయి. వేమన శతకం ప్రబంధ కావ్యం కాజాలదు. రాణాప్రతాప సింహ చరిత్ర, శివ భారతం, సౌందరనందం, ఆంధ్ర పురాణం, బాపూజీ ఆత్మకథ అనునవి నవ్యాంధ్ర మహా కావ్యాలు.[1]

---

1 శ్రీ నరసింహదేవర ఉమామహేశ్వరశాస్త్రి నవ్యాంధ్ర పంచ కావ్య పరిశీలనము.

ఉమామహేశ్వర శాస్త్రి గారి "నవ్యాంధ్ర పంచ కావ్య పరిశీలనం" అను గ్రంథానికి దివాకర్ల వేంకటావధాని పీఠికవ్రాస్తూ.

"పై పంచకావ్యాలను నిర్మించిన కవులెల్లరును సంస్కృతాంధ్ర సారస్వర క్షీరాంభోధులను దచ్చి, తద్రసామృతము కడుపార గ్రోలి త్రేన్చి నవారే. ఈ కావ్యములు మార్గకవితలోను, రసపాత్ర పోషణములోను, ధారా శుద్ధి కలిగి రచింపబడిన వయ్యును, జానపదాంధ్ర భాషావిలసిత ములు గాక జానపదీయమైన వస్తువు నెన్నుకొన్నట్టివి గావనుటలో విప్రతి పత్తి లేదు"1 అని పేర్కొన్నారు. ఈ ప్రబంధాలు దేశభక్తికి, భక్తికి చరిత్ర ప్రసిద్ధికి ఆలవాలు. మహాత్ముల జీవిత చరిత్రలు ఇందు వర్ణింపబడినాయి. ఇవి జాతీయతను, దేశభక్తిని ప్రబోధించే కావ్యాలు.

అధునికాంధ్ర కవితా యుగంలో రాయప్రోలు, గురజాడ, నాయని మొదలగు అధునికాంధ్ర కవిశేఖరులు, సామాన్య జనుల వ్యవహారంలో నలిగి పోయిన పదాలను కావ్యాల్లో ప్రవేశపెట్టి, వానికి సరికొత్త గ్రాంధిక తను ప్రసాదించిపెట్టారు. జాన పదీనమైన వస్తువుల నెన్నుకొని రచించారు. దువ్వూరి రామిరెడ్డి "కృషీవలుడు' అను లఘు కావ్యం ప్రశస్తమైంది. ఈ కావ్యం పీఠికలో కట్టమంచివారిట్లున్నారు.

"కృషీవల జీవితమును ప్రధానాంశముగ గ్రహించిన తెలుగు గ్రంథ ములలో ఇదియే మొదటిది............... ఇందు గ్రామాంతర నివాసము' వ్యవసాయ వృత్తి ఇత్యాది ప్రకృతి సామాన్య జీవితములకును, మనుష్య స్వభావ ప్రవృత్తికిని వుండు సంబధము చూపబడి యున్నది"1. "కృషీ వలుడు" అను ఈ లఘు కావ్యం మహా ప్రబంధ కావ్యంగా రచింపబడలేదు.

ఇక తుమ్మలవారి 'పరిగపంట', గంగుల శాయిరెడ్డి 'కాపుబిడ్డ' అను నవి ఖండ కావ్యాలే. ముసలమ్మ మరణం, కష్టకమల, లవణరాజు కల, ఎంకి పాటలు మున్నగు వానిలో జానపదాంధ్ర భాష, జానుతెనుగు రచన

---

1 నవ్యాంధ్ర పంచ కావ్యపీఠిక - దివాకర్ల వేంకటావధాని.

2 సర్ కట్ట మంచిరామలింగారెడ్డి - ఉపోద్ఘాతము – 4 పేజి. కృషివలుడు – దువ్వూరి రాంరెడ్డి

కానవచ్చుచున్ననూ, ఈ కావ్యాలు లఘు, ఖండ కావ్యశ్రేణికి చెంది ఉన్నాయి.

ఖండ కావ్యాలనే ఈ అనిబద్ధ కావ్యాలు మహా కావ్యంలో ఒక కిరణం లాంటివి. పరమాణువంటివి.1 అని వామనుడు పేర్కొన్నారు, 'ముక్తకాలు రచించే కవులనేకంగా ఉన్నారు. లఘు కావ్యాలు చెప్పేవారు వందల కొలది ఉంటారు, కాని మహా ప్రబంధాలు రచించే కవులు ఒకరు – ఇద్దరే. మూడవవాడు కనిపించుట దుర్లభం"2 అని మహా కావ్య ప్రశస్తిని చాటి చెప్పాడు రాజశేఖరుడు. ఆచార్య సుప్రసన్న ఇదే విషయాన్ని ప్రతి పాదించారు.

"ముక్తకాలు, ఖండ కావ్యాలు కవి యొక్క కవితా శక్తిని ప్రతిభను స్వల్ప పరిధిలో ప్రకాశింపజేసేవి. పాఠకుని మనస్సులో ఒక తళుక్కును, ఒకగగుర్పాటును ఒక సూక్ష్మానుభవ తరంగాన్ని ప్రసరింప జేసేవి. 'మహా ప్రబంధం అంటే మహా కావ్యం' 'ఒక సమాజ నిర్మాణం ఒక మహా భావ పరిణాహం, సమగ్రమైన మానవ జీవన ప్రస్తారం వల్ల అనంత మనోవికార ముల ప్రదర్శించి వాటి క్రమ పరిణామాన్ని నిరూపించేది"3 రైతు రామా యణం మహా ప్రబంధం, మహా కావ్యం4. ఆచార్యులు గతకాలాన్ని స్మరించి, వర్తమానాన్ననుసరించి భవిష్యత్తును ఊహించి, కర్షక లోక పురోగమనాన్ని వారి విజయాల్ని కాంక్షించి రైతు రామాయణాన్ని వెలయించారు.

---

1 "నాఽనిబద్ధంచ కాస్త్యేక తేజః పరమాణువత్" –వామనుడు

2 "ముక్తకే కవయోఽనంతాః సంఘతే కవయః
శతమ్, మహా ప్రబంధేతు కవిరేకోద్వి దుర్లభాస్త్రమః"
రాజశేఖరుడు కావ్య మీమాంస దశమాధ్యాయం
కవి చర్యా - రాజ చర్యాచ పుట 133.

3 డా॥ సుప్రసన్న-సాహిత్య వివేచన పుట 15

a) రైతు రామాయణం - మహా ప్రబంధం

b) రైతు రామాయణం మహా కావ్యంలో విస్తృతంగా చర్చించబడింది.

సామెతలు, జాను తెనుగునకు ఉడుపులైన తేటతెనుగు పలుకుబళ్ళు బళ్ళ కెత్తింపబడినాయి. ఈ కావ్యంలో సహజోక్తులు, నిసర్గ వర్ణనలు, చమత్కారపు ఉక్తి వైచిత్రిలు, బహు విషయ వ్యాఖ్యానాలు, పల్లె ప్రజల జీవన ప్రస్తార విశేషాలు, అమోఘంగా కూర్చబడినాయి. జానపదీనమైన కృషీవల వస్తువుతో, తదనురూపమైన భావనతో, దేశ సాహిణిని వెలార్చె ఛందో వైవిధ్యంతో, వస్తు నిర్మాణ చాతుర్యంతో కథా కథన శిల్పంతో, అపురూపంగా నిర్మింపబడింది. ధర్మాను ప్రాణితమైన వీర రసస్ఫూర్తితో. నానా రసోల్లసితమై కర్షక శ్రామిక కార్మికుల అభ్యుదయం, ధర్మ విజయం కావ్య ఫలంగా లక్షింప బడినదై రైతురామాయణం రచింపబడింది. ఈ కావ్యం తెలుగు ప్రజల జీవన క్రమ పరిణామాలతో, తెలుగువారి ఆచార వ్యవహార సంస్కృతీ సంపత్తితో, గ్రామీణుల సుఖదుఃఖాలతో పెనవేసుకొని, స్పందింప జేసి కర్తవ్యాన్ని ప్రబోధిస్తుంది. కావున రైతురామాయణం "తొలి జానపథాంధ్ర మహా ప్రబంధకావ్యం" అని ప్రసిద్ధ కవిపండితులు ప్రశంసించారు.

I "పల్లె ప్రజల నోళ్ళలో జీవద్భాషగా బ్రతుకుచున్న కమ్మని జాను తెనుగునుడి కారపు సొంపును పుణికి పుచ్చుకున్నారు. అట్టి అమూల్య సంపదను వెచ్చించుచూ అనిదం పూర్వరీతిని ఒక సామాన్యులైన కాపు యువతీ యువకులను కావ్య నాయికా నాయకులుగా గ్రహించి మొట్టమొదటిసారిగా మహాకావ్యము రచించిన కీర్తి శ్రీ జగన్నాథాచార్యులదే"1 అని డా॥ పల్లా దుర్గయ్యగారు ప్రస్తుతించారు.

II "తమాషా ఏమిటంటే ఆ ప్రబంధ ప్రౌఢ గంధముతో పాటు తరళ తరళ జానపద పదాల ఘుమాయింపు లుండడం........... ... కాని మాండలికాలను బండ్ల కెత్తడం వీరి వినూత్న స్వరం తెలంగాణా గ్రామ జీవనం ఎన్నెన్ని అంచులు తీర్చుకున్నది. పల్లీయుల ప్రాకృతిక స్వచ్ఛత ఎన్ని మీగడలు పేర్చుకున్నది."2 అని డా॥ సి. నారాయణరెడ్డి వినుతించారు.

III "తెలంగాణా పల్లె ప్రాంతాల్లో నేటికి రైతుల నోళ్ళలో ఆడు

---

1 డా॥ పల్లా దుర్గయ్య-"తొలిపలుకు"-4వ పుట - రైతురామాయణం

2 రైతురామాయణం-"జాళువాపంట" - డా॥ సి. నారాయణరెడ్డి

తున్న జానుతెనుగు నుడికారపు సొంపులను, తన కావ్యంలో పొదిగి జగ్గన కవీంద్రుడు తన మహాకావ్యానికి ప్రత్యేకతను చేకూర్చారు.1 అని డా|| దాశరథి కీర్తించారు.

IV "ఇట్టి సంజీవమైన జాతీయపు నుడికారముల ఇంతగా వాడినకవి "నభూతో నభవిష్యతి"2 అని డా|| వానమామలై వరదాచార్యులు శ్లాఘించారు.

V "నవనవోన్మేషమగు ఈ జాను తెనుగుతోట నయనానందకరమగు చిత్రవిచిత్ర వర్ణ సంశోభితము"3 అని గోవిందరావు మురహరిశర్మ వ్యాఖ్యానించారు. తొలిజానపదాంధ్ర మహాప్రబంధ కావ్యాన్ని వినిర్మించటంచే ఆచార్యులు మహాకవివరేణ్యులుగా వాసికెక్కారు.

మహాకవి లక్షణ లక్ష్యాలను శేషేంద్ర స్పష్టంగా తెలిపారు.

"కాని మహాకవులు ఎవరైనా తీసుకోండి. ఎవరైతే ప్రజల్ని ప్రభావితుల్ని చేశారో, నాగరికతల్ని, సంస్కృతుల్ని సృష్టించారో, అలాంటి కవులు అందరూ వాళ్ళ కవిత్వాన్ని వర్తమాన భాషలోనే రాశారు. గతించిన శతాబ్దాల భాషలో వ్రాయలేదు. (తిక్కన సోమయాజి ఉదాహరణ) సూక్ష్మమేమంటే వాళ్ళ కవిత్వం కవిత్వం కోసం రాయలేదు. మనుషుల్ని మార్చాలని రాశారు. అంటే అది ఒక మహత్తర దార్శనికత్వం అన్నమాట"4 అనగా సమాజ శ్రేయస్సు కోరి రచించబడే ఉత్తమ కావ్యం అన్నమాట.

ఆచార్యులు వర్తమాన ప్రజల భాషలో రైతురామాయణాన్ని రచించి కర్షక సమాజ శ్రేయాన్ని కాంక్షించారు. ఈ జానపదాంధ్ర మహాకావ్యంలో సుమారు మూడువేల పద్యాలున్నాయి. వీనిలో 1070 గీతాలు,

---

1 రైతురామాయణం–"రైతు రామకథ–ప్రజాకావ్యసుధ" డా|| దాశరథి–7వ పుట

2 రైతురామాయణం–"రైతువాల్మీకి నా జోహార్లు"–డా|| వానమామలై

3 రైతురామాయణం–"ఆలోకనము" 1వ పుట– గోవిందవరపు మురహరిశర్మ

4 ఆధునిక కవుల మానిఫెస్టో- 103వ పుట గుంటూరు శేషేంద్రశర్మ

630 కంద పద్యాలు, 280 అటవెలదులు, 80 సీసపద్యాలు, సుదీర్ఘమైన ద్విపదలు వెరసి రెండు వేల పద్యాలు దేశి ఛందస్సులో రచింప బడినాయి. ఆచార్యుల దేశ్యభిమానం ప్రశంసనీయం. పల్లె ప్రజల నోళ్ళలోని జాను తెనుగు నుడికారాలు, జాతీయాలు పలుకు బళ్ళు, తేట తెనుగు పద బంధాలు, గ్రాంధికత కూర్చబడిన అన్య దేశ్యాలు ఈ మహా కావ్యంలో కోకొల్లలు. ఆచార్యరు తొలి జాను తెనుగు మహా ప్రబంధ కావ్యాన్ని రచించిన ప్రథ మాంధ్ర కవివరేణ్యులు. వీరి కవితా సేవ అనితరసాధ్యమైంది.

## నుడికారపు పలుకుబళ్లు:-

కొన్ని విడి విడి పదాలకున్న అర్థం కంటే వాని కలయికతో విభిన్నార్థ స్ఫూర్తి కలిగించే పద బంధాలను పలుకుబళ్ళంటారు1 ఇవే నుడికారాలు, జాతీయాలని వ్యవహరింప బడుతున్నాయి. రస భావస్ఫూర్తిని, శబార్థ చమత్కారాన్ని, ప్రస్ఫుటం జేస్తూ చదువరుల నాకర్షించే నుడికారపు పలుకు బళ్ళు ఈ మహా కావ్యం నిండా ఉన్నాయి. ఆచార్యులు నుడికారపు కడలిని పుడిసిలించిన అభినవ ఆగస్త్యుడు జీవనదాలుగా, రసాస్పదాలుగా నున్న ఈ పదాలు తెనుగును సజీవ భాషగా రూపుదిద్ది, కావ్య గౌరవాన్ని అతిశయింప జేస్తున్నాయి ఇవి కథకూ, పాత్రకూ, సన్నివేశానికీ, ప్రబల స్ఫోరకంగా ఉండి రస హృదయాల తలలూపింపజేస్తున్నాయి.

## 1. కొంగు బంగారమే:-

సాగరమ్య గ్రామీణ ప్రజాళికి కొంగు బంగారమే.2 కావ్య నాయకుని తండ్రి సాగరయ్య. అతడు ప్రజనొప్పిని సొంతపు నొప్పిగ ఎదదలంచి ధర్మపు హక్కులకై తలడ్డిడువాడు. ప్రజల యొక్క సమస్యలను తీరుస్తూ వారికి కొంగు బంగారమైనాడు. అనగా తడపు లేకుండా, తడుము కోకుండా కోరిన వెంటనే వారి బాధలను పోగొట్టి కాపాడేవాడన్న మాట. కొంగునగట్టు కొన్న బంగారాన్ని (ధనాన్ని) అప్పటికప్పుడే ముడివిప్పి దానం జేయ

1 చెలమచర్ల రంగాచార్యులు, ఆంధ్ర శబ్దరత్నాకరం తెలుగు- తెలుగు నిఘంటువు ద్వితీయ సంపుటం పుట 705.

2 రైతురామాయణం శిశు కాండం 1 పుట 4 పద్యం.

వచ్చును. సాగరుని దయాగుణాన్ని, శీల సంపదనూ ఒక మాటలో విశేషించి చూపుడమైనది. తండ్రి సాగరుని గుణగణాలను పుణికి పుచ్చుకొన్న రైతు రాముడు ప్రజానాయకుడై కావ్యనాయకుడుగా ప్రశంసలను పొందినాడు.

## 2. మేకవన్నె పులి:-

రైతురాముని గ్రామోద్ధరణాన్ని, శాంతియుత విప్లవ పోరాటాన్ని గురించి చార వర్గంతో ఎప్పటికప్పుడు తెలిసికొని దుష్ట జమీందారుడు అతని పైనున్న రోషావేషాన్ని ఆత్మలో మ్రింగుచు పైకి మిథ్యా సాధుత్వపు మేక వన్నె పులియై[1] మసలి యుండెను. మేక మాంసలుబ్ధకున్ని నమ్మి వధ్య శిలపై తలమోపి ఆహారమగును, కాన అమాయికమైంది. పులి భీకరంగా కనపడినదాన్ని వేటాడి తన్మాంసాన్ని భక్షించేది కాన క్రూరమైన స్వభావం గలది అని ఎవరునూ దాని చేరువకుపోరు. సాదుత్వంగల మేకవన్నెతో పులి యున్నచో మిక్కిలి ప్రమాదం. ఏలనన మేక గదాయని సమీపించినచో పులి లక్షణాలతో అది హానికలిగించును. లోకంలో కొందరు సాదువుగా ఉండి నమ్మించి మోసగించి హానిజేతురు, పెద్ద మనిషిలా చలామణియై లోకాన్ని వంచించెదరు.

దుష్ట జమీందారుడు అట్టివాడు. ఆదరించినట్లే ఆదరించును కాని పీక నొక్కేదాక ఎవరికి తెలియనివ్వని స్వభావం గలవాడు. రైతురాముని నట్లే మోసగించి సీతను నిర్బంధించాడు. ఈ విధంగా ఒకే ఒక్క పదంలో జమీందారు పాత్ర యొక్క స్వభావాన్ని తెలియపరచి కావ్య కథను భావింజేసినారు ఆచార్యులు.

## 3. పచ్చి కట్టె దివిటియై మండు:-

జమీందారు పాపారావు పేరు జెప్పిన మాత్రమున పచ్చి కట్టె దివిటియై మండును.[2] ఎండు కట్టెకు గుడ్డపీలికల దిండు గట్టి దానిపై నూనె పోసి అంటించిన అది దివిటీగ వెలుగును. కాని పచ్చి కట్టెకు నిప్పు అంటించిననూ తొందరగా అంటుకొనదు, కాలదు, వెలుగనేరదు. పచ్చికట్టె దివిటియై మండుట

1 రైతు రామాయణం శిక్షా కాండం 11 పుట 6 పద్యం.

2 రైతు రామాయణం నిర్బంధ కాండం 8 పుట 5 పద్యం.

సాధ్యం గానిది కాని అట్లగునని చెప్పుటచే ఆ జమీందారుడంతటి అగ్నిహోత్రింవంటి కోపంగలవాడు, కాలాంతకుడు, దుర్మార్గుడు, సాధ్యాసాధ్యాలు వాని కరస్థాలు అందుకే వాని చెంతకెవరూ సమీపించడు అని వ్యంగకంగా తెలిపి కావ్య కథలు వాని పాత్రకున్న ప్రాధాన్యతను, వాని వలని భావి విపర్యాసాన్ని వ్యక్తంజేయడం జరిగింది.

## 4. నిప్పువంటిది సుమీ:-

ప్రతినాయకుడు జమీందారు పాహారావు సైతురాముని పత్నిని సీతను నిర్బంధించడానికి పొన్నయసెట్టితో మంతనాలాడుతాడు. అట్టి దుష్ట ప్రయత్నం నుండి విరమింపజేయడానికి వానిని వలదని వారిస్తూ, ప్రపంచ మొక ఎత్తు, ఉత్తమ సతీజన్మమొక ఎత్తు, వారిని హింసించ రావణాదులు హతులైనారు. ఆ సీతాసతి కూడ నిప్పువంటిది సుమీ! అసాధ్వీ రత్నం యొక్క పొందు ఆశించిన వానికి అయువు మూడును అని హెచ్చరించాడు. నిప్పు సమస్తాన్ని తన శక్తిచే పవిత్రం జేస్తుంది. ముట్టుకొన్న వారిని దహించి బూడిదగావిస్తుంది. అట్లే కాపు సీతయు సతీత్వంచే నిప్పులా ప్రకాశించే శీలంగలది. ఆమె శీల భంగానికి ప్రయత్నించిన దహించివేయ బడతాడని హెచ్చరించటం జరిగింది, సీత యొక్క పాతివ్రత్యాన్ని, సతీత్వాన్ని, ప్రాశస్త్యాన్నే గాక జమీందారుడు రావణునివలె హతుడుకాగల డని సూచించడం జరిగి వస్తు, పాత్రల స్వరూపాన్ని ప్రత్యక్ష మానం జేయడమైంది. జమీందారుడు తన వినాశం కొఱకు సీతను నిర్బంధింప తలపెట్టాడని ధ్వనింపజేయబడింది.

## 5. కంచము మంచమ్మొకటిగ

కాపు రామ లక్ష్మణులు కంచము మంచమ్మొకటిగ[1] అణుపుణులు లేక పాలు చెక్కెరటులు కలసిమెలసి సోదర మైత్రితో పెరిగినారు. వారు ఒకే కంచంలో తిని, ఒకే మంచంలో నిదురించేవారు. అనగా ఆ అపూర్వ సోద

1 సైతురామాయణం నిర్బంధ కాండ 25 పుట 1 పద్యం.

2 సైతురామాయణం శిక్షణా కాండం 2 పుట 3 పద్యం.

రుల మనస్సులు, పనులు, మాటలు ఒకటేయై యున్నవన్న మాట. వారిలోని ఈ ఐక్యపేర్మిమభావాలే లక్ష్మణుడు గృహ, సేద్య కార్యాల్లో నిమగ్నమై యుండుటకు రాముడు రైతునాయకుడగుటకు దోషదపడినాయి. ఈ పలుకుబడి కవి కథా నిర్మాణ మార్మికతను తెలియజేస్తూ కథను ప్రసన్నంగావించే ఫణితికి పాఠకున్ని ఆయత్తున్ని జేయుచున్నది.

## 6. అలుకలు వరిగడ్డి మంటలు

రైతురాముని అలుకలు వరిగడ్డి మంటల లాంటివి.1 ఎవరి యెడను వ్యక్తిగత ద్వేషాలు లేనివాడు. పేదలకేమైన అపకారం జరిగినచో మండి పడతాడు. యమునిలా ఊుముతాడు కఱచినట్లు మాట వరకే గాని కడుపు నిండ వాత్సల్యంగల సుతిమెత్తని హృదయం కల ధర్మరాజతడు. వరిగడ్డి అంటుకొని రివ్వున మంటలెగసి వెంటనే చల్లారుతుంది. నిప్పు ఉండదు బూదిఅవుతుంది అట్లే రైతురాముని కోపం కూడ వెంటనే చల్లారుతుంది రైతు రాముని హృదయ స్వచ్ఛతనూ, సరళతనూ, నిష్కపట ప్రవృత్తినీ, ధర్మ నిరతినీ చాటుచున్నదీ నుడికారం.

ఈ విధంగా కావ్యంలో పలుకుబళ్లు కావ్య కథకు ఇంపును సొంపును నింపుచున్నాయి. కావ్యంలోని కొన్ని పలుకుబళ్లు ఉండేలట్టలు నడుము ప్రకటింప బొగ్గనాల బొగడ పలుకంటే వార్తే ముందు సిగపూవు వాడకుండ లేవిడిపాట బాడరు. నాలుక తెగిపోవునంతటి చిరులేదు. గుండె గాలమయ్యే వచ్చికరము బాబో! పామైకుట్టెడిన్ బట్ట గాల్చి పైనవేయు పాపి గుండెలో గుట్టలు గూతెను అలుకు ములుకు తేళ.

## సామెతలు

ఆ నోట ఈ నోట నలిగి ఎక్కువ వాడుకలో నున్న జనుల ఉక్తులు సామెతలుగా పరిగణించ వచ్చును.2 జన వ్యవహారంలో పదిగురి నోట నలిగిన మాటలకు కావ్యత్వాన్ని ప్రసాదించారు ఆచార్యులు. ఇవి రసభావ

---

1 రైతురామాయణం శిక్షణ కాండం 22 పుట 3 పద్యం.

2 తెలుగు సామెతలు పీఠిక పుట 2 & 3 సాహిత్య అకాడమి.

స్వార్తికి, పాత్రౌచితికి, సన్నివేశ వైచిత్రికి, దోహదకారులై విశిష్టార్థస్ఫోర కాలుగా కావ్యంలో అందగింపబడినాయి. (రైతురామాయణం తొలి జానపదాంధ్ర కావ్యంగా ప్రసిద్ధిగాంచింది) ఇది సాధారణంగా ఉపమా రూపం లోనూ, అర్థాంత వ్యాసంగానూ ఉండి కావ్య కథకు పుష్టిని కలిగిస్తూ, కథా గమనానికి చక్కని బాటలు వేసినాయి.

1. కోటి విద్దెలున్ గుంటుక కోండ్రమించవట, 2 కొంగు బంగార మట్లు, 3 పూల తెప్పలట్లు పొల్చి, 4 నిండు పుట్టివోలె, 5 చెట్టు కాయదించి పెట్టినట్లు, 6 తోడిమవీడి పండు దొరలినట్లు, 7 నీరును పోయడె నారు పోయువాడే, 8 గువ్వ పిట్ట వోలె, 9 చమురిగ్గుం దివ్వెలో తైలమట్లు, 10 ఆ కుంజాటు మొగ్గలట్లు, 11 పాలుపటువ గాపాడునట్లు, 12 అడవి గాచిన వెన్నెలతానె 13 గోర్చుట్టుపైన రోకలిగ, 14 బొట్టుపెట్టి పిల్చిన యట్లె, 15 మోట బొక్కాన రీతి, 16 సంతోషం సగం బలంగాదె? 17 గుతుపలవోలె, 18 సిడెముల వంటి, 19 నమ్మించుచు గొంతుగోమురకాలు, 20 నేల యీనినట్లు, 21 బంతి యెద్దునె మరు రీతి, 22 బొమ్మపై కుంపటి, 23 పూస గ్రుచ్చిన యట్లు, 24 రెక్కల మీది జీవితాలు, 25 వెన్నలోవెండ్రుకవలె, 26 కుత్తుకపై చురకత్తి యయ్యె, 27 బట్ట గాల్చిపైన వేయుపాపి, 28 పోగాలమునకె యీ చెట్టు బుద్ధి, 29 చిచ్చును కొంగున కట్టు కొందురె? 30 కన్నమున దొంగను తేలుకాటిచ్చువ్యాపారమై 31 మైతి పాల్ చక్కెరటుల, 32 రెండు రెండు కన్నులెమన్న రీతి 33 దిగమ్రింగె గుడిన్ గుడిలో నిలింగమున్, 34 ఎండుకు గొడుగురీతి. 35 ఎల్ల యేస్గెక్కినంత-ఇట్లెన్నో లోకోక్తులు, సూక్తులు కావ్యము నందు ప్రతిభాసించుచున్నాయి.



# తొలి తెలుగు రైతు కావ్యం

ఒకరిద్దరు తప్ప తెలుగు కవులందరు చక్రవర్తులనో, సామంత ప్రభువులనో, సిరిగలవారినో ఉదర పోషణార్థమై ఆశ్రయించినవారే. అందువల్ల కృతికర్తల అభీష్టాల మేరకు కావ్యాలు రచించారు. ప్రాయికంగా దివ్యాదివ్యులు బ్రాహ్మణులు, క్షత్రియులకే కావ్య నాయకత్వం పట్టం కట్టబడింది.

పోతన కవి మనుజేశ్వరాధములను నిరసించి ధిక్కరించాడు. వారొసగే పురములు, వాహనాలు, హొమ్ములను తిరస్కరించి, హాలిక జీవనాన్ని సాగించాడు. శ్రీమదాంధ్ర మహా భాగవతాన్ని జగద్ధితముగా రచించి తరించాడు. తరింపజేశాడు. అంతేగాక, "సత్కవులు హాలికులైననేమి" అని చాటి చెప్పిన మహనీయుడతడు. "కవివిశాల మానవతకు బాధ్యుడు. సమగ్ర మానవ జీవితానికి బాధ్యుడు"1 అనునాటి మహోన్నత భావంతో కవికీ, కావ్యానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండాలని ప్రతిపాదించిన ప్రగతివాది. కవితా వైతాళికుడు పోతన మహాకవి. కవులు హాలికులు కాలేకపోయిననూ, హాలిక జీవన సంగతమైన ఇతివృత్తాన్నైనా స్వీకరించి, సాహసించి, మహాకావ్యరచనకు కడంగిన మహాకవులు కూడ కానరారు. కష్టజీవుల కథావస్తు వైవిధ్యంతో రచింపబడిన మహాకావ్యాలు లేవు. ఈ ఇరవయ్యో శతాబ్దంలో "కృషీవలుడు" వంటివి కొన్ని వెలువడినను అవి మహాకావ్యాలు కావు. కర్షకుల, కాపుకూలీల హృదయాంతరాళాల్లోని దేవిపోతనలను, వారి చేతన యందలి త్రవ్విపోతలను, గుర్తించిన వారు లేకపోయారు. ఆచార్యులు కవి పండితులేగాక స్వయంగా కృషీవల జీవితాన్ని గడిపినవారు. రైతుల దైనందిన జీవితాల్లోని, మిక్కిలి దైన్యమైన వ్యధలను, వేదనామయమైన ఆర్తిని ప్రత్యక్షంగా జూచి ఆర్ద్ర చిత్తులైనారు. రైతుయొక్క వ్యథాకలిత గాథలను ఆకళింపునకు దెచ్చుకొన్నారు. "ఉత్తమ సంస్కారం గల హృదయమే ఉదాత్త భావన చేయగలదు. నైతికంగా నిష్కళంక జీవనం గడిపినవాడే వ్యంగ్యంగా నైనను సరే లోకానికి సందేశమందించ

1 గుంటూరు శేషేంద్రశర్మ-కవిసేన మానిఫెస్టో 19వ పుట

డానికి సమర్థుడగును."2 హృదయ సంస్కారం గల ఆచార్యులు హాలికు డైన భక్తకవి శిఖామణి పోతన గడిపిన హాలిక జీవితానికి, తన స్వప్న ప్రబోధానికి స్ఫూర్తిని పొందారు. ఇష్టదైవం శ్రీరామచంద్రమూర్తి స్వప్నంలో సాక్షాత్కరించి ధన సంపదల కాశపడక కాపురాము కథలను కావ్యంగా రచింపుమని ఆజ్ఞాపించారు. అంతేగాక, కాపు కావ్యానికి తానే నాయకుడుగా నుండుటకు అంగీకరించి అనుగ్రహించారు. ఈ విధంగా, దైవానుగ్రహంతో రైతురామాయణ మహాకావ్యాన్ని రచించారు. ఈకావ్యం రచించడానికి తాము పొందిన సామాజిక ప్రేరణలను, అనుభూతులను ఆచార్యులిట్లు స్పష్టం జేశారు.

"పల్లెలలోని రైతుకూలీల దైన్యజీవిత విషాద గాథలలోని బాధలు నా హృదయమును తమ వైపుకాకర్షించుకొన్నవి. ఒక ఉత్తమ కావ్యము ను వ్రాయుమన్నవి. నా హృదయం కాదనలేకపోయింది. పల్లెటూరి రైతురాముడు సామాన్యవ్యక్తి. అతని గాథ సామాన్యగాథ, అయినప్పుడు కథానాయకత్వమున కుండదగిన ఉదాత్తత లేదుగదా యని యాత్మ శంకించింది. చివర కీవిషయంలో మనస్సే గెల్చుకున్నది. పల్లె జీవితాలను చక్కగా అధ్యయనం జేసినది. భాష సమకూర్చు కొన్నది. తెగువ చేసి రైతురామాయణమును వ్రాయపూనుకొన్నది. వాగ్దేవి కరుణా ప్రసారము తోడుపడ్డది. అభిజ్ఞుల ప్రోత్సాహ వాక్యములు దోహదములై వెలసినవి"2 ఈ విధంగా ఆచార్యులవారు పరిశ్రమించి కర్షక నాయకమైన రైతు రామాయణాన్ని తెలుగులో తొలి రైతు మహాకావ్యంగా రచించారు. ఈ సందర్భంలో పల్లీజన కృషీవల విషయికమైన రచనలు, దోహదపడిన సాహిత్య ప్రక్రియలు, కర్షక కావ్య నిర్మాణ ఆవశ్యకతను గురించి చర్చించటం సమంజసం.

కాల్పనిక కవిత్వంలో (Romantic Poetry) ప్రకృతి ప్రీతి, ప్రకృత్యారాధనం, అనేవి ముఖ్య లక్షణాలు3 వర్డ్స్‌వర్తు మహాకవి విశ్వా

---

1 ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు డా॥ సి. నారాయణరెడ్డి - పుట - 53.

2 రైతురామాయణము-మున్నుడి కృత్యాద్యవస్థ- వ పుట.

3 ఆధునికాంధ్ర కవితాసమీక్ష-ఆచార్య కొర్ల వేంకటరామనరసింహకవి పుట -40.

కును, మానవాత్మకును ప్రకృతియే స్వర్ణహేతువని విశ్వసించాడు1 కావున ఈ మహాకవి ఆంగ్ల సాహిత్యమందు, ప్రకృత్యారాధనాతాదాత్మ్యంతో అనేక గ్రంధాలు రచించి తర్వాత కవులకు మార్గదర్శకుడయ్యాడు. ఏతత్ప్రభావంతో ప్రకృత్యుపాసనాత్మకమైన, ఖండ కావ్యాలనేకంగా వెలసినాయి. క్రమంగా కవుల యొక్క భావరేఖ పల్లియ ప్రకృతిని, జానపదీన జీవన సరళిని, ప్రకాశమానం జేస్తూ వాస్తవిక చిత్రణానికి ప్రాధాన్య మిచ్చింది. నిసర్గ రమణీయమైన పల్లె పట్టుల్లోని సహజ సౌందర్య ప్రకృతి, పశుపక్ష్యాదులు, నదీనదాలు, జానపదుల పండుగలు, వేడుకలు, ఆచార వ్యవహారాలు మొదలగు అంశాలు రచనల్లో ప్రధాన పాత్ర వహించాయి. విభిన్న మానసిక ప్రవృత్తులు ప్రకృతితో సమన్వయింపబడి, భావ పుష్టిని ప్రపంచించె రచనలు విరివిగా వెలువరింప బడినాయి. "కాల్పనిక కవుల కాచార్యులన దగిన రాయప్రోలు వారు ప్రకృత్యారాధనతో పాటు, సామాన్య జీవితగాధలను ఇతి వృత్తంగా గ్రహించి, రచనకుపక్రమించారు. తృణకంకణం కష్టకమల, స్నేహలత, రూపనవనీతం, పేర్కొన దగినవి."2 ముఖ్యంగా వీరు, మధ్యతరగతి బ్రాహ్మణుల జీవితాలను వస్తువుగా గ్రహించి వస్తునవ్యతకు ఉతన్న పీఠం వేశారు. "నవ్యాంధ్ర యుగకర్త గురజాడ అతి నవ్యులకు ఆచార్యులు. వీరు వర్డ్స్వర్తు యెడల అచంచల గురుభావం గలవారు. అతనివలె తెలుగున వస్తు నవ్యతను సృష్టించారు. సామాన్యుల జీవిత ఘట్టాలనే కథా వస్తువుగా స్వీకరించారు3 ప్రజాభాషలో ప్రజల కొఱకు రచన సాగించారు.

"The Principal object, them proposed in these poems, was to Chcose incidents and situations from Common life and to relate or describe them throughout as per as possible in Selection of language really used by men and at same time to throwover them a certain colouring or imagination where by ordinary things should be presented to the mind In an usual aspect"2 వర్డ్స్ వర్తు అభిప్రాయాలకు అనుగుణంగా గురజాడ "ముత్యాల సరాలు" అనే ఖండకావ్యాన్ని

1 ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు
డా|| సి. నారాయణరెడ్డి – 422వ పుట

2 ఆచార్య కాకర్ల వేంకట రామనరసింహకవి ఆధునికాంధ్ర కవితా సమీక్ష – పుట 185

3 Preface to lyrical ballads-by werds worth

రచించారు. భాషా నవ్యత, ఛందో నవ్యతలను స్థాపించి తదనంతర కవులకు ఆదర్శమయ్యారు.

కవి చక్రవర్తి గుఱ్ఱం జాషువా ఒక్కజిక్కిన అస్పృశ్యుని కావ్య నాయకునిగా జేసి విప్లవాత్మకమైన వస్తునవ్యతతో, "గబ్బిలం" కావ్యాన్ని సందేశాత్మకంగా రచించారు. ఇట్లే కాపువారు, పడవ నడుపువారు, గొల్లవారు అస్పృశ్యులు మొదలగు కావ్య పాత్రలతో, నిమ్న వర్ణాలవారి బ్రతుకుదెరువులకు, కావ్య గౌరవమివ్వబడి అనేక కావ్యాలు అవతరించాయి. ఇంగ్లీషు కాల్పనిక కవిత్వ సంప్రదాయాలు నవ్యాతి నవ్యంగా అధునికాంధ్ర కవిత్వాన్ని ప్రభావితం జేశాయి.

## పల్లీ జనకవిత్వం (Pastrel Poetry)

నవ్యాంధ్ర యుగంలో పల్లెజన కవితావృక్షం శాఖోపశాఖలై, విస్తరించడానికి ఇంగ్లీషు కాల్పనిక కవితాశాఖ Pastral Poetry ప్రభావం ఉందనడం నిర్వివాదాంశం" స్థూలంగా 'పాస్టొరల్ పోయమ్స్' అంటే "గోపకావ్యము" లనవచ్చునని అండ్రశేషగిరిరావు గారు నిర్వచించారు.

పాశ్చాత్య భాషలలో పల్లెపనుల వారి సహజ జీవితానికి ముగ్ధులై నాగరికులైన కవులు వారి స్వభావాలను వర్ణిస్తూ అనేక కావ్యాలు రచించారు "క్రీస్తు పూర్వం 280లో Partoral Monologue ను రచించిన థియోక్రిటస్ [Theocritul] అను సిసిలీకవి ఈ కవితా ప్రక్రియకు అధ్యక్షుడు Pastorel Monologue పద్ధతి గ్రీకు రోము మొదలగు పాశ్చాత్య దేశాలకు విస్తరింపబడింది"2 ]Virgil] వర్జిల్ అను గ్రీకు కవి వ్రాసిన రెక్లాగ్ [Rclogue] అనునది Pastorel Poetry లో మకుటాయమానమైనట్టిది ప్రణయ కవితలో ప్రముఖులైన కవులు పెట్రార్క్, డాంటీ, స్పెన్సర్ మొదలగు కవులు Pastoral Poems అను వెలయించారు. ఇంగ్లీషులో

---

1 డా॥ సి. నారాయణరెడ్డి ఆధునికాంధ్ర కవిత్వం, సంప్రదాయములు, ప్రయోగములు పుట 437.

2 డా॥ సి. నారాయణరెడ్డి ఆధునికాంధ్ర కవిత్వం, సంప్రదాయములు, ప్రయోగములు పుట 437.

స్పెన్సర్‌తో ఈ ప్రక్రియ ప్రారంభమైంది. ఇతని "Shepherd's Calonder", సిడీ ఆర్కేడియా [Arcadia] ఎలన్‌రామ్సే వ్రాసిన "Gentle Shepherd" అనే కావ్యాలు వరుసగా వెలువడ్డాయి.1

"కాల్పనికోద్యమంలో ప్రణయతత్త్వము, దేశభక్తి, భక్తితత్త్వము, పల్లీ జనకవిత్వం పాశ్చాత్య భాషల్లోనేగాక తెలుగు సాహిత్యంలో కూడా అనేక విధాలుగా ప్రాచుర్యం పొందింది.2

ప్రాచీన సాహిత్యంలో గోప కావ్యాలు ప్రత్యేకంగా లేకున్నను పల్లె పట్టుల వర్ణనలు ఛాయ మాత్రంగా కన్పిస్తాయి. ఇట్టివి పోతన భాగవతంలో ఎఱ్ఱన ఉత్తర హరి వంశంలో, జయదేవ గీతగోవిందంలో కూడా చూడ వచ్చు, శ్రీకృష్ణుని బాల్య క్రీడలు, గోపకులతో చల్దు లారగించుట, బృందా వన జీవితం, గోపగోపికా సంచారాలు, గోపికాన్వేషణ వృత్తాంతాలు, మొదల గునవి మనోహరంగా వర్ణింపబడినాయి.

ఆధునికాంధ్ర కవిత్వంలో దువ్వూరి రామిరెడ్డి గారి "వనకుమారి" అనేది గొల్లవారు జీవించిన విధానాన్ని వర్ణించే కావ్యం. కవి కొండలవెంకట రావు గారు ఆలకాపరి నుండి అంట్లుతోమే దాసి వరకు కవితా వస్తువులుగా ఎన్నుకొని కావ్యాలు రచించారు. వీరి "రక్తకుల్యగాధ" వడవలాగు సరం-గుల జీవితాలను వర్ణించే కావ్యం. ఇందు ముఖ్యంగా సామాన్య మానవుల వృత్తుల వారి మాన్యభావాలను పలు ఖండికలలో ప్రకటించారు. ఇట్లే దువ్వూరి వారి "ముసలి మాలెత" బాపిరాజు గారి గోధూళి" రెంటాల గోపాల కృష్ణ "పల్లకీ బోయీలపాట" ఎన్నదగినవి. సంప్రదాయ సరణిలోను, జానపద గీతాల్లోను, పల్లీయులభాషలోను, శిష్ట వ్యవహారికంగా వర్ణింపబడిన ఈ శ్రేణికి చెందిన రచనలన్నియును లఘు ఖండ కావ్య రూపాలలో ప్రకటితమైనవే.

---

1 డా॥ సి నా.రె. ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు, ప్రయోగములు పుట 437.

2 ఆచార్య కాకర్ల వేంకటరామ నరసింహ కవి ఆధునికాంధ్ర కవితా సమీక్ష పుట 41.

సత్యం, అహింస అనే ఆయుధాలతో శాంతి సమరం సాగించిన గాంధీజీ ''Back to Villages'' "పల్లెటూళ్ళకు తరలండి" అనే నినాదాంతో యావద్భారత ప్రజలకు పిలుపునిచ్చారు. నగరాలలో కేంద్రీకృతమైన సాంఘిక వ్యవస్థ పల్లెటూళ్ళల్లో వేళ్లూని వదిల పడవలెనని ప్రకటించారు. భారతదేశానికి "పల్లెటూళ్లు గుండెకాయ" వంటివని గుర్తించినప్పుడే దేశాభ్యుదయం కలుగుతుందని ఎలుగెత్తిచాటారు.1 గాంధీమహాత్ముని ప్రవచనాలు పలువురి కవులనాకర్షించాయి. ఆధునిక కవులు పల్లెవాసులేకావడం మూలాన పల్లెప్రజల బ్రతుకుల్లో గాఢమైన పరిచయ స్నేహాలు ఏర్పరచుకొన్నారు. ప్రజాభాషలో పల్లీయుల జీవిత గాథల్ని, గ్రహించి రచనలను కొనసాగించారు.

## కర్షక జీవన చిత్రణం గల కావ్యాలు:-

అధిక శాతం పల్లెజనులకు వ్యవసాయమే జీవనాధారం. పల్లీయులలో కర్షకులే ప్రధానమైనవారు. కర్షక జనజీవితాన్ని నిర్ఝరసారవేగంతో కవి కోకిల దువ్వూరి రామిరెడ్డి గారు వర్ణించారు. వీరు 1919లో "కృషీవలుడు" అనే కావ్యాన్ని ప్రచురించి కర్షక వాఙ్మయ వికాసానికి బాటలు వేశారు. ఈ కావ్యానికి ఉపోద్ఘాతం వ్రాస్తూ సర్ కట్టమంచి రామలింగారెడ్డి ఈ విధంగా పేర్కొన్నారు, "కృషీవలుల జీవితమును ప్రధానాంశముగ గ్రహించిన తెలుగు గ్రంథములలో ఇదియే మొదటిది. ........ఇందు గ్రామాంతర వాసము, వ్యవసాయ వృత్తి ఇత్యాది ప్రకృతి సామీప్య జీవితములకును, మనుష్య స్వభావ ప్రవృత్తికిని, వుండు సంబంధము చూపబడియున్నది"1

దువ్వూరి వారు స్వయంగా కర్షకులు కావుననే కృషీవల జీవితాన్ని యథాతథంగా స్వభావోక్తి రమ్యంగా చిత్రింపగలిగారు. ఈ కావ్యంలో కాపుటిల్లాండ్ర దైనందిన చర్యలు, జానపదుల జీవిత విశేషాలు, వారి మనో ధర్మాలు, ఋతువులతో సమన్వయింపబడి వర్ణింపబడినాయి. పొద్దు-పొడిచినదాదిగా ప్రొద్దు గ్రుంకు వరకు పొలాలలో కష్టించే రైతు యొక్క

1 "గాంధీజీ సమాజవాదం" లో వివరించబడింది.

2 కృషీవలుడు–ఉపోద్ఘాతము -1 పే. 4 పుట సర్ C.R. రెడ్డి.

హృదయ కళిక నిర్మలమైంది. ఉండి తిన్నను లేక పస్తున్నను గాని పరుల కష్టార్జితానికి ఆసపడని, ఈసు చెందని కర్షకుని హృదయ సంస్కారాన్ని వర్ణించారు. అంతేగాదు—

"సైరికా నీవు భారతక్ష్మా
తలాత్మ గౌరవ పవిత్ర మూర్తివి
శూరమణివి, ధారుణీ పతిపాలన దండ
మెపుడు నీ హలంబు కన్నను ప్రార్థనీయమగునె"

"ధారుణీ పతి పాలన దండం కన్న రైతు హలం మిన్న" యని కాపు రక్షకత్వాన్ని శ్లాఘించి ఘంటా పథంగా చాటి చెప్పారు.1 "ఉత్తయాసల కన్న మేలుద్యమంబ"ని కృషీవల వృత్తినిర్వహణాన్ని ఉద్యమ స్ఫూర్తితో నిర్వహించాలన్న ధర్మాన్ని కావ్యోపదేశంగా ప్రబోధించారు."

"ఈ కృతి పరిమాణమున చిన్నదయ్యును గుణమున నానాసౌభాగ్య శోభితముగా నున్నది. ఈ గ్రంథమునుఁ జదువఁ జదువ ఏ రీతి యిన్ని యంశములను ఇన్ని కొద్ది పుటలలో నిక్షేపించినాడు అని ఆశ్చర్యము దాల్పని వారుండరు"2 అని కట్టమంచివారు కృషీవల కావ్య ప్రశస్తి గావించారు.

దువ్వూరివారి "కృషీవలుడు" రమణీయమైన లఘుకావ్యం ఇందు మొత్తం 130 పద్యాలు హృద్యంగా వర్ణింప బడినాయి. ఒక్కొక్క పదలీ ముత్యం హాలిక జీవన చిత్రణానికి కలికితురాయి. ఇది ప్రబంధకావ్యం గాక పోయిననూ, తెలుగు సాహిత్యంలో కర్షక జీవితాన్ని చిత్రించినట్టి మొదటి లఘుకావ్యం. తర్వాతి కవులకు దువ్వూరి మార్గదర్శకుడైనాడనుటలో అతిశయోక్తి లేదు.

పింగళి కాటూరి కవుల "తొలకరి" సైరికుని ప్రాశస్త్యాన్ని తెలిపే ఖండకావ్యం. తొలకరిలో ముగ్ధ మనోహర కన్యకాజని సౌందర్యం, వర్ణింప బడింది. "సంక్రాంతి ఖండికలో తెలుగు దేశపు పల్లెలలోన ప్రకృతి సౌందరలీ

1 దువ్వూరి – కృషీవలుడు–19వ పుట–1వ పద్యం

2 కట్టమంచివారి కృషీవలుడు–ఉపోద్ఘాతము

మును కన్నులకు గట్టినట్లు చిత్రించియున్నారు. చలిగాలి చురుకుదనము, కుప్పల నూర్చుచు గొంతులెత్తి పదములు పాడు కాపుల కంఠరవము, పూవులతో నిండిన చేల సోయగము, ఎఱ్ఱని మెరుగులీను పండ్లు గల మిరపతోటలో విరుగ బూచిన ముద్దబంతి పూల సొగసుదనము సాతాను జియరు పాటల కమ్మదనము, ముద్దులొలుకు గొబ్బెమ్మలు, పల్లెజన జీవితమంతయు యథాతథముగా వర్ణించి యున్నారు" పింగళి కాటూరి కవుల దేశాభిమానం అనిర్వచనీయమైంది.

తుమ్మల సీతారామమూర్తి గారి "పరిగపంట" "పెద్దకాపు" ఖండ కావ్యాల్లో జానపద జీవిత మాధుర్యం, హృదయంగమంగా వివరింపబడింది. గంగుల శాయిరెడ్డి కాపుబిడ్డ, ఏటుకూరి నర్సయ్యగారి "క్షేత్రలక్ష్మి"లలో కర్షక జీవితం చిత్రించబడింది. విశ్వనాధ వారి ఋతుసంహారంలో "పంటకాపు" జీవితం నందలి కొన్ని ఘట్టాలు వర్ణింప బడినాయి. 1932-1933లో కొండవీటి వేంకటకవిగారు "కర్షకా" అను మకుటంతో కర్షకుని వేదనామయ జీవితాన్ని శతక రూపంలో వర్ణించారు.1

అభినవ పోతన వానమామలై వరదాచార్యులు "రైతురాజు" గేయ నాటికను రచించారు. "మాకు పాడిపంట లొసంగి భారతావని నేల, రావోయి ఓ రైతురాజా" అని రైతును ఆహ్వానించారు. వీరి మరొక గేయకావ్యం విప్రలబ్ధ. ఇది "నవ్య కవితా విరాగమానమైన గేయకావ్యం. ఇది కథాత్మకమై 54 గేయాలతో విలసిల్లుచున్నది. జానపదమై, 'రాముడు లక్ష్మియను తెలుగునాటి కర్షక దంపతుల సాంఘిదీకేతి వృత్తము గలదై కర్షక జీవన చిత్రణము కావించుచు వారి ప్రణయమును పూర్వరాగమును, విప్రలంభము ను పోషించుచున్నది."2 ఆచార్యులు ఈ లఘుగేయ కావ్యంలో రైతు దైనందిన కార్యకలాపాలను, వర్షాది వర్ణనలను యథార్థంగా చిత్రించారు.

1 ఆచార్య కాకర్ల వేంకటరామ నరసింహకవి
ఆధునికాంధ్ర కవితాసమీక్ష-168వ పుట

2 ఆధునికాంధ్ర కవితాసమీక్ష-ఆచార్య కాకర్ల వారి గ్రంథం ఉపకరించింది

3 డా॥ అందె వెంకటరాజం-వానమామలై వరదాచార్యుల కృతులు అనుశీలనము-233వ పుట

ఈ విధంగా ఆంధ్రమున కర్షకవస్తు ప్రధానమైనవి ఖండకావ్యాలు కొన్ని మాత్రమే రచింపబడినాయి.

శ్రీమాన్ వానమామలై జగన్నాథాచార్యులు ప్రజలదైన భాషలో జాను తెనుగు భాషా నవ్యతతో, రైతురామాయణ మహా ప్రబంధ కావ్యాన్ని రచించారు. ఈ కావ్యం వస్తువులో, భావంలో, రచనలో అచ్చమైన దేశిత్వాన్ని, స్వచ్ఛమైన తెలుగుదనాన్ని పుణికిపుచ్చుకున్నది.

డా॥ సి. నారాయణరెడ్డి ఇట్లు అభిప్రాయపడినారు. "రైతుకథ పేరుతో జగన్నాథాచార్యులు గారు జాతీయాల పాతరలు, నుడికారాల ముత్యాలు, శ్లిష్ట వర్ణనల సువర్ణ సంపుటాలు ఆవిష్కరించారు— —ఈ కావ్యం పఠనీయం రసైక హృదయ ధ్యేయం"1 అని శ్లాఘించారు.

డా॥ పల్లాదుర్గయ్యగారు

"అనిదం పూర్వ రీతిని ఒక సామాన్యులైన కాపుయువతీ యువకులను కావ్యనాయికా నాయకులుగా గ్రహించి మొట్టమొదటి సారిగా మహాకావ్యము రచించిన కీర్తి శ్రీ జగన్నాథాచార్యులదే"2 అని రైతురామాయణానికి తొలి పలుకులు వ్రాస్తూ చెప్పిన మాటలు అక్షర సత్యాలు. ఈ కావ్యం యొక్క నాయికా నాయకులు కాపు సీతారాములు. తెలుగు రైతుబిడ్డలు. పుట్టి పెరిగి విహరించినది తెలుగునేలలు. వీరి జీవితాల్లోని సుఖదుఃఖాలు, వివాహ బార సాలలు, మొదలగు కాపు బ్రతుకు సన్నివేశ ఘట్టాలన్నియు తెలుగు సంప్రదాయాన్ని పుణికిపుచ్చుకున్నట్టివి.

"మడి వైభవానికి పాటుపడ్డ కాపు రామన్న శైశవము, శిక్షణ, కళ్యాణ, కృషి, నిర్బంధ దానిపై అతడు సాధించిన విజయగానమే జగ్గన్న పాడిన రైతురామాయణం "జైకిసాన్ నినాదముల కన్న మిన్నే"3 అని కాళోజి పేర్కొన్నట్లుగా రైతు కుటుంబ జీవితం సాక్షాత్కరింపజేయబడింది.

---

1 డా॥ సి. నారాయణరెడ్డి– "జాలువా పంట" రైతురామాయణం 1, 2 పుటలు

2 డా॥ పల్లా దుర్గయ్య. తొలిపలుకు – రైతురామాయణ–7వ పుట

3 కాళోజి–నా అభిప్రాయం – పేజి రైతురామాయణం

ఈ కావ్యంలో "జగ్గన్న ప్రజాకవివరేణ్యుడు. ప్రాచీన పద్ధతిని కావ్యం రచించి అర్వాచీనులను అలరించిన సవ్యసాచి ఈ కవీంద్రుడు. రైతు రామాయణ మహాకావ్య పఠన పాఠనము లొనర్చిన వారి హృదయాలలో జ్ఞాన తేజం ప్రసారము జరుగక మానదు"1 అని డా॥ దాశరథి రైతు రామాయణాన్ని ప్రజాకావ్యసుధగా అభివర్ణించారు. ఎందుకంటే ఈ కావ్య మందలి నాయికానాయకుల యొక్క సమగ్ర జీవన ప్రస్తారం సమకాలీన సాంఘిక రాజకీయ పరిస్థితులతో ముడిపడి సాగింది. నిరంకుశ నిజాం పాలనా దుర్వ్యవస్థను, జమీందారీ ఫ్యూడల్ అరాచకత్వాన్ని ప్రజా ప్రతి ఘటనతో ఎదిరించి పోరాడి విజయాన్ని సాధించినట్టి ఇతి వృత్తం గలది రైతురామాయణ కావ్యం.

రైతురాముని కథ రామాయణ కథకు అనురసణీయంగా సాగింది రైతు రామాయణం ఏ దేశమైన తలదాల్చ దగిన గ్రంధమన్ని శ్రీమాన్ వరదా చార్యుల వారు ఈ కావ్యకర్తను రైతువాల్మీకిగా అభివర్ణించారు.1 కృషీవల జాతుల గాధలు కథానాయక కోటిలోన జేరవు, వీరు కృతికి ఉదాత్త నాయ కులు లేరు, అని భావించి సభ్య బుధ సమాజం నవ్విపోతుంది అనునట్టి సందేహం కలిగింది ఆచార్యులకు. కాని కర్షక ప్రాధాన్యమైన ఈ ఇతి వృత్తాన్నే ఉదాత్తంగా సంభావింపజేసి రస హృదయములను ఆనంద పర వశుల జేశారు అందేకాదు కర్షక శ్రామిక శక్తి ప్రాశస్త్యాన్ని లోకానికి చాటారు. ప్రముఖ కవి పండితులను మెప్పించి ప్రశంసలనందుకున్నారు. కర్షక శ్రామిక శక్తికి, గ్రామ వికాసానికీ, గార్హస్థ జీవితానికి ప్రతిఫలింప జేసే సంఘటనలతో మహాకావ్య లక్షణాలను గర్భీకరించుకొని రచింప బడిన తొలి తెలుగు రైతుకావ్యం రైతురామాయణం.2

---

1 డా॥ వానమామలై వరదాచార్యులు–"రైతు వాల్మీకికి నా జోహార్లు" పుట–1, 2 రైతురామాయణం

2 "రైతురామాయణం"లో వివరించబడింది.

# రైతురామాయణం మహా ప్రబంధం

ఆతని కావ్య గానమున నప్పటి నవ్యప్రబంధకావ్య ని
ర్మాతల కావ్య సాహితి కలాత్మచి విర్చితలిర్చెఁ బొంగినా
చేతనయుం గగుర్చె రస చింతనతృష్ణ చివిర్చె శ్రావ్య సం
గీతము గీతము న్వినుచు గిచిన బొమ్మవిధాననిల్చితిన్"

రై. రా. అవతారిక 25-4 పద్యం.

రైతురామాయణ విజయకాండ గద్యలో ఈ కావ్యం ప్రబంధమని పేర్కొనబడింది. అవతారికలోని పై పద్యంలో కూడ ప్రబంధకావ్య కలాత్మ చివిర్చిందని వర్ణింపబడింది. దీనిని బట్టి కవి ఈ కావ్యాన్ని ప్రబంధంగా కూడ నిబద్ధించారని తెలుస్తుంది.

ప్రబంధమంటే ప్రకృష్ట బంధమని, రచనా విశేషమని, కల్పితకథ యని, అర్థాలున్నాయి. కాదంబరి వంటి కల్పిత కథా కావ్యాలు ప్రబంధాలుగా వ్యవహరింపబడ్డాయి.1

ప్రబంధ్ = g. Conj. P. to bind on tie fasten to compose., put together, arrange.

ప్రబంధృ = M. An Anthor.

ప్రబంధః = A bind, tie uniterupted Servies of Succession. A continued or Connected discourse; Any Literary work or Composition A fiened story on Substrantum of fact"2

ప్రాచీన కాలంలో సంస్కృత అలంకారికులు కాళిదాస భాసాదుల

---

1 "ప్రబంధస్యకల్పనకథా" అమరకోశః ప్రదమకాండః

2) "ప్రబద్యతే ఇతిప్రబందంః" వాచస్పత్యమ్-

3) "ప్రబంద స్యకల్పనాయధాకాదంబర్యాదిరుత్పాత్యత్వాత్" భట్టిక్షరస్వామి అమరకోశవ్యాఖ్య.

2. The Practical Sankrit English Dictionary By V.S Apte, M.A.

నాటకాలను, మహా కావ్యాలను, అలంకార గ్రంథాలను ప్రబంధాలని పేర్కొన్నారు.1 మహా కావ్యమైనను, నాటకీయమైనను, లఘుకావ్యమైనను, కథా కావ్యమైనను, ప్రబంధ పదంతో వ్యవహరింపబడింది.2

ప్రాచీన తెలుగు కవులు కూడ కావ్యానికి ప్రబంధ శబ్దాన్ని ఉపయోగించారు.3 నన్నచోడ కవిరాజు కుమారసంభవ కృత్యవతారికలో వస్తు కవిత కలిగిందే ప్రబంధమని పేర్కొనడం గమనింపదగింది. తిక్కన భారత భాగాలను ప్రబంధ మండలి అని పేర్కొనడం మనకు పరిచయమే. ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుడై నృసింహ పురాణాన్ని ప్రబంధంగా నిబద్ధించాడు. శ్రీనాథుడు నైషధాది సంస్కృత అనువాద గ్రంథాలను ప్రబంధాలుగా వర్ణించాడు. ఈ విధంగా ప్రబంధ శబ్దం కావ్య సాహిత్యానికి పర్యాయంగా పరివ్యాప్తమైంది. విన్నకోట పెద్దనాది అలంకారికుల ప్రబంధ లక్షణాలను పెద్దనాది కవుల కావ్య లక్ష్యాలను సమన్వయం చేసికొన్న వీరేశలింగం పంతులు, వేటూరి ప్రభాకర శాస్త్రి గారలు ప్రబంధాలకు సమగ్రమమైన నిర్వచనాలను అందించారు. "పురాణముల నుండి కథను గైకొని స్వకపోలకల్పనలను విశేషంగా చేర్చి పెంచి చెప్పిన కేవల ఆంధ్రీకరణలు కాని రచనలు ప్రబంధములు"4.

నాటకాలలోని మంగళాంత వస్త్వైక్య లక్షణము మేళవించి విపులమైన కథా ఘట్టము ఉండవచ్చునని వేటూరి ప్రభాకర శాస్త్రి గారు అభి-

1 1) ఇదమ పర్య ప్రబంధస్య రసవ్యంజకత్వే నిబంధనమ్।
.......... యథా కాళిదాస ప్రబంధేషు"- ధ్వన్యాలోకము-
3-14 కా-వృత్తి-ఆనందవర్ధనుడు.

2) ప్రతాప రుద్రదేవస్య గుణానాశ్రిత్య నిర్మితః
అలంకార ప్రబంధోఽయం సంతః కర్ణోత్సవోఽస్తువః॥
విద్యానాథ ప్రతాపరుద్రీయనే-ఉపో-శో-9.

2 ధ్వని-మనుచరిత్రము -డా॥ రాజన్న శాస్త్రి పుట 343.

3 నన్నచోడుడు కుమార సంభవము.

4 ఆంధ్ర కవుల చరిత్ర - పీఠక - పుట 12 కందుకూరి వీరేశలింగం

ప్రాయపడిరి.1 నిడదవోలు వేంకటారావు గారు కూడ సమర్థించారు.2

ప్రాచీన అర్వాచీనుల అభిప్రాయాలననుసరించి పింగళి లక్ష్మీ-కాంతం గారు ప్రబంధాలు "పంచలక్షణీ"గా సూత్రీకరించారు.3

1) ఏకనాయకాశ్రయత్వం – వస్త్వైకం.
2) అష్టాదశ వర్ణనాత్మకం.
3) శృంగారం ప్రధానరసం-అవశ్యకతను బట్టి తక్కిన రసాలు గౌణాలు
4) ఆలంకారిక శైలి.
5) స్వతంత్ర రచన.

ఇవిగాక నన్నచోడుడు పేర్కొన్న "వస్తు కవిత" ను వ్యాఖ్యానిస్తూ డా॥ వల్లా దుర్గయ్య గారు జానుతెనుగు, దేశికవితా రీతి, సూక్తులు ప్రబంధ వాఙ్మయంలో ఉండాలని పేర్కొన్నారు.4

## రైతురామాయణంతో ప్రబంధ సమన్వయం:-

| రైతురామాయణంలోని నాయకుడు రాముడు. రామాయణ కథలోని ధీరోత్తనాయకుని లక్షణాలను పుణికి పుచ్చుకున్నవాడు ధార్మికంగా రైతురాముని జీవిత ప్రస్తారం శిశు, శిక్షణ, కళ్యాణ, కృషి, నిర్బంధ, విజయకాండల ద్వారా సాగింది.

ప్రతినాయకుడైన జమీందారు పాపారావుపై విజయం సాధించి ధీరోదాత్త లక్షణాల్ని నిరూపించినాడు. కర్షక అభ్యుదయాన్ని సాధించిన విజయ గాధ ఏకబిగిన రసపట్టుతో సాగింది. నిజాం పాలనకు అంతం పలికింది. శిశు కాండ నుండి విజయకాండ వరకు కథ పాత్రలనంటిపెట్టుకొని నడిచింది. ఏక నాయకత్వం, వస్త్వైక్యం చక్కగా నిబద్ధించబడింది.5

1 వేటూరి ప్రభాకర శాస్త్రి తెలుగు మెరుగులు 188 పుట
2 నిడదవోలు వేంకటారావు-ప్రబంధ ఫక్కిపీఠిక
3 సాహిత్య శిల్పసమీక్ష - పింగళి లక్ష్మీకాంతము
4 వల్లా దుర్గయ్య - ప్రబంధ వాఙ్మయము.
5 వస్తు శిల్పంలో చూడండి.

II ఈ మహాకావ్యంలో అష్టాదశ వర్ణనలో ఒకటి రెండు లేకున్నను, [illegible], సందర్భ శుద్ధితో జానపదమైన కర్షక సంబంధమైన పలు వర్ణనలు అందగించబడినాయి. పల్లె జీవినాన్ని ప్రతిబింబింపజేసే తిరునాళ్ళు, రథసప్తమి పండగలు, జాతర, మఱ్ఱివృక్షం, పంటచేల వర్ణనలు కావ్య, శోభను యినుమడింపజేశాయి.2

III ఈ కావ్యంలో ధర్మవీరం ప్రధానరసం. శృంగార, కరుణ, అద్భుత, భీభత్స భయానకాది రసాలు అంగాలుగా పోషించబడ్డాయి. ప్రత్యేకంగా శృంగార రసం నాయికానాయకుల మధ్య ఔచిత్యంతో పోషింపబడి ధర్మవీరానికి పరిపుష్టినందించింది. గార్హస్థ్య జీవిత ధర్మాన్ని రైతు జీవితంలో సమన్వయించి శృంగారం పవిత్రీకరించబడింది. ప్రధాన రసమైన ధర్మవీరం బాల్యం నుండియు రైతురామునిలో ప్రకటించబడి క్రమంగా శిశు శిక్షణ, కృషి, నిర్భంధ విజయకాండలో వివిధ సన్నివేశాల ద్వారా పరిపుష్టమై ప్రతినాయకుని వధతో పరాకాష్ట పొందింది. ఈ చర్చ రస నిర్వహణంలో విపులంగా వివరించబడింది.

IV అలంకారాలను ప్రయోగించటంలో కవి ప్రత్యేకమైన శైలి ఈ కావ్యంలోని ప్రతి పద్యంలో ప్రదర్శితమైంది. శబ్ద, అర్థ అలంకారములు ప్రాచీన ప్రబంధ భావాలను క్వాచిత్కంగా, పల్లెపట్టుల లోని ప్రకృతి సౌందర్యాలను బహుళంగా ప్రదర్శించి, అడుగడుగున అందమైన సరళమైన ఆలంకారిక శైలి పఠితలను ఆకట్టుకుంటుంది.

V రైతురామాయణం భాషాంతరీకరణంగాక సామాజిక స్పృహతో నవ్యతతో, అభ్యుదయాన్ని కోరి, తెలంగాణంలోని రైతు కుటుంబ జీవితం లోని నిమ్నోన్నత అనుభవ ప్రస్తారాన్ని దర్శించి, భావించి, రచింపబడి నట్టి స్వతంత్రకావ్యం సీతారామ, ఊర్మిళ లక్ష్మణాది పాత్రలో గల రామ కథతో సాన్నిహిత్య సాదృశ్యాలుగల రైతురాముని జీవిత సర్వస్వం ఇందు వర్ణింపబడింది. ఈ కావ్యంలోని రైతురాముని కథ గ్రామీణ జీవన విధానాన్ని, సమకాలీన సాంఘిక రాజకీయ వ్యవస్థా స్వరూపాన్ని వాస్తవంగా చిత్రించి కర్తవ్య ప్రబోధం గావిస్తుంది. మానవుని సంపూర్ణ మూర్తిమత్వ

1 వర్ణనాశిల్పంలో వివరించబడింది.

వికాసాన్ని, గార్హస్థ్య జీవితం లోని విలువల్ని, ధర్మాన్ని ప్రబోధిస్తుంది. శాంతియుతమైన గ్రామరాజ్యం లోని కర్షకాభ్యుదయమే దేశ సౌభాగ్యానికి ప్రథమ సోపానమని నిర్దేశిస్తుంది.

"శ్రీభూగోకుల నిత్యసేవన శ్రీభాగ్య నిక్షేపు..................కాపులకు గాపున్ గాపుగాఁ గొల్చెదన్" అని మంగళశ్రీతో ప్రారంభింపబడి, ఇష్ట దైవం విష్ణు స్తోత్రంతో కావ్యకథలో ధ్వనింపజేయబడింది. కావ్యం మధన కథలో "సీతారాముల, ఊర్మిళా లక్ష్మణుల కల్యాణ ఘట్టాలు వర్ణింపబడి యుండుటచే "మంగళ మధ్యాని" అనే లక్షణం సమన్వయింపబడింది. ఇట్లే కావ్యం చివరగా "కాపుగాఁ బూటకాపుగా, కష్టజీవుల పాలి కాపుగా........ శాంతి సౌఖ్యాలు వెలయుత" అనే భరత వాక్యంలో కరవులను పారద్రోలే రామరాజ్య స్థాపనా కాంక్షతో కావ్యం మంగళాంతంగా ముగింపబడింది.

నిజాం దుష్టపాలనం, రజాకారు ఉద్యమకారుల అమానుష చర్యలు, కర్షకుల, రైతుకూలీల కడగండ్లు కృత్యవతారికల్లో కవిప్రేరణలుగా ప్రకటింప బడినాయి.1 నన్నె చోడుని"వస్తుకవిత"ను వ్యాఖ్యానిస్తూ డా॥ పల్లా దుర్గయ్య గారు ప్రబంధ కవితలో రసభావ గుణ వర్ణనలతో పాటు సూక్తులు, జాను తెనుగు, దేశి కవితారీతి ఉండవలెనని చెప్పిన లక్షణం. రైతురామాయణం ప్రబంధానికి చక్కగా సరిపోతుంది. సుమారు మూడు వేల జాత్యుపజాతి వృత్త పద్య ప్రభేధాలతో వ్యాప్తి, అవ్యాప్తి దోషాలు లేకుండ రస, గుణ, భావ అలంకార సూక్తి జాను తెనుగు, దేశికవితా రీతులతో,రచనా శిల్పంతో ఒప్పారి, చక్కని సన్నివేశ కల్పనా చాతుర్యంతో రసవంతంగా ఆనందోప దేశాలను లోకానికందించే రైతురామాయణం మహాప్రబంధ కావ్యమనుటలో విప్రతిపత్తిలేదు.

---

1 కావ్యోపదేశంలో వివరించబడింది.

# రైతురామాయణం పై వాల్మీకి రామకథా పరిభావం

"శ్రీభోకుల నిత్య సేవన శ్రమశ్రీ భాగ్యనిక్షేపు స
దోభక్త్యోన్నతి సత్కలాపుఁ గృషియజ్ఞోద్దీపు క్షామాసురీ
క్షోభానిర్వహణ ప్రతాపుఁ బ్రగతి స్ఫూర్తి క్రియాటోపు స్వర్
భూభోగాలకుఁ బ్రాపుఁ గాపులకుఁ గాపున్ఁ గాపుగాఁ గొల్చెదన్"[1].

విష్ణుస్తోత్ర మంగళంతో ఆరంభింప బడినదీకావ్యం. వేదాంతస్ఫూర్తి ఆర్తి, ప్రవత్తుల యొక్క పిండీకృతసారం ఈ పద్య భావం.

ఆది విష్ణువు, శ్రీదేవి, భూదేవి, నీళాదేవి అను ముప్వురు సతులతో, ఆది శేషగరుడాదులు అను "నిత్యులచే" నిత్యం సంసేవించ బడువాడు. ఐశ్వర్య, సమగ్ర, వీర్య, యశః శ్రియ, జ్ఞాన వైరాగ్యాది షడ్గుణైశ్వర్య సంపన్నుడైన భగవంతుడు, వాత్సల్య, స్వామిత్వ, సౌశీల్య, సౌలభ్య జ్ఞాన శక్తులు గలవాడై, పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చారూపాలతో దర్శనమిస్తూ తనను సేవించే ఆయా భక్తకోటిని రక్షించాలనే సత్కలాపాలు గలవాడు. సత్కర్మలను అనుష్ఠించు వారిని బ్రోచుటకై యజ్ఞకర్తృత్వం యజ్ఞభోక్తృత్వాలను వహించి, సకలలోకాలచే ఆరాధించబడువాడు అసుర శక్తిపై దైవీశక్తి యొక్క విజయాన్ని చాటే ప్రగతి స్ఫూర్తి క్రియాటోపాలు గల అవతారాలను దాల్చిన అర్చామూర్తి, త్రైలోక్య సంతర్పి, ఇహపర సౌఖ్యసంధాయి, రక్షకులకే రక్షకుడు, దేవాది దేవుడు ఐన విష్ణు మూర్తి సర్వథా రక్షగా ఉండాలని వేడుకొంటున్నాను" అని శరణాగతితో అచంచల భక్తి విశ్వాసాలతో స్తుతించారు ఆచార్యులు.

కావ్యగతమైన అర్థాన్ని స్ఫురింప జేసే విధంగా "కాపు, భక్తి, కృషి యజ్ఞము మొదలగు పదాల్లో శ్లేషను చమత్కరించి ఈ మొదటి నాంది పద్యాన్ని శిల్పించారు. కాపు - రక్షకుడు - కాపురైతు - భక్తి - భక్తులు-

1 రైతురామాయణము- ఇష్టదేవతాస్తుతి, 1 పుట 1 పద్యం.

అన్నము – కృషి యజ్ఞము – సత్కర్మానుష్ఠితమైన యజ్ఞము సేద్యము.

శ్రీదేవిని (సంపద), భూదేవిని (భూమి), గోకులాన్ని (పశుసంపద), త్రికరణ శుద్ధిగా సంభావించి నిత్యం సేవించువాడు రైతు. అతడు శ్రమచేత సిరిసంపదలకు, భోగభాగ్యాలకు నిక్షేపం వంటివాడు. జనలోక సంతర్పణకు అన్న సమృద్ధికొఱకు ఆహార పదార్థాల ఉత్పత్తిని వృద్ధిపరచే సత్కలాపాలు గలవాడు రైతు. సేద్య యజ్ఞన్ని నిష్ఠతో అనుష్ఠించు కర్షకర్షి కరువుకాటకా-లనే రక్కసుల సంక్షోభాన్ని అంతంగావించే శౌర్య ప్రతాపాలు గలవాడు. దేశ ప్రగతికి, సమగ్ర స్ఫూర్తికి, జాతి దీప్తికి, మానవలోక సుభిక్షానికి నిరంతరం దోహదపడునట్టి వీరోచితమైన కార్యకలాపాలను ద్విగుణీకృతో-త్సాహంతో ధర్మబద్ధంగా నిర్వర్తించేవాడు కర్షకుడు. భోగభాగ్యాలతో, సిరిసంపదలతో భూతలన్ని స్వర్గధామంగామార్చే లోకరక్షకుడు ఐన కాపు రైతును జగద్రక్షకుడైన విష్ణు దేవునితో సరిపోల్చుతూ, ఆ విష్ణుమూర్తిని ఇట్టి కాపులకు (రైతులకు) కాపుగా (రక్షగా) ఉండుమని వేడుచున్నారు.

ఈ విధంగా కావ్యారంభంలో కాపుకథయే కావ్యకథ యనియు, ధర్మానుప్రాణితమైన వీరరస స్ఫూర్తిని ధ్వనింపజేశారు. ఈ విధమైన ప్రారంభం రామాయణ కథాప్రారంభంలోని 'మానిషాద' శ్లోకాన్ని జ్ఞాపకం చేస్తుంది. ఇట్టి పద్యం ఆదికవి వాల్మీకి రచించినట్లుగా సరస్వతీదేవి రాముని కథ వ్రాయుమని ప్రబోధించినట్లుగా, ఈ కావ్యంలో రాముడే సాక్షాత్కరించి కవిని ప్రబోధించి కావ్యోన్ముఖుణ్ణి చేస్తాడు.

త్రేతాయుగాన రావణాది రాక్షసులొనర్చే బాధలకు తాళలేక దేవ, మునిగణాలు ఆది దేవుడైన విష్ణువుతో మొరపెట్టుకున్నారు. శిష్టరక్షణ, దుష్ట శిక్షణార్థమై విష్ణువు తనను సేవించు నిత్యులతో భూలోకమందవతరించిన ఘట్టాన్ని "శ్రీభూగోగుల" పద్యం తలపింపజేస్తుంది. "శ్రీభాగ్యనిక్షేపు" అను ఈ పద్య పాదంలో ఈ భావం యిమిడియుంది.

"నిత్యులనగా ఎప్పుడును సంసారబంధం లేనివారు, భగవత్సన్నిధా-నంలో ఉంటూ, భగవత్సేవలొనరుస్తూ, భగవదానుకూల్యైక భోగము ఆనందములు గలవారు, ఈశ్వరుని యోగముచే సృష్టిస్థిత్యాదులను జేయు

శక్తిగలవారు, తాము భగవదాజ్ఞచే అవతరించువారు, వీరు శ్రీ, భూ, నీళలు, అనంతగరుడాదులు, ఆదినారాయణుడు దేవతల కోరిక మేరకు భూలోకమున శ్రీరాముడుగా అవతరించగా శ్రీలక్ష్మీదేవి సీతగను, అనంతుడు లక్ష్మణుడుగను అవతరించిరి"1. వాల్మీకమున సీతారాములు లక్ష్మీవిష్ణ్వంశలచే ఒప్పి యున్నారని "మానిషాద" శ్లోకంలో తెలుపబడింది.

"సీతా లక్ష్మీర్భగవాన్ విష్ణుః" అని రామాయణమున 'దేవతాస్తుతి'గా జెప్పబడింది. ప్రారంభ పద్యంలో "స్వర్ భూభోగాలకు ప్రాప్తు" అనే భావాన్ని ఇట్లావివరించవచ్చు.2

"సత్యంచ ధర్మంచ పరాక్రమంచ
భూతానుకంపాం ప్రియవాదితాంచ
ద్విజాతి దేవాతిథి పూజనంచ
పంథానమాహుస్త్రిది వస్యసంతః"1

గృహస్థాశ్రమ ధర్మంలో అనుష్ఠించదగిన సత్యం, ధర్మం, పరాక్రమం, భూతదయ, ప్రియభాషణం, ద్విజదేవాది ఉత్తములకు అతిథి సత్కారం అనునవి ముఖ్యమైనవి. ఇవి భూభోగాలను అనుభవింజేపయునవే గాక, స్వర్గానికి సోపానాలై మార్గదర్శనం జేయుచున్నట్టివి. ఈ ధర్మాలు వాల్మీకి శ్రీరామునిచే జాబాలి మహర్షికిచెప్పిన "స్వర్గమార్గాలుగా" శ్లాఘింపబడుతున్నాయి. ఈ ప్రవృత్తి ధర్మాలు గల శ్రీరామునిచే సంచారితమైన భారతభూమి కర్మ భూమిగా, యజ్ఞ భూమిగా ప్రశస్తి పొందింది. అందుకే 'కృషియజ్ఞోద్దీపున్" అను విశేషణం మొదటి పద్యంలో జెప్పారు.

యజ్ఞభావన భారతీయ మహర్షుల ఉదార మానసిక స్థితికి, లోక కళ్యాణకాంక్షకు ప్రతీక. యజ్ఞ శబ్దం దేవపూజ, హోమకర్మ అను అర్థాలతో

---

1 డా॥ గుండి వేంకటాచార్యులు రంగనాథ వాల్మీకి రామాయణముల తులనాత్మక పరిశీలనం – 447 పుట.

2 దా॥ ప్రతి॥ వాల్మీకి రామాయణము – యుద్ధ కాండం
నర్గ శ్లోకం 28.

3 దా॥ ప్రతి॥ వాల్మీకి రామాయణము – అయోధ్య కాండం.
సర్గ 109 శ్లో-3.

ప్రాచుర్యమై ఉంది. ఈ యజ్ఞం నుండియే సమస్తం ఉత్పన్నమైనట్లు వేదాలలో చెప్పబడింది. భగవద్గీత అనేక యజ్ఞాల గురించి వివరించింది. అన్ని యజ్ఞాలకు త్యాగమే మూలం, త్యాగం వల్లనే సమాజం వికసిస్తుంది. రైతురామాయణంలో కర్షకుని శ్రమశక్తియు త్యాగం తన సర్వశక్తులతో భూమికి ధారపోసి పంట పండించి సమాజాన్ని బ్రతికించేవాడు రైతు. వాల్మీకి రామాయణమున యజ్ఞకర్మలు కళ్యాణ కరములోని వర్ణింపబడి-నాయి, "ఈ కృషి యజ్ఞం" ఇంతటిమహోదాత్తమైన భావాన్ని సంతరించు కొన్నట్టిది. బృహదారణ్యకో పనిషత్తులో జనకుడు అనేక దక్షిణలు గల యజ్ఞమొనర్చెనని చెప్పబడింది1 జనక చక్రవర్తియజ్ఞాచరణమునకు యజ్ఞ వాటికను నాగలితో దున్నుచున్న సందర్భమున నాగేటిచాలున ఒక పెట్టిలో సీత లభించింది. జనకుడు శ్రీరామునకీ వృత్తాంతన్ని వివరించాడు.

అథమే కృషతః క్షేత్రం లాంగలా దుథ్థితా మయా
క్షేత్రం శోధయతా లబ్ధానామ్నా సీతేతి విశ్రుతా
భూతలా దుత్థితాసాతు వ్యవర్థత మమాత్మజా"2.

నాగేటిచాలు నందు లభించే ఆ బాలకు 'సీత' అని నామకరణం గావించి, తన కూతురుగా జనకుడు పెంచి పెద్దచేశాడు. మొదట భూజాతయై-సీతానాయమున ఒప్పి జనకునిచే పెంచబడి 'జానకి' గా వ్యవహృతమై' నది. సతీ అనసూయతో సీత తన జన్మవృత్తాంతాన్ని తెలియజేస్తూ "తస్య-లాంగల హస్తస్యకర్షతః క్షేత్ర మండలం అహం కిలోత్థితా భిత్వాజగతీం నృపతేస్యుతా"3 ఆ యజ్ఞవాటికను దున్నినప్పుడు నాగటిచాలునందు సీత జనకునకు లభించినట్లు చెప్పబడి యుండి.

"ఇంద్రః సీతాం నిగృహ్ణాతు
తాంపూషాను యచ్ఛతు"4

---

1 ఋగ్వేదం అష్టక 3 అధ్యా-24 వర్గ-13 డా॥ గుండి వేంకటాచార్యుల రంగనాథ వాల్మీకిరామయణం తులనాత్మకపరిశీలనం నుండి ఉద్ధృతం

2 జనకోహ వైదేహోబహుదక్షిణేనయజ్ఞేనేజే బృహదారణ్యకోపనిషత్తు అధ్యాయ 5 బ్రాహ్మణము-1

3 డా॥ ప్రతి॥ వాల్మీకిరామాయణం సర్గ 66 శ్లోక 13, 14

4 డా॥ ప్రతి॥ వాల్మీకి రామాయణం అయోధ్య-సర్గ 118 శ్లోకం 28

ఇంద్రుడు (శ్రీరాముడు) సీతను స్వాధీన పరచుకొనును. పూష (జనకుడు) అనంతరం ఆమెను (శ్రీరామునకు) ఇచ్చును అని ఋగ్వేదంలో వివరింపబడింది.

ఈ వృత్తాంతాన్ని దృష్టిలో పెట్టుకొని ఆచార్యులవారు కావ్యంలోని నాందీ మంగళాచరణంలో ఈ పద్యం రచించారు.

"నాగటి కొండ్రలోని యొకనాటి పసందు పంటకాపుకొ
మ్మా గరువంపునిమ్మయని మంజులసోక్తుల మేలమాడు నా
కౌగిలిలోని పెన్మిటినిఁ గప్రపు ముద్దుల దేల్చుచౌనుపేర్
మ్రోగిన పెద్దకాపు తమరోమరి యంచను సీతకావగున్".1

పేరు మ్రోగిన పెద్దకాపు = ప్రఖ్యాతిగాంచిన రామాయణ కావ్యవేద పురుషుడు శ్రీరాముడు, రాముడు కావగున్ – శ్రీరాముడు రక్షకుడగును. మరొక అర్థం – శ్రీరాముడే రైతుకాపు అగును. "సీతాలాంగల పద్ధతిః" అని భావింపబడింది. సీత కావగున్ – సీత రక్షరాలగును. మరొక భావం సీత కావ్యంలో కాపెతమగును.

ఈ విధంగా రైతురామాయణ కావ్యం యొక్క నాయికానాయకులను ధ్వనింపజేస్తు నాందీ మంగళాచరణంలో నమస్క్రియా లక్షణాన్ని నిర్వ-హించి వర్ణించిన విధం అనితర సాధ్యమైంది. ఆచార్యులు మహాకవియేగాదు వేదాంతి-ఆధ్యాత్మికవేత్త. అందుకే రైతురామాయణ కావ్యం కృత్యావ-తారికలో శ్రీరామున్ని కాపుగా పుట్టి పుడమిలోని రైతాంగాన్ని ఉద్ధరింపు-మని వేడుకొన్నాడు.

"కాపులకుఁ గాపువైన నీ కాపులేక
కాపుబ్రతుకెల్ల వడుగా పులయ్యె
కాపులందున నీవొక కాపుగాగ
బుట్టి రావయ్య రామయ్య పుడమిలోకి
అనుచు రాముఁ బ్రార్థించె రైతాంగ మెల్ల"2

1 రైతురామాయణం నాందీమంగళాచరణం 3 పుట 6 పద్యం.
2 రైతురామాయణం-కృత్యావతారిక 22 పుట 4 పద్యం

సీతారాములను కావ్య నాయికా నాయకులుగా నొనర్చుకొని సంస్తుతించారు.

కాపు, కాపురాలుల యొక్క కాపురాలు సీతారాముల ఆదర్శదాంపత్య ధర్మాన్ని స్ఫురింపజేస్తుంది.

"పాడిదప్పని యాలు నేనామిగూడ
యాడి దప్పని కాపురాలాదమరచి
గాడి దప్పని బండిచక్రాలు కొండ్రి
చాలు దప్పని సూటినాగేటి చాలు"1

పాడిదప్పని, కాపురాలు, ఆలు, మొదలగు పదాలన్నియు శ్లేషచే ఉద్భాసిస్తున్నాయి. పాడి సంపదనిచ్చే ఆవులు, నీతితప్పని ఇల్లాలు.

కాపురాలు నీతిదప్పని సత్యవంతులైన కాపు కాపురాలు, వారి సంసార జీవితాలు, భార్యాభర్తలు సంసార రథానికి రెండుచక్రాలవంటివారు. ఆ బండి చక్రాలెప్పుడును ఎన్ని ఒడుదొడుల పథంలోనూ గాడితప్పవు, ధరాన్ని నీతిని తప్పనివారని భావం. ఇట్టి కాపువారి ఆదర్శ దాంపత్య జీవితం సమాజ పతిష్ఠతాస్ఫూర్తికి ఉన్నత శిఖరం వంటిదని శ్లాఘించారు. ఆచార్యులు శ్రీమద్రామాయణ సుధారసాలను గ్రోలుటవల్లనే యిట్టి వర్ణన సాధ్య పడుతుంది.

నిజాం నిరంకుశ పాలన, జమీందారీ వ్యవస్థ, రజాకార్ల అరాచకత్వం జమీందార్లకు సాలీన యిచ్చే ముడుపులు, అధికార్లకొసగే లంచాలు, సాహు లకు చెల్లించే చక్రవడ్డీలు, దరిద్రత, నిరక్షరాస్యత, కరవు కాటకాలు, పశు హాని, సస్యవినాశం అనే ఈ పదిరకాల కష్టాలు దశముఖాలు కలిగిన అసుర శక్తివలె కర్షకుల నెల్లరును పీడిస్తూ ఉండెను. ఇట్లు కాపు (రైతురాముని) యొక్క సస్యలక్ష్మిని (కాపుసీతను) దశముఖాలు (జమీందారు పాపారావు వంటివారు) దశముఖాల హరించి వేయుచుండిరి

"ఇట్లు దశశీర్షకముల జరించు ఘోర
రావణాసుర దైత్యపీడా విముక్తికి
అవతరించరాదే "రైతులందురామ"2

1 రైతురామాయణం-కృత్యవతారిక-22వ పేజి 4వ పద్యం
2 రైతురామాయణం-కృత్యవతారిక-20వ పుట-2వ పద్యం

అని రైతాంగ మెల్ల శ్రీరామచంద్రుణ్ని ప్రార్థించారు. రావణాసుర సంహారానికి రామావతార మెంత అవసరమైందో కర్షకుల బాధలను నివారించడానికి రైతురాముడంత అవసరమని, రైతురామునిలో శ్రీరాముని గుణగణాలను నిక్షిప్తం జేసి కావ్యాన్ని రచించారు.

ఆచార్యులకు శ్రీరాముడు స్వప్నమున సాక్షాత్కరించి "ఆమె ఇష్టానుసారము ఇపుడు కాపునై వెలసితినీశుడనయి, క్షామరక్షోవధార్థము సాగుము కృతి"1 అని ఆనతిచ్చాడు. భూజాత యిష్టానుసారంగా కరవుకాటకాలు అనే రాక్షసులను నిర్జించి సస్యలక్ష్మిని రక్షించాలన్న తపనతో శ్రీరాముడు రైతురాముడుగా వెలసినాడు. ఈ విధంగా రైతులో రాముని తత్త్వాన్ని రామునిలో రైతును దర్శించి కావ్యాన్ని వినిర్మించారు ఆచార్యులు.

ఇట్టి కావ్యనాయకుడు రైతురాముడు. అతడు శాంతి విప్లవవీరుడు ఇతడు శ్రీరాముడైతే, ప్రతినాయకుడు జమీందారు పాపారావు పాపాలపుట్టయైన రావణుడు. వీని దురహంకార పూరిత క్రూర రాక్షస కృత్యాలకు, గురియైన గ్రామీణ ప్రజానీకానికి రైతులకు కాపుకూలీలకు, శ్రామికజనానికి రైతురాముడు అండదండగా నిలుస్తాడు. వారిలో నూత్న విప్లవ చైతన్యాన్ని కలిగిస్తాడు. గ్రామసౌభాగ్యానికి పాటుపడే రైతురాముణ్ని అంతం జేయటానికి రజాకారు దళాలతో కుట్రలు పన్ని జమీందారు విఫలుడౌతాడు. ఈ పాపారావు సోదరి సుందరమ్మ సాక్షాత్తు శూర్పణఖ రాముని తమ్ముడు లక్ష్మణున్ని కామించి తిరస్కృతమై పరాభవించబడుతుంది. కక్ష సాధింపుగా రైతురాముని పత్ని సీతయొక్క అందచందాలను వర్ణించి సోదరున్ని ప్రేరేపిస్తుంది. జమీందారు సీతను అపహరించి నిర్బంధిస్తాడు. ధర్మరాట్ప్రభువు సుగ్రీవుని వంటివాడు. అతని నమ్మినబంటు హనుమప్ప సీతయొక్క ఉనికిని తెలిసికొని రైతురామునకు తెలియపరుస్తాడు. వీరి సహాయంతో రైతురాముడు పోరాటంలో జమీందారు పాపారావు పాపం పండించి సీతను పరిగ్రహిస్తాడు ధర్మాట్ప్రభువు రైతురామునకు శ్రీరామపురానికి పెద్దరైతుగా పట్టంగట్టుటతో నాయక, కర్షకాభ్యుదయాలు కలిగి కావ్య ప్రయోజనం నెరవేరుతుంది.

1 రైతురామాయణం- స్వప్న సాక్షాత్కారం-30వ పుట 6వ పద్యం

గంగమాంబ సాగరయ్యలు, కౌసల్య సుమిత్ర దశరథుల వంటివారు రామలక్ష్మణుల పత్నులు సీతా ఊర్మిళలే. ఈ విధంగా రామాయణం కథా పాత్రలతో, రైతురామాయణం రచింపబడింది. శ్రీమద్రామాయణంలో వలె ఈ కావ్యమందునూ ఆరుకాండములున్నాయి. అవి శిశుశిక్షణ, కల్యాణ, కృషి, నిర్బంధ విజయకాండములనేవి. ఇందు రైతురాముని జీవిత వృత్తాంతాలతో కర్షక జీవిత చరిత్రయేగాక పరిపూర్ణ మానవుని చరిత్ర వర్ణింపబడింది.

సీతారాముల ఆదర్శ దాంపత్య జీవనం రామలక్ష్మణుల నిర్మలమైన భ్రాతృప్రేమ, మాతృప్రేమ, వాత్సల్యాలు, గృహస్థాశ్రమ ధర్మాలు విశేషంగా సంపూర్ణంగా పోషింపబడినాయి.

ధర్మారాట్ప్రభు స్నేహశీలం, హనుమప్ప సేవాభావం, కాపుసీత పాతివ్రత్యం, రైతురాముని ధర్మవర్తనం మొదలైన అంశాలు కథా సన్నివేశాలననుసరించి మహోదాత్తంగా నిరూపింపబడినాయి. రైతురాముడు కర్షకాభ్యుదయాన్ని, హాలిక సంక్షేమాన్ని, కోరినవాడై సేవాతత్పరతతో, ధార్మిక చింతనగలవాడై పాపారావు జమీందారు వంటి పాపుల నుండి రైతాంగానికి విముక్తి కలిగించడానికి పోరాడి విజయం పొందాడు. ఈ మహత్తర కార్య నిర్వహణంలో ధర్మవీరము అంగిరసంగా పరిపుష్టంగా నిర్వహింపబడి తక్కుంగల శృంగార కరుణాదులు అంగ రసాలుగా పోషింపబడినాయి. ఈ విధంగా ఇతివృత్తం వాల్మీకి రామాయణ సంగతమై కథా ప్రణాళిక కర్షక జీవన సంగతమై పతనమైన ధర్మాన్ని పునరుద్ధరించడానికి రైతురామాయణ మహాకావ్యం రచింపబడింది. రసహృదయులను స్పందింపజేసి రామాయణ సందేశాన్ని అందిస్తూ, సామాజిక స్పృహను వెలిగిస్తూ, గ్రామరాజ్య స్థాపనకు క్రియాశీలకమైన మార్గం నిర్దేశించడం ఈ కావ్యంలో జరిగింది.

---

1 వస్తు శిల్పంలో రామాయణకథా మహాత్మ్యాన్ని దెలిపే రమ్యసన్నివేశాలు విపులంగా ఉంది.

# వస్తుశిల్పం

ఇతివృత్తం, నాయకుడు, రసం అనే ఈ మూడు ప్రధానాంగాలు కావ్య ప్రతిష్ఠను పెంచుతాయి. ఉపాంగాలైన అలంకార వర్ణనాదులతో కావ్యం శిల్పించబడుతుంది. దేహికి శరీర సౌష్ఠవమెట్టిదో, కావ్యానికి ఇతి వృత్త నిర్మాణ శిల్పం అట్టిది. కావ్య శరీరమైన ఇతివృత్తం పంచ సంధులచే రసనాయక పాత్రాదులతో కావ్యంలో కథావస్తువుగా పరిఢవిల్లుతుంది.1 అలంకారికుల, కవిపండితుల అభిప్రాయంతో కావ్యకథ ప్రఖ్యాత, ఉత్పాద్య, మిశ్రమ భేదాల్లో దేనికి చెందినరసాను గుణంగా ఉండాలి. పురాణేతిహాసకథా బంధం కలది ప్రఖ్యాతం కవిస్వక పోల కల్పిత వస్తువు గలది ఉత్పాద్యం. ప్రసిద్ధమూ, కల్పితమూ ఐనకథా వస్తువు గలది శ్రమం2 ప్రఖ్యాతంలోని ఇతివృత్తం అంతకు పూర్వమే లోక ప్రసిద్ధమై ఉంటుంది కావున అది సిద్ధమైంది కాని ఉత్పాద్యంలో కథా వస్తువు కవికపోల ప్రజ్ఞా ప్రకల్పిత విలసితమై సాధింపబడుతుంది లోకాభీష్టా నికి అనుగుణంగా ఔచిత్య శోభితాలైన పురాణాల్లోని ఇతిహాసాల్లోని కథాంశాలు, లోకాదర్శ ధర్మాలననుసరించి కొన్ని మార్పులతో గ్రహింపబడి ఉత్పాద్య వస్తువునకు ఉపకరిస్తాయి.3 కవి ఉద్దేశించిన ఏదో యొక ప్రయో

---

1 ఇతి వృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితమ్
వంచభిస్సంధిభిస్తస్య విభాగః సంప్రకల్పితః”
భరతుడు-నాట్యశాస్త్రము-19వ అధ్యాయం-1వ శ్లో॥ ఇతివృత్త నిర్మాణం

2 ప్రఖ్యాతోత్పాద్య మిశ్రత్వభేదాత్-తత్ త్రివిధమ్ మతం” ఇతి ఇతిహాస బంధనం ప్రఖ్యాతం-కవికల్పితముత్పాద్యం, సంకరా యత్తం మిశ్రంచేతి” విద్యానాధుడు-ప్రతాపరుద్రీయమ్ నాటక ప్రకరణమ్

3 అత ఏవచ భరతే ప్రఖ్యాతవస్తు విషయత్వం, ప్రఖ్యాతోదాత్తనాయ కత్వం నాటకస్యావశ్చ, కర్తవ్యతయోపన్యస్తం తేనహి నాయ కౌచిత్యానౌచిత్య విషయే కవిర్న ముహ్యతి యస్తూత్పాద్యవస్తు నాట కాది కుర్యాత్తదా ప్రసిద్ధానుచిత నాయకస్వభావ వర్ణనే మహాన్ ప్రమాదః” ఆనందవర్ధనుడు-ధ్వన్యాలోకము-పుట 334

జనాన్ని బట్టి కల్పితమైన కథ, రసైకసంవిధానంతో, సహృదయ సంవాదం నొందింపజేసే విధంగా ఉంటుంది. అనల్ప కల్పనా కథా సంవిధానం గల ఉత్పాద్య వస్తువులో కవియొక్క ఉపజ్ఞకు భావనాశక్తికి ప్రకాశం లభిస్తుంది. కావున కావ్యంలో ఇతివృత్తం ఉత్పాద్యంగా ఉండటం సర్వథా విలక్షణమైందని ఆధునిక సాహిత్య విమర్శకులు అభిప్రాయపడినారు.

రైతురామాయణంలో ఉత్పాద్య వస్తువును ఎంచుకొన్నారు. ప్రపంచ విఖ్యాతాలైనకథలతో విరోధించే కల్పనలు అయోగ్యాల నిభావించి, జగద్విఖ్యాతమైన రామాయణ కథామార్గంలో కర్షక జీవన వృత్తం రైతురామనాయకమై సమకాలీన భావాలకు ప్రాతినిధ్యం వహిస్తూ నవ్యాతినవ్యంగా ఈ కావ్యంలోని ఉత్పాద్య వస్తువు చక్కని నిర్మాణక్షమతో అలరారింది.

## రైతురామునిలో ఉత్పాద్య కథాసంవిధానం

రైతుల చితికిన అతుకుల గతుకుల బ్రతుకులను కావ్యజగత్తులో ప్రతిఫలింప జేయడానికి సామాన్యమైన రైతురాముని కావ్యనాయకునిగా జేసికొన్నారు. పల్లె పట్టును కేంద్రంగా తీసికొని, అతనికి సంబంధించిన కథాంశాలను పరస్పరోపకారాలుగా సంధింప జేశారు. విభావానుభావ సంచర్యాది భావపుష్టితో, రసవ్యంజకానికి ఉపదేయమైన అలంకారాలు, వర్ణనలు పాత్రలను సంయమనంతో కావ్యకథలో నిర్వహించారు1 జగత్తును సేవించి కాపాడే కాపు రామునిలో కావ్య జగత్తుకు ఉదాత్తనాయకుడైన శ్రీరామున్ని దర్శించారు.

అన్నార్తులకు జీవరక్ష, లోకానికి జీవగఱ్ఱ, సమస్త కర్మలకు మేలుకీలుచీల, జాతికి వెన్నముకగా ప్రశంసింపబడేరైతును కావ్యంలో ధీరోదాత్తు

---

1 విభావానుభావ సంచార్యౌచిత్య చారుణః
విధిః కథాశరీరస్య వృత్తస్యోత్ప్రేక్షితస్యచ............
.............. అలంకృతీనాం శక్తావప్యానురూప్యేణ యోజనం
ప్రబంధస్యరసాదీనాం వ్యంజకత్వే నిబంధనమ్
ఆనందవర్ధనాచార్యులు-ధ్వన్యాలోకము-ఉద్యోతం, 3 కారికలు 10-14 వరకు కథాశరీరం

నిగా, ధర్మవీరునిగా ప్రతిష్ఠించారు. రైతును బ్రహ్మ విష్ణు మహేశ్వరేంద్రులుగా, పరశుబలశ్రీరాములుగా దర్శించి కావ్య నాయకత్వానికి ఉదాత్తతను చేకూర్చారు. ఇట్టి కృషి కృతికి కావ్యసామాగ్రి నవ్యాతినవ్యమైంది. చెడు నేలల్ని సస్యశ్యామలం జేసే హలమేవాశ్రితకలమైంది మోటకాలువ నీరు సిరా. కొండ్రచాళ్లు గీతలు, తడిదుక్కిన నేల మెత్తని కాగితం, నాటిన మొక్కలు వర్ణమాల, పాలికాపులు, వాయసగాళ్లు సహాయకులు కార్మికజనం పరిష్కర్తలు, నవధాన్యాలు నవరసాలు, పల్లె జనం రసహృదయులు.

ఈ విధంగా కర్షక జగత్తు, కావ్యజగత్తునకు సమన్వితిని పొందింది. తనువును ధనువుగా వంచికరాలను శరాలుగా ఎక్కిడి "సీతాలాంగల పద్ధతిః" అను సీతామహాలక్ష్మిని పెండ్లాడిన రైతురామునిలో శ్రీరాముని చరిత్ర ధ్వనింపజేయబడింది. రైతురాముని సీతాసస్యలక్ష్మిని దశముఖాలహరించి వేసే రజాకారు జమీందారీ బూర్జువా వ్యవస్థను నిర్మూలించిన రైతురాముని విజయం దేశకాల పాత్రల కనుగుణమైన కథా పాత్రలతో రైతు కుటుంబ జీవనగాధ చిత్రింపబడి ఇతివృత్తం ఋజువుగా సాగింది. సామ్యవాదంలోని సమభావం, సమానత్వం, గాంధీజీ సమాజవాదం ఈ కావ్యకథలో ఓతప్రోత మైంది. "దున్నినవాడిదే భూమి", తెలంగాణా రైతుదే" శ్రమాధీనమ్ము-లీలోకమ్ములని శాంతి విప్లవ పోరాటానికి తగిన ఇతి వృత్తం ఎంచుకొనబడింది. రామాయణ కథాంశాలలో సమన్వితిని పొంది జనజీవన సంస్కా-రాల్ని సువ్యవస్థితంజేసింది. ఆకృతి సౌష్ఠవానికి తగిన సన్నివేశకల్పనలు రసపుష్టికి తగిన భావ సౌందర్యం, జాతీయతకు తగిన దేశ్యభిమానం ఔచి-తీమంతంగా ధ్వనింపజేయబడింది. జానుతెనుగు, హాలిక శ్రామిక జీవన సౌందర్యం పుష్టిని తుష్టిని సంతరించుకొంది. ఆదర్శవంతులైన ఉత్తమ జీవితాలు విలువలు ధర్మాధర్మాల సంఘర్షణంలో ఉత్తమ మానవ ధర్మం పొందే విజయం చక్కగా కథా రూపంలో గానం జేయబడింది.

## I కథా నిర్మాణ కౌశల్యం:-

సుమారు మూడు వేల పద్యాలు గల బృహద్రసవత్కావ్యం రైతు రామాయణం. ఇందు రైతురాముని కథ శిశు శిక్షణ కృషి కళ్యాణ నిర్బంధ విజయాలనే ఆరుకాండల్లో చక్కని కథా యోజనాతో చిత్రితమైంది.

## కథా యోజనలోని ప్రధానాంశాలు:-

1) కృతిపతి ప్రశంస – కృత్యాద్యవస్థ,
2) కావ్యారంభము,
3) స్వప్న సాక్షాత్కారం,
4) కావ్య కథ,
5) కథా సంవిధానం.

## I కృతిపతి ప్రశంస:-

ప్రజల భాషలో ప్రజల కొఱకు రచింపబడిన రైతురామాయణ కృతి నాటి విదేశాంగశాఖామాత్యులు నేటి భారత ప్రధాని మాన్యశ్రీ పాములపర్తి వేంకట నరసింహారావుకు అంకితమివ్వబడినది. 15 పద్యాల్లో కావ్యభాష శైలి ప్రయోజనాలు పేర్కొనబడినాయి. పీవీజీ ఆంధ్ర రాష్ట్ర నవ్యమహోదయావతరణ కర్ణధారిగా, కృతిభర్తగా కీర్తించబడినాడు.

### కృతి ఉద్ధార్త:-

కరీంనగర్ జిల్లా గ్రామాధికార సంఘం కావ్యముద్రణకు సహాయనిధిని సమకూర్చింది. జిల్లా కలెక్టర్ శ్రీ కె. ఎస్. శర్మ గారు కావ్యాన్ని ముద్రింపించారు. ఆ సంస్కృత శ్లోకాల్లో 15 పద్యాల్లో కృతి ఉద్ధర్తలకు కృతజ్ఞతలు తెలియజేశారు. నాటి రాచరిక వ్యవస్థలో రాజలోకంలో కవులు కావ్యాలు ఉద్ధరింపబడగా నేటి ప్రజా యుగంలో గ్రామ నాయకులే ఈ కావ్యాన్ని ముద్రింపజేయడం గొప్ప విశేషం. ప్రజాదరణకిదొక నిదర్శనం. తెలుగు జాతి ఎంత కాలముండునో ఈ కావ్యమంత కాలముంటుంది.1

### కృత్యాద్యవస్థ:-

కావ్య వస్తువును అపారమైన జీవితానుభవాల నుంచి కవి సేకరించుకో-

---

1 డా॥ దాశరథి ఆచార్యులను "ప్రజా కవి శేఖరులని" పేర్కొంటు అన్న మాటలు.

వాలి.1 మహా కావ్యనిర్మాణానికి జీవితకాలం కృషి సలుపవలసి ఉంటుందని విశ్వసించిన ఆచార్యులు చిన్ననాటఁగోలె పితృపరంపరాప్రాప్తమైన కవితా వ్యాసంగంచే ప్రేరితులై, అభిమాన విషయమైన రైతు జీవితగాథను, పల్లె తెలుగు నుడికారపు సొంపులతో మలచుకొనుటలో తాము పడిన శ్రమ ఇంతా అంతా కాదని ప్రకటించుకొన్నారు. కవి ప్రతిభకు ఉపస్కారకంగా లోక శాస్త్ర కావ్యాద్యవేక్షణం నియతపరచబడినపుడే కవి కావ్య వస్తువును సంపాదించగలడు.2

ఆచార్యులు పోతారెడ్డిపేట అను గ్రామంలో వ్యవసాయంతో స్థిరపడి పల్లె ప్రజల జీవిత విషాద గాథలలోని బాధలను, వారిభాషను, అధ్యయనం చేసి అవగతం చేసికొని జానుతెనుగులో రైతురామాయణం రచించి రైతు వాల్మీకిగా ప్రశంసలనొందారు.3

ఘన ప్రయోజనాత్మికమగు కావ్య సృష్టి
కళకెగాక సమాజ వికాసమునకు
మధుర లలిత పయోధర మంజు సృష్టి
రతికెగాక మాతృత్వ సాహితి కొఱకును"

రై.రా. మున్నుడి పుట 2.

ఆనందోపదేశాలు, కళాత్మకత, సామాజిక స్పృహ లక్ష్యాలుగా, నిరంకుశత్వంలో జరిగే దోపిడి నుండి రక్షించడానికి సామాజిక కర్తవ్యంతో రైతురామాయణం రచింపబడిందని పేర్కొనబడింది.

## II. కావ్యారంభం :-

కావ్యారంభంలోని ఇష్ట దేవలాస్తుతిలో కావ్యవస్తువు నిర్దేశించ-

1 శ్రీశ్రీ ఏది విప్లవ పంథా – శ్రీశ్రీ - సార 208 పుట.

2 డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు - ఆధునిక తెనుగు సాహిత్యము- సాంప్రదాయము పుట 284.

3 "రైతు వాల్మీకి నాజోహార్లు" అని వానమామలై వరదాచార్యులు తమ అభిప్రాయాన్ని ప్రకటించారు.

మైంది.1 "గురునుతి" సుకవిస్తుతి" కావ్యత్వ సిద్ధిని ప్రకర్షింపజేశాయి. పిదప "మంగళాచరణంలో రైతుకృషి మహోదాత్తంగా సూచింపబడింది.

కావ్యంలో 80 పద్యాల్లో కవి వంశ అభివర్ణితమైంది. వంశపరంపరాగతంగా వచ్చిన కవితా పాండితి సంపద కావ్య రచనకు ప్రబల హేతువుగా చెప్పబడింది. "ఇష్ట దేవతాస్తుతి"లో కాపులకు గాపున్ గాపుగాc గొల్చెదన్" అని కావ్య వస్తువు ధ్వని గర్భితంగా నిర్దేశింపబడింది. పరదేవతాస్తుతి, వినాయకస్తుతి, వాగీశ్వరస్తుతి, ముగురమ్మలస్తుతి, త్రిమూర్తులస్తుతి, గురు వేంకటార్య స్తుతి, అభినవ పోతన వరదార్యుల స్తుతి, కావ్య గౌరవాన్ని పెంచాయి.

కుకవి నింద వదలివేయబడి సుకవిస్తుతి గావింపబడింది. "క్రిందటి యిప్పటి ముందటి యందఱు కవులం దలంతునంజలి యిడుచున్ మందుడనగునా బుద్ధికి నందని ప్రతిభా సమంచితాద్భుత మతులన్ అని కవి వినమ సంపద ప్రకటించబడింది.

"నాందీ మంగళాచరణం" ఈ కావ్యంలో నూతన ప్రక్రియ 4 పద్యాలలో పార్వతీ పరమేశ్వరులు సీతారాములు కావ్యానికి రక్షకులుగా స్తుతింపబడ్డారు. పార్వతి శివునితో ఆయువారములతో బ్రతకటం మంచిదికాదు. బస్వనకు కాలుని దున్నకు జతచేసి దున్ని సేద్య ఫలితాన్ని పొందినచో పసిc గాయ వెంకన్నయు చద్దితేను తాన్నునానని స్థాణు రొప్పుతుంది బిచ్చమెత్తి బ్రతకటం కన్న మద్దిదున్నుకొని జీవించటం మేలని ఉపదేశించటం జరిగింది. ఇక వాణి బ్రహ్మతో కోటివిద్దెలున్ గుంటుకు కోండ్రమించవట

---

1 i) ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దే శోవాఽ పితన్ముఖమ్
కావ్యాదర్శ – 1-4.

ii) "ఆదౌనమస్క్రియాశీర్వాదవస్తు నిర్దేశ ఏవవా।
క్వచిన్నిందాఖిలాదీనాం సతాంచ గుణకీర్తనమ్"
సాహిత్య దర్పణం 6-319.

iii) శ్లోకైర్మహా కథాయా మిష్టాన్ దేవాన్ గురూర్నమస్కృత్య
సంక్షేపేణ నిజంకులమభిదధ్యాత్ స్వంచకర్తృయా"
కావ్యాదర్శ – రుద్రట -16.

అని చాటింది. సీతారాముల మంజురసోక్తులలో "సీతాలాంగల పద్ధతిః" అని సీతారాములు కావ్యంలో కాపు సీతారాములుగా ధ్వనింపజేయబడి రైతు రామాయణ కథను ప్రత్యక్షమానమైంది.

చివరగా "భరతవాక్యం"లో కాపురాముడు వెలయుత రామరాజ్యము వెలయుత కావ్య కృషి సాగుగాత అని కాపురామునికథ లోక కళ్యాణాన్ని కోరుటతో ముగింపు జరిగింది.

ఈ ప్రక్రియ మంగళాదిని–మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యానిచ" అనే కావ్య ప్రయోజనం సాధింపబడింది.

## కృత్యవతారిక

కావ్యంలో 38 పద్యాల్లో కృత్యవతారిక ప్రత్యేకమైన ఒరవడితో నిర్వహింపబడింది. తెలంగాణంలో నిజాం దుష్ట పాలనకు అద్దం పట్టె దయనీయమైన పరిస్థితులు కావ్యకథ నడిపించడానికి సన్నివేశ కల్పనలుగా నిలిచాయి. రజాకార్లు, జమీందార్లు, జాగిర్దారులు, గ్రామ ముఖ్యులు ప్రజలను నానావిధాలుగా హింసించిరి. మతదురహంకారం,దారుణమారణకాండ, కాపుకూలీల స్వకష్టార్జితాన్ని దోచుకోవడం, వెట్టిచాకిరి, అమానుషంగా హింసించడం విచ్చలవిడియై పల్లె ప్రజలు దిక్కుదీము లేక నానావస్థలు. పొందిరి. ఘోర దారిద్ర్యం, కరవు కాటకాలు, పశుహాని, అధికార్లకు లంచాలు సాహుకార్ల అవక్ర చక్రవడ్డి, రజాకార్ల భీభత్సకాండ, జమీందార్లకు చెల్లించు ముడుపులు, నిరక్షరాస్యత, వరకట్నం, మతోన్మాద మారణకాండ అనునీదశముఖాల రావణాసురుని ప్రతినాయకునిగ సృష్టించుకోవటం జరిగింది. బ్రాహ్మణ వంశంలో పరుశురాముడు, క్షత్రియుల్లో సాకేత రాముడు. వైశ్యుల్లో గాంధీజీ అవతరించిన విధంగా కాపు కులంలోని రైతులందు ఆది దేవుని రామునిగ అవతరించి దశముఖ సంహారం జేయుమని ప్రజ వేడుకొన్నది. ఈ విధంగా కావ్యనాయకుడు రైతురాముడిని ప్రకటించబడింది. కావ్యకథకిది పూర్వరంగంగా నిల్చింది. కథాకల్పనకు ప్రధాన హేతువైంది. నాయకత్వ వరణం కావింపబడింది. ఇట్లె కృత్యవతారిక సామాజిక ప్రేరణ సామాజిక స్పృహగల రైతుకావ్య రచనకు హేతువైంది.

## స్వప్న సాక్షాత్కారం

కావ్యకథ ఆరంభించడానికి ముందు అరువై (66) పద్యాలతో కావ్యావతారిక రచించబడింది. ఇందులో కవి ఆత్మిక చైతన్యం, ఆత్మికవిచారం కావ్యకళ వ్యక్తం చేయబడింది.

స్వప్నంలో కవికి రైతు జీవిత కథాదృగ్విశేషం భావ్యమానమైంది ఇందులో కథాప్రణాళిక సిద్ధం చేసికొనడం జరిగింది. స్వప్నంలో కనపడిన రైతులో పరశురాముని బలరాముని దర్శించి వారి అవతార స్ఫూర్తిని కావ్యనాయకునికి ఆపాదించుకోవటం జరిగింది. రైతుకావ్యాన్ని వ్రాయడానికి సంకోచించే కవికి వాగీశ్వరి ఆశీర్వదించి రచించుమని ఆదేశించింది సీతాసమేతుడైన శ్రీరాముడు సాక్షాత్కరించి కావ్యనాయకత్వ భారాన్ని వహించాడు. ఈ స్వప్న సాక్షాత్కారం రామాయణ కథా సాదృశ్యం గల రైతురామాయణ కావ్యరచనకు పూర్వరంగంగా నిల్చి కావ్య దివ్యత్వ ఉదాత్తతలను, కావ్య గౌరవాన్ని పెంచింది.

## III. కావ్యకథ

మహాకావ్య రచనా ప్రణాళికలో కావ్యకథ మూడవది. కావ్యంలో రైతురాముని జీవిత ప్రస్తారం శిశు, శిక్షణ, కళ్యాణ, కృషి, నిర్బంధ విజయాలనే ఆరు కాండల్లో విస్తరిల్లి, సుమారు (3000) మూడువేల పద్యాల్లో కావ్యకథగా పరివ్యాప్తమై నిబద్ధింపబడింది.

## పల్లె వర్ణణం

రైతు జీవితం జానపద జీవన సంగతమైంది. కావ్యనాయకుడు రైతురాముని జీవిత వృత్తం శ్రీరామపురం కేంద్రంగా నడిచింది. అందువల్ల కథారంభం (70) డెబ్బది పద్యాల్లో "పల్లె వర్ణణం"తో సాగింది. శ్రీరామగిరికి సమీపంలో గౌతమి తటాన శ్రీరామపురం కలదు. ఆ పల్లె పరిసరాలు మిక్కిలి రమణీయమైనవి. అందమైన తోటలు, పచ్చని పైరులు, పల్లె పడుచుల, రూపురేఖా విలాసాలు, రైతాంగం, కూలీజనం సాగుబాటు పనులు. పల్లె ప్రజల జీవన వృత్తులు, పెంపుడు జంతువులు, పశువులు, బాతులు,

కోళ్లు, పక్షుల విన్యాసాలు, పల్లె వాతావరణంతో మేళవింపబడి నేత్ర పర్వంగా వర్ణింపబడినాయి. ఈ పల్లె వర్ణనం కర్షక నాయకుని అభ్యున్నతికి సోపానంగా అమరి ఉంది.

## కథా సంగ్రహం

## 1. శిశుకాండ కథ-నామౌచిత్యం

మొదటిదైన శిశుకాండ కథ 125 పద్యాల్లో నడిచింది. పంటల కొటపట్టు కృషి వ్యాపారులకు ఉనికిపట్టు శ్రీరామపురంలో సాగరయ్య అనే ఒక కాపు పెద్ద ఉన్నాడు అతడు అభిమానధనుడు పరోపకారపరాయణుడు. కృషి తత్పరుడు. గొప్ప పేరున్న వాడు. జమీందారు కుట్రలను కనిపెట్టి కట్టిపెట్టి ప్రజల సమస్యలను పరిష్కరించే ప్రజా బంధువు. నయవంచకమైన రజాకారు బూర్జువా జమీందారీ వ్యవస్థపై ప్రజాభిమతంతో క్రాంతి పథాన శాంతి విప్లవ పోరాటాన్ని ఆరంభించిన ధర్మకర్మ వీరుడు. అతనికి గంగమ మంగమలను ఇద్దరు భార్యలు. చాలా కాలం వారికి సంతానం కాలేదు. దానధర్మాలు వ్రతపూజ లొనరించగా శ్రీ వేంకటేశ్వరుని కరుణతో గంగమలకు రామలక్షణుల వంటి కుమారులు కలిగిరి. బాలుర బారసాల జాతక కర్మోత్సవాలు వైభవంగా జరిగాయి. జన గొడ్డు గేస్తు సాగరుని ఇంటిలో రామలక్ష్మణులు అవతరించటం వల్ల ప్రజల ఆనందానికి అవధుల్లేవు. దినమొక పండువుగా రెండేళ్ళు గడచాయి. గంగమాంబ మాహమ్మారి వ్యాధితో సాగరుని దుఃఖసాగరంలో ముంచి కన్ను మూసింది. శోకంతో శ్రార్ధకర్మాది విధులనునిర్వర్తించినసాగరయ్యకు మంగమాంబ అక్కలేని లోటును తీరుస్తూ రామలక్ష్మణుల పోషణ భారాన్ని స్వీకరించి ఉత్తమమాతృమూర్తిగా పిల్లలిద్దర్ని తీర్చిదిద్ది పెంచింది. కావ్య నాయకుడు రైతురాముని అతని తమ్ముడు లక్ష్మణుని జన్మ వృత్తాంతం వారి శైశవ విశేషాలు రామాయణ కథకు అనుగుణంగా నిర్వహింపబడుటచే శిశుకాండమనే పేరు సార్థకమైంది. కావ్యకథలో నిజాం జమీందారీ వ్యవస్థపై తిరుగుబాటుకు రామలక్ష్మణుల జననం బీజావాపనం జేసింది. సాగరయ్య శాంతి విప్లవ పోరాటానికి అంకురార్పణం జరిగింది. కథా ప్రయోజనాన్ని రామలక్ష్మణులు సాధిస్తారని సూచించటం జరిగింది. కాండం చివర మంగమాంబ శిశు పోషణ భారం వహించిందనుటచే శిక్షణకాండకథ సూచితమై కవియొక్క కథానిర్మాణ దక్షత చాటబడింది.

## 2, శిక్షణ కండకథ:-

నూటా అరువై ఎనిమిది (168) పద్యాల్లో శిక్షణ కాండకథ నడిచింది. శ్రీరామ లక్ష్మణులకు శుద్ధ ప్రతులుగా నున్న రామ లక్ష్మణులను స్వంత బిడ్డలుగా పెంచసాగింది మంగమాంబ. వారు కంచం మంచమొకటిగ, ఉనికి మనుకులొకటిగ అపూర్వ సోదర ప్రేమతో కలసి మెలసి పెరిగిరి. నాగలిదున్నుట, మోటగొట్టుట, పొలపునాట్లు వేయుట సేద్యవనుల ననుక-రించే ఆటలనాడి పిన్ననాటనే రైతు విషయిక జ్ఞానాన్ని పొందారు. గురువు తిరువేంగళప్ప వద్ద విద్యనభ్యసించారు. సుమతి శతకం, దాశరధి శతకం, వేమన శతకం, పెద్ద బాలశిక్ష, బాల రామాయణం కంఠోపాఠం జేశారు. మనుచరిత్రాది కావ్యపరిచితిని పొందారు. క్షేత్ర గణితం పట్వారిలెక్కలలో నైపుణ్యాన్ని సాధించారు. పంచతంత్రంలోని మిత్రలాభం, మిత్రబేదాలను అర్థంచేసికొని రాజకీయ పాండితిని పొందారు వ్యవసాయ పనుల్లో తండ్రిని మించిన కొడుకులనిపించుకొన్నారు.

లక్ష్మణుడు ఇంటి పనులందు, వ్యవసాయం పనుల్లో నిమగ్నుడ-య్యాడు. రైతురాముడు గ్రామ పునరుద్ధరణకు ఉద్యమించాడు. పాలికాపు మల్లన్న, రంగన్నలు వీరికి చేదోడువాదోడుగా ఉండేవారు.

రైతురాముడు ప్రజల్లో చైతన్యం కలిగించి వారికి హక్కులను బాధ్యతలను తెలియజేసి ఉద్యమించడానికి సిద్ధం జేశాడు, పల్లెసీమలను శాంతి సౌభాగ్య సీమలుగా మార్చుటపే సత్త్వర సమిష్టికర్తవ్యమని అందర్నీ ఐక్యవేదికపైకి తెచ్చాడు. పల్లెప్రజలను అక్షరాస్యులుగా మార్చే యత్నం చేశాడు. ఊరూరా "రైతు సంఘాలను" నెలకొల్పి కాపు సంఘాలకు అధ్యక్షుడైనాడు. అధిక దిగుబడులనిచ్చే వంగడాల సాగుబడితో గ్రామ కర్షక చరిత్ర సత్ఫలితాల్ని సాధించింది. రజ్వీరజాకార్ల కూటనీతిని, గ్రామపెత్తందార్ల కుటిల నీతిని, జమీందారు పాపారావు రాక్షస కృత్యాలను బాహాటంగా ఖండించి శాంతి విప్లవ పోరాటానికి ప్రజా బలాన్ని సమీకరించాడు. రైతు రాముని ధర్మ వీరోచితమైన గ్రామోద్ధరణ కార్యనిర్వహణకు సాగరయ్య ముురిసిపోయాడు.

రైతు రామలక్ష్మణులు విద్యా బుద్ధులు పొంది సుశిక్షితుతులగుట,

గ్రామ ప్రజలు అన్ని రంగాల్లో అభివృద్ధిని సాధించడానికి ఉద్యమించుట, కర్షకాభ్యున్నతి సాధింపబడుట, రైతు రాముని నాయకత్వం స్థిరపడుట"లనే యీ కథా ప్రణాళికతో శిక్షణకాండ సమర్థవంతంగా నిర్వహింపబడింది. శిక్షణకాండ ముగింపులో రామలక్ష్మణుల యౌవ్వన రూపురేఖావిలాసాలు వర్ణింపబడినందున తర్వాతి కళ్యాణకాండ కథకు మార్గమేర్పర్చినట్లైంది.

## 3. కళ్యాణకాండ:—

రైతు రామ లక్ష్మణులకు సీతాఊర్మిళలతో జరిగిన కళ్యాణ కథా ఘట్టాలు 725 పద్యాల్లో వర్ణింపబడినాయి. మిసమిసలాడే రైతురాముని సౌష్ఠవ యౌవన సౌందర్యానికి, సద్గుణసంపదకు, ప్రజా గౌరవానికి ముగ్ధులై తమ కన్యలనిచ్చి పెండ్లి జేయడానికెందరో ప్రముఖ దొరలు ముందుబడి వచ్చారు. వరకట్నమెంతైనా ఇవ్వడానికి సిద్ధపడ్డారు. సంఘ సంస్కరణా-భిలాషి రైతురాముడు వరకట్నానికాశపడక గంగారపు చౌదరి వంటి ప్రముఖులను నిరాకరించాడు. మంగమాంబ సాగరయ్యలు రామునకు పెండ్లిజేయ సంకల్పించారు. ప్రజలు తమ నాయకుని పెండ్లి వేడుకలను చూడాలనే ఆసక్తితో ఉన్నారు.

రైతురాముడు ఆశ్లేషకార్తెలో వరినాట్లువేయించే సమయంలో అందాలసుగుణరాశి కాపు సీతను, సిగపూవునందించే మిషతోచూచి ప్రేమించి ఆమె వివరాలు సేకరిస్తాడు. పేదకాపు సీత చుఱుకు పనితనం అతన్ని ఆకర్షిస్తుంది.

రైతు రామునిపై అనురాగాన్ని పెంచుకున్న కాపు సీత అతన్ని కలువడానికి పశువులకు మేత తెచ్చేమిషతో రాముని బాడువకంచెకువస్తుంది అచట ఆమె ఎలుగుబంటి బారిబడి రైతురామునిచే రక్షింపబడి అతని కుటీ-రానికి చేరుతుంది. ఏకాంతంలో వారు గాఢంగా ప్రేమించుకుంటారు ప్రకృతి పెండ్లి పెద్దయై వారినాశీర్వదించింది. తనను వెదకుతూ వచ్చిన శివయ్య వెంట సీత యింటికి చేరుతుంది. విరహవేదనకు గురియైన వీరి ప్రేమ వృత్తాంతం సీత తల్లిదండ్రులు మణమ్మ నాగయ్యలకు తెలుస్తుంది. వారు మురిసిపోయి మంగమాంబ సాగరయ్యలకు తెలియ పరచి వియ్యమందుకుంటారు. వరకట్నం తీసికోక రైతురాముడు సీతను పెండ్లాడుతాడు.

దేశీయాచారాలతో జరిగిన సీతారాముల పెండ్లి విందు నారగించి పల్లె ప్రజ లందరు ఆశీర్వదిస్తారు. నూతన మిథునం కాపు సీతారాముల "తొలిరేయి" నూరేళ్ళపంట, వెయ్యేళ్ళ సంగ్రహంగా, సంభోగ శృంగార రస పిపా సార్తితో గడుస్తుంది. వారి ఆదర్శ దాంపత్య జీవితం గార్హస్థ్య జీవితానికి ప్రతీకయై నిల్చింది. ఇందు శృంగార రసం పరిపుష్టమైంది. కళ్యాణకాండ కథ కావ్యానికి ఆయువు పట్టై, కావ్య ప్రయోజనం సాధించడానికి ప్రోద్బ లకమై, కావ్యనాయకుని శుభాభ్యుదయ నిశ్శ్రేయస పరంపర లబ్ధికి తోడ్పడింది.

## లక్ష్మణుని కళ్యాణ ఘట్టం

కావ్యనాయిక సీత ఉత్తమ గృహిణిగా బాధ్యతలు నిర్వహిస్తూ అందరిమన్ననలను పొందింది. మఱది లక్ష్మణునికి పెండ్లి చేయాలని రైతురామునకు ప్రస్తావిస్తుంది. దమ్మాపేట నుండి తనను చూడటానికి వచ్చిన చెల్లెలు ఊర్మిళ లక్ష్మణునికి చక్కని జంట అని తలచింది. చద్ది అన్నం తెచ్చి తినిపించిన ఊర్మిళపై లక్ష్మణునకు ప్రేమ కలుగుతుంది. పరస్పరాకర్షితులైన వారి ప్రేమ ప్రణయ రూపం దాల్చుతుంది. అన్నా వదినల కోరిక ప్రకారం ఊర్మిళా లక్ష్మణుల వివాహం తెలుగు వారి ఆచార వ్యవహారాలననుసరించి వైభవంగా జరుగుతుంది.

కాలమీవిధంగా గడచి పోతుండగా ఒక కాళరాత్రి రజాకార్లు దోపిడీ చేస్తూ వచ్చి రైతురాముని ముట్టడిస్తారు. వారు ఆయుధాలతో కొట్టగా మంగ మాంబ అడ్డుపడి రాముని కాపాడి తాను చనిపోతుంది. ఈ దారుణ సంఘట నకు విచలితుడైన రైతురాముడు రజాకార్ల దౌర్జన్యాన్ని అణచివేయడానికి సంకల్పిస్తాడు.

సీతారాములకు కొడుకు పుడతాడు. నామకరణోత్సవాన్ని ఘనంగా జరిపించి గంగామంగేశ్వరుడని పేరు పెడతారు. ఆ బిడ్డను "గోపి" అని ముద్దుగా పిల్చుకుంటారు. ఇంటికి కంటికి వెలుగైన తమ కొడుకును చూచి సంతోషించడానికి గంగమంగమాంబలు లేకపోవడం వల్ల ఆ దంపతులు మిక్కిలి బాధపడతారు. రైతురాముని నేతృత్వంలో పల్లె ప్రజలు వ్యవ సాయం పనుల్లో నిమగ్నమయ్యారు. కాలమీవిధంగా సాగిపోతూ ఉంది.

## 4. కృషికాండ

కర్షక ప్రాధాన్యంగల పలు అంశాలు 227 పద్యాల్లో వర్ణితమై కృషి కాండ కథ సాగింది. శ్రీరామపురం పరిసరాల్లో వర్షాలు లేక పురిసెడు నీరు కూడ కరువై కరవుకాటకాలేర్పడినాయి. పాడిపశు పంట సంపద కోల్పోయి తిండిలేక తరలిపోయే జనాన్ని ఆపి వారికి తమవద్దనున్న ధాన్యాన్ని పంచి వేస్తాడు రైతురాముడు. అన్నార్తులైన పల్లె ప్రజలను కాపాడవలసిందిగా దొరలను సాహులను భూస్వాములను అర్థిస్తాడు. ఒక్క ధర్మారాట్ప్రభువు మాత్రం అన్నసత్రాలు పెట్టి కరవు రక్కసి బారి నుండి ప్రజలను రక్షి స్తాడు రైతుల దండయాత్రకు దద్దరిల్లిన మిగిలిన భూస్వాములు కూడ తమ వద్దనున్న ధాన్యాన్ని పంచేస్తారు. దైవప్రార్థనలు చేయగా వర్షాలు పడి ప్రజ సంతోషించింది. రైతురాముడు వర్షాధారపు బ్రతుకైన కర్షకుల బాధ లను నివారించడానికి శాశ్వత పరిష్కారంగా ఇప్పలవాగుపై ఆనకట్ట కట్టి పెద్ద చెఱువును నిర్మించాలని పథకం వేశాడు. కాపు మల్లన్న సాహుపొన్న య్యలు సహకరిస్తారు. కాపు కూలీ రైతు సంఘాలు శ్రమించి సమిష్టి కృషితో సేతు నిర్మాణమౌతుంది. పుష్కలంగా నీటిసౌకర్యమేర్పడుతుంది. పల్లం యెఱుకు నేలల చేలన్నియు సస్యశ్యామలాలైనాయి. పుట్లకొలది ధాన్యాలు పండించి ప్రజలు కరవు రక్కసి నుండి విముక్తిపొంది సిరిసంపదలు కల వారౌతారు. ఈర్ష్య మాత్సర్యాలతో జమీందారు పాపారావు రైతురాముని సాధించే ప్రయత్నంలో ఉంటాడు ఇట్టి కృషికాండ కథ అన్నార్థాభిదానమై కావ్యనాయకుని ఫలసాధనకు ఉన్ముఖునిగా జేసి ధీరోదాత్తునిగా నిలబెట్టింది.

## 5. నిర్బంధ కాండ

ప్రతినాయకుడు జమీందారు పాపారావుచే కావ్య నాయిక సీత నిర్బం ధింపబడిన వృత్తాంతం 630 పద్యాల్లో వివరింపబడింది.

శ్రీరామపురం పరిసర పరగణాల మొత్తానికి ఏకైక ఏలిక అపర రావ ణుడు జమీందారు పాపారావు అశ్వపదాతి ఫిరంగి దళాలచే అతని దుర్భేద్య మైన కోట రక్షింపబడుతుంది. రోహిలాలు, రజాకార్లు, ఆటవికులు కరడు గట్టిన క్రూరులు అతనిపటాలాలు. సుందరమ్మ జమీందారుసోదరి భర్తలేని ఆమె శూర్పణఖవంటి వన్నెలాడి. ఒకనాడది లక్ష్మణుని అందాన్ని చూచి కామించి

పొందుకోరుతుంది. తిరస్కృతమై అవమానం పొందుతుంది. రైతు రామలక్ష్మణులు సాధించే ప్రయత్నంతో సోదరునికి సీతసౌందర్యాన్ని వర్ణించి సీతనుపొంది ప్రతీకారం తీర్చుకొనుమని దుర్బోధజేస్తుంది. రైతురాముని పైనున్న కక్షతో సీతను తనదానిగా జేసికొనే తలంపుతో జమీందారు పొన్నయసెట్టితో దుర్మంతనాలాడుతాడు నగల కొఱకు సెట్టింటికి వచ్చినసీతవర్షం కారణంగా కోటకు చేరి పాపారావు భటులతో కోటలో బంధింపబడుతుంది. నానా మాటలతో హింసిస్తూ, పటాటోపాన్ని ప్రదర్శిస్తూ రాముని నిందిస్తూ సీతను పొందడానికి గడపు పెడతాడు జమీందారు పాపారావు. పరిపరివిధాల పలవించే సీతను త్రిజటవలె వృద్ధురాలైన అవ్వ అనునయించి స్థైర్యాన్ని కలుగజేస్తుంది సీత నిర్బంధింపబడిన విషయం సెట్టి వలన తెలిసికొన్న రైతురామలక్ష్మణులు ధర్మారాట్ప్రభువు సైన్యసహకారంతో జమీందారుపై యుద్ధం ప్రకటిస్తారు. కాపు కూలీ రైతుప్రజ రామునకు అండగా నిలుస్తుంది. ఎదుర్కోవడానికి జమీందారు తన సైన్యాన్ని అప్రమత్తం జేస్తాడు.

## 6. విజయకాండ

సీతను నిర్బంధం నుండి విడిపించి రైతురాముడు జమీందారు పాపారావును జయించిన కథాఘట్టం 251 పద్యాల్లో విజయకాండలో చిత్రితమైంది.

సీత నిర్బంధ వార్తకు దురపిల్లిన రైతురామునకు లక్ష్మణుడు ధృతినొసగి ధర్మరాట్ప్రభువు సైన్య సహకారాన్ని కోరుతాడు. అతడు హనుమప్పను సేనానిగా జేసి సైన్యాన్ని పంపుతాడు. రైతురాముని ఆజ్ఞను తీసికొని హనుమప్ప జమీందారు కోటకు చేరుతాడు సన్యాసి వేషంతో జమీందారును నమ్మించి సీత నిర్బంధించి ఉన్న జాడ తెలిసికొంటాడు. శోకంలో మునిగి ఉన్న సీతకు రైతురాముని క్షేమవార్తను తెలియజేస్తాడు. గడువులోపల రాముడు చెఱవిడిపించగలడని చెప్పి జమీందారు సీతను నిర్బంధించాడన్న విషయాన్ని కోట గోడలపై వ్రాసి సీత క్షేమవార్తను రామునకు చేరవేసి దూతకార్యం నెరవేస్తాడు

ధర్మారాట్ప్రభువు, రైతురామలక్ష్మణులు జమీందారు సైన్యాలనెదు

రొక్కన్నారు. హనుమప్ప జమీందారు సేనాని కొండని నేలగూల్చాడు జమీం దారు సైన్యాలు చెల్లాచెదురై వెనుదిరిగాయి. పోరు ఘోరంగా జరిగింది. జమీందారు ఏకాకిగా చేజిక్కాడు. జమీందారు నణచుటకు వచ్చిన భారత యూనియన్ సైన్యాల పదఘట్టన క్రింద నలిగి జమీందారు హతుడైనాడు. జమీందారీ నిరంకుశత్వానికి తెఱపడింది. రైతురాముడు జమిందారు కుటుం బానికి రక్షణ కల్పిస్తాడు. వృద్ధులైన అవ్వ. ధర్మారావు ప్రభువు హనుమప్పలు సీతా పాతివ్రత్యాన్ని స్తుతించగా రైతురాముడు సీతను పరిగ్రహిస్తాడు. పాపారావు దురాక్రమణలో నున్న 100 ఎకరాల మాగాణిని ధర్మారావు ప్రభు రైతురామునకొసగి రైతులకు నాయకునిగా నిల్పి భీమ సంస్థానానికి చేరు కొంటాడు.

కర్షకాభ్యుదయం, నామకాభ్యుదయంజరిగి ధర్మం స్థాపింపబడింది. రజాకారు జమిందారు బూర్జువా వ్యవస్థ అంతమైంది. విజయకొండ కథ కావ్య ప్రయోజనాన్ని సాధించింది.

## కథా సంవిధానం

ఆధునిక కావ్య విమర్శకుల అభిప్రాయంలో ఇతి వృత్తాన్ని "సంభా వ్యములనిపించునట్లుగా సహజోన్మీలనమును కలిగించుచు, వివిధ సంఘటన లను అనుగుణమైన ఆశ్రయ కల్పనముతో సుద్దీప్తముల జేసి, పరస్పరం హత్తించి కావ్యమందలి ప్రధానాంశాభిముఖంగా వికసింప జేయుచు, దానిని స్ఫురణ గోపన ప్రక్రియలతో సహృదయులందు ఉత్సుకతను నిలువ రించుచు, చివరకా యంశము ప్రస్ఫుటమగునట్లుగా కావ్యమునందు ఇతి వృత్తమును నిర్వహించుట నిర్మాణ శిల్పమగును"1

రైతురామాయణంలోని కావ్యనాయకుడు జమీందారు పాపారావుపై విజయం సాధించి అతని నిర్బంధం నుండి సీతను విడిపించి నిజాం పాలన లోని జమిందారీ వెట్టి చాకిరి వ్యవస్థ నుండి ప్రజలనుద్ధరించటం కర్మకాభ్యు దయాన్ని సాధించటం అనేవి ముఖ్యాంశాలు. ఈ కథ పరిపుష్టంగా, ఆకృతి

1 ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ-డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు 165వ పుట

సౌష్ఠవంగా ఉండటానికి,కావ్యోద్దిష్ట ఫలప్రాప్తికి ప్రాసంగికంగాకథోపాంగాలను సమకూర్చుకుంది. రామాయణ కథాపాత్రలననుసరించే, ధర్మారావ్రభువు, హనుమప్ప, సుందరమ్మ వృద్ధస్త్రీ వృత్తాంతాలు, ఘటనా శిల్పంతో ప్రకరి పతాక స్థాయి కలిగి ప్రాసంగికాలుగా అమరినాయి. కావ్యనాయిక సీత, ఊర్మిళాలక్ష్మణులు, గంగ మంగ సాగరయ్యలు, ప్రతినాయకుడు జమిందారు పాపారావు పాత్రల ప్రస్తారాలు కావ్యనాయకుని పరివేష్టించి కథకు హత్తించబడినవి. ధర్మానుప్రాణితంగా ధీరోదాత్తుడు రైతురాముని గాధ శిల్పించబడింది.

సీతారామ, ఊర్మిళా లక్ష్మణ, హనుమత్సుగ్రీవ, రావణ శూర్పణఖ త్రిజటల పాత్రలతో రామాయణ కథతో పోలిన ఈ కావ్యకథ రైతు జీవిత ప్రస్తారానికి సమన్వితి పొంది కావ్యనాయకుడు రైతురామునితో పరివేష్టించి కౌశల్యంతో నిర్వహింపబడింది. అందువల్ల కావ్యనామం"రైతురామాయణం ఔచితీ పూర్ణంగా ఉంది1

# I కర్షక జీవితాన్ని ప్రతిబింబించే కథాసన్నివేశ కల్పనలు

## 1. శ్రీరామపురం పల్లె వర్ణనల ఘట్టం

కావ్య కథకు కేంద్రస్థానం శ్రీరామపురం. రైతురాముని కార్య నిర్వహణకిది రంగభూమి కావ్యనాయిక సీత నిర్బంధింపబడిందిచటనే. ప్రతినాయకుడు జమీందారు పాపారావు కిరాతక చర్యలను ప్రతిఘటించు ప్రజాబల సమీకరణకు అంకురార్పణం జేసిన సాగరయ్య, విజయం సాధించిన రామలక్ష్మణులు పుట్టిపెరిగిన పల్లె శ్రీరామపురం. ఇచటనే రామలక్ష్మణులకు కావలసిన విద్యాబుద్ధుల శిక్షణ గురువేంగళప్ప వద్ద లభించింది. తుదకు రామలక్ష్మణులచే జమీందారు పాపారావు నిర్జింపబడిన రణరంగ క్షేత్రం

1 "నేతాస్మిన్ యదునందనః స భగవాన్ వీర ప్రధానో రసః
శృంగారాదిభిరంగవాన్ విజయతే పూర్ణాపునర్వర్ణనా
ఇందప్రప్రస్థ గమాద్యుపాయ విషయశ్చైద్యావసాదః ఫలం"
ధన్యోమాఘ కవిర్వయంతు కృతినస్తత్సూక్తి సంసేవాత్
మల్లినాధవ్యాఖ్యా–శిశుపాలవధ–1-1 శ్లో–

కూడ శ్రీరామ పురమే. ఇట్టి పల్లె పట్టణాలకు ఆయువు పట్టు, ఎందుకనగా అచట నేలబారెడి చీమకైన, మంటపరుగు దీసెడి ఏ కుంటి పక్షికైన. అగ్గి ముచ్చటలాడ తీరదు, కర్షకాభ్యున్నతికి, నాయకాభ్యుదయానికి శ్రీరామ పురం వర్ణనాఘట్టమెంతో కావ్యకథకు ఉపకరించింది.

## 2: అశ్లేషకార్తిలో వరినాట్ల సన్నివేశ కల్పనం:-

రైతు రాముడు వరినాట్లు వేయు కాపు పడతుల్లో పని చురుకుదనం గల సీతను పూవుమిషచే చూచి ప్రేమించుట జరిగింది. ఈ వృత్తాంతం తర్వాతి సీతారాముల కళ్యాణ ఘట్టానికి పాదులు వేసింది కావ్య కథకు సహజత్వాన్ని కూర్చింది.

## 3. గ్రామీణ జీవన చిత్రణం:-

కర్షక కుటుంబ జీవితం, పశుపోషణం, పాడిపంటలు, వ్యవసాయపు పనులు, కులవృత్తి పనులు, పల్లె ప్రజల అమాయక జీవితాలకు అద్దం పట్టినాయి. ఇట్టిగ్రామ సంపదను దోచుకునే జమీందారీ వ్యవస్థ రూపుమాపాలనే ఆశయం, ఉత్సాహం కావ్యనాయకునికి కలిగించటంలో ఫలితాన్ని పొందిదీ గ్రామీణ జీవన చిత్రణ కల్పనం.

## 4. కరువు కాటకాలు:-

వానలు లేక పురిసెడు నీరు కూడ కరువై పాడిపంటలను కోల్పోయి తిండికి అలమటించిన పల్లెరైతు కూలి ప్రజను రైతురాముడు రక్షిస్తాడు. ఆకలిచే అలమటించే ప్రజకు తమను దోపిడి చేసే జమీందారీ వ్యవస్థయే కారణం అనే వాస్తవం తెలుస్తుంది. వర్షాధారమైన బ్రతుకుకన్న శాశ్వత నీటి వసతి గల వ్యవసాయం ఆవశ్యకమైందని గ్రహిస్తారు. సమిష్టి కృషితో పెద్ద చెఱువు నిర్మాణం గావింపబడటం వల్ల రైతురాముని ఔదార్య గుణం ధర్మాదిశౌపరత్వం రక్షకత్వం చాటబడి కావ్య నాయకత్వానికుండదగిన అర్హత సాధింపబడింది. కర్షకాభ్యున్నతికి నాంది పల్కింది. తన దౌర్జన్య చర్యలకు ప్రతి బంధకంగా నిల్చిన రైతురామునిపై జమీందారుకు మాత్స ర్యం కలిగి కక్ష సాధించే ప్రయత్నానికి పురికొల్పిన ఈ కరువుకటకాల

సేతు నిర్మాణ కథా కల్పన ఘట్టం సీతా నిర్బంధానికి పాదులు వేసి కావ్య కథను సుగమం చేసింది.

## II. రామ కథానుగుణ కల్పనలు:-

రామాయణ కథా లక్షణాలను అభివ్యక్తంజేసే లక్షణాలు కావ్య కథా సంవిధాన శిల్పానికి దోహదమైనవి.

### 1. సాగరయ్య, గంగమాంబలు:-

సాగరం వర్ష రూపంగా నీటిని అందించి సేద్యానికి ఉపకరిస్తుంది. రైతులకు దైవంతో సమానమైంది.

కర్షక వరాలర్షిణి గంగాఝురి సాగరంతో పెనవేసికొని సాగరంలో లీనమౌతుంది. సాగరత్వ ధర్మంగల సాగరయ్యకు గంగమాంబ పెద్ద భార్య ఆమె సోదరి మంగమాంబ రెండవ భార్య. వ్రత దీక్షల ఫలితంతో, శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహంతో వారికి రామ లక్ష్మణులు జన్మించారు. రామాయణంలో దశరథునకు భార్యలు ముగ్గురుండగా హాలిక ప్రాధాన్యం గల రైతు రామాయణంలో కైకేయి, భరతుల పాత్రలవసరం లేదు. కావున కవి కథాప్రణాళికలో సాగరయ్యకు గంగకు మంగలకే స్థానమిచ్చాడు. పున్నమి చంద్రుని జూచి కడలిపొంగు విధంగా రైతు రామచంద్రుని కనుటతో సాగరయ్య ఆశయం నెరవేరింది.

### 2. రైతు రామలక్ష్మణులు:-

శ్రీమన్నారాయణుడు శంఖచక్రాదుల అంశతో దశరథునకు శ్రీరాముడిగా జన్మించి రావణాదిరాక్షసులను సంహరించాడు. అదేవిధంగా సాగరునికి రామలక్ష్మణులు జన్మించి పల్లె ప్రజలను వేధించే జమీందారు మొదలగు మానవరూప రాక్షసుల దురాగతాలను నిర్మూలించారు. రామలక్ష్మణులకు శుద్ధ ప్రతులుగానున్న రైతు రామలక్ష్మణులు కారణజన్ములై తమ బాధలెల్లబాపెదరని ప్రజ సంతసించింది. సాగరయ్య తలపెట్టిన క్రాంతితోడి శాంతి విప్లవ పోరాటం రామలక్ష్మణుల ధర్మోత్సాహ కార్యనిర్వాహణంతో విజయాన్ని సాధించింది.

### 3. కాపు రామలక్ష్మణుల వివాహ ఘట్టాలు:-

పూవుమిషచే పలుకరింపబడి రైతురాముని వలచి రాముని కంచెలో గడ్డిగోముచు ఖల్లాకబారి పడుతుంది సీత రాముడామెను రక్షిస్తాడు. "ఆది నారాయణుని వెంట లక్ష్మియటులాత్మ మనోరథ ఉవ్వమానమై, రాముని వెంట తానునయి అచ్చమా కాపుకుమారి, సీత రాముని వెంట పర్ణశాలకు నడచివెళ్ళింది. ఆమెను వెదకుతూ వచ్చిన శివయ్య "నాడు రాముని వెంట చిన్నారి సీత కానకోనలకు నడువదే" అంటాడు, పర్ణశాలలో సీతారాములు ప్రేమించుకుంటారు. పెద్దల ఆమోదంతో వారి పెండ్లి జరుగుతుంది "శ్రీసీతా రామ సుసంవాసిత కళ్యాణ మిధున వద్భాసితమై శ్రీసీతారామ మిధునమిది నవదీప్తితో శ్రీరామపురం పల్లె భాసించింది". ఇట్లీ సీతారామ కళ్యాణ కల్పన కథ రామాయణ కథాంశాన్ని తలపిస్తూ తర్వాతి కథను స్ఫురింప చేస్తుంది.

### 4. కాపు ఊర్మిళా లక్ష్మణుల కళ్యాణ ఘట్టం:-

ఊర్మిళను సాగనంపుతు వెంటనడిచే మరది లక్ష్మణుని జూచి సీత "మరదలమ్మవెంట నడిచె బాబు, ఊర్మిళ వెంట లక్ష్మణుడయి"అని భావించింది చద్దిదెచ్చిన ఊర్మిళను లక్ష్మణుడు ప్రేమిస్తాడు. వీరి విషయం తెలిసిన సీత రైతురామునితో "బావకు దానికెదో యనుబంధము క్రిందటి జన్మజన్మలన్ దైవిక ప్రేమసూత్రమునం దార్పబడెన్" అని అందర అనుమతితో ఊర్మిళా లక్ష్మణుల వివాహాన్ని జరిపిస్తుంది. ఇట్లీ ఊర్మిళాలక్ష్మణుల సీతారామలక్ష్మణుల కళ్యాణ ఘట్టాలు కావ్యకథలో ఆదర్శ దాంపత్యధర్మం, గృహస్థాశ్రమ ధర్మ విలువలను చాటినాయి.

### 5. ఇప్పల వాగుపై సేతు నిర్మాణం:-

కరువు కాటకాల కర్కశ రాక్షస నాశనములకై నడుము గట్టి రైతు రాముని సేన యనబరగు రైతులు ఇప్పల వాగుపై సేతు బంధము గావించిరనే కీర్తి గ్రామగ్రామాలకు ప్రాకింది. సేతు నిర్మాణానికి సంతోషించిన ప్రజ జమీందారు ప్రముఖులు "శ్రీరాముడె రాముడు మరి రైతులె యాకపి

బలమ్ము లాగడియు కటుల్" అని కీర్తించిరి. ఈ కథా కల్పనం రైతుల సుసంఘటిత శక్తిని ఏకత్రితం జేసి రైతురాముని నాయకత్వాన్ని స్థిరపరచింది. అందువల్ల ప్రతి నాయకుడు జమీందారుకు కంటగింపు కల్గి సీతా నిర్బంధం జరిగింది. శ్రీరామునకు వానరసైన్యం తోడైన విధంగా రైతులెల్ల రైతురామునకుతోడై జమీందారును నిర్మూలించడం జరిగింది. ఇది కావ్య కథకెంతో ఉపస్కారకంగా ఉంది.

## 6. ధర్మారాట్ప్రభువు వృత్తాంతం:-

భీమవరం సంస్థానాధిపతి ధర్మారాట్ప్రభువు జమీందారు పాపారావు దురహంకారానికి కరువు కాటకాలకు బలియైన అన్నార్తులైన రైతు కూలీ ప్రజలకు అన్నదానం జేసి రక్షించిన ఉదారుడు అడ్డుకట్టవేయటానికి ఉపకరించిన ధీరుడు. అతని "ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ" తన సైన్యంతో రైతురామునకు అండగా నిల్చి, జమీందారును నిర్జించడంలో సహకరిస్తాడు. నిర్బంధం నుండి విముక్తి పొందిన "సీత ఉత్తమ ఇల్లాలు ఆమె నేడ్పించుట తగదని, రైతురామునిచే పరిగ్రహింపజేసిన ఉత్తమ చరిత్రుడు. ఇది ప్రాసంగిక కథగా సుగ్రీవ వృత్తాంతాన్ని తలపింపజేస్తుంది.

## 7. సుందరమ్మ వృత్తాంతం:-

జమీందారు పాపారావు ఏకైక సోదరి సుందరమ్మ. ఆమె చుప్పనాతి వంటిది, విధవరాలు, రైతు లక్ష్మణుని కామించి కోరిక తీర్చుకొన ప్రయత్నించి విఫలురాలైంది. 'ఈ చుప్పనాతియెడ, నీచాత్మకురాలియెడ కరుణ జాలి కూడదని'ఈ లంఖిణి చెవి ముక్కులు చెక్కి యాలంకపైవు వంపిచుమని రైతురాముడనగా లక్ష్మణుడు "ఛీ! రావణుదౌ చెల్లెలికైన దుర్గతియెయౌన్ పాపాలకున్" అని అవమానించి వెడలనడిపాడు. అది ప్రతీకారంతో జమీందారునకు ఉద్బోధించి సీతను నిర్బంధింపజేయడానికి కారణమౌతుంది. ఈ సుందరమ్మ కథా కల్పనం అచ్చుగా శూర్పణఖచే ప్రేరితుడైన రావణుడు సీతనపహరించి చెఱపెట్టిన ఘట్టాన్ని స్ఫురింపజేస్తుంది. ఈ కథాకల్పనంలోని ప్రతి చర్య కావ్య కథకు పరోక్షంగా ఉపకరించింది.

## 8. జమీందారు పాపారావు ఔద్ధత్యం

లంకేశుడైన రావణుని స్వభావంతో సరిపోలిన ఔద్ధత్యం కలవాడు జమీందారు పాపారావు. లంకంత కోటలోకి పోతుటీగకూడ జొర రానివ్వని రోహిలాల సైన్య బలం గలవాడు. రైతురాముని సాధించడానికి సుంద రమ్మచే ప్రేరితుడై సీత సౌందర్యానికి ముగ్ధుడై, దుష్కామలోలుడై కాపు సీతను నిర్బంధిస్తాడు. ప్రజాబలం, యూనియన్ సైన్య బలంతో రైతు రాముడు జమీందారును నిర్మూలిస్తాడు. అపర రావణుడు జమీందారు పాపారావు మాత్సర్యంతో కూడిన కిరాతక ఔద్ధత్య చర్యలు కావ్యనాయకు నికి ధృతి ఉత్సాహాలను పెంచి విజయపథం వైపు నడిపించాయి. ఇది కథా సంవిధానానికి తోడ్పడింది.

## 9. కాపుసీత ఆభరణాల నిమిత్తం పొన్నయశెట్టి ఇంటికి వెళ్ళుట

"బంగారు లేడికోసం సీత పతిని ప్రయాస పెట్టిన విధంగా కాపుసీత పైడిపై గల కాంక్షచే నగల కొఱకు రైతురాముని సాధిస్తుంది. భర్త ఆజ్ఞతో నగలు చేయించుకొనే నిమిత్తం సీత పొన్నయసెట్టింటికి వెళ్తుంది. జమీం దారు అజ్ఞతో పొన్నయసెట్టి పన్నిన పన్నాగంలో చిక్కుతుంది. తిరుగు ముఖంలో సీత వర్షం కారణంగా జమీందారు కోటకు చేరుతుంది. కాచుకొని ఉన్న జమీందారు భటులచే నిర్బంధింపబడుతుంది. సీతకు గల పైడి ప్రలోభం రామాయణం బంగారు లేడి కారణంగా రావణునిచే సీత అపహ రింపబడిన వృత్తాంతాన్ని తలపిస్తుంది. ఈ కథా కల్పనం సీత నిర్బంధింప బడటానికి ప్రబల కారణమై కథా సంవిధానానికి ఉపకరించింది.

## 10. కావ్యనాయిక నిర్బంధం

జమీందారు తన కోటలో నిర్బంధించిన సీతను సమీపించాడు. ఆయమ మెయికాంతిలో ఏదో అమలిన దివ్య తేజము దురాసదమౌటకి మూర్తిమత్వమును చూచి స్పృశించటానికి వెఱచాడు. ఈ రామగుణాభిరామ చొరరాని పవిత్ర సతీత్వశీల సుస్థేమ అని భావించాడు. సీతను లొంగదీయ

డానికి సుందరమ్మ "నీ యదృష్టము దొడ్డది. నీవు సీతవు, అపర లంకేష దైవ మాయన్న కంటబడితివి. నిన్ను వదలడు" అని సీతను బెదిరిస్తుంది. సీతను వశం చేసికోవడానికి జమీందారు ఒక అవ్వను సీతకు కావల పెడ తాడు. హనుమప్ప దౌత్యంతో సీత జాడ రాముడు తెలిసికొని జమీందారుని జయించి సీతను పరిగ్రహిస్తాడు. అశోకవనంలో సీత పొందిన ఆవేదనను తెలియపరచే ఈ ఘట్టం కావ్యకథా నిర్వహనకు ఎంతో సహకరిస్తుంది.

## 11. సీతకధైర్యమిచ్చి అవ్వ వృత్తాంతం

జమీందారుకు నమ్మకస్థురాలైన వృద్ధురాలైన అవ్వ నిర్భంధంలో సీతకు కాపుగా ఉంటుంది. ఆమె వలవించి మూర్ఛిల్లిన సీతకు మనో ధైర్య మిస్తుంది. "అమ్మ రెండవ సీతమ్మా, రాముని నమ్ముకొనే ఊరడిల్లుమని ఓదార్చింది. యోగి వేశంలో వచ్చిన హనుమప్పకు కోట రహస్యాలను చెప్పింది. రైతురాముడు వచ్చి సీతను చెఱవిడుపించునని తల్లికి మారుగా సీతకు అండగా నిల్చింది. సందేహిస్తున్న రైతురామునికి సీత అగ్గివంటిది ఆమెనన్న వారికి రౌరవాది నరకము వచ్చునని సీత సతీత్వాన్ని చాటి చెప్పి అతనిచే పరిగ్రహింప జేస్తుంది. రామాయణంలోని త్రిజటావృత్తా తాన్ని తలపించే వృద్ధయైన అవ్వకథ కథానాయకుని ఫలనిర్వహణకు దోహదం జేసింది.

## 12, హనుమప్ప దౌత్యం

ధర్మారాట్ప్రభువు రైతురామునకు అంపిన సైన్యానికి సేనాని హను మప్ప. సీతజాడ తెలిసికోవటానికి యోగి వేశంలో జమిందారు కోట ప్రవే శించి వృద్ధ అవ్వ వలన కోట రహస్యాలన్ని తెలిసికొంటాడు. సీతకు రైతు రాముని క్షేమవార్తను తెలిపి, గడువులోపల రైతురాముడు వచ్చి చెఱ విడి పించునని తెలియజేస్తాడు తిరుగు ప్రయాణంలో పాపిహావడీల్లుననియు, సీతను పాపపుబుద్ధితో అపహరించిన అపర రావణుడని వాని రాక్షస కృత్యాలు కృత్యాలు జమీందారు కోటగోడలపై వ్రాసినాడు సీత క్షేమవార్తను రైతు రామున కెఱింగిస్తాడు. ఈ దౌత్యకల్పనం రామాయణంలో హనుమద్దౌ త్యాన్ని పోలి ఉంది. జమీందారు పాపారావుపై రైతురాముడు యుద్ధం ప్రకటించినట్లు ఈ సన్నివేశకథ చాటుతుంది.

## 13. సీతా పరిగ్రహణం

జమీందారు పాపారావు మరణంతో సీతా నిర్బంధం తొలిగింది. ఆమెను పరిగ్రహించడానికి రైతురాముడు శంకిస్తాడు. "సీత పూతాత్మ, ఆమె ప్రాణాలతో చెలగాటమాడరాదు. సాధ్వి వధ మహాపాతకం" అని ఆమె పాతివ్రత్యాన్ని చాటిచెప్పి అవ్వ, హనుమప్ప ధర్మారాట్ప్రభువులు రైతు రామునికి తెలియజేస్తారు. "నీ సతీత్వశీల మాలోక మెరింగె, నేను మున్నెరిగిన తడనె" అని ప్రేమతో సీతను రైతురాముడు పరిగ్రహిస్తాడు. రామాయణంలో సీతా పరిగ్రహణ ఘట్టాన్ని తలపింపజేస్తుంది. సీత నిరపరాధ, పూత చరిత మహాసాధ్వి" అని లోకానికి చాటునట్టి ఈ కల్పనం మంగళాంతంగా కావ్యకథకు దోహదపడింది.

# III. ప్రబంధోచిత కథా సన్నివేశాలు

కావ్య ప్రధానకథకు సారస్యాన్ని కూర్చి ప్రబంధోచితమైన అల్పాంశ కథా సన్నివేశ కల్పనలు హత్తించబడి సమగ్రతతో ప్రబంధ కావ్యంగా రూపుదిద్దుకుంది రైతురామాయణం.

## 1. గంగమాంబ నిర్యాణ కథనః

సాగరయ్యకు గంగమంగమలిర్వురు భార్యలు దైవానుగ్రహంతో గంగకు రాముడు మంగకు లక్ష్మణుడు జన్మించారు. లొంగని వ్యాధి కారణంగా గంగమాంబ నిర్యాణమొతుంది. లేత శిశువులైన రామలక్ష్మణులను మంగమాంబ బాధ్యతతో పెంచింది. ఏకోదర సోదర ప్రేమలు పిన్ననాటనే పాదుకొల్పబడినాయి. అందువల్ల లక్ష్మణుడు వ్యవసాయం ఇంటి పనుల బాధ్యతలను స్వీకరించగా రైతురాముడు కర్షకాభ్యుదయ నిర్వహణంలో కావ్యనాయకుడుగా ఎదుగ గలిగాడు. గంగలేని లోటును తీర్చి చివరకు మంగమ రైతురాముని రజాకార్ల బారినుండి రక్షించడానికి ప్రాణాలను కూడ అర్పిస్తుంది. గంగమ యున్నచో రామలక్ష్మణులకు ఏకోదరులమనే భావం లోపించెడిది. కావున కావ్య కథా ప్రయోజనానికి గంగమాంబ పాత్ర నిష్క్రమించబడింది.

## 2. తిరువేంగళప్ప వద్ద రైతురామలక్ష్మణుల విద్యాభ్యాసం

మొండి బండరాయినైనా రత్నమణిగా రాఁదొలిచే నైపుణ్యంగల తిరువేంగళప్ప వద్ద రైతురామలక్ష్మణులు విద్యనభ్యసించారు. భారత భాగవత రామాయణాదులు, నీతిశాస్త్రం, గణితశాస్త్రం, పంచతంత్రం నేర్చుకొన్నారు. నాయకోపనాయకులు సుశిక్షితులై విద్యావంతులై భూస్వాములు జమీందారులు వేసే ఎత్తులను చిత్తు జేసే రాజకీయ పాండిత్యం, పరకట్ని దురాచారాన్ని నిర్మూలించే సంస్కారం, ప్రజాబలాన్ని సమీకరించే నాయకత్వ లక్షణం పొందగలిగారు. స్వల్పమైన ఈ విద్యాభ్యాస కల్పనం రైతురామకథను ధర్మానుప్రాణితంగా నడిపించే ప్రణాళికకు రంగం సిద్ధం జేసింది.

## 3. నాయికానాయకుల ప్రణయకథా కల్పనం

ఆశ్లేష కార్తెలో వల్లె పడుచులు వరినాట్లు వేయు తటి వారందరిలో రతి సుందరిగా చుట్టుమిన్క జుక్కల నడుమ చందురురేఖాజ్యోతిగ కాపు సీత రైతురామునాకర్షించింది. పనికత్తెలలోన మేలుబంతి. కాపుజాతికే వన్నెను గూర్చిన ఆ ముగ్ధయొక్క సిగపూవు గెంతిపడగా రైతురాముఁడది తీసి ఆమె కొసగును. ఈ సన్నివేశ కల్పనతో ఇరువురి యందనురాగము పెరిగింది. ప్రణయం పరాకాష్ఠకు పరిణయం పరిష్కారమైంది. ఈ సన్నివేశకథ ప్రబంధోచితమై కావ్యకథను సంవిధానం జేసింది.

## 4. భల్లూక వృత్తాంతం

సీత రైతురామునిపై వలపుగొని, పచ్చిక తెచ్చే మిషతో, రాముని కంచెచేలుకు వచ్చి, గర్జారావాటాలతో గగ్గోలు చేసే భల్లూకం బారిబడి ఆక్రందనం చేసి మూర్ఛిల్లుతుంది. "భయపడకు నేను గలను నీ ప్రాణములకు ప్రాణమెదురుపెట్టుదునని సీతను పట్టి యెత్తి తన కుటీరానికి చేర్చాడు రైతురాముడు. అచట వారు అన్యోన్యం ప్రేమించుకొంటారు. పూవు మిషచే అంకురించిన అనురాగం భల్లూక వృత్తాంత సన్నివేశ కల్పనతో బలపడి వారి కళ్యాణానికి దారి తీసింది.

## 5. ఊర్మిళ లక్ష్మణునికి చద్ది తెచ్చు కల్పనం

సీత తన సోదరి ఊర్మిళను తోడికోడలుగా జేసికొన నిశ్చయించి లక్ష్మణునకు ఊర్మిళతో చద్ది పంపుతుంది. కొంటె చిలిపి చూపులతో ఒకరి నొకరు గుండె కొల్లగొట్టుకున్నారు. పిదప పెద్దల సమ్మతంతో వారికి వివాహం జరిగింది. ఏకోదర సోదరులవలె నున్న రైతురామలక్ష్మణుల వలె సీతా ఊర్మిళలు ఒక్క కుదురులోని మొక్కల్లాగ కలిసి యున్నారు. చద్దిగొని వచ్చే ఈ సన్నివేశం కృషికి కావ్యానికి సహజత్వాన్ని కలిగించింది.

## 6. జమీందారు దేవీవ్రతాచరణం

నిర్బంధంలోనున్న కాపుసీత తనకు వశమగునట్లు దేవి కనికరించా లన్న ఉద్దేశంతో జమీందారు దేవీ వ్రతాచరణం దృఢనిష్ఠతో చేస్తాడు. జంగ మారాధ్య బ్రాహ్మణులకు భూరిదక్షిణలిచ్చి సత్కరిస్తాడు. కాపుసీతాసతియు స్వశీల రక్షకై సర్వమంగళ ఆదిశక్తి పూజను దీక్షతో ఆచరిస్తుంది. దైవీ శక్తికి విజయం అసుర శక్తికి అపజయం సూచించే ఈ సన్నివేశ కల్పనం జమీందారు ఔద్ధత్యాన్ని, సాధ్వి సీత సతీత్వాన్ని చాటుతుంది.

## 7. పొన్నయసెట్టి దుర్వ్యూహం

రైతు రామలక్ష్మణుల వలన సోదరి సుందరమ్మకు జరిగిన అవమానా నికి ప్రతీకారంగా సీతను నిర్బంధింప సమకట్టిన జమీందారు పాపారావు, పొన్నయసెట్టిని దుర్వ్యూహం పన్నడానికి ఆజ్ఞాపిస్తాడు. ఉత్తమ పతీ జనమ్ములొక ఎత్తు ప్రపంచమొక యెత్తు సీతను చెఱపట్ట కూడదని సెట్టి భావించినను జమీందారు ఆజ్ఞకు బద్ధుడౌతాడు. సెట్టి కాపుసీతను బంగారు నగలు వేయించుకొనే నిమిత్తం తన యింటికి వచ్చే విధంగా చేస్తాడు. ఆమె తిరిగి వెళ్లే సమయంలో వర్షం కారణంగా జమీందారు కోటకు చేరి వాని భటులచే నిర్బంధింపబడుతుంది. ఈ సన్నివేశ కల్పనం జమిందారు మూర్ఖపు పట్టుదలను, వాని అంతాన్ని సూచిస్తుంది.

## 8. రథసప్తమీ పండుగ, తదితర వర్ణనలు:-

రథ సప్తమీ కోడండ్ల పండుగ, జాతరను వర్ణించే వర్ణనలు కాపు జీవితాల్లోని అమాయికత్వం, స్వచ్ఛత, అనురాగం, భక్తి పరతత్వం, చాటుతున్నాయి. అట్లే నాయికానాయకుల విప్రలంభ వేదనం, మలయానిలచంద్ర దూషణాది వర్ణనలు, శృంగార దోహద క్రియలు పల్లె ప్రకృతి వాతావరణానికి అనువర్తింపజేయబడినది. ఇట్టి కథా సన్నివేశాలన్ని ప్రబంధోచితాలై కథా సంవిధానానికి తోడ్పడినవి.

## IV. కథా కథన శిల్పం:-

కావ్య కథను ప్రసన్నంజేసే కథా ఘట్టాలెన్నో ప్రతికాండ కథలోనూ ఉన్నాయి. ఆయువుపట్టయిన పలు స్వల్పాంశాలు కథా కథన శిల్పంతో రమణీయంగా చిత్రితమైనాయి ఇందుకు ఉదాహరణంగా కళ్యాణకాండ కథను గ్రహించటం జరిగింది. ఇందులో శృంగారరసం పరిపుష్టిని పొందింది. గార్హస్థ్య జీవిత వైభవం చిన్న చిన్న ఘట్టాల్లో వల్లెపనులు, దేశీయాచారాలు మనోవృత్తులు, పల్లె రైతుజన జీవిత విధానం ప్రసక్తమై కథా రూపంలో వ్యాఖ్యానింపబడింది.

రైతురాముని నవయౌవని విలాసాన్ని, సద్గుణశీల సంపత్తికి పెద్ద పేర్మొగిన దొరలు తమ కూతుళ్ళను రైతురామునకి దలంచుట, శ్రీరామపురంలో చావడి గద్దెపైన పల్లెప్రజలు రాముని పెండ్లి ప్రసక్తిదెచ్చుట, వరినాట్లు తటి కాపు సీతారాముల ప్రథమ రాగోదయం కలుగుట, పూవుమిషచే రైతురాముడు వలపుగొనుట, నాయికా నిర్గమనం, నాయికా విరహవేదన-ఉపచారాలు, పచ్చిక మిషచే రాముని జూడవచ్చిన సీత ఖల్లూకానికి బెదరుట, సీతను రాముడు తన వాకిళ్ళకు గొంపోవుట, నాయికా నాయకులొకరి నొకరు ప్రేమించుకొనుట, మల్లమ్మ మంగమలు సీత గురించి ముచ్చటించుట, సాగరయ్య రాముని పెండ్లి గూర్చి తలపోయుట వరకట్నం లేకుండ కాపు సీతను పరిణయ మాడుటకు కాపు రాముడంగీకరించుట, దేశీయాచారాలతో సీతా రాముల పెండ్లి నూతన వధూ - వరుల తొలిరేయి, ఆదర్శ దాంపత్యం, మొదలగు అంశాలు సముచితం గారసోన్ముఖమై కావ్య కథతో

సంవిధానం పొంది కథా కథన శిల్పాన్ని అభివ్యక్తం జేశాయి.

## V, సమకాలీన రాజకీయ సామాజిక వాతావరణ ప్రతి ఫలనం:-

నిజాం పాలనలో నున్న తెలంగాణంలో రజాకార్లు, సంస్థానాధిపతులు జమీందార్లు, భూస్వాములు, సాహులు, గ్రామ ప్రముఖులు, రోహిలాలు అనేక అరాచకాలను సృష్టించారు. రైతులు, కార్మికులు, శ్రామికులు, పల్లెల్లోని వివిధ వృత్తులవారు, వెట్టిచాకిరికి గురియై బానిస బ్రతుకులతో ఎన్నో వేదనలతో అలమటించారు. కరువు కాటకాలతో నీటి వనరులు లేక పల్లెలు కళ మాసిపోయాయి. నిరక్షరాస్యత వరకట్నం వంటి ఎన్నో సమాజరుగ్మతలు ప్రజలను పీడించాయి. దోపిడీ వ్యవస్థకు గురియైన పలు అంశాలు రైతు రాముని జీవితంతో హత్తుకొని పోయాయి. నాటి సామాజిక వాతావరణాన్ని ప్రతిఫలనం చేసే కథా ఘట్టాలు ఈ కావ్యంలో ఉన్నాయి.

### 1. సాగరుని క్రాంతి పథం:-

శ్రీరామపురంలో పేరు పొందిన కాపు పెద్ద సాగరయ్య. అతడు ప్రజల సాధారణ జీవితానికి అడ్డుగా నున్న ప్రబలమైన దుష్ట శక్తులను ప్రతిఘటించటానికి శాంతియుతంగా, ప్రజాభిమతంగా క్రాంతి పోరాటాన్ని చేపట్టాడు. అది గ్రామ ప్రజలకు విస్తరిల్లింది, జమీందారు దొరలు తమ దుర్వ్యూహాలు, కుట్రలు, కుతంత్రాలు చెల్లక, పాచికలు పారక తోకలు ముడిచారు పల్లె ప్రజల్లో చైతన్య బీజాలు మొలకెత్తాయి. క్రమంగా గ్రామీణ వికాసం కలిగి అభ్యున్నతి సాధింపబడింది. సాగరయ్యతో ప్రారంభింపబడిన క్రాంతి పోరాటం రైతురామునిచే మరింత బలపడి జమీందారీ న్యవస్థను రూపుమాపగలిగింది. ఈ విధంగా నాటి నిజాం పాలనంలోని జమీందారీ దొరల బూర్జువా వ్యవస్థ కథా ప్రారంభంలోనే తెలియజేయబడి, కావ్య రచనాంశయం స్పష్టం గావింపబడింది,

### 2. జమీందారు పాపారావు బలగం:-

అపర రావణుడుగా పేరుగాంచిన జమీందారుని పటాలాలు యమభటా

లికి ప్రతిరూపాలు. వారు పరమ దుర్మార్గులు కుతుకలదాకా నంజుడు గుడు పులతో, కల్లు సారా మత్తు పదార్థాలను సేవించేవారు. క్రూరస్వభావులు, రాక్షస కృత్యాలతో ప్రజలను వేధించేవారు, వాని పేరు చెప్పిన పచ్చికట్టె దివిటీయై మండేది. కంటబడ్డ ఏ సుదతియైనా పోనిచ్చేవాడు గాదు, అతడు తనకెదురు నదురులు లేక తనసెదిరించే అధికార్లు లేక ప్రజను బాధించేవాడు.

రోహిలాలు, రజాకార్లు అతని కనుసన్నల్లో ఉండేవారు. వారెంత కిరాతక చర్యలనైనా ఒనర్చడానికి వెనుకాడని వారు. ఈ విధంగా కావ్య ప్రతినాయకుడు జమీందారు పాపారావు మద మాత్సర్యాహంకార పూరిత మైన వృత్తాంతం వర్ణింపబడి, నాటి జమీందారీ వ్యవస్థకు అద్దం పట్టింది. నిజాం లోపభూయిష్ట దుష్టమైన పాలనం, నాటి జన జీవన స్థితిగతులు సాక్షా-త్కరింపబడినాయి. దుర్మార్గుడైన జమీందారును ఓడించి గ్రామ రాజ్యస్థాప నం జేయడమే ఈ కావ్య రచనకు ప్రధాన లక్ష్యమైంది. ఆచార్యుల వారి కథా కథనం సమకాలీన పరిస్థితులకు అనుగుణంగా సాగింది.

## 3. కరువు కాటకాల వైపల్యం:-

వర్షాలు లేక శ్రీరామ పురం అపరశా మొత్తం కరువు కాటకాలకు గురి యైంది తిండి లేక జన నష్టం, పశు నష్టం జరిగింది. అట్టి విపత్కర పరిస్థి-తుల్లో నాయక రాముడు కర్షక శ్రామిక జనాలను రక్షించడానికి భూస్వాము లందరు తమ వద్ద నిల్వయున్న ధాన్యాలను పంచాలని శాంతియుత పోరా-టం సాగించాడు. ధర్మారాట్ప్రభువు మొదలగు సంస్థానాధిపతులు గ్రామ ముఖ్యులు రైతాంగానికి ధాన్యమిచ్చి కరువు కోఱల్లో నుండి రక్షించాడు. నాటి సమాజ జీవితం రైతుల పల్లె ప్రజల కడగండ్లు సాంఘిక దేశాల పరి-స్థితులు వాస్తవికంగా చిత్రించబడినాయి. ఈ విధంగా కావ్య కథ పటిష్ఠమై కవి ఆశించిన ప్రయోజనం సిద్ధించింది.

## 4. రామ లక్ష్మణుల కళ్యాణ ఘట్టాలు:-

కాపు సీతారాముల, ఊర్మిళాలక్ష్మణుల వివాహఘట్టాల్లో నాట్లువేయుట పశు సంరక్షణం జేయుట మొదలగు వ్యవసాయ పనులు వివరించబడినాయి

'వరకట్నం'-దాని పరిణామాలను, నివారించడానికి కాపు రామలక్ష్మణులు, వరకట్నం లేకుండ వివాహం జేసుకొన్నారు. వారి వివాహాలు దేశీయ సంప్రదాయాలు, తెలుగు వారి ఆచారాలనుసరించి జరిగినాయి. ఇందు రైతు కుటుంబాల గృహస్థ జీవితం ప్రతిబింబిమైంది. రైతు వేషం, ఆహార విహారాదులు వర్ణింపబడి గ్రామీణ సంస్కృతి, ఒక కుటుంబంలోని సభ్యుల అన్యోన్య అనుబంధాలు, స్వచ్ఛ ప్రకృతిలో కర్షక జీవన సౌందర్యం బహుముఖాలుగా వర్ణింపబడి రైతు రామాయణ కావ్యరచనా కృషి ఫలించింది.

## 5. రజాకార్ల దౌర్జన్యం:-

రజాకార్లు గ్రామాలు దోచుచూ, గత్తరావాతానర్చుచూ, మిక్కిలి ఆర్భాటంతో స్వైరవిహారం జేస్తూ, కాపు రాముని ఇంటిని దాడి జేశారు. రైతు రాముని బడితెలతో తుపాకులతో చంపడానికి ప్రయత్నించగా, మంగమాంబ అడ్డువచ్చింది. వారిదౌర్జన్యానికి మంగమాంబ బలైంది. కాని రైతురాముడు రక్షింపబడి కాపు వీరుల సాయంతో రజాకార్లను తరిమాడు.

ఈ కథా కల్పనం నాటి రజాకార్ల దౌర్జన్యకాండ, మారణ హింసాకాండ అరాచకత్వం, దోపిడి వల్ల ప్రజానీకం పొందిన బాధలు, నిజాం నిరంకుశ విచ్చలవిడి దుష్టపాలనం కన్నులకు గట్టినట్లుగా అభివ్యక్తంజేసింది. రైతు రాముని నాకాభ్యుదయానికి ఈ కథా కల్పనం కార్యకారణ సంబంధం కలిగి ప్రకృష్టమైన కథను సాక్షాత్కరింపజేసింది.

## 6. జమీందారు పాపారావు దుర్మరణం:-

చెఱలో నున్న సీతను విడిపించేందుకు రైతురాముడు రైతాంగం దండు తోడ్పడగా, ధర్మారాట్ప్రభువు సైన్యం సహాయంతో జమీందారుపై యుద్ధం ప్రకటించాడు. భీకరమైన పోరాటంలో జమీందారు పాపారావు సైన్యాలు చెల్లాచెదురై వెనుదిరిగినాయి. జమీందారుడు ఒంటరియై పోరాడే సమయంలో భారత యూనియన్ సైన్యాలు జమీందారును లోబరుచుకోవడానికి వచ్చాయి. భయంకరమైన పదఘట్టనకు వారి బూటుకాళ్ళ క్రింద నలిగి జమీందారు దుర్మరణం పాలైనాడు.

ఈ సన్నివేశం చారిత్రక సత్యాన్ని చాటేది. జమీందారీ వ్యవస్థాని-ర్మూలనకు అశేష ప్రజానీకం వెల్లువై ఉప్పెనతో లేచింది. ఐక్యమై స్వాతంత్ర్యం కోసం పోరాడింది. నిజాం పాలనకు సర్వత్రా వ్యతిరేకత ప్రకటించబడింది. భారత యూనియన్ సైన్యం కూడ నిజాం పాలనను అణచివేసింది. తరతరాలుగా పాలించిన నిజాం షాహిల పాలనం తెలంగా-ణంలో అంతమొందింది. ఈ విధమైన చారిత్రక రాజకీయ సామాజిక పర-మైన పలు అంశాలు రైతురామాయణ మహాప్రబంధంలో నిర్వహణ భూమికగా తోడ్పడుతున్నాయి. ఈ నేపథ్యానికి చెందిన అంశాలు ప్రధాన కథతో సంయోజించబడి, కథా కథన శిల్పంతో కావ్యం సర్వాంగ సౌష్ఠవంగా రూపు దిద్దుకొంది.



# రస నిర్వహణం

మహా కావ్యానికి శరీరం వస్తువు1, రసం ఆత్మ2 రమ్యమైన వస్తు నిర్మితమైన రైతురామాయణం ధర్మాను ప్రాణిత వీర రసంతో సంయోజితమై మహా ప్రబంధంగా రచింపబడింది. ఆచార్యులు కావ్యంలో 'నాచేత నయుంగగుర్చె, "రసచింతన తృష్ణ చివిర్చె" కృతియొ యది రసబ్రహ్మయా కృతియొ" అచటి ప్రకృతి యంతయు రసమయ ప్రకృతియయ్యె" అని స్వప్న సాక్షాత్కారంలో రసమయమైన దీకావ్యమని చెప్పారు. వస్త్వలంకార వర్ణనాది కావ్య సామాగ్రి అంతా ధ్వనీభూతమై రసపర్యవసాయమైన కావ్య రసానందం బ్రహ్మానంద సహోదరంగా సహృదయులకు అనుభూయమానమౌతుంది 3

రైతు రామాయణం రసాత్మకమై ఉత్తమ కావ్య ప్రయోజనంతో లక్షించబడింది. మహా కావ్యంలో శృంగార వీర రసాలతో పాటు శాంతకరుణాలు కూడ అంగిరసాలుగా అంగీకృతాలైనాయి.4 వీనిలో లోకోత్తరగుణోన్నత నాయకాశ్రయమై, పరమరమణీయమై, దానధర్మాది సద్గుణశ్రయమై ఉత్సాహం స్థాయి భావంగల వీరరసం అంగిరసంగాగల కావ్యమే ఉత్తమ

---

1 ఇతివృత్తంతు నాట్యస్య శరీరమ్ నాట్యవేదం-19-1

2 కవిభిః కుశలై రసభావ మపేక్ష్యతు నాట్యవేదం-14-105

3 రసోవై సః రసగ్‌హ్యేవాఽ యంలబ్ధ్వాఽఽ నందీ భవతి-
తైత్తరీయోపనిషత్తు 2-7-1

4 ఏకోరసో అంగికర్తవ్యో వీరః శృంగారవివవా।"
అ) దశరూపకమ్-౩-౩.
ఆ) శృంగార వీరశాంతానమేకో అంగిరస ఇష్యతే" సాహిత్య దర్పణం
ఇ) శృంగార వీరవివవేతి కథనం సముచిత రససూచికం।
తేన ఉత్తర రామచరితే కరుణస్య ప్రబోధ చంద్రోదయే
శాంతస్యచ అంగిత్వ మక్షతమ్"
దుర్గాప్రసాద పండితః-సన్నిధానం-కావ్యలంకార సంగ్రహం పుట 412

కావ్యమని విద్యానాథాద్యాలంకారికులు స్పష్టం చేశారు.1

రైతు రామాయణంలో వీరరసం ధర్మానుప్రాణితంగా నిర్వహించబడింది. ఇక హాస్యరౌద్రాద్భుత భీభత్సభయానక రసాలు మహాకావ్యంలో అంగిత్వాన్ని పొందజాలవు. కావున ఈ కావ్యంలో అంగరసాలు గాను శృంగార కరుణశాంతాలు ప్రధానమైన ధర్మవీరానికి ఉత్కర్షనాపాదించి అంగరసాలుగా నిష్పన్నమై, రసాత్మక కావ్యంగారూపుదిద్దాయి.

కావ్యంలో అగిరసం ధర్మవీరం "శ్రీభోగోగుల నిత్యసేవన శ్రీభాగ్య సిక్షేపు.... ....... కృషియజ్ఞోద్దీపు, క్షోభా నిర్ధరణ ప్రతాపు, ప్రగతిస్ఫూర్తి క్రియాటోపు, కాపులకు కాపు" అని కావ్యమారంభమైంది. "కరువుల పారద్రోలు మొదటి ప్రాపుగా కాపురాముడు వెలయుత" అని ముగింపుజరిగింది రసం కావ్య ప్రయోజనాన్ని అనుసరించి ఉంటుంది. కావ్యంలో రైతు రాముడు ధీరోదాత్తనాయకుడు వీరరసార్హుడు.2 ఉత్సాహం స్థాయీభావంగలవాడు అనగా ఉత్సాహాత్మకు నిత్యోద్యోగి3 లోకోత్తర క్రియాచరణుడు చణుడు లోక సంగ్రహైక తత్పరత కలిగిన వీరపురుష ప్రవృత్తిగలవాడు. కృషి యజ్ఞోద్దీపుడు కర్షకాభ్యుదయాన్ని ఒక మహాయజ్ఞంగా నిర్వహించినవాడు. క్షోభా నిర్ధరణ ప్రతాపుడు. ఎన్నికష్టాలు, ఆటంకాలు, క్లేషాలు ఎదురైనమా

---

1 "ఉత్తమ ప్రకృతిర్వీర ఉత్సాహస్థాయి భావకః...........
   అ) సచ దానధర్మ యుద్ధైర్దయ యాచసమన్వితశ్చతుర్ధాస్యాత్"
   సాహిత్య దర్పణం 3-232, 234
   ఆ) శృంగార వీరరసయోరన్యతరస్య ప్రాధాన్యమ్
   ప్రతాపరుద్రీయమ్-నాటక ప్రకరణం పుట 87
   విద్యానాధుడు వావిళ్ళ - 3-3

2 "నాయక స్యహిధీరోదాత్తాది భేదభిన్నస్య।
   సర్వధా వీరరసానువేధ్యే భవితవ్యమితి"
   అ) అభినవ గుప్తుడు - బాలప్రియ పుట 364
   ఆ) ఆంధ్ర ధ్వన్యాలోకము 2వ భాగము 116 పుట

3) Each type of Hero Shall be distinguished by Rasa, which dominates his charac'or and consti'utes his individuality– Number of Rasas Page 121.

సహించి, ఎదుర్కొని సాధించే ఆత్మిక గుణం గలవాడు కావుననే కరవు రక్కసి బారినుండి రైతుసోదరులను రక్షించినట్టి కృపాళుత్వం గలవాడు. స్వార్థచింతన లేక ధర్మ కర్మలందు బుద్ధినిల్పినవాడు ధర్మకర్మ మనగా వేదమునందు ఏ కర్మ విధిగా విహితమైందో అది ఆచరించువాడు.1 అందువల్ల ధర్మమతని రక్షించింది.2 నేతలే రక్షకులు3. కావున కావ్యంలో కాపులకు కాపైనాడు.

అతడు ప్రగతిస్ఫూర్తి క్రియాటోపుడు. అందువల్ల నిజాం పాలనలోని బూర్జువా జమీందారీ దోపిడీ వ్యవస్థను రూపుమాపినాడు. నిర్బంధి పబడిన సీతను పరిగ్రహించాడు. అతనిచే చల్వచే సస్యలక్ష్మి, దశముఖాల రావణుల నుండి విముక్తి పొందింది. గ్రామ రాజ్యం రామ రాజ్యంగా విలసిల్లింది, ఈ విధంగా కావ్య ప్రయోజనం అభివ్యక్తమైంది, శాంతి సౌభాగ్యాలతో విలసిల్లే రామ గ్రామ రాజ్యస్థాపనంజేసిన విజేత రైతురాముడు వీరరసానికి ఆలంబన విభావం కాగా, అతని ననుసరించిన తండ్రి సాగరుని క్రాంతిశాంతి విప్లవ పోరాటం రామలక్ష్మణుల స్థైర్య ధైర్య, శౌర్య త్యాగ వైశారద్య, దాతృత్వ సదధ్యవసాయ గుణాలు విభావ అనుభావము, నాయకాభ్యుదయ ఫలానికి ప్రతి బంధకంగా ఉన్న మాత్సర్యం, దురభిమానం, గర్వం ఆవేశం మొదలగు వ్యభిచారీ భావచిత్తవృత్తి గల జమీందారు పాపారావు ప్రతిఘటన చేష్టలు ఉద్దీపన భావాలై రైతురామునిలోని సంఘదేశ హితైక పాదకమైన ఫలాన్ని సాధించే అధ్యవసాయ స్థాయీభావమైన ఉత్సాహంగా పర్యవసించి కావ్య ఫలం సాధింపబడి రసావిష్కృతినిపొంది ధర్మాను ప్రాణితమై వీరరసం నిష్పన్నమై కావ్యం నందు అనుభూయమానమగుచున్నది.4

---

1 వేదో అఖిలోధర్మమూలమ్ - ఆర్యోక్తి

2 ధర్మో రక్షతి రక్షితః

3 రక్షితారస్తునేతారం-రసార్ణవ సుధాకరం భావకోల్లాసం 3-4

4 "నహిరసాదృతే కశ్చిదర్థః ప్రవర్తయత ఇతితత్ర విభావాను భావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః భరతుడు నాట్యశాస్త్రం
అధ్యా - 6 31 శ్లోకం

"తండ్రిని మించిన కొడుకు" అనిపించుకొన్న ఆదర్శతనయుడు రైతురాముడు-తండ్రి సాగరయ్య గుణగణాలను పుణికి పుచ్చుకొన్నాడు. సాగరయ్య "ప్రజనొప్పిని సొంతపు నొప్పిగా నెదదలంచి స్వజాతి సోదరుల ధర్మపుహక్కులకై తలడ్డెడు" భావంగలవాడు. "ఎట్టి సమస్యలందును చలించని గుండె బలము, గుట్టలు గట్లువచ్చి తలపై గూలినను నెట్టుకొని ఎదురురీగె కార్యదీక్ష, స్థైర్యశౌర్యములు" సాగరుని సహజ సంపదలు. నాటి నిజాం జమీందార్ల జులుంను ప్రజాబలంతో ఎదుర్కొనుటకు సిద్ధపడిననాడు "శాంతిమూర్తి యౌయతనియా క్రాంతి పథము, శాంతి యుతము గ్రామీణ ప్రజాభిమతము, ఫలితముగా ప్రజలలో వెల్గె పౌరుషమ్ము, మంచుపైరలో నగ్గి దుమారమెుదవే." సమాజాన్ని దోపిడీ చేసే వారందరికి సాగరుని ధర్మ పోరాటం అగ్గిదుమారం రేపింది. తండ్రికి వారసుడైన కావ్యనాయకునిలో బాల్యంలోనే చైతన్య బీజాలు పడి ఫలించాయి. ఎట్టి సమస్యలనైనా ఎదుర్కొనే సామర్థ్యం, విస్మయ విషాదాలకు లొంగని పట్టుదలతో కూడిన యత్నోత్సాహం, సమస్యలను పరిష్కరించే క్రాంతితో కూడిన శాంతిపోరాటం పట్టువడినాయి. ఈ విధమైన గుణసంపద జన చైతన్యానికి, ప్రజైక్య సంఘటనకు పాదులు వేసి కావ్యోద్దిష్ట ఫలాన్ని సాధింపజేసింది.

పరమోత్కృష్టమైన లోకధర్మాలను స్వధర్మాలను గుర్తించి, గుర్తింప జేయుటయే నాయక ధర్మం.

"మన విల్వల్ మనమే గ్రహించునపుడే మర్యాదరాముల్ మనన్, గణుతింతెత్రిట్టుని యెంతకాలమిటు గ్రుక్కల్ మ్రింగుచున్ జుక్కలన్, గనుచున్ నెన్నుదురంటి కూర్చొనుట లోకావన్నలారా! మనందున వీరత్వము చచ్చిపోయెనె యెటందున్ గుండెలుంజచ్చులే" అని రైతులకు స్వధర్మాన్ని గుర్తుజేశాడు. పెత్తందారీ భూస్వామ్య ఫ్యూడల్ వ్యవస్థలో నానాహింసలకు గురియై పతనమైన కర్షక కార్మిక శ్రామిక ప్రజానీకాన్ని ఐక్యపరచి కాపు సంఘాలను స్థాపించి తిరుగులేని నాయకుడయ్యాడు. బానిస సంకెళ్ళు తెగ . డానికి, ధర్మమైన హక్కులు సాధించడానికి" నడుములు గట్టిలెండని, పిరికి పందలలాగ నీర్గారుచు జీవించటం కన్న నీచమైంది లేదని, బలిదానం జేసి శాంతియుత క్రాంతి పోరాటం సాగించాలని "ప్రజాశక్తికి గల పిలుపను చాటాడు. ఈ పట్టున వీర రసం నిర్భయంగా క్రాంతి చైతన్యాలను

ఉద్భాసింపజేసింది.

ప్రతి నాయకుడు అతనికి సంబంధించిన వారి అవినీతి కృత్యాలకు ప్రతిస్పందించే ప్రయత్నం కావ్యంలో వీర రసావిష్కృతికి ఆలంబన మౌతుంది.

"ఎక్కిన కొమ్మ గొట్టి కొకునిప్పటి యీ జమీందారు దోపిడీ! రక్కసి రాజనీతి యటు రజ్వీ నిరంకుశ కూటనీతియున్! బ్రక్కల బల్లెమై ప్రజల పాలిటి కర్కశ నిత్యమృత్యువై! క్రిక్కగసాగె నిపుకల్ లయకాళికదంష్ట్రి-లోయనన్!

ఖాసీం రజ్వీ రజాకార్ల దయనహింసాకాండకు ప్రతిస్పందించి "సరస సూక్ష్మేక్షణ కాంతి పుంజముల, ప్రజలయెదల నిద్రాణమైయున్న, పృథుల శిథిల వీర చైతన్య ఉత్ప్రజములను" రైతునాయకుడు మేల్కొల్పాడు. సాంఘిక శక్తిని కిల్కొల్పాడు. చదువు సంస్కారాలను వృద్ధి పరిచాడు. నాయకులలోని పరోపకార గుణం, ఆసక్తి, బలస్థైర్యాలు వ్యక్తమై "రామ-బాబు వంటి రచపిండము, మనకాపుజాల ముందు కలిగి వచ్చెనని" ప్రక-టింపబడి కావ్యనాయకుని ధీరోదాత్త ధర్మగుణం ప్రజామోదం పొందింది.

కావ్యనాయకునకు ఎన్ని ఆటంకాలెదురైనా పట్టుసడలని కార్య నిర్వ-హణంలో ఉత్సాహం చెక్కుచెదరలేదు. సేతు నిర్మాణ భారం వహించిన రైతురాముని కాపు మల్లన్న "ఆర్థికముగ మనిషి అడుగున బడగూడదు. సొంత పనులు విడిచి గంతులు వేయుట భావ్యం గాదు. అర్థమే సకలార్థ-సాధములకు మూలము అని నిరాశ పరుస్తాడు. కాని ఈ నిస్పృహ కలిగించే మాటలు ద్విగుణీకృతోత్సాహం కలిగించినవై రైతురాముడు మల్లనతో- "ఆప్తుడవు నీవు నన్ననవచ్చు విసెద, పెద్దవాడవు వయసులో బుద్ధిలోను, కాని రాముడు రైతుల కొఱకై జనించి రైతులకై, తుదకు మరణించు వాడిని నెదయెరుగుమి!" అని రైతు రక్షకత్వానికి సర్వస్వంత్యాగం చేసే నాయకుని జీవిత ధర్మం, వ్యక్తిగత ధర్మం కన్నా లోకధర్మం మిన్నయని చాటింది. ధర్మరక్షణయే జీవిత పరమార్థమై అనేక వ్యయప్రయాసలు గల సేతు నిర్మాణం గావింపబడింది.

ఇట్లే వీర రసం కావ్య కథలోని పలు అంశాల్లో అభివ్యంజితమౌతుంది.

ఆలంకారికులు వీరరసాన్ని దానవీరం, ధర్మవీరం, దయావీరం, యుద్ధవీరం అని నాలుగు **విధాలతో పేర్కొన్న**నూ[1] **కావ్యనాయకుడు** రైతు రాముడు ధర్మవీరుడు కావున వీరరస ప్రభేదాలన్ని ధర్మవీరంలోనే పర్యవసించాయి.

## దాన దయావీరం

**వరుల** బాధలను జూచి సహింపలేక వారికి సహాయ మొనర్చే సాత్త్విక భావన కలిగి యుండట దయాగుణం, దయాగుణం సంపూర్ణ మానవత్వానికొక విశిష్ట లక్షణం. ఈ గుణానికి వన్నె గూర్చేది **దానగుణం**[2] దానవీరానికి రైతురాముడు ఆలంబము అతడు ఉదారుడు.

"తన ఇంటగల నిల్వ ధాన్యముల మొత్తమ్మున్
స్వకీయ ప్రజా వినియోగమ్మునకు మహామహుడుఁ
దా వెచ్చించె రాముండని ర్ధనుడయ్యున్ తనతోడి
సోదరుల బాధల్ చూడలేకవ్వియొ క్కసెలాపెన్
ప్రజమండ గర్వున నిదాఘమ్ముఁదు భూవర్షమై"

కరవు కాటకాలేర్పడి అన్నార్తులైన తనతోడి కర్షక సోదరులకు నిర్ధనుడయ్యునూ, స్వార్థం లేక యింట నిల్వయున్న ధాన్యాన్ని దానం చేయటంలో జూపిన ఉత్సాహం రైతురాముని ధర్మవీర స్ఫూర్తిని ప్రకటిస్తుంది ఈ స్ఫూర్తిని ఆదర్శంగా తీసుకొని భీమవరం సంస్థానాధిపతి ధర్మారాట్ప్రి

---

1 దానవీరం, ధర్మవీరం, దయావీరం, యుద్ధవీరం తథైవ

అ) దయావీర మపి ప్రాహు బ్రహ్మ త్రివిధ సమ్మతఁ॥
తిరువేంగళాచార్యులు–ఆంధ్రధ్వన్యాలోకము–పుట–485

ఆ) "తత్ర దానవీరో బలిజామదగ్న్యాది
యుద్ధవీరో రామాదిః, ధర్మవీరో యుధిష్ఠిరాదిః
దయావీరో జీమూతవాహనాదిః॥
ప్రతాపరుద్రీయమ్‌- రత్నాపణవ్యాఖ్య- పుట–195

2 డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం–వీరరసము–పుట–74

భువు అన్న సత్రిలు పెట్టి తోటి భూస్వాములతో ధాన్యములనునింపించి రైతుల నాదుకొనును. "గ్రామపు పెద్ద రైతయిన రాముడు రాముడెయో వినార్థిక స్థోమత కోద్దిదే యతడు చూపిన త్యాగమపారమద్భుతమ్మామహ నీయమూర్తియె మనందరికిన్ మార్గదర్శి నిష్కామ మహర్షియాతని సుగా థలగాథము లార్యగణ్యముల్" ఈ విధంగా విద్యావంతుడు మాననీయుడు ధర్మారాట్ప్రభువు పొగడటం వల్ల రైతురాముని అవికత్థనత, నిష్కామమైన త్యాగశీలం దానదయగుణాలు ధర్మవీరంలో పర్యవసించి రసావిష్కృతి కలుగుతుంది.

శతృవుచే స్తుతింపబడటంవల్ల కూడ నాయకునిలోని ఉత్సాహం ద్విగుణీకృతమై క్లేషాన్ని ఎదిరించే ఆత్మస్థైర్యం పెరిగి ఫలోన్ముఖుని గావిస్తుంది. ఇప్పల వాగుపై నిర్మించిన పెద్దచెఱువును జూచి ప్రతినాయ కుడు జమీందారు పాపారావు.

"మీకు నా ధన్యవాదముల్ మీకు నాదు,
బహుకృతజ్ఞతల్ నాకు సెప్పకయె మీరు
ఒక ప్రజామహాకార్యము నొనరిచితిరి
చాల సంతోషమైనది మేలయినది"

అని రైతురాముని స్తుతించాడు. జమీందారునకు అసూయాద్వేషా లున్ననూ నాయకుని ప్రజాహితైక కార్యాన్ని గూర్చి పొగడక తప్పలేదు. ఇట్లనుట నాయకుని విజయాన్ని ఒప్పుకొని తన అసమర్థతను చాటుకొనుటే. ధర్మవీరానికి దొక పరాకాష్ట. రైతురాముని సేన రైతులు వాగుపై సేతు బంధనం జేసి కరవు రక్కసుల నాశనానికి నడుముగట్టినారని ప్రజలు విస్మయం జెందిరి. కావ్య ఉపనాయకుడు లక్ష్మణుడు కూడా

"అన్న నిర్మింపజేసిన యానకట్ట
అది మహాద్భుత కార్యమునది నిజమ్ము
సాహసోపేతమైన ప్రజాహితైక
ప్రగతి కార్యక్రమమ్ము సంపత్ప్రదమ్ము"

అని ఆశ్చర్యపడినాడు. అద్భుతానికి స్థాయి విస్మయం. లోకోత్తర మైన సేతు నిర్మాణం ఆశ్చర్యాన్ని కలిగించింది. "అద్భుత మెప్పుడునూ వీరరసానుకారియై వీరరస దీప్త్యావహమైంది"1 లోకరక్షణాకాంక్ష ధర్మ స్థాపనానికి ఉత్కర్ష కల్గిస్తుంది. మహాద్భుతమైన ప్రజా శ్రేయస్సు కోరిన సేతు నిర్మాణం ధర్మవీరాన్ని పతాకస్థాయికి చేర్చింది.

సతిసీత జమీందారు పాపారావుచే నిర్బంధింపబడిందన్న విషయం దెలిసి అశ్రుపూరిత నేత్రుడైననూ, శౌర్యభరిత సునేత్రుడైనాడు. మధ్యలో సంప్రాప్తించిన మోహవిస్మయ విషాదాదులకు లొంగక కార్యనిర్వహణకు గడంగినాడు. ధర్మాన్ని రక్షించాడు కావున ధర్మం అతన్ని రక్షించింది.

> ''అందరము మేము మీ, గిటుందాటము ధర్మమె
> చ్చటో యచ్చట, మేముందుము తోడుగ మీకున్,
> సందియ పడరాదు మంచి సమయమే యొదవెన్"

కర్షక, శ్రామిక పల్లె ప్రజల దండు అధర్మ పరుడైన జమీందారు నణచడానికి కదిలివచ్చింది. రైతురాముని నాయకత్వం స్థిరపడి గంభీరత చాటబడింది.

ధీరోదాత్తుడు ధర్మబద్ధంగా కామార్థాలను సాధిస్తాడు.2 ధర్మబద్ధమైన శృంగారం వీరం నందే పర్యవసిస్తుంది. కావ్యనాయిక సీత రైతురాముని వీరోచితమైన ధర్మగుణాలకు పలచి పెండ్లాడింది. తనను నిర్బంధించిన జమీందారుతో తననాథుడు ప్రేమమూర్తి, ధర్మమూర్తి, ఋషివంటివాడు, మహాత్ముడు, ఏకనారీవ్రతుడు, లోకేశ్వరుడు, ఉదారబుద్ధితో శత్రువు సైనా మన్నించే క్షమాగుణం కలవాడు, అతని శరణు కోరుమని అని స్తుతించింది. తనముందు శత్రువు స్తుతింప బడటం ప్రతినాయకునకు

---

1 వీరస్యాపిచ యత్కర్మణో అద్భుతః పరికీర్తితః
మహాపురుషోత్సాహోపి జగద్విస్మయ ఫలాభిసంధానేనైవ"
అభినవభారతి–1–భా–297వ పుట.

2 "తతః కామార్థయోః, ధర్మమూలత్వాద్వీరః
నహి ధర్మ ప్రధానః"–అభినవభారతి–6వ అధ్యాయం

క్రోధకారణమైంది. మాత్సర్యంతో నాయకునితో తలపడునట్లొనర్చింది. ప్రతినాయకుని క్రోధ మాత్సర్యాలు, కావ్యనాయకుని జిగీషగల ఉత్సాహం పోటీపడినాయి. ఉత్పన్నమైన ధర్మం ఉద్ధరింపబడింది. నాయకగతమైన వీరరసం ప్లావితమైతమైంది.

సీతను నిర్బంధించడానికి పొన్నయసెట్టితో దుర్మంతనాలాడగా జమీందారుతో శెట్టి—

"ఎన్నడు లేనిదీబుద్ధి యిపుడు మీకు
కలుగుటది మాదు పాపమె కాదు సామి,
దేనికో కాచుకొని యున్నదిది నిజముగ
పుట్టుఁ బోఁగాలమునకె ఈ చెట్టబుద్ధి"

సీతను నిర్బంధించుట వినాశహేతువు కాగలదని హెచ్చరించాడు ఇట్లనుట రైతురాముని పరాక్రమాన్ని బోధించి ప్రతినాయకుని అల్పత్వాన్ని తెలిపి నాయకుని మహోన్నతత్వాన్ని నిలిపి, వాని ప్రయత్నానికి వైఫల్యాన్ని కోరటం జరిగింది, వ్యంగంగా నాయకుని ధర్మవీరాన్ని పోషించినట్లైంది. ప్రతినాయకుని ప్రేరేపించినట్లైంది. అందుకె నాయకుని సాధించే ప్రయత్నంలో ఆత్మనాశనాన్ని కొని తెచ్చుకొన్నాడు. ప్రతినాయకుడు చేసే ప్రతీకార చర్యలన్నీ నాయకుని ఫలోన్ముఖునిగా జేసినాయి.

ధర్మారాట్ప్రభువు, హనుమదాదులందు గోచరించే ఉత్సాహపూరితమైన కార్య నిర్వహణం రైతురామునకు అండగా నిలిచింది. సోదరుడు లక్ష్మణుని ధర్మోత్సాహం, సేద్యంనందలి తత్పరత, సోదరప్రేమ, సేవా ధర్మం, సీత గార్హస్థ్య ధర్మం, రైతురాముని ధర్మ కార్య నిర్వహణానికి భూమికలై వీరరసం ఆవిష్కరించబడింది.

అర్తుల యెడల దయకలిగి రక్షించు వీరుల ధర్మము దయ[1] కావున దయావీరం కూడ ధర్మవీరమున అంతర్భవిస్తుంది.

---

1 డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం – వీరరసము–పుట 74

భర్తను కోల్పోయి విలపించే జమీందారు పత్నితో—

"పాపలను జూచికొని నీవు బ్రతుకవలయు
నీ విభుని వధియింపగా నేనెవడను
అతని పాప బుద్ధియె కాక అవ్వ యిపుడు
పాపలు ప్రబుద్ధులౌ పెద్దవనిని గనుమి"

అని రైతురాముడు తన శత్రువు భార్యను క్షమించి ఓదార్చి కాపాడుతాడు. అట్లే జమీందారు సోదరి సుందరమ్మ తన పతి సీత నిర్బంధానికి ముఖ్యకారకురాలైననూ క్షమించి వదిలేస్తాడు. దయనీయమైన స్థితిలో ఔదార్యంతో దయతో ప్రవర్తించిన నాయకుని ధర్మ ప్రవృత్తి వీరరసాన్ని పరిపుష్టం జేసింది.

## యుద్ధ వీరం

అపరరావణుడైన జమీందారు దౌష్ట్యాన్ని నిర్మూలించి సీతను నిర్బంధం నుండి విడిపించడానికి రైతురాముడు యుద్ధం ప్రకటిస్తాడు.

అన విని రామలక్ష్మణుల యాత్మల
వీర ప్రతాప శక్తులి ట్టె నెమరుపైచి పొంగెం
బ్రకటించిరి వెంటనె యుద్ధయాత్ర భేరి నినద
భాంకృతుల్ చదల రెక్కొని దిక్కులు పిక్కటిల్ల శ
త్రునివహ కర్ణ రంధ్రముల దూరి హడల్ గలిగించె నంతటన్"

రైతురాముని సమరోత్సాహం శత్రుని మహానికి హడలెత్తించింది. కావ్య నాయకుని వీరప్రతాపోత్సాహాలు ఫల ప్రాప్తికి ఆయత్తమై యుద్ధవీరం రసోన్ముఖమైంది.

ధర్మారాట్ప్రభు హనుమదాదులతో నున్న రైతురాముని సైన్యం జమీందారు సైన్యంతో తలపడింది.

"వీరోత్తం సములారా।సాగుడు రణోర్వి సెత్రుటేర్లాజ్యపుం। ధారాపాతముగాగ శత్రుభట మేధస్సారముల్। హవ్యముల్ గా రూపొందం బహు ప్రవృత్తిగల

పాఖండుడుఁ బావడాఁ। కూర్రాస్త్రానలవేది యాగ పశువై రూపిల్ల యుద్ధా-
ధ్వర। ద్వారా మారణ కర్మహోమము నొనర్పన్‌జేయ పూర్ణాహుతిన్"

ధర్మబద్ధమైన సమరోత్సాహం యజ్ఞం జేయటం వంటిది దేవబ్రాహ్మ ణుల తృప్తిపరచుటకు, లోకరక్షణం కోరి యజ్ఞం నిర్వహింపబడుతుంది. నిజాం దుష్టపాలనంలోని జమీందారీ వ్యవస్థానిర్మూలనకుసాగే ధర్మపోరాటం ఒక మహా యజ్ఞంగా రూపించబడింది. కావ్యనాయకుని ధైర్య స్థైర్యాలు శత్రు జనిత సమరోత్సాహం, శత్రువును నిర్మూలించాలన్న ఆకాంక్ష యుద్ధ వీరానికి పోషకాలైనాయి రైతురాముడు ఆలంబనంగా శత్రు విజృంభణం అనుభావాలై సాగిన యుద్ధవీరం జయించాలనే ఉత్సాహం ఉరకలు వేసి రైతురాముని కీర్తి ధ్వజం జమీందారు కోటపై రెపరెపలాడింది. జమీందారు మరణంతో ధర్మం క్రమవికాసం పొంది ఫలించింది. ఈ విధంగా కావ్యంలో ధర్మవీరం అంగిగా సమర్థవంతంగా నిర్వహింపబడింది. దాశరథి ప్రముఖులు ఈ అభిప్రాయాన్ని బలపరిచారు.1 రామాయణంలో ధర్మవీరం సశాస్త్రీయంగా నిరూపించబడింది.2 రామాయణ కథానుసరమైన రైతురామాయణంలో ధర్మవీరమే అంగిత్వాన్ని పొందింది.

## శృంగార రసం:-

నాయికానాయకులు కావు సీతారాములఁ ఆదర్శ దాంపత్య ధర్మం, సుమానుషత్వం భూమికగా ధర్మ బద్ధమైన అమలిన శృంగారం కావ్యంలో ఉదాత్తంగా నిర్వహింపబడింది.

---

1) ఈ రకమైన రైతురాముడు తెలంగాణా రైతు వీరుడు. శాంతి విప్లవ వీరుడు. ఇతడు శ్రీరాముడైతే పాపారావు జమీందారు పాపాలపుట్టయైన రావణుడు. అతని జులుంజబర్దస్తీలకు గురియైన గ్రామీణ ప్రజానీకానికి విశేషించి రైతులకు అండదండగా నిలిచి వారిలో నూతన విప్లవ చైతన్యాన్ని కలిగించి ఈ రైతురాముడు గ్రామ సౌభాగ్యానికి దోహదం జేస్తాడు డా॥ దాశరథి రైతు రామకథ, ప్రజాకావ్యసుధ రైతు రామాయణము 2 పుట.

2) డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం వీరరసోల్లాసం.

ధీరోదాత్త నాయకాశ్రితమైన శృంగారానికి స్థాయీ భావం రతి. "స్త్రీ పురుషులకు అన్యోన్యాలంబమయిన ప్రేమయను పేరుగల చిత్తవృత్తి విశేషం రతి"1 నాయికానాయకులు సీతారాములు ఆలంబన విభావం. వారి దర్శనాలింగ నాదికాలతో పరస్పరానందజనకమైనట్టి "సంభోగవిషయికమైన ప్రేమ రతిస్థాయీ భావంగా పరిపుష్టమై రసావిష్కృతియై శృంగారం సేవ్యమానమైంది.

జమీందారును నిర్జించి సీతను పరిగ్రహించిన రైతు రాముని కథ ధర్మ వీర రసోదంచితమైంది కావున కావ్యంలో శృంగారం అంగిరసానికి ఉత్కర్షావహంగా ఔచిత్యంతో తీర్చబడింది.

## నాయికానాయకులకు రాగోదయం:-

వరినాట్లు వేసే కాపు సుందరులందు "తానొక రతి సుందరిగా, చుట్టు మిన్కు చుక్కలనడుమ చందురురేఖా జ్యోతిగ సీతసెరసిపోయింది. మదను డెక్కిన మెరుపు బాణమనగ, తరుణ దేవతాస్వైరయానకమనగ ఉన్న కాపు సీతను జూచి కాపు రాముడు ఆకర్షితుడైనాడు. "అవునీ పై డిపతాజీ బొమ్మది వికక్ష్యల్‌దాటి ప్రత్యేకమౌ నవలావణ్య విలాస మాధురుల మందారాపూదో-టనే భువికిన్ దెచ్చిన దేవకన్యయొ మబ్బుంజిల్లుకొ్రింబట్టుశాల్వ వితానమ్ము లుద్రోసి వెల్వడిన శంపానర్తకీబాలయో।" -రై.రా.

యువతీయువకుల మధ్య ప్రేమ వినుకలి, కనుకలి వలన గాఢమౌ-తుంది. తనకై దిగివచ్చిన దివ్యసుందరిగా తలంచిన రైతురామునకు ఆమె గుణరూపలావణ్య సంపదను తనివితీరా జూచుటతోడనే సీతపై అనురాగముదయించింది. అంతలో ఆమె సిగపూవు బంతి జారిపడగా రాముడది తీసి సవప్రణయ కళలొల్కగా చెలికురులలో తురిమింప జేశాడు. సీతకు సిగ్గు

1 స్త్రీ పుంసయోరన్యోన్యాలంబన ప్రేమాఖ్యః
అ) చిత్తవృత్తి విశేషో రతిః స్థాయీభావః"
పండితరాయలు-రసగంగాధరము పుట 141
ఆ) తత్త్వ సంభోగ విషయ ఇచ్ఛా విశేషో రతిః
విద్యానాథుడు, ప్రతాపరుద్రీయమ్-రసప్రకరణం పుట 192

మొగ్గలు వేసింది. అది జూచిన చెలుల పరిహాసోక్తులకు తలదించుకొని పంట గోరునొక్కుతూ కేగంట పేమపులకరింపగా రాముని పలుకరించింది ఈ విధంగా వారి ప్రథమ సమావేశంలో పరస్పరావలోకనాలు, మౌనభాష ణాలు, అనుభావాలై, అవయువ విక్షేపాలు, అంగసౌష్ఠవాలు ఉద్దీపనాలై పూర్వరాగం అంకురించి శృంగార రసోన్ముఖింగా వింపబడింది.

## నాయికానాయకుల విరహవేదన:-

రైతురాముని వనపు పాశంలో చిక్కిన నాయిక సీతకు ప్రకృతిలోని ప్రతి అంశం వలపును పురిగొల్పింది. "కలువ కుమరి చలువ పుప్పొడి జల్లింది గున్నమావి నన్నపైరలు దోలింది. కన్నెవాగు చల్లని పన్నీరు జల్లింది వెన్నెలపడుచు వచ్చకప్పూరం పూతలుపూసింది చిలుకలు గోరువంకలు చెలినిచుట్టి జిలిచిలి పలుకులచే మోజు చేసినాయి." ఈ విధంగా సీత స్మర-జ్వరం ప్రకృతిమాత బిడ్డల సమాజమైన శైత్యోపచారాలచే తగ్గుజూపింది.

ఇక రైతురాముడు "ప్రేయసిని గురించి పలురీతుల కలువరించును వలవరించును. కనుల ముందు సీత మెరసినట్లై పెద్దగా ఉలికిపడును భామ పిలిచినట్లై అంతట కలియజూచును. సీత లేక ఉండలేని స్థితిలో ఉన్నాడు. నాయికానాయకులిర్వురికి మలయానిలాలు చంద్రాతపములు అగ్గి మంటల వలె, చందనం మండుటింధనం వలె తోచినాయి. శుకపికరుతాలు కటువై-నాయి, విరాళి వలపుకాకచే పడుచు జంట యెదలో తాపార్తిలో లోనగోలింది.

## ప్రణయ రాగం:-

విరాళిని తట్టుకోలేక నాయిక సీత రామునికై వచ్చి, భల్లుకం అర్భ-టించి పెల్లార్చగా భయకంపితయై, చెంతనున్న యువ రాముని చుట్టి వేసింది.

"ప్రాలెననుకొనకుండ నా బాలమేను
అట్టులాతని భుజపంజ రాంతమున
అ ప్రియత్న ముగనె వాని హస్తములవి
గట్టిగానామె కటిసీమం జుట్టివైచె"

అన్యోన్యాలంబనం గల నాయికా నాయకుల గాఢాలింగనం సంభోగ విషయమైన రతికిద్దరిని సన్నిహిత పరచింది. ప్రాణానికి ప్రాణమెదురు పెట్టుదునని రైతురాముడు సీతను తన వాటికకు చేర్చి "చెలీ నీవంటి యెఱ్ఱ పచ్చని పూవయసు పడుచు కొండభూముల మధ్యన బావురుమను చిట్టడివిలో నిశావేళలందు మసలుట చెడ్డ సాహసమగునని పరామర్శించాడు. ప్రియుని మాటలకు సీతకు సిగ్గు మొగ్గలు వేసింది. రోమాలు నిక్కరించాయి, సీమంతం ఉబికి కనులు చెమరించాయి. వారిద్దరు కలిసి ఒక్కరైనారు.

## సంభోగ శృంగారం

నాయికా నాయకుల ప్రణయ బంధం వివాహ బంధమై వారి నొకటి జేసింది. నవ ప్రణయ రసాంకూరాలను నాటి తొలిరేయి నందు కాపు సీతా రాములు రసార్తి తృష్ణతో సిగ్గు దుమారంలో ఊరిని చిలిపి కోరికలతో ఒకరి కొకరు దగ్గరై జడలుగానల్లు కౌగిళ్ళలో ముద్దుల సుద్దుల మూటవిప్పి ఆనం దంలో తేలిపోయారు.

"సాగిసాగనట్లుగఁ బిపాసార్తి కొంత
తీరి తీరనట్లుగ కోర్కె తీపిసుధలు
యంది యందనట్లుగ నుండు నా విచిత్ర
నవయువాముగ్ధ మృదు మిధునమున కల్ల
నాటిరేయి త్రియామమైనది నిజముగ"

క్రొత్తజంట శృంగార చేష్టలు రతి స్ఫూర్తిని పొంది రసదృప్తి కల్గి స్తాయి. ఆలంబమైన కాపు సీతారాముల దర్శన స్పర్శనాదుల వల్ల పరస్పరా లింగ సంభాషణాదుల వల్ల వర్ధిల్లిన ప్రణయరాగం రోమాంచాది విభావాను భావసంచార్యాదులతో స్థాయి భావమైన రతి సంయోగం పొంది శృంగార రసం సభ్యతావిశిష్టగా నిర్వహింపబడింది.

## విప్రలంభ శృంగారం

జమీందారు నిర్బంధంలో ఉన్న నాయిక సీతతన రాముని గురిం చిన పరివేదనలో

"ఒక్కక్షణమైన నను విడియుండలేని
చిన్ని నాదొర నను విడి యెన్ని యెన్ని
పాట్లు పడుచుండెనో యెంత బరువు బ్రతుకు
నీడ్చు చుండెనో" అని వలవించింది.

"రామ! నా రాము రక్షించుమే మెరుగని
చిన్ని నాదొర చల్లగానున్న క్షేమ
వార్త కొఱకె జీవించెద వసుధ వాడు
దైవమును ప్రాణమును జీవితమును తానె"

తన జీవిత సర్వస్వమైన రాముపీడి మనుట దుర్భరమైందని వాపోవటం వల్ల వారి స్నిగ్ధమైన ప్రేమానుబంధం ప్రకటింపబడి విప్రలంభం స్థాయినందుకొంది. సీతను బాసిన రాముడు కూడ వియోగభారానికి కుర్రంగిపోతాడు.

"ఓసీతా! నాసీతా! నా సింగారాల రాణి నా సతి నీకున్
బాసితి నెపుడో యపుడే! పాసితి నా జీవితంపు ప్రగతికె సీతా!

సతితోనే ప్రగతి యుందని, సీత కొఱకే బ్రతికి యున్న రైతురాముని అవ్యాజమైన ప్రేమ వారి ఆదర్శ దాంపత్య జీవితానికి పరాకాష్ఠ. ఇట్లీ నాయికానాయకుల్లోని విప్రలంభ పరివేదనం పునస్సమాగమం కొరకు పరితపిల్లింది. అందువల్లనే సీతను పరిగ్రహించడానికి రైతురాముడు జమీందారు పాపారావును పరాక్రస్తమొనర్చటం జరిగింది. కావ్యంలో సంభోగ విప్రలంభ శృంగారం ధర్మవీరంలో పర్యవసించి కావ్య ప్రతిష్ఠను పెంచింది.

## కరుణ రసం

అనిష్ట ప్రాప్తి వల్ల చిత్త ద్రుతి కలిగించే శోకం స్థాయీ భాగంగా గల రసం కరుణం. శాపక్లేషాదుల వల్ల, విభవనాశోపద్రవాదుల వల్ల, ఇష్ట వస్తు వియోగం వల్ల శోకం జనిస్తుంది. శోకం బాష్ప పులకాదులచే అనుభూతమై చిత్తద్రుతిని కల్గించి మనస్సును కరిగించి కరుణ రసాస్వాదనకు ఉన్ముఖుల జేస్తుంది. జీవితం సుఖఃదుఖాత్మకమైంది కావున ప్రకృతిరస

మైన కరుణం1 కావ్యంలో అంగరసంగా నిర్వహింపబడి అంగిరసానికి అండగా నిల్చింది.

"అడుగడుగలనన్ ప్రమాద పుటలలు పెద్ద
కొండయెత్తునన్ లేచుచు గుండె జీల్చ
పెనుదుమరల నడి కడలిని మునుగుచు
హిందు ప్రజల జీవిత నావ యిట్టటుగుచు
కొట్టుకొని పోవ దరి జేర్చునట్టి యెట్టి
దిక్కుదిములేని బ్రతుకు దినదినమ్ము
ప్రాణగండమైపోన్ నిజామ్‌రాష్ట్ర ముడివి
ఎందయిన తలదాచుకోనిటటు జనిరి"

నిజాం రాష్ట్రంలో జమీందారు రజాకార్ల అమానుష క్రూర రాక్షస కృత్యాలకు సమస్త సంపదలు కోల్పోయి చావలేని, బ్రతుకలేని, లేవలేని వల్లె ప్రజల దీనమైన బ్రతుకు బాధలు కర్షక లోకం పొందిన ఆవేదన శోక స్థాయిని పొంది కరుణం అవిష్కృతమై ఎంత మొండు బండ గుండెలనైనా కరిగిస్తుంది. అందుచే సజాతి సోదరుల నుద్ధరించడానికి కావ్యనాయకుడు కృత సంకల్పుడై ద్విగుణీకృతోత్సాహంతో కర్షకాభ్యుదయాన్ని సాధిస్తాడు ఇందువల్ల కరుణ మంగరసమైంది.

సాగరయ్య పెద్దభార్య గంగమాంబకు వ్యాధి కారణంగా చిక్కి శల్యమై మరణమాసన్నమౌతుంది.

"గంగను జేరదీసి యుసెఁ గన్నుల గంగలు దూకిపారగా
బంగరు రాణి నన్విడిచి పాపలన్ విడిమమ్ము శోకపుం
గంగను గూల్చి పోదువటె కానని లోకములోకి కాపుర
మ్మంగడి పాలుజేసి తగునా! ననునొంటరి ప్రాణి జేసిపోన్"

చిన్నిపాపలైన రామలక్ష్మణులను వదలిపోనున్న గంగలేని బ్రతుకు శూన్యమని, అమెతో తాను కూడ ప్రాణాలు విడుతునని" పరిపరివిధాల విల పించే సాగరయ్య శోకాన్ని చూచిన అచటి వారందరు గొల్లునయేడ్చారు. గంగ మరణించింది. కడుపు చెక్కలౌనట్లు, గుండె పగులునట్లు ఏడ్చి అర్చి సాగరుడు దుఃఖాతిశయంతో కనులు వర్షింప అవశుడై నేల బడినాడు. సాగరు

1 ఏకోరసః కరుణఏవ—భవభూతి ఉత్తరరామ చరిత్రము నాటకము-3-41

డాలంబనంగా నున్న కరుణాని కిగంగ వియోగం అనుభావమై, తద్వియోగ భారం వల్ల కలిగిన సాగరుని ఏడ్పులార్పులు, పలవింతలు వ్యభిచారులై దుఃఖంతో నిండిన కన్నులనిండిన నీరు, మూర్ఛనొందటం సాత్త్వికభావాలై స్థాయినందుకున్న శోకం చిత్తద్రుతిని కలిగించి కరుణరసం ఆస్వాదనీయమై అలరారింది. ఈ కరుణరసాత్మకమైన ఘట్టం మంగ హృదయాన్ని కరిగించింది. చిన్నిపాపలైన రామలక్ష్మణుల సొంత బిడ్డలుగా పెంచి రామలక్ష్మణులకు "ఒకే తల్లి బిడ్డలమనే భావం" కిలిగించింది. అందువల్ల రైతురాముడు కావ్యనాయకుడగుడకు మార్గం సుగమం చేయబడింది.

నిర్బంధంలో నున్న సీత రైతురామునెడబాసి నా అనే దిక్కు లేక హాయని అర్చుచు ఏడ్చింది. "కంటికి మంటికే కముగఁ గాల్వలు గట్టగ వెక్కివెక్కివాల్గంటి భరింపరాని పొంద గర్భముద్రవయ్యగనేడ్చె గుండెలన్ గంటిడు కత్తులై స్మృతులు కారియపెట్టగ నేడ్వనై ననున్ కంఠములేకలోఁ గుమిలె గాత్రిగెడి మూసనులోహ మెట్లటుల్" పతిరైతురాముని, సుతు చోపును, మామ సాగరుని పేరు పేరున తలపోస్తూ వారి నుండి వేరైనందులకు గుండె బాదుకొంటూ కంటికి మంటికి నేకధారగా యేడ్చే సీత శోకదేవతలా రస హృదయులకు చిత్తాద్రుతిని కలిగిస్తుంది.

రైతురాముడు ప్రాణానికి ప్రాణమైన సీతా వియోగంతో అశ్రువులు కన్నుల నుండి కారి కారి కనుచూపు నిల్చిస్తబ్ధ సజీవ చిత్రంగా ఉండి పోయడు.

"నా సీతా కరసైన నిను విడియుండన్ లేని నేనిన్ని నా
శ్వాశాజీవిగనై ననున్ మిగులు చింకాయుంటి నన్నన్‌చెలీ
సాన్నిధ్యము కోనమె మధురమౌని ప్రేమకోసమ్మె నా
యాసల్ వమ్మొనరించబోకు సుమీ నీయా గోపు కోసమ్ము నేన్"

అని సీతను గూర్చి దుఃఖించిన తీరు హృదయాన్ని కదిలిస్తుంది. నాయికానాయకులు ఆలంబన విభావమై ఒకరి నుండి ఒకరు వియోగం పొందడం అనుభావమై అశ్రుపాతాదులు సంచారాదులై ఎడబాటువల్ల కలిగిన వారి శోకం స్థాయి భావంగా నిష్పన్నమై కరణం రసతరంగితమైంది.

మైన కరుణం1 కావ్యంలో అంగరసంగా నిర్వహింపబడి అంగిరసానికి అండగా నిల్చింది.

"అడుగడుగలనన్ ప్రమాద పుటలలు పెద్ద
కొండయెత్తునన్ లేచుచు గుండె జీల్చ
పెనుదుమరల నడి కడలిని మునుగుచు
హిందు ప్రజల జీవిత నావ యిట్టటగుచు
కొట్టుకొని పోవ దరి జేర్చునట్టి యొట్టి
దిక్కుదిములేని బ్రతుకు దినదినమ్ము
ప్రాణగండమైపోన్ నిజామ్‌రాష్ట్ర ముడివి
ఎందయిన తలదాచుకోనిటటు జనిరి"

నిజాం రాష్ట్రంలో జమీందారు రజాకార్ల అమానుష క్రూర రాక్షస కృత్యాలకు సమస్త సంపదలు కోల్పోయి చావలేని, బ్రతుకలేని, లేవలేని వల్లె ప్రజల దీనమైన బ్రతుకు బాధలు కర్షక లోకం పొందిన ఆవేదన శోక స్థాయిని పొంది కరుణం అవిష్కృతమై ఎంత మొండు బండ గుండెలనైనా కరిగిస్తుంది. అందుచే సజాతి సోదరుల నుద్ధరించడానికి కావ్యనాయకుడు కృత సంకల్పుడై ద్విగుణీకృతోత్సాహంతో కర్షకాభ్యుదయాన్ని సాధిస్తాడు ఇందువల్ల కరుణ మంగరసమైంది.

సాగరయ్య పెద్దభార్య గంగమాంబకు వ్యాధి కారణంగా చిక్కి శల్యమై మరణమాసన్నమౌతుంది.

"గంగను జేరదీసి యసెం గన్నుల గంగలు దూకిపారగా
బంగరు రాణి నన్విడిచి పావలన్ విడిమమ్ము శోకపుం
గంగను గూల్చి పోదువటె కానని లోకములోకి కాపుర
మ్మంగడి పాలుజేసి తగునా! ననునొంటరి ప్రాణి జేసిపోన్"

చిన్ని పాపలైన రామలక్ష్మణులను వదలిపోనున్న గంగలేని బ్రతుకు శూన్యమని, అమెతో తాను కూడ ప్రాణాలు విడుతునని" పరిపరివిధాల విల పించే సాగరయ్య శోకాన్ని చూచిన అచటి వారందరు గొల్లునయేడ్చారు. గంగ మరణించింది. కడుపు చెక్కలౌనట్లు, గుండె పగులునట్లు ఏడ్చి అర్చి సాగరుడు దుఃఖాతిశయంతో కనులు వర్షింప అవశుడై నేల బడినాడు. సాగరు

1 ఏకోరసః కరుణఏవ–భవభూతి ఉత్తరరామ చరిత్రము నాటకము–3-41

డాలంబనంగా నున్న కరుణాని కిగంగ వియోగం అనుభావమై, తద్వియోగ భారం వల్ల కలిగిన సాగరుని ఏడ్పులార్పులు, పలవింతలు వ్యభిచారులై దుఃఖంతో నిండిన కన్నులనిండిన నీరు, మూర్ఛనొందటం సాత్త్వికభావాలై స్థాయినందుకున్న శోకం చిత్రద్రుతిని కలిగించి కరుణరసం ఆస్వాదనీయమై అలరారింది. ఈ కరుణరసాత్మకమైన ఘట్టం మంగ హృదయాన్ని కరిగించింది. చిన్నిపాపలైన రామలక్ష్మణుల సొంత బిడ్డలుగా పెంచి రామలక్ష్మణులకు "ఒకే తల్లి బిడ్డలమనే భావం" కిలిగించింది. అందువల్ల రైతురాముడు కావ్యనాయకుడగుడకు మార్గం సుగమం చేయబడింది.

నిర్బంధంలో నున్న సీత రైతురామునెడబాసి నా అనే దిక్కు లేక హాయని ఆర్చుచు ఏడ్చింది. "కంటికి మంటికే కముగఁ గాల్వలు గట్టగ వెక్కివెక్కివాల్గంటి భరింపరాని పొంద గర్భము వ్రయ్యగనేడ్చె గుండెలన్ గంటిడు కత్తులై స్మృతులు కారియపెట్టగ నేడ్వనైనమున్ కంఠములేకలోఁ గుమిలె గాత్రిగెడి మూసనులోహమెట్లటుల్" పతిరైతురాముని, సుతుచోపును, మామ సాగరుని పేరు పేరున తలపోస్తూ వారి నుండి వేరైనందులకు గుండె బాదుకొంటూ కంటికి మంటికి నేకధారగా యేడ్చే సీత శోకదేవతలా రస హృదయులకు చిత్రాద్రుతిని కలిగిస్తుంది.

రైతురాముడు పాత్రాణానికి ప్రాణమైన సీతా వియోగంతో అశ్రువులు కన్నుల నుండి కారి కారి కనుచూపు నిల్చిస్తబ్ధ సజీవ చిత్రంగా ఉండి పోయడు.

"నా సీతా కరనైన నిను విడియుండన్ లేని నేనిన్ని నా
శ్వాశాజీవిగనైనమున్ మిగులు చింకాయుంటి నన్నన్‌చెలీ
సాన్నిధ్యము కోనమె మధురమౌని ప్రేమకోసమ్మె నా
యాసల్ వమ్మొనరించబోకు సుమీ నీయా గోపు కోసమ్మునేన్"

అని సీతను గూర్చి దుఃఖించిన తీరు హృదయాన్ని కదిలిస్తుంది. నాయికానాయకులు ఆలంబన విభావమై ఒకరి నుండి ఒకరు వియోగం పొందడం అనుభావమై అశ్రుపాతాదులు సంచారాదులై ఎడబాటువల్ల కలిగిన వారి శోకం స్థాయి భావంగా నిష్పన్నమై కరణం రసతరంగితమైంది.

విప్రలంభాను ప్రాణితమైన ఈ కరుణ రస సన్నివేశం రైతురాముని రోష పరవశునిజేసి కర్తవ్యాన్ని ప్రబోధించింది. సీతాపరిగ్రహణానికి ప్రోత్సాహ పరచింది. కరుణ మీ విధంగా ధర్మవీరానికి అంగరసంగా భాసించింది.

ఇంకా ఈ కావ్యంలో కరువు కాటకాల విలయ తాండవం వల్ల పల్లె ప్రజలు పడిన కష్టాల చిత్రణంలోను, అత్తవారింటికి ఊర్మిళను అప్పగించే ఘట్టంలోను, రజాకార్లచే హతమైన మంగమను గూర్చి రాముడు శోకించిన సన్నివేశంలోను, జమీందారు మరణానంతరం వాని భార్య దుఃఖించిన సందర్భంలోను కరుణరసం అభివ్యంజితమై కావ్యనాయకుని కావ్యఫల సాధకునిగా నిలుపుతుంది.

## శాంతరసం

నిర్వేదంతో కూడిన శమం స్థాయీభావంగా గల రసంశాంతం[1] వైరాగ్యం, భక్తి, సత్సంగం మున్నగువానిచే జనించే చిత్తవృత్తిశమం[2] వీని నిష్పనంచే ఏర్పడిన శాంతరసానికి నాయకుడు ధీరశాంతుడు. ఈ రసానికి ఆలంబన విభావం దైవభక్తి, సత్పురుషసేవ, వేదాంత విచారం, దైవానుగ్రహం మొదలైనవి. ఉద్దీపనవిభావాలు మతి, స్మృతి, ధృతి మొదలైనవి. చింతా వితర్కాదులు వ్యభిచారీ భావాలు వీని సంయోగంతో స్థాయి భావమైన శమం శాంతరసంగా నిష్పన్నమై సేవ్యమానవౌతుంది. శాంతం కావ్యంలో సాగరయ్య. ధర్మారాట్ప్రభు పాత్రల ప్రవృత్తి నాశ్రయించి సాగింది. వీరి జీవన ప్రస్తారాలు ఆలంబనంగా రైతురాముని ధర్మవీర చరితం కావ్య కథగా నడిచి కావ్యఫలాన్ని సాధించింది. అందువల్ల శాంతం ధర్మవీరానికి అంగంగా పరివ్యాప్తమైంది.

కావ్యంలో సాగరయ్య శాంతరసావిష్టుడై ఆలంబనగా నిల్చినవాడు. అతనికి చిరకాలం సంతానం లేక పోయింది. "ఫలము గలుగు గలుగదు,

---

1 నిత్యానిత్య వస్తు విచార జన్మా విషయ విరాగాఖ్యోనిర్వేదశ్శమః
రసగంగాధరము -పరివస్య- పుట 188

2 వైరాగ్యాదినా నిరికార చిత్తత్వ రెశమః
విద్యానాధుడు- ప్రతాపరుద్రీయమ్ రసప్రకరణమ్- పుట-197

ఇలా నదియో మనకర్మ బట్టి నడుచు కర్తలెవరు? అని నిర్వేదం పొందు తన వంతు ధర్మంగా తన భార్యలు గంగమంగలచే అనేక వ్రతదాన దీక్షలను నిర్వర్తింప జేశాడు. వారికి రామలక్ష్మణులు జన్మించారు."వెల్గులే లేనియింట పసివెల్గుల పంట ఫలించె యీ వెలుగుల జంట యే విభుడు పెట్టిన కోటి వరాల పంటదా నిలుపువాడె నేసెవడ నీరును బోయడె నారు బోయువాడిల నని సాగరయ్య తొణకింతయు లేక స్మరించు వెంకనన్" భగవంతుని యందు భక్తి నిలిపి, విధి సంకల్పానికి సదాబద్ధుడై సంతోష విషాదాదులను సమతుల్యంగా భావించిన స్థిత ప్రజ్ఞత అతనిలోని శాంతానికి ఉద్దీపన బావాలుగా పర్యవసించాయి.

"ఏది ఎట్లుగా నున్నదో యింకయే వి పత్తులెన్ని రానున్నవో। మొత్తమునకు స్వామి సంకల్పమునకు నా స్వామి దయకు తిరుగులేదు కానున్నది జరిగి తీరు" కానున్నది కాకమానదనే నిరపేక్ష భావం, సుఖ దుఃఖాలు జీవిత ప్రవాహానికి ఆవలీవలి తీరాలని, చీకటి వెనుక వెలుగు రేఖలుంటాయనునీ చింతావిత్కాంశమానికి వ్యభిచారులుగా తోడ్పడిసై గంగ మరణం వల్ల కన్నీరు పొంగిపోయి హృదయ భారం తొలగి నిర్వికారత భాసించింది "అడిగి తెచ్చుకొన్న యనుభవమ్మయిపోయి। ఋణము తీరెనెపుడొ వనిముగిసెను పైననింకనవనిపై నక్షణమ్ముండి। బ్రతుకుహక్కు ప్రాణితతికెచటిది। ఋణాను బంధంతోనే భార్యాపుత్రులు పశు సంతతులు ప్రాప్తిస్తాయి అనే వేదాంతస్ఫూర్తి, వైరాగ్యం, నిర్వేదచింతనం గల చిత్తవృత్తితో స్థాయి భావమైన శమం నిష్పన్నమై సాగరయ్య యందు శాంతం రూపుకట్టింది. ఎగసిపడని దూకిపడని చిత్తవృత్తితో బ్రతికినన్నాళ్ళు విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించిన సాగరయ్య కుమారులు రామలక్ష్మణులు కావ్యనాయకోపనాయకులుగా ధర్మ కార్యాలను ఉత్సాహంతో నిర్వర్తించి కావ్య కథను సుసంపన్నం జేశారు. కావ్యంలో మరొక శాంతరసాలంబనమైన ప్రాత ధర్మారాట్ప్రభువునకు వర్తిస్తుంది. అతడు భీమవరం సంస్థానానికి అధిపతియైనను నిగర్వి శాంతగంభీరుడు.

"ధర్మారావొక దొడ్డచున్నెమునకున్ ధర్మప్రభుండార్యుడున్
నిర్మాయుండును నిత్య సత్య వ్రతుడున్ నిర్ద్వంద్వుడీ దుష్టదు
ష్కర్మారంభములన్ సహించడెపుడున్ సంస్కారవంతుడు స
న్నిర్మాణాత్మిక నిష్ఠడెల్ల ప్రజకున్నెట్టైన నచుట్టమ్మునున్"

ధర్మారాట్ప్రభువు యొక్క సత్ప్రాంగత్యం, సత్యసంధత, నిష్కామమైన నిర్మాణాత్మకమైన కర్మనిష్ఠ, శమక్షమ నిర్వేదాదులు వ్యజ్యమానమై శాంత రససూర్ఫర్తిని కల్గిస్తున్నాయి. ధీరశాంతుడైన అతడు ధర్మ కర్మాచణోత్సాహం గల కావ్యనాయకునకు సైన్య సహకారమందించి అతని ధర్మ విజయానికి తోడ్పడం వల్ల శాంతం ధర్మవీరంలో పర్యవసించింది.

## హాస్యరసం:-

వికృతమైన ఆకారం, వికృతమైన భాష, వికృతమైన వేషం, వికృత చేష్టాదులను చూడటం వల్ల, వినటం వల్ల కలిగే మనోవికారం హాస్యం, హాస్యం స్థాయీభావం గాగలది హాస్య రసం.1

కావ్యంలో సుందరమ్మ వృత్తాంతం, హనుమప్ప యోగి వేషం హాస్యరస సమంచితాలై ఉన్నాయి. సుందరమ్మ కామవాంఛ తీర్చుకోవ-డానికి అచ్చం రతీదేవికి మేనత్తలాగున, బంగరుతను సంపత్తు, ఉంగరాల జుత్తు, కనుల నిషామత్తూ, దిగువ మొలకసరత్తుతో హొయలు మీర బాజారు అంగనవలె రింగురింగున లక్ష్మణుని చెంతకు బయలు దేరింది" లక్ష్మణుడు దానిని ఛీచ్కరించి మర్కటిలాగున త్రోసివేయగా అది బెల్లటుతూలి నేల వ్రాలింది.

పల్లెవాసుల కట్టు బొట్టు వడికట్టునకు సుందరమ్మ వేషం, నిర్లజ్జ, లక్ష్మణుని వల్ల త్రోసివేయబడుట ఇవన్నీ పరిహాస పూరితాలై హాస్యరసం వ్యజ్యమానమగు చున్నది.

## అద్భుతరసం:-

అద్భుతానికి స్థాయీభావం విస్మయం. అపూర్వ వస్తు సందర్శనంచే కలుగు ఆశ్చర్యమే విస్మయం.2

---

1 వికృత దర్శనాది జన్యమనో వికారము హాసము
విద్యానాధుడు-ప్రతాపరుద్రీయమ్-రసప్రకరణమ్

2 అపూర్వ వస్తు దర్శనా చిత్త విస్తారో విస్మయో మతః
ప్రతాపరుద్రీయమ్

వృద్ధాప్యంవచ్చే వరకు సాగరునికి సంతానం కాలేదు. వేంకటేశ్వరుని దయతో రామలక్ష్మణులు గంగ మంగలకు స్వప్నంలో కనిపించి జన్మింతు మని అనతిచ్చారు.

"అద్భుతమ్మద్భుతమ్ము పరమాద్భుతమ్ము
ఇరువరమ్మల గర్భాల నింకపైన
రామ లక్ష్మణులే కాపురాజులగుచు
నవతరింతురొ మేమెచూడవలె ముందు"

అని ప్రజలు ముచ్చటలాడిరి. "జగగొడ్డుగేస్తు ఇంట పాపలుయ్యేలల నూగిరి" స్వప్నం నిజమైనందుకు, చిరకాలం సంతానం లేని వారికి పిల్లలు కలుగటం అపూర్వమనిపించి ప్రజలు విస్మయం చెందుటచే అద్భుతరసం అభివ్యక్తమైంది.

ఇప్పలవాగుపై కైతు రాముని సేన సేతు నిర్మాణ ఘట్టం అద్భుత రసోత్పాదకంగా ఉంది. కొన్ని వేల బిగడుల కొత్తసాగునకు దెచ్చు ఆ పెద్ద చెఱువు ఆనకట్టను జూచి జమీందారు గుండెబాదు కొనుచు గుర్రిడ్లు తేలగి లపైచి పెద్ద సేపు చోద్యమందెను. విస్మయం వ్యంజితమై అద్భుతం రంజితమైంది. అద్భుతావహమైన అపూర్వ సేతు నిర్మాణం కావ్య నాయకుని ఉపజ్ఞను చాటింది. ఇట్లీ అద్భుతం అంగరసంగా విలసిల్లింది కావ్యంలో హనుమప్ప దౌత్య నిర్వహణంలోను అద్భుతం ప్రదర్శితమై కావ్య కథకు ఉపకరించింది.

## రౌద్రరసం:-

శత్రువులొనరించు అపచారం వల్ల కలుగు మనః ప్రజ్వలనమే క్రోధం.1 క్రోధం స్థాయీ భావంగాగలది రౌద్ర రసం.2 రౌద్రం ఉత్తమ ప్రకృతికం కాదు. రౌద్రానికి ధీరోద్ధతుడు నాయకుడు. కావ్యంలో ప్రతి

1 శత్రు కృతాపచారేణ మనః ప్రజ్వలనం క్రోధః
విద్యానాథుడు-ప్రతాపరుద్రీయమ్ -రసప్రకరణం

2 రౌద్రః క్రోధ స్థాయీ భావః సాహిత్య దర్పణమ్

జమీందారుడు పాపారావు వృత్తాంతం రౌద్ర రసోపేతమైంది.

స్వోత్కర్ష, దురహంకారం, పట్టిన పట్టువిడువని మూర్ఖత్వం, మాత్స-ర్యం, క్రోధం మున్నగు ఉద్ధత గుణాలు1 గలవాడు పాపారావు.

"పదుగురు పెత్తలల్ తనకుఁ బ్రక్కలనిల్వ దశాస్యుడై సుదు
ర్మదమునఁ గ్రొవ్వి నవ్వికొని బ్రహ్మను గాచడు కంట బడ్డయే
సుదతిని పోవనీడు ముకుసూటిగ సాగవలెన్ తనన్నదే
ఎదురెవడెందు లేక తనదే పయిచేయిగ మింటఁగాడెడిన్"

జమీందారు స్త్రీ విషయికమైన కామవాఛ, తాను వీరుడననే దురహంకారం వాని అంతానికి కారణమైనాయి. రైతు రాముని కర్షక గ్రామాభ్యుదయ కార్య సరళి ప్రజా బల సమీకరణం, అపూర్వ సేతు నిర్మాణం జమీందారులో అసూయను రేకెత్తించి మాత్సర్యం కలిగించాయి. కావ్య నాయ-కుని సాధించాలని ఆతని సతిని సీతను నిర్బంధించి కయ్యానికి కాలు దువ్వాడు. ధర్మారాట్ప్రభుని సైన్య సహకారంతో రాముడు జమీందారునెదుర్కొంటాడు.

"వీర హుంకార ఘీంకార క్రూర నినద
పూరమై హయరాజ విస్ఫుట సరోష
హేషిత ధ్వాన ఘోషిత భీషణమయి
పణవ దుందుభి కాహళ పటహనివహ
ఘూర్ణితానంత రోద సీకుహరమగుచు"

వీర భట ఘోషణాలు, భేరీఖాంకారాలు హయహేషధ్వానాలు ఇరువర్గ శత్రు సైన్యాలకు ఉత్తేజాన్ని కలిగించి రోషా వేశుల జేసినాయి.

"మీ కర్మల్ మూడును కాంచు కొండు భట వర్గమ్ముల్ మహాక్రూర దుఃష్కర్ముల్ పాప ఫలమ్ము పొందుదురు గాత", అని హనుమప్ప సేనాని అధిక్షేపాత్మకమైన మాటలు ప్రతి పక్షానికి ఈటెలై గ్రుచ్చినాయి. క్రోధపరవశుడైన పావని సేనాని కొండడు హనుమప్పతో తలపడ్డాడు.

---

1 తిక్కన కావ్య శిల్పము - కేతవరపు రామకోటి శాస్త్రి పుట 24

క్రూరాస్త్రావళి నొండొరుల్ ఛెనకిరాక్రోశించి పెల్లార్చుచున్
హోరాహోరిగ బోరుచున్ రుధి రధారోత్సిక్త సర్వాంగులైనారు".

మిక్కిలి ఔద్ధత్యంతో పోరాడే వారి క్రోధం తారాస్థాయికి చేరింది. ఇదే విధంగా ధర్మారాట్ప్రభువు జమీందారు సెదుర్కొని సూటి పోటి మాటల ఈటెలురువ్వాడు.

"ఇది యానీ దొరపద్దు। పాపనుతి। యిట్లేదొడ్డ యిల్లాండ్రవా
రి దొరల్ కంటికి నీరు వెట్టుకొన బల్మిన్ మానభంగమ్ము చే
యదలంపూనితొ। ఏందరాండ్రయుసురన్యాయమ్ము గాంచుచ్చుకొం
దుదొరా। కాలము మూడె నీకిక మహాదుర్మార్గనోరెత్తవే"

ఇందుకు పాపారావు "బలమున్నతనిదె పృథ్వి, బలమున్న వానిదె వర్ధాంగి బలశాలిదే స్థిర చరాస్తులు" అని స్వోత్కర్ష చేసికొని పరస్పరం దూషించుకోవటం వల్ల క్రోధం పరాకాష్ఠకు చేరింది. రైతురాముడు జూలు విదల్చిన సింగంలా కదనరంగాన దూకాడు. సైన్య పదఘట్టనకు పాపి పాపడు నేలకొరిగాడు."

ధీరోద్ధతుడైన జమీందారు మాత్సర్యాహంకారాదులు అనుభావాలై, వీర ప్రతి వీరుల పరస్పర దూషణలు ఉద్దీపనాలై, తాడన పీడన ఛేదనాదులతో స్థాయీ భావమైన క్రోధం తారాస్థాయికి చేరి రౌద్రరసం స్ఫూర్తిమంతమై ధర్మ వీరానికి ఉత్తేజ విస్తారాలను ఉద్దీపింపజేసి కావ్యఫలాన్ని కావ్యనాయకునికి అందివ్వడానికి అంగరసంగా ఆవిష్కృతమైంది.

## భయానక రసం:-

భయం స్థాయీ భావంగా గలది భయానక రసం.1 రౌద్ర స్వరూపాలను చూడటం వల్ల, భీకర శబ్దాలను వినడం వల్ల కీడు కలుగునోయని శంకించడమే భయం, స్త్రీలు నీచులు ఈ రసానికి ఆశ్రితులు.

కావ్యంలో నాయిక సీత రాముని కంచెచేలుకు చేరిన సందర్భంలో

1 విద్యానాథుడు-ప్రతాపరుద్రీయమ్-రసప్రకరణమ్ పుట 196

ఒక భల్లూకం గర్జార్భాటంతో వరుగున వచ్చింది.

"కూలెన్ గుండెలు నిల్వునన్ పొలతిమేను కుర్రింగారె చన్నీళ్ళ కుం
డై లోపించెను చేతనా పటిమమెర్రెడై యా నిమేషమ్ము ప్రా
ణాలే లేచి మహాంతరిక్ష పథమున్ బట్టెన్ లతాతన్వి దానేలన్
వ్రాలె పతత్త్రటిల్ల తగనందే కెవ్వుమంచార్చుచున్"

క్రూరమైన భల్లూకాన్ని జూచి భయపడి ఆపాదమస్తకం కంపించు చుండగా, గుండె కోల్పడి ఆర్తనాదం చేసి వశం తప్పి నేలపడింది"

భయకంపితమైన సీత ఆలంబన విభావమై, భల్లుక రౌద్ర స్వరూపం భీకరార్భటులు ఉద్దీపన విభావమై, శరీరకంపనం, స్వేదం, శోకం, ఆర్తనాదం మూర్ఛాది వ్యభిచారీ భావాలచే స్థాయీభావమైన భయం రసస్థితిని పొంది భయానకం రసానుభూతిని కలిగిస్తుంది.

భల్లూక బారి నుండి రక్షింపబడిన సీత రామునకు చేరువౌతుంది. వారి ప్రణయం పరిణయంగా మారుతుంది కావ్యనాయిక జీవన ప్రస్తారంతో కావ్యనాయకుడు ఉద్దిష్ట ఫలాన్ని సాధిస్తాడు. అందువల్ల కావ్యంలో భయానకరసం ప్రధాన రసానికి అంగంగా కూర్చబడింది.

ఇట్లీ భయానక రసం కరువు రక్కసివాత జిక్కిన గ్రామ ప్రజల వెతలను వర్ణించే సందర్భంలోను, ఘఘాను గర్జార్భటికి గురియై సీత నిర్బంధింపబడిన ఘట్టంలోను, రైతురాముని సైన్యం వీర గర్జనకు ప్రతి వీరుని సైన్యం పయనాన్ని వర్ణించే సందర్భంలోను ఔచిత్యంతో నిర్వహింపబడింది.

## భీభత్స రసం :-

వమనం, నెత్తురు మొదలగు వస్తువుల దర్శనం వల్ల తచ్ఛ్రవణం వల్ల మనస్సులో కలిగే జుగుప్సను స్థాయీ భావం గల రసం భీభత్సం కావ్యంలో నాయగ ప్రతినాయకుల రణస్థలి జుగుప్సావహియై భీభత్సానికి తావలమైంది. హనుమప్ప కొండడు ఇర్వురు సేనానులు ఒకరినొకరు తలప

డగా వారి శరీరాలు చిట్లి రక్తధారలు స్రవించినాయి.

ఘోరంబైన రణాంగ నావనియు కాకుల్ గ్రద్దలల్లాడుటన్
దారుదాగ్రవని యయ్యెఁ బావని బలాల్ దస్సించెఁ గ్రొమ్ముళ్ళన్
వెసన్ పారేన్ కొండడు భండనమ్ము విడి దేవపాహి
పాహీతి దీనారావమ్ములు నల్దిసల్ పరచి పోనాపై పుకేన్ జూడకే"

రణరంగ క్షేత్రంలో క్షతగాత్రుల నుండి రక్తంచిందిం, ప్రవహించటం కాకులు గద్దలు సంచరించటం, గాయపడిన వారి హాహాకారాలు మొదలగు భీతావహమైన జుగుప్సాకరమైన దృశ్యాలు భీభత్స రసాన్ని ఆవిష్కరిస్తు న్నాయి. భీభత్స రసం యుద్ధవీరానికి స్ఫూర్తినిచ్చి కావ్య కథకు తోడ్పడింది.

భక్తి రసం:-

భక్తి రసమునకు భగవంతుడు ఆలంబన విభావము. అతని చరిత్ర ములు ఉద్దీపన విభావములు, భగవదాకార చిత్తవృత్తిస్థాయీ భావము అదియే భగవద్రతి. తత్కాల జనితమైన నేత్రాది వికారములు అనుభావ ములు, భగవదాకార చిత్తవృత్తి రూపమైన భగవద్రతి ఉపర్యుక్త విభావా దులచే పోషింపబడి భక్తి రసములుగా నుద్భాసించును.1

కావ్యంలో గంగ మంగమ్మల వ్రతాచరణ, నియమ నిష్ఠలు, దాన ధర్మాలు చేయటం వల్ల శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రసన్నుడై వారికి స్వప్న ములో సాక్షాత్కరిస్తాడు.

"సింగారములు జిమ్మ చెంగావి జిలుగుల
బంగారు సరిగంచు పంచె వెలయ
డా మూపుపై నాగుబాము- కూసము వంటి
జరి పూవు కండువా జారి పడగ
గండస్థలుల రత్నకుండలోజ్జ్వల చలద్

---

1 మధుసూదన సరస్వతి–"భగవద్భక్తి రసాయనము"
ద్వితీయోల్లాసము- శ్లోకం-74 నుండి 79 వరకు

ద్యుతితరంగతతి చింగులిడిపరవ
రత్నోజ్వల కిరీట రమ్యముక్తాహార
కాంతుల్ పవలె తారకల సృజింప
శంఖ చక్రాది దివ్యాస్త్రనికర
చక చకద్యుతుల్ మొగులంచులకును బ్రాక
మూగు ముంగురుల నడుమ మొగిలునవశె
కేసరి మెఱపు నామము కెంపులీన
స్వప్నగతుడౌచు నిట్టిసాక్షాత్కరించె
వడ్డి కాసుల వేంకటరెడ్డి సామి"

స్వామి కలలో సాక్షాత్కరించి కుల తరుఫలాలను రెండింటిని వారికి ప్రసాదించాడు. గంగ మంగమ్మ సాగరయ్యల అచంచలమైనట్టి నియమ నిష్ఠలు, వారి తపన, చిత్తద్రుతి వికాసాలు, నత శిరస్కులై మొక్కుట్లు మొదలగు విభావానుభావాలచే శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలంబనంగా వారి భగవద్రతి పరిపుష్టమై భక్తి రసం ఆస్వాదనీయమై తన్మయం చేస్తుంది. కావ్యావతారికలోని స్వప్నసాక్షాత్కారంలో ఇష్ట దేవతాస్తుతి, పరదేవతాస్తుతి మంగళాచరణములందు ఆచార్యులు భక్తిరసావిష్కృతిని కలిగించారు.

తక్కుంగల రసాలు అంగరసాలుకాగా ధర్మవీరం ఈ విధంగా రసవైరుధ్యం లేకుండా కావ్యంలో అంగిత్వాన్ని పొందింది. రైతురామాయణం నవరసభరితమై బ్రహ్మానందసహోదరమైన రసానందాన్ని కలిగించింది.



# వర్ణనా శిల్పం

కావ్యంలో ప్రకృతిలోని స్థితిగతులు, సమాజంలోని అనుభవాలు, భావనా బలంతో రసోపస్కారకంగా అభివ్యక్తం చేయడానికి వర్ణనలు పకరిస్తాయి. ఉద్దీప్తిని, ఉత్కర్షను కలిగించే అనేకాంశాలు ఏకత్రితమై లోకోత్తరంగా వర్ణింపబడినపుడు కావ్య వస్తువు సమగ్రమై ఆవిష్కరింపబడుతుంది. ఆలంకారికులు పేర్కొన్న అష్టాదశ వర్ణనలున్న[1] మహాకావ్యం రైతురామాయణం. ఇందులో ఆదికవి వాల్మీకి వలె ప్రకృతితో పాత్రలకును, కథా సన్నివేశాలకును తాదాత్మ్యత కలిగి వర్ణనలు ఐక్య భావాన్ని పొందాయి. కర్షక ప్రాధాన్యాన్ని సంతరించుకొన్న ఈ కావ్యంలోని కథాపుష్టికి గ్రామీణ పరిసరాలకు, పల్లె జీవన విధానానికి అనుగుణంగా వర్ణనలు కూర్చబడి శిల్పించబడినాయి.

## I. పల్లె వర్ణనం:-

కావ్యారంభంలో సుమారు (60) అరువది పద్యాల్లో "శ్రీరామ పురం" పల్లె వర్ణనం ఉపజ్ఞావిలసితంగా ఉంది. నగర వర్ణనం ప్రబంధ కావ్య లక్షణాల్లో ఒకటి - ఐతే - కావ్యంలో నాయకుని ఫలావాప్తికి శ్రీరామపురం భూమికగా నిల్చింది. హాలిక జీవన వ్యవహార సరళికి పల్లెపట్టు ఉనికి పట్టు.

"పచ్చలు పేర్చి తీర్చిన తివాచులు పచ్చికబీళ్ళు. కొండతో
డిచ్చలు గొట్టుచున్ బరుగుదీసెడియేల్ సెలయేళ్ళు, నింగికిన్

---

1. "నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనమ్
ఉద్యాన సలిల క్రీడా మధుపాన రథోత్సవా
విప్రలంభో వివాహశ్చ కుమారోదయ వర్ణనమ్
ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే
ఏషామష్టా దశానాం కైశ్చిదూన మపీష్యతే"
విద్యానాథుడు-ప్రతాప రుద్రీయమ్ కావ్యప్రకరణమ్ 69_71 శ్లోకాలు

నిచ్చెనలెత్తినట్లుగ వనీస్థలి నిల్చిన మిట్టతాళ్లు, పైర్
పచ్చల చుట్టు కోట దరబారులు దీర్చిన కొండచాళ్ళులన్"

స్వభావోక్తిలో ఉత్ప్రేక్షలో పల్లెపట్టు ప్రత్యక్షమౌతుంది. "కావ్య సౌందర్య సంపాదన కొఱకు భావాభివ్యక్తికి, సాధనమౌతుంది".1 పచ్చిక బీళ్ళు, సెలయేళ్ళు, మిట్టతాళ్ళు, కొండచాళ్ళ పల్లెపట్టు అందాన్ని స్ఫురింప జేసే నైసర్గిక దృశ్యాలు, చినుకానని చక్కనిపూరిపాకలతో, తోరణ గ్రుచ్చిన పెంకు టిండ్లతో, కమ్మని పరిమళాల వెదజల్లే పూదీవపందిళ్ళ సోయగాలతో నేత్ర పర్వంగా శ్రీరామ పురం దర్శనమిస్తుంది.

పశు సంపద పల్లె ప్రజలకు జీవన రక్ష. దుక్కిటెద్దులు, కాడెద్దులు లేగటాలు, గంగడోలు మూపురాలు ఎగురాడ ఉరికే గిత్తలు, ముంగలి వోకాళ్ళ మొగ్గి, పొదుగు గుర్రిమ్మి పిలుకతోకాడ చన్జేల్చు లేగ దూడలు, చన్గుత్తి పట్టిలాగే కురుచపాటి కూరసాని కుక్కకూనలు, పిడుకగుచ్చె కొప్పెక్కి నిక్కి రాగాలు గుంజు పుంజురాయుళ్ళ, పెంటల కుళ్ళగిస్తూ కేరు పిల్ల కోళ్ళు, దిగుడు బావుల్లో జలక్రీడల మోజు చేసే జిలుమజతలు గాక్రుగాక్రు మని అర్చే గోక జంటలు, చొప్పాకుకై అఱ్ఱులుచాచే పోతుకుఱ్ఱలు అంకె వేసి పరుగుదీసేమదవృషభాలు, గడ్డపు మేకపోతు పొట్టేళ్లూ, చీదరిస్తు ఈగలదోలు కుంటూ బుసకొట్టె గొడ్డు గోదలు మున్నగునవి పల్లె జీవితాలకు ప్రబల నిదర్శనాలు.

రైతాంగం పని పాటలు వారి ఋజువర్తనానికి, అమాయికత్వానికి, కార్యదీక్షకు ప్రతిబింబాలుగా ఉన్నాయి. అరకసాగించుట, చేనికి కంచెవే యుటకై పొరక నాటుట, మోట బావి నీరు తోడుట, చిలుకపురి నారతో గోగి నారతో కుచ్చుపగ్గాళ్ళు, వారిణెలు, పలుపులు పేనుట, నాగటెద్దులచే దున్నుట, పిడుక కుచ్చెళ్ళ కూర్చుకొనుట, ఎండుగలకు కావలా యుండుట, ఋతు ధర్మాన్ని అనుసరించి కోండ్రసాగించుట, జమ్ము కొట్టుట, దక్కి సాగించుట, అచ్చుకట్టు కట్టుట, అలుకుళ్లు చేయుట, విత్తనాలు విత్తుట, వరి నాట్లు వేయుట, మొదలగు సేద్యపు పనుల్లో పొర్లిద్దు పొడిచినది మొదలు

1 "కావ్యశోభాకరానర్థానలంకారాన్ ప్రచక్షతే" దండి
"అనంతాహివాగ్వికల్పాః తత్ప్రకారాఏవచాలంకారాః ఆనందవర్ధనుడు.

కొన్ని పొద్దు గుంకే వరకు శ్రమించే రైతు దైన్యందిన జీవిత సరళి కన్నులకు కట్టినట్లుగా చిత్రితమైంది.

ఇల్లుదీర్చే తెలుగు మాగాణపు జాణల క్రియాశీలత్వాన్ని చాటే వర్ణనలు ఆకట్టుకొంటాయి. తిరగలి త్రిప్పుతూ పాడే జవరాండ్రు, కూనిరాగాలు తీస్తూ రింగు రింగునరాట్నం త్రిప్పే పడతులు, సువ్వి పాటలు పాడుతూ రోకళ్ళతో వడ్లు దంపకం గావించే ఇంటి కోడళ్ళు, కూడవేసిన పేడను కసపిస ద్రొక్కి బొణకలకొలది పిడకలనొత్తివేసే జాణలు, పటువలో పాలుదీసే కాపు పడుచులు, పాచిపనులు చేసే కాపు కన్నెలు, గాజుల ఘలం ఘలలతో కవ్వం కదుపుతూ చిల్లగొట్టి వెన్నదీసే గొల్లభామలు ఇట్టి వెన్నో ముచ్చట గొల్పుతాయి.

"చిటుకు మెట్టియలతో చిలిపి గాజుల
జతల్ లయగల్పి ప్రక్కతాళములు వేయు
గజ్జెలందియలతో కాల్కడియాల్ జతై
టక్కుటిక్కుల చెమ్మ చెక్కలాడ
గుండు పోగుల జతల్ కొంజెక్కుటద్దాలఁ
బసిడి జిందుల జంట భరతమాడ
తనతొల్త పెండ్లి క్రొత్తలనాటి ముత్యాల
ముకుపోగు ముద్దులమూట విప్ప
పచ్చ చేమంతి పూదోట పసిడి కోట
పడుచు పరువాల పాలమీగడల తేట
చిలిపి సిగ్గు సింగారాల జిలుగుమూట
పల్లెచెలి యోర్తు జనువరివంపునాట"

వరి పంపునాటు చెలుల ఒయ్యారాల సింగారాలు గ్రామీణ సంస్కృతికి నివాళులెత్తినాయి. పాడిదప్పని ఆడి దప్పని కాపురాలు గల పల్లెలోని కాపులకు కాపుటిల్లాండ్రకు జొన్న అంబలియే రసాసవాలు, శ్రమ జలాల్లోనే నులివెచ్చని స్నానాలు, కావిజిడ్డ మాగు ముతక పంచెలే హేమాంబరాలు. కృషి తపః ఫలాలే పంటచేళ్లు. ఈ విధంగా "శ్రీరామపురం పంటలక్ష్మికి ఆట పట్టై, కాపు జనాలపాలి బంగారు గట్టై, కరువు కాటకాల్లేని గ్రామ రాజ్యంగా

విలసిల్లింది. రైతురాముని కృషి ఫలితంగా గ్రామీణ వికాసం కలిగిందనే భావన పల్లె వర్ణనలో ప్రస్ఫుటమౌతుంది.

## II జాతరలు-పండుగలు:-

కావ్యంలోని నిర్బంధ కాండలో 52, 57 పుటల్లో వర్ణించబడింది. "అమ్మవారి జాతర" జానపదుల మూఢభక్తికి, అచంచల మైత్రి విశ్వాసానికి ఆచార సంస్కృతికి నిదర్శనంగా ఉంది.

"మొక్కుబడులు దీర్చ కొండ్రచటిమొప్పె ప్రజల్ తమ మూఢభక్తితోన్
పెక్కురకాల మేలువడుపు నిల్వలు తల్లికి ముట్టజెప్పుచున్
చక్కెర పొంగళుల్ పెరుగు చద్దులు బోనము పెట్టి నీరు వార్తురి।

పల్లె ప్రజల ఈ భక్తి విశ్వాసమే వారి ఆత్మవిశ్వాసాన్ని పెంచి కార్యదక్షులుగా నిలిపింది. జాతరలో శివసత్తురాండ్రు, పెదఘలాండ్రు, బస్వన్నగాండ్రు, గారడీండ్రు, శరభ శరభా అంటూ అగ్ని గుండాల్లో దూకే జంగమయ్యల కోలాహలంతో జన సమ్మర్ధంగా ఉంటుంది. ఆప్తులు, ఇష్ట బంధువులు, స్నేహితులు ప్రేమ మీర కలిసికొంటారు. గిట్టిరాపు బేరాసారాలు చేసి పల్లెపడుచులు తీరు తీరు సరుకులుకొని గృహోపకరణాలను సమకూర్చుకొంటారు. నిరంతరం శ్రమించే కర్షక శ్రామిక జనానికి వినోదాన్ని అందించే ఈ జాతర వర్ణన మెంతయు తగియున్నది.

### రథసప్తమీ పండుగ:-

కళ్యాణ కాండలో 43 45 పుటల్లో ఈ వర్ణన ఉంది. పండుగలు, వినోదాలు జానపదుల నాగరికతల్ని, సంస్కృతుల్ని ప్రకటిస్తాయి.

"పర్వదినము నవ వధువుల
గర్వ దినము బాలలకు నఖర్వవిభవదృక్
పర్వ దినము రథ సప్తమి
పర్వ దినము మహిళల వ్రతిపర్వదినమ్మున్"

క్రొత్త కోడండ్రకు కొండంత పండుగ, అత్తమామలు ఇంటి కోడళ్ళ

కు కంచి అంచు పట్టు కోకలు కట్టిస్తారు. అత్తాకోడళ్లు అరమరలు లేక విందు భోజనాలతో సంతోషాన్ని కలిగిస్తారు. ఇల్లు దీర్చే కోడలు ఇంటికి వెలుగు నిస్తుందని చాటు ఈ పండుగ వర్ణనా ప్రసక్తి కళ్యాణ కాండలో ఉంది. తల్లిదండ్రులు యువ రామునికి వివాహం చేసి ఉత్తమురాలైన కోడలును గృహ లక్ష్మిగా తెచ్చుకోవాలన్న కోరిక కలిగింది. దోహద పడింది, సీతా రాముల కళ్యాణానికి వర్ణన సోపానమైంది. గృహస్థ ధర్మంలోని సభ్యతా సంస్కారాలను ప్రకర్శింప జేసింది.

## III ఋతు వర్ణనలు:-

కావ్యంలో కళ్యాణ కృషి నిర్బంధ కాండల్లో పలుతావుల ఋతు వర్ణ నలు. పాత్రోన్మీలనానికి ఉపకరిస్తూ, ప్రకరణ ఔచిత్యంతో, రసావిష్కృతిని కలిగిస్తాయి.

### 1. వసంతర్తు వర్ణనలు:-

1) కళ్యాణ కాండ – 26 పుట, 39, 42, 72, 74, 104 పుటలు.
2) లక్ష్మణుని కళ్యాణ ఘట్ట – 48 పుట

పరినాట్లతరి తొలిచూపులోనే కాపు సీతారాములు పరిస్పరాకర్షితులై స్నిగ్ధ ప్రణయరాగోదయంచే పరవశించారు. పుంస్కోకిలల వసంతరాగాలా పనం ఉత్ప్రేరకమై రసవ్యంజితం గావించింది.

"చెంగట కోట కాలువకుఁ జేరువఁ జూచిన మావిగున్న క్రి
వంగల నాకుఁజొంపముల పచ్చని పట్టుఁడుయేల లూగుచున్
పొంగుచు గండు కోయిలల ముచ్చట జంటయొకండు కేరుచున్
రంగమొనర్చె రాగరసరంజిత సుస్వరపేటి విప్పుచున్"

మావిచివుళ్ళ మెసవి మత్తెక్కి క్రీవంగల పొంగుతూ గండుకోయిలల ముచ్చట జంట ఆడిన ఆట పాడిన పాట నవయువ ప్రేయసీ ప్రేమగీతికి శ్రుతి గలిపి వారిని ప్రణయ రాగ డోలికల్లో ఊపి, కదిపి కలిపివేసింది. అంతే గాక 'వసంతోత్సవాస్థాన గాయని పికికన్నె జాళువ పాటను కొసరి

పాడింది. తేటిబోటి తంబురశృతి మీటి పాడింది. నెమలి పడుచులు పురివిప్పి నాట్యమాడినాయి." వసంతా గమనంతో శుకపిక కేకితేటులు పరవశించి ఆడటం ప్రకృతి ధర్మం వానికేళీ విలాసాల్ని కావ్య నాయికా నాయకుల చిత్తానందానికి హేతువుగా సమన్వయించి వర్ణించడం జరిగింది. ఏకాంతం గానున్న రైతు రామునకు "ప్రకృతి సుందరి నూత్న పుష్పవతిగా" దోచింది. అనగా అపూర్వభోగ భోగ్యం అనే భావన ధ్వనించి కాపు కన్నె సీతపై అంతర్లీనంగా నున్న రైతు రాముని ప్రేమ రాజిల్ల చేయబడింది పల్లె ప్రజలకు ప్రకృతి తోడిచెలిమి కలిమి తాదాత్మ్యాన్ని సంయోజితం జేయబడింది.

## 2, గ్రీష్మ తాపం:-

1) కృషికాండ 1, 2 పుటలు

2) కళ్యాణ కాండ 22 పుట ఎండవర్ణనం

కరువు కాటకాలేర్పడటానికి వర్షాభావమే మూలకారణం. గ్రీష్మతాపం భూమిని ఉడికించేస్తుంది.

"ఎటు జూచిన నిసుక యుడుకుచు
నిటలాక్షుని చిచ్చుకంటి నిక్కకలనన్
చిటిలెడి యగ్ని జ్వాలలె
ఎటుం జూచినం గారు చిచ్చు చెరగళులెఖువిన్"

శివుని చిచ్చరకంటి నుండి వెల్వడే నిక్కకలవలె గ్రీష్మపు ఎండలు అగ్నిని కురిపించాయి. ఇసుకనుడికించే తాపానికి పురిసెడు నీరు కూడ లేక ప్రాణితతి అలమటించింది పల్లెసీమలు కాక గృధ్ర సృగాలాల సంచారానికి తావలాలైనాయి. గ్రీష్మతాప ప్రతాపం భయానకభీభత్సాలను రక్ష్యమానం జేసింది. ఈ వర్ణన పల్లెప్రజలను మేల్కొల్పింది. శాశ్వత నీటి వనరుల అన్వేషణకు కావ్యనాయకునికి ప్రేరణ నిచ్చింది రైతుజీవితంపై ఋతువుల ప్రభావం చక్కగా చాటబడింది.

ఎ ం డ లు :-

"చిత్తు యెండ లెంతెనియుఁ జిచ్చుటెండ
లెత్త పస్వులున్ కించిత్తు చిత్త గుదురు
కండలనుఁ గరగించి యా ఎండ వండ్లు
తిననిదే కాని యా పంట తీపిరాదు"

రై.రా. క.కాం. 22 పుట 4 పద్యం

తాపసులను చిత్తుజేసే మండే ఎండల్లో, కృషికత పస్వినులు కండలను కరిగించి ఎండ వండ్లను తిని, శ్రమించి సాధించిన పంట ఫలాలతీపిని అందరికి పంచుతారు. పల్లెప్రజల పరహితైక సమృద్ధి భావం, త్యాగగుణం కార్యనిర్వహణ పరత్వం ఎండను వర్ణించేనెపంతో మహోదాత్తంగా ధ్వనింప జేయబడింది.

3. వర్ష వర్ణనం:-

1) కృషికాండ – 12 పుట,
2) లక్ష్మణుని కళ్యాణ ఘట్ట – 5, 7 పుట.
3) నిర్బంధ కాండ – 43, 44, 58 - 60 పుటలు.

కరువు కాటకాలకు గురైన రైతాంగం వర్షం కోసం ప్రార్థనలు చేయగా వర్షాలు కురిసినవి.

"నవ మేఘమ్ములకాజ్ఞ యిచ్చెనొకొ యింద్రస్వామి కానున్న యీ
మొవులిట్లేమిటి చిమ్మచీకటులు గ్రమ్మంగాన్ర్మెయన్ బెంఛిమిన్
బవులన్ బొబ్బలువెట్టుచున్ నిలువునన్ వజ్రాస్త్రముల్ గూల్చునా
నవ విద్యుత్పటు దీప్తి పుంజములతోన్ నర్తించసాగెన్ దివిన్"

దేవేంద్రుని దయతో ఉఱుములు మెఱుములతో నభోంతరాళం ఘూర్ణిల్లుతూ కుంభవర్షం కురిసింది. కుంటలు చెఱువులు బావులు నిండాయి వర్షాధారమైన పల్లె బ్రతుకులకు ఉల్లాసం ఉప్పొంగింది.

"ఎడతెగని తువర తుపతుప
బడసాగెను మొగులు తూటుబడినట్టులుగాన్

చెడగొట్టు వానలౌరా
నడిజాముస తెరపి యీాకనాన్పుచునుండెన్"

తెరపి నివ్వని చెడగొట్టు వానలకు చేలుజాలు పట్టి మొక్క పెరుగదు. సస్యనష్టం కలుగుతుంది. సూర్యోదయం కూడ కానరావంత మబ్బులుపట్టి ఉండటం వల్ల, మొగులు తూట్లుబడినట్లు పడే వర్షం కారణంచే అంతరాయం కలిగి పల్లె జీవనం స్తంభించిపోతుంది. లోకాద్యవేక్షణా నైపుణ్యంతో వర్ష వర్ణన గావింపబడింది.

తుఫాను వర్షం:-

నిర్బంధ కాండలో కథకు అనుగుణంగా కాపు సీత జీవితంలో తుఫాను చెలరేగి జమీందారుచే నిర్బంధించ బడుటకు సూచనగా తుఫాను వర్ణించ బడింది. జమీందారు దుష్టరాక్షస చర్యలకు సంకేతంగా ప్రకృతిలో భీభత్సాన్ని సృష్టించిన తుఫాను వర్ష వర్ణన వస్త్వలంకార ధ్వనితో రసావిష్కృతిని కలిగిస్తుంది.

"పృథివి యదుర్వసాగెఁ బిచ్చలించి చలించె
దిగ్దిగంతములును దిద్దిరమని
బ్రద్దలయ్యె మంచు పర్వతములనగ
పెనుతుఫాను గాలి వీవసాగె"

బ్రహ్మాండమే బ్రద్దలైన రీతిగా, మిన్నువింగి నేలగూలునట్లుగా, గిరులో మీటదప్పి యొరిగిపడిన రీతిగా, మెఱుములుఱుములతో ప్రళయ వర్షకురిసింది. కారుమేఘాలు వచ్చికడవగ, పొద్దులు నిండిన నిండుచూలా-లుగ, నింగి మొత్తం తల్లడిల్లి జడివాన కురిసింది. తుఫాను హోరుగాలులు ప్రళయాన్ని సృష్టించాయి.

నిర్బంధింపబడిన కాపు సీత హృదయాకాశంలో కారుచీకట్లు గ్రమ్ము కొన్నాయి ఆమె జీవితంలో కష్టాల జడివాన కురిసింది. పైడి పెగల ఆశ కారణంతో దుర్భరమైన నిర్బంధ మనుభవించవలసి వచ్చింది. సీత వేదనా మయమైన మానసిక సంక్షోభం, భీతావహమైన తుఫాను గాలివానతో ఉత్ప్రేక్షితమై వ్యజ్యమానమగును.

సేతు నిర్మాణ వర్ణనం — కృషికాండ 27–29 పుటలు.
శీతర్తువర్ణన — లక్ష్మణుని కళ్యాణ ఘట్ట 7, 9, 10, 56, 57 పుటలు.
హేమంత వర్ణన — కళ్యాణ కాండ — 68, 69 పుటలు, (చలి వర్ణనం)
కళ్యాణ కాండ - 20, 24 పుట,
సస్య వర్ణనం — శిక్షణ కాండ - 26 పుట, కృషి కాండ–34, 37 పుటలు,
కళ్యాణ కాండ — 70, 71 మఱ్ఱిచెట్టు వర్ణన,
" — 72, పుట మామిడిచెట్టు వర్ణన,
" — 12 పుట వరినాట్లు వర్ణన

ఋతు వర్ణనల్లో పల్లె జనుల జీవితాలకు ప్రకృతితో గల తాదాత్మ్యత దర్శనమిస్తుంది. అవి కావ్య కథకు ఉపస్కారకంగా కూర్చబడినాయి.

## IV. శృంగార వర్ణనం

### 1. అంగాంగ శృంగార వర్ణనం:-

పల్లెపడుచుల ముగ్ధమోహన సౌందర్యం కావ్య బంధంలో అందగింప బడింది. పల్లెచేడియలు సిగ్గు సింగారాల జిలుగు మూటలు, పడుచుపరువాల పాలమీగడ తేటలు, నాయిక సీత చెల్లెళ్ళు, ఊర్మిళ సోయగాలు చిత్తభవ కేళికి ఆస్పదాలు.

"ఔ! బలే యందకత్తె, యేమా పొగసులు
పచ కప్రపుపు మెయి, మోవి, పచ్చిదాక్ష
విచ్చుకత్తులు చూపుల్లు, విరిపొద యెద
మొగిలి రేకులంగుళి పుటములు చివుర్లు"

"వనజాక్షి సోగ కాటుక
కనులందున నేదొమత్తు గమ్మత్తు నిషా
దినుసున్నది యొక కమ్మని
మనసున్నది దానివెనుక మరులున్నదెదో"

సీత సోయగాలు షుష్పశిజుని మందిరాలు, ఆమె ప్రణయ దేవత, ఆమె రైతురాముని వలచి వలపింపజేసుకొన్నది. ఆమె అచ్చమైన మారశక్తిదేవికి ప్రతి

రూపమే. శృంగార రసభాండం వంటి మరి కొన్ని వర్ణనాలు కావ్యంలో గలవు.

1) పల్లె వర్ణనం - 6, 17 కాపుటిల్లాంధ్ర వర్ణన,
2) కళ్యాణ కాండ - 8-26, 33-35, 66-67, 75, 90-93 పుటలు,
3) లక్ష్మణుని కళ్యాణ ఘట్ట - 20-40 పుటలు.

## 2. విప్రలంభ శృంగారం:-

కళ్యాణ కాండ - 35-42 పుట, నాయికా విప్రలంభవేదన 62, 65-70, 74
లక్ష్మణుని కళ్యాణ ఘట్ట - 39, 40

నాయిక సీత విరహతాపం చెలుల శైత్యోప చర్యలతో చల్లారుతుంది.

"కూడగబోవు క్రొత్త తొలికూటమిలోని యవస్థలిట్టులే
ఏడను నింతె, యెందుకట యింత పరాకుచిరాకు లట్టులే
కూడును నీరును ముట్టకయె కొల్కికి ప్రాణముఁ దాల్చికొందెయా
టాడక, ముచ్చటాడక యునాడక పాడక నవ్వి క్రుశుళ్ళకన్"

చెలులతో ఆడకపాడక నీరు ముట్టక ప్రియునిపైన మనసున్న సీతకు ధృతి నొసగి విరహతాపాన్ని చల్లార్చడానికి ప్రయత్నించారు.

కావ్యనాయకుడు రైతురాముడు సీత యెడ అనురాగంతో విరహాళితో పరితప్తుడైనాడు. వారికి మలయానిలాలు అగ్ని జ్వాలలైనాయి. చల్లని వెన్నెల కిరణాలు సాంద్రాతపాలై తపింపజేసినాయి. చందనం మండుటింధనమైంది. శుకపికరుతాలు శ్రవణకటువులైనాయి. మలయానిలాదులు విరాళికి ఉద్దీపనాలై విప్రలంభం ప్రకృష్టమైంది. ఉద్వేగ్నాపాదకమైన ఈ వర్ణనం నాయికా నాయకులకు సాన్నిహిత్యం పెంచింది. పరిణయంతో కావ్య కథ పరిపుష్టత నందుకొన్నది.

## 3. కరుణ విప్రలంభం:-

1) శిశు కాండ - 16-20 పుటలు,
2) నిర్బంధ కాండ - 68, 73 పుటలు,
3) విజయకాండ - 1 పుట.

శిశుకాండలో గంగమాంబను తలపోస్తూ సాగరయ్య దుఃఖించిన సందర్భం లోను, నిర్బంధకాండలో నిర్బంధితురాలైన సీత రైతురాముని తలచుకొంటూ పలవించిన సందర్భంలోను, రైతురాముడు సీతను స్మరిస్తూ శోకించిన సన్నివేశంలో విప్రలంభ శృంగారం కరుణరస తరంగితమై రసహృదయాలను ద్రవింపజేస్తుంది. నాయికానాయకుల కరుణ విప్రలంభం కావ్యకథలో సతీపతిత్వ స్నిగ్ధ ప్రేమానురాగాలను అభివ్యక్తం చేసి ఒకరు లేనిది మరొకరు బ్రతుకలేరను భావాన్ని కల్గించి కథను కావ్యఫలోన్ముఖంగా విస్తుంది.

## 4. సంభోగ శృంగారం

1. కల్యాణకాండ - 103, 104 పుటలు
2. కల్యాణకాండ - 122-125 పుటలు (తొలిరేయి)
3. లక్ష్మణుని కల్యాణ ఘట్టం - 3 పుట

నాయికానాయకుల ప్రణయ రసవద్ఘట్టాలందు ఈ వర్ణనం ఉంది.

భల్లూకభీతిచే రైతురాముని సీత హత్తుకుపోతుంది. "అతని భుజపంజరాంతమున వ్రాలిన హస్తములామె కటిసీమను గట్టిగా జుట్టివైచినవి.

"బిగువెక్కె వలపు బంధము
దిగజారెను గుండెదిటవు దిన్నగ బంటై
మగతనముల్లోగి వచ్చెను
మగువ తనమ్మునకు హరుడు మరుడేకముగన్"

మగువతనానికి మగతనం లోగి వచ్చింది. సీతారాములకు వివాహం జరిగింది. నూత్న వధూవరులు ఒకటి యగుచు రేవటి మూడుగను నవప్రణయ రసాంకురాలు నాటుకొనే తొలిరేయి నిర్ణయింపబడింది.

"సాగిసాగనట్లుగఁ బిపాసార్తి కొంత
తీరితీరనట్లుగ కోర్కె తీపిసుధలు
యంది యందనట్లుగ నుండు నావిచిత్ర
నవయువా ముగ్ధ మృదు మిథునమున కల్ల
నాటిరేయి త్రియామమైనది నిజముగ"

బిగువ కౌగిళ్ళ మగతలో పెద్దసేపు ఒక్కటిగ నల్లుకొని పెనగొనిన లలిత సుమలతా గుల్మ మిధున పుంగ్రిమము దోచింది. నాయికానాయకుల సంభోగ శృంగారం వారి ఆదర్శ దాంపత్య ధర్మాన్ని చాటుతుంది.

## V. సూర్యోదయ వర్ణణం

1. కళ్యాణకాండం-124వ పుట
2. లక్ష్మణుని కళ్యాణ ఘట్టం-9, 51, 52 పుటలు
3. విజయకాండ-20వ పుట

## 2. సూర్యాస్తమ వర్ణనం

1. కల్యాణకాండ-85వ పుట
2. నిర్బంధకాండ-33,43,61 పుటలు

నాయికానాయకులు కాపు సీతారాములకు క్రొవ్వలపు పిపాసార్తితో తొలిరేయి గడిచింది. సూర్యోదయమైంది.

"అరుణారుణ నవభాస్వద్
వరకుంకుమ తిలకదీప్త వదన సువర్ణాం
బర సమలంకృత కటితటి
వరాంగి ప్రాక్సతినూత్న వధువటు తోచెన్"

వరాంగి ప్రాక్సతి నూత్న వధువుతో ఉపమించబడి ఉత్ప్రేక్షింపబడింది. నాయిక సీత నూత్న వధువు ఆమె సువర్ణాంబర కటితమై నుదుటి కల్యాణ తిలకంతో ఒప్పియున్న సౌభాగ్యవతి. జన్మజన్మాలనోముపంట ఫలించిన తొలిరేయిని, తనకు సౌమంగల్యాన్ని ప్రసాదించిన రైతురామునితో ప్రణయరాగ రస తరంగాల్లోనోలలాడుతూ గడిపింది. కన్యావస్థ నుండి ప్రజావతిగా ఎదిగి, సతిగా ఒదిగి, స్త్రీత్వ సిద్ధిని పొందింది. ఈ సందర్భంలో వర్ణించబడిన ప్రాక్సతి వైభవం, భారతీయ సంస్కృతిని, తెలుగువారి కట్టు బొట్టు, పడికట్టును ధ్వనింపజేస్తూ భరతవర్ష ఆర్షవైదిక ప్రాక్సంప్రదాయం విశ్వచేతనానికి సంకేతమైందిగా, అభివర్ణించబడింది. నవయువ నూత్న

దంపతుల నవనవోన్మేష ప్రణయభావ స్ఫూర్తి, జనజీవన ప్రగతి వికాసానికి, ప్రజానీకానికి మనిషికికి, ఆశాకిరణం కావాలని మేల్కొల్పు పాడింది. ఈ అభ్యుదయ సూర్యోదయం లోకబాంధవుడు, విశ్వచేతనుడు ఐన అరుణుని మృదు కరస్పర్శచే పులకించి, అరుణరాగ రంజితాంబరంతో అలంకృతమై ప్రాక్సతి, భాస్వంతంగా ఒప్పినదై నూత్న వధువువలె వెలుగొందింది. అని రసభావధ్వనిధునితో కవితా స్రవంతిని కావ్య జగత్తులో జాలువారించారు ఆచార్యులు.

భూగోళాంధ తమస్సులడగింప భాస్వత్సార్వభౌముడు ప్రాగ్భాగాన తన సహస్ర కిరణకరాలతో విశ్వచేతనం ఒనర్పగా కీటకమాదిగా, బ్రహ్మ మేరకు తమతమ పనులను నిర్వర్తించటంలో లీనమయ్యారు. క్రొత్తవలపు మైకంతో, యువకృషికినవ మిధునము ప్రొద్దుపొడుపు మేల్కొల్పుని బద్ధకంగా సిగ్గిలి, బేగిలేచి, దైనందిన కార్యకలాపాల్లో తలమునకలయ్యారు,

"తవ సహస్ర కరాలతోఁ దరతమముల
భేదములనుఁ బాటించక వివిధ
విశ్వభూతతతికిఁ జైతన్య విస్ఫూర్తి నిడెడి
జ్యోతులను బంచెనా జగజ్జ్యోతి సమత
విశ్వబాంధవు ప్రేమకు వెలితిదనమే"1

గాలికి, నీటికి, నింగికి, నేలకు, వెలుతురుకు తరతమ భేదాలు లేవు. కులమత భేదాలులేవు. ఉచ్ఛనీచ భావాలులేవు. భగవత్సృష్టాలైన ప్రకృతి సిద్ధాలైనవి ప్రతిచేతనాంశానికి ఆశ్రిత పక్షపాతమైనా ఉండదు. నిష్పక్షపాతమైన సమతాభావంతో, లోకంలోని ప్రతిప్రాణికి సమంగా చేతనత్వాన్ని అందిస్తాయి. ఈ ఉచ్ఛనీచ తరతమ భేదభావాలనేవి, నియంతృత్వాధికారంతో. దురహంకారంతో, ఏర్పరింపబడినట్టివి. సమాజాన్ని భ్రష్టుపట్టించే ఈ నిమ్నోన్నతభావం, పెత్తందారీతనాన్ని, అధికార దాహాన్ని మత్తదురహంకారాన్ని పటిష్ఠ పరుస్తాయి. ఈర్ష్యాసూయా ద్వేషాలతో పెచ్చరిల్లిన ఈ దమన నీతికి, తట్టుకోలేని, సభ్య సంస్కార సమాజం, సమతకోసం శిక్షిస్తుంది. మమత కోసం ఉద్యమిస్తుంది. జాతిని పట్టి పీడించే ఈ తరతమ

1 రైతు రామాయణం – కల్యాణకాండం, 124, 3వ పద్యం

భేద వైషమ్య భావం, మారణహోమానికి ఆజ్యం పోస్తుంరి. అందుకే మమతతో కూడిన సమతాభావం, లోకం నిలుకడకు, జాతి మనుగడకు అత్యంతావశ్యకాలని భావించి, జమీందారీ బూర్జువా వ్యవస్థా నిర్మూలనకు, సమసమాజ స్థాపనకు "రైతు రామాయణ కావ్యం రచింపబడింది." అనే విషయాన్ని తెలుపుచున్నదై వస్తు ధ్వని శోభితంగా ఈ సూర్యోదయ వర్ణనం విరాజమానమై విజ్ఞులకు విందు గూర్చింది.

## 2. సూర్యాస్తమయ వర్ణనం

ప్రకృతి-కావ్యకథాంశానికి రమణీయ సంబంధాన్ని కల్పించడానికి సూర్యాస్తమయ వర్ణనలు మానవీకరించబడి వర్ణింపబడినాయి.

"ప్రకృతిని మానవీకరించుట అనగా మానవుకి కష్టసుఖాలతో, ప్రకృతి సహానుభూతి చూపునట్లు, పాలుపంచుకొనునట్లు వర్ణించుట"1

కాపు సీత రైతురాముని అనుమతి లేక అరువు సొమ్ముల నిమిత్తం, పొన్నయశెట్టి ఇంటికి వచ్చిన సందర్భంలో సూర్యాస్తమయ వర్ణనం ఉంది.

జమీందారు పాపారావు సీతను ఏ విధంగానైనా నిర్బంధించి తీరాలన్న తలంపుతో పొన్నయశెట్టిని ఆ పనికి నియోగించాడు. కాపుసీతకు నగలు అవసరమన్న విషయాన్ని పసిగట్టి సెట్టి తన భార్య ఆభరణాలను అరువుగా నిత్తునని చెప్పాడు. సెట్టింటికి సీత రావటం అనివార్యమైంది. సమయం కోసం కాచుకొని ఉన్న జమీందారు ఒంటరిగా ఇంటికి పోవుచున్న సీతను నిర్బంధించండని భటులను పంపాడు. పెనుగాలి వర్షంలో పిడుగు పాతబడి ఆ వచ్చిన భటులు మృతి జెందారు.

"వెల్గుదొర ముఖ బింబము విన్నబోవ
మసక మబ్బు దొంతరలు నాకపము నిండ

---

1 డా॥ గుండి వేంకటాచార్యులు
రంగనాథ-వాల్మీకి రామాయణముల తులనాత్మక పరిశీలనములు పు.542

నీలి తెఱలను బఱచెను నిఖిలలోక
వదన సీమపై ముసుగు దుప్పటియిది యన"

సూర్యాస్తమయ సమయంలో మసకమబ్బు దొంతరలు ఆకసంనిండ నీలితెరలు పరవడం, లోకమంతటా చీకట్లు వ్యాపించడం, ప్రకృతి సహజ మైన యథార్థాంశం కాని ఇచటి ఉత్ప్రేక్షాంశం గమనించినచో వెల్గుదొర ముఖం విన్నవోయింది. అతని వదన సీమపై ముసుగు దుప్పటం గప్ప బడింది. సాధారణంగా లోకంలో తాను అవమానింపబడినప్పుడు గాని, చూడ రాని దృశ్యాన్ని చూచినపుడు గాని, ఎదుటి వారి భయంకర రాక్షస కృత్యాల్ని చూడలేక పోయినప్పుడు గాని, జరుగకూడని సంఘటన జరిగిన ప్పుడు గాని, జుగుప్సావహమైన సన్నివేశాలను గాంచినప్పుడు గాని మనో వైక్లభ్యం కలిగి ముఖాన్ని దాచుకోవడం జరుగుతుంది. సీతవంటి ఉత్తమ కాపుటిల్లాండ్రు అరువు సొమ్మునకు ఆసపడి పరువు పోగుట్టుకోవడం తగద నియు, ఉత్తమ గృహిణికి పసిడిపైని ప్రలోభం కూడదనియు, జమీందారు సీతా సతిని నిర్భంధించాలన్న నీచప్రవృత్తిని, అతని దుష్ట రాక్షస కామ ప్రవృత్తిని చూడలేని కర్మసాక్షికి మోము విన్నవోయింది. మబ్బుముసుగు దుప్పటాన్ని గప్పుకొని మోముచాటు చేసికొన్నాడు. లోకమంతా అంధకారం దాని అధికార దర్పం రాజ్యమేలింది.

కావ్యనాయిక సీత రామునను జ్ఞచే నగలను జేయించే నిమిత్తం, సెట్టి ఇంటికి వచ్చి, తిరిగి వెళ్లుతూ మార్గ మధ్యంలో పెనుతుఫాను వర్షానికి గురై జమీందారు కొటలోకి ప్రవేశించింది. కానరాని కటిక చీకటిలో తలఢీకొని మూర్ఛిల్లి జమీందారుచే నిర్బంధింపబడింది. ఈ సందర్భంలో సూర్యాస్తమ వర్ణనం మానవీకరింపబడింది.

"ఒరిగెనస్తగిరిని నరుణుడు కొలువు చా
లించి యిచటనున్న మంచి లేదు
జరుగ బోవు ఘోర సాహసోపేత దు
స్సంఘటనలు కనుఁగొన జాలననుచు"

ఒకమారు తప్పింపబడిన కాపు సీత ఈ మారుతప్పక జమీందారుచే

నిర్బంధింప బడుతుందనియు, చెఱయందు సీత పొందనున్న వేదనలను వాని ఘోర సాహసోపేత చర్యలను చూడలేనని సూర్యుడ స్తమించెనని కవి ఉత్ప్రేక్ష లోకబాంధవుడు, కర్మ సాక్షి సూర్యుడు కావ్యనాయిక పట్ల సహానుభూతిని అభివ్యక్తం జేస్తున్నాడన్నచో ఆమె ఉత్తమ గుణశీల సంపదను. జమీందారు రాక్షస ప్రవృత్తిని, కావ్య గతార్థంగా లోకానికి చాటినట్లైంది. "మంచికి సహానుభూతిని, చెడుకు దుర్మార్గతకు నిగ్రహత్వాన్ని ప్రకటించడం మానవీయ సాత్త్విక ప్రవృత్తికి అద్దం పడుతుంది.

## VI. చంద్రోదయ వర్ణనం:-

1) కళ్యాణ కాండ – 87-89, 104 పుటలు

2) నిర్బంధ కాండ – 80 పుట.

రైతు రాముడు కాపు కన్య సీతను భల్లూకం బారి నుండి కాపాడి, భీతి మాన్పి చల్వపందిరి వాటికకు చేర్చుతాడు. వారి ఏకాంతసమావేశం ప్రగాఢ ప్రణయ ప్రబంధ కృతికి నాందియైంది. ప్రణయ భావాభివ్యక్తకమైచెల్వొందింది. ఈ సందర్భంలో శరత్కాలంలోని చంద్రోదయ వర్ణనం నాయికా నాయకుల అన్యోన్య ప్రణయ రాగాన్ని ప్రకటిస్తుంది.

"గండు చీకటి గుండెకాయఁ దూటాడెడి
చలివెలుంగుల విష్ణు చక్రమనగ
జారచోరుల నిశాచర వృత్తిఁ బట్టియు
కాముడెత్తిన కంచు కాగడయన
విరహిదంపతుల హృద్వీథిఁ బ్రేమ జ్యోతి
రగిలించి విడుకపురపు శశికన
అమృతం పుజల్లు సర్వాంగణమ్ముననఁ జల్లు
కమ్మని యమృత భాండమ్మిది యన
మసకమబ్బుల సరిగంచు ముసుగుశాల్వ
వల్లెవాటు వైచి కొనిన తెల్ల దొరగ
ఘా ప్పు కొండ ఫంచుల బడి విమాన యాత్ర
వెడతెఁ దారాంగ నల నవ్వు విరులమధ్య"

విరహి దంపతుల హృద్వీధి ప్రేమజ్యోతులు రగిలించు చందమామ విశ్వవేదిపై వెండి తెరలు గప్పిన చందం వర్ణనాతీతం.

"పిండి యార వోసినరీతి, వెండి నీరు పరచి వరదవారిన భాతి, పాల వెల్లి వెల్లువలు పొంగిపారినట్లెల్ల దెసల విరిసెనవ జ్యోత్స్నలు విశ్వవీధి" ఉపమోత్ప్రేక్షలచే చెల్వొందిన ఈ వర్ణనం కల్పనకు ప్రతిబింబం.

రాకాసుధాకరుని రాకకు దివిని తారానటి ముఖదీప్తులొప్పినాయి. కలువ కన్నెల మొగ్గ ముఖాలు విప్పినాయి. కాపు సీతారాముల హృదయాలలో ప్రణయ రాగసుధలు వెల్లువలై పొంగి పొరలినాయి. ప్రకటించరాని పరువాల మురిపాల భావాలు ముద్దులాడుకున్నాయి. కువ కువలాడే వారి మోహన రాగం పరవశించి పోయింది. పురుషత్వం స్త్రీత్వం చిందులు చిందులు వేశాయి. ఏకమైపోవుటకు ఎవేవో మూగ బాసలాడుకున్నాయి. నాయికా నాయకుల స్నిగ్ధముగ్ధ ప్రణయరాగం కల్యాణకరమైంది. "తన్మనోలగ్న శుభోత్సవాన ఆకసం పెండ్లి పందిరిగా, నందప్ప పెండ్లిపెద్దగా, పుణ్యతారాంగనలు పెద్ద ముత్తయిదువులుగా, మోదుగుపడుచులు కుంకుమలు దీర్చగా, వచ్చ చేమంతి బంతు వసుపులార్చగా" నవయువ కాపు జంట జీవితానికి శుభావహంగా సుఖావహంగా సన్నివేశ కల్పనం జరిగింది. కాపు సీతా రాముల కల్యాణం వైభవోపేతంగా జరిగింది.

ప్రబంధంలో వర్ణించాలన్న అభినివేశంచే గాక కావ్య కథను రసాత్మకంగా, అనుభూయమానం గావించాలన్న ప్రయత్నంతో చంద్రోదయ వర్ణనలకు సముచితమైన స్థానం కల్పింపబడింది.

## వివాహ వర్ణనం:-

1) కళ్యాణ కాండంలో కాపు సీతారాముల కళ్యాం 118-122 పుటలు
2) లక్ష్మణుని కళ్యాణఘట్టలో ఊర్మిళాలక్ష్మణుల వివాహం 42-46 పుటలు వర్ణింపబడినాయి.

"ఒక యిల్లాలని యుండి యున్నగదా యిల్లో య్యారితో గడ్డిపా
కకున్ దెవ్వియుఁ దేజమునుం గలుగుఁ బైగాఁ జంకచాటైనఁ బై

డికిలా లెందుకు స్వర్గసేపనికి? రెండే రెండు సంసార జీ
వికి నిల్దీర్చెడిరాణి భుక్తికిని కర్వే లేని మాగాణియున్"

"పెండ్లంటే నూరేళ్ళ పంట' "నూరేళ్ళ జీవితం వెయ్యేళ్ళ సంగ్రహం అని భావించబడింది. గృహస్థాశ్రమ ధర్మాచరణకు వివాహమే మూల ప్రాతి పదిక. అదొక మహాక్రతువు. జన్మజన్మాల బంధాన్ని ముడివేసే పవిత్ర కార్యం. ఇల్లుదీర్చే ఇల్లాలు, భుక్తికి కర్వులేని మాగాణి కలిగియున్న సమస్త స్వర్గ సుఖాలు కరస్థాలై సంపదలన్నీ తలవాకిటనున్నట్లే. పల్లె జీవన వికాసాన్ని, నవజీవన ధర్మాన్ని ప్రబోధం జేస్తూ పురుషార్థసాధకమైన గృహస్థ ధర్మానికి పట్టంగట్టే విధంగా కావ్యంలో వివాహ వర్ణనలున్నాయి.

తెలుగుజాతి వైవాహిక సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు అనా దిగా వస్తున్న తెలుగు పురోహితుల "వివాహకల్ప విధి భట్టిమము"1. అనుస రించి ఉన్నాయి.

లగ్న సుముహూర్తమును నిర్ణయించుట, నూత్న వధువునకు పట్టు కోక గట్టించి నిశ్చయ తాంబూలములు పుచ్చుకొనుట, వటువునకు ప్రధాన కార్యము జరిపించుట, పచ్చిపాల పొరకతో పెండ్లి పందిరిని తీర్చి దిద్దుట, అలుకు పూతలు పచ్చతోరణలచే గృహాంగణాల నలంకరించుట, వేదికాలం కరణం, వధూవరులకు పుణ్య స్నానం, దోషాపహృతికి భాసికాలము గట్టుట తెరవట్టి ఒకరినొకరు కల్దొక్కింప జేయుట, తలంబ్రాలు పోసికొనుట, మంగళసూత్ర ధారణం, జీలుకర బెల్లం పెట్టించుట, బ్రహ్మముళ్ళను గూర్చి సప్తపది కార్యక్రమాన్ని నడిపించుట, పసుపు పారాణిలను పాదాల కలదుట, సాధ్వీ అరుంధతీ నక్షత్ర దర్శనాన్ని గావించుట, వివాహానంతరం మహదాశీర్వచనాన్ని పొందుట, ఆ పిదప అప్పగింతలలో మంగళ వాద్యా లతో వధూవరులను సాగనంపుట, ఊరేగింపుతో నూతన వధూవరుల గృహ ప్రవేశం ఆదిగాగల పెండ్లి ఆచారాలు కన్నులకు గట్టినట్లుగా వర్ణింప బడినాయి.

---

1 డా॥ గుండి వేంకటాచార్యులు-రంగనాథ వాల్మీకి రామాయణము తులనాత్మక పరిశీలనము-పుట-३६५.

"తెరపటమ్మనోన్య కరపుటమ్ములు గూర్ప
మధ్యవర్తిత్వంపు బాధ్యతగొన
తలఁగప్పిపోయి ముత్యాల తలంబ్రాలు
వలపు కోర్కిం గోర్కి రవ్వల జడులన
గళసీమగట్టు మంగళసూత్ర బంధమ్ము
దండి స్నేహానుబంధ ప్రతియన
తలను బంకగఁ బట్టు జీలకర బెల్లమ్ము
చక్కని తీపి మచ్చిక గురుతన
బ్రహ్మముళ్ళవి పరబ్రహ్మ గూర్చిన స్వ
దాంపత్యాను బంధపుం బటిమ నెరప

మంగళాశీర్వాద మంత్రాక్షత ప్రక
రమ్ము స్వీయ శుభతారకలనంగ
పెండ్లి తిలకము శోభనావిష్కృతి
మచ్చుతునకన పరిమళ మధురమంజు
లాగరు ద్రవ్య కస్తూరి కాది కలిత
లలిత శృంగార నిధిగ ఫాలె స్థలిమనె"

నూత్న వధూవరులైన కాపు సీతారాముల వలపు కోర్కిం గోర్కెలు చివురించడానికి, వారి స్నేహాను బంధాన్ని పెంచడానికి, చిరకాలం చక్కని మక్కువ తీపిగుర్తులుండే విధంగా, శృంగార రస నిధిగా, దాంపత్య ధర్మాన్ని అనుసంధానించు మంగళసూత్ర బంధనాది పెండ్లి వేడుకలు, మంగళవాద్యాలతో నేత్రోత్సవంగా నిర్వహించబడినాయి. ఇదే విధంగా ఊర్మిళా లక్ష్మణుల వివాహం జరిగింది.

బాజాల్ మ్రోగ సనాయినూత్న శుభదాంపత్యానురాగంపు ని
ర్వ్యాజ ప్రేమ సుగీతి పాడగను, దారస్థాయి బాకాలు బీన్
బాజా నాదములున్ జనమ్ములకు నాహ్వానములందించను
భ్రాజించెన్ సరిక్రొత్త జంట బులుపారన్ వీధులూరేగన్"

వధూవరుల ఊరేగింపు నేత్రపర్వంగా జరిగింది. కనులు చెమ్మగిల్లు

కరుణ రసాత్మకమైన "వధువు అప్పగింతలు"తో పెండ్లి చివరితంతు ముగుస్తుంది.

## పుత్రోదయ వర్ణనం

శిశుకాండ - 8-11, 12,13 పుటలు

కాపు రామలక్ష్మణుల బారసాల వర్ణనం, వారి శైశవ వర్ణనం, కావ్యంలో శిశుకాండంలో ఉంది. అట్లె కాపుసీతారాములకు "గోపి" జననం లక్ష్మణుని కళ్యాణ ఘట్టం 48వ పుటలో యుంది.

శ్రీరామచంద్రుని కరుణాకటాక్షాలవల్ల సాగరుని పత్నులు గంగమంగ మాంబలు గర్భాలు ధరించారు.

"ముదిరె నెలలు తనూభారములు పెరిగెను
పెరిగె గర్భముల్ ప్రక్కలొకర జాఱ
రొండ్లు వ్రాలెఁ గాపుం గోమలులును డస్సి
యలసగమనలై పూల తెప్పలటు పొల్చి
రెండు జీవాల తల్లులై నిండువడిరి"

గర్భాన్ని దాల్చిన సీమంతిని గర్భస్థ శిశుభారాన్ని, ఆమెపొందే అనుభూతిని, అవస్థను చక్కగా రూపుకట్టించడం జరిగింది. "నవమాసాలు నిండి అలుకు ములుకు లేక చెట్టుకాయ దించినట్లు, తొడిమవీడి పండు దొరలి నట్లు సులభసూత్రంగా ప్రసూతి జరిగింది."

మూలా నక్షత్రంలో బాలోదయమైంది. సాగరయ్య విధి ప్రోక్తంగా వేదమూర్తులైన బ్రాహ్మణులచే, హవన పుణ్యాహవాచనములాది శాంతి కర్మలు జరిపించాడు. వేడుకమీద బాలురకు నామకరణోత్సవం నేత్ర పర్వంగా జరిగింది.

"బాలుర బారసాల నొక పండుపుగా సరిక్రొత్త సొమ్ములే
ర్పాళులుగ, భావిభాగ్యముల నాందిగ, డోలునవాయి మేలు బా

జాలు బజంతిరీల్ శుభము జాటుచు నేలయు నింగిమ్రోగు నా
దాలిడఁ బచ్చ తోరణలు ద్వారగృహంపుటలం క్రియల్ తగన్"

బాలుర బారసాల భావిభాగ్యాలకు నాందిగ, స్వామి తిర్నాళుగ వైభవంగా జరిగింది. "సంతాన ప్రాప్తితో మానవుడు పూర్ణ పురుషుడౌతాడు, కాని ఐశ్వర్యాదులచే మాత్రం గాదు.వృద్ధులైన కుటుంబీకులు తమ భారాన్ని సంతానంపై వేసి పితృణం నుండి విముక్తులౌతారు. సంతానం లేనివారికి ఈ లోకమే లేదన్నచో పరలోకం ఉండదని వేరే చెప్పనక్కరలేదు."1

చిరకాలం సంతానంలేని తమ ఇంట రామలక్ష్మణులు ఉదయించడం వల్ల సాగరయ్య ఉప్పొంగిన స్వాంతంతో బాలుర బారసాల ఘనంగా జరిపించాడు. అంతేగాక జమీందారీ ఫ్యూడల్ వ్యవస్థకు వ్యతిరేకంగా తాను సాగించే, శాంతి విప్లవ పోరాటానికి, వారసత్వ గుణాలను పుణికి పుచ్చుకొని తన తర్వాత అట్టి బాధ్యతలను స్వీకరించి కర్షకలోకపు కళ్యాణానికి పాటుబడగలట్టి సంతానాన్ని గన్న ఆ తండ్రి సంతోషానికి అవధులు లేకుండా పోయింది. అందుకే ఆపరగణా మొత్తం ప్రజలకు విందు భోజనాలతో సంతోష పరిచాడు. దీనితో భవిష్యత్తులో రైతురాముడు కావ్యనాయకుడై ప్రజలను రక్షించగలడను భావన స్థిరపడింది.

## కోట, బురుజు, అగడ్తల వర్ణనం

కావ్య ప్రతినాయకుడు జమీందారు పాపారావు రాచరికపు ఠీవిని, దర్పా దర్పాలను ప్రకటించు ఈ వర్ణనం, కావ్యంలో నిర్భంధకాండం,విజయ కాండంలో ఉంది.

1 "ప్రజయాహి పురుషః పూర్ణోభవతి నైశ్వర్యాదినా।
ప్రజాయాం స్వాం ధురమవరోప్య పితృణామనృణా
భూత్వా విశ్రామ్యంతి జీర్ణాః కుటుంబినః।అప్రజసాంతు నాస్త్యేవ సర్వ
లోక సాధారణోప్యయం లోకః కిం పునః పరః।
లక్ష్మణసూరిః – రామాయణ సంగ్రహే-బాలకాండః

"దొరగారి కోటగలుమన
బరికత్తుల మేల్పిపాయి పహరా యెపుడున్
చొరరాదు పోతుటీగకు
పొరపాటునసైన నాజ్ఞ పొందెడి వరకున్"

ఆజ్ఞలేనిది పోతుటీగకూడ చొరశక్యం గాని దుర్భేద్యమైనకోట, ఆయుధ పాణులైన సిపాయిలతో రక్షింపబడుతుందని వర్ణించటం వల్ల జమీందారుడు దుర్భేద్యుడు. బలోపేతుడు. నిరంకుశత్వం గలవాడని తెలుపడమైంది. ఇట్టి అసామాన్య బలోపేతున్ని రైతురాముడు జయించటం వల్ల కావ్య నాయకుని శక్తి సామర్థ్యాలు చాటబడినాయి.

''సాంద్ర శిలానిర్మిత త
త్కోంద్రాట్టాలకము చుట్టు కృష్ణానదినా
మంద్రగతి కలదు నౌక
పరిఖేంద్రమునే యీతగానికేన్ చొరరాకన్"

కోట, పరిఖల వర్ణనం, జమీందారు ఔద్ధత్యాన్ని చాటుతుంది.

## మద్యపాన వర్ణనం

కావ్యంలో నిర్బంధకాండలో జమిందారు పాపారావు భటాళిని వర్ణించే సందర్భంలో ఈ వర్ణనం గావింపబడింది.1

"అతని పటాలముల్ యమభ వశికిం బ్రతిరూపమచ్చుయా
కుతుకలదాక నంజుళుల కూరలు మెక్కుచు నల్లగల్లు ద్రా
వితలకు పోసికోదగిన వెక్కసపాటున మస్తు దూలుచున్
గుతుపల వోలె నాయినువగుండ్లటులుండు కొనామొదల్ సరై"

జమీందారు సైనిక పటాలాలు తలకు పోసికోదగిన విధంగా నల్లకల్లు త్రాగి, వెక్కసపాటుతో, మస్తు తూలిపడుతూ, కిరాతక చర్యలోనర్చేందుకు

---

1. రైతురామాయణం నిర్బంధకాండ 1,2, 99-102 పుటలు

వెనుకాడని వారుగా పేర్కొనటం వల్ల మద్యపానంమనుషులను వివేక శూన్యులుగ జేస్తుందని ప్రబోధించడమైంది.

అంతేగాక సైనిక పటాలాలు సంస్కార హీనులుగా, మద్యపాన మద చిత్తులుగా వర్ణింపబడటం వల్ల, జమీందారు ఔద్ధత్యం, రాక్షసత్వం ప్రకటితమై, కావ్యంలో అతని మదమాత్సర్య ప్రవృత్తి, అనుచర వర్గం యొక్క అరాచక అమానుష చర్యలు భావింప జేయబడినాయి.

నిర్బంధ కాండలో నిర్బంధింపబడిన సీత చెంతకు పాపి జమీందారు తప్పతాగి నిషా మత్తులో చేరవచ్చాడు.

"రప్పమనుచు మండు నిప్పు విషజ్వాల
చప్పచేదు హాల తప్పతాగి
నోరు తిరుగనంత నూరు డిగ్రీల ని
షా యుషారులో కషాయితుడయి"

మత్తు పదార్థం-మండునిప్పు, విషజ్వాల, హాలాహలం వంటిది. నిప్పునకు జ్వలింపజేసే ధర్మం ఉంది. హాలాహలకు విషపూరితం జేసి నశింపజేసే ధర్మం ఉంది. విషం అమృతానికి పూర్తి వ్యతిరేకం. అమృత సేవనంవల్ల దేవతలు అజరామరులయ్యారు. విషం వంటి మద్యం సేవించి మానవులు నిషాకషాయితులై, నిశాచర ప్రవృత్తిపరులై, వివేక శూన్యులై, పరపీడను లౌతారు. సప్తవ్యసనాల్లో మద్యపానం, పరదారాభిలాష మానవత్వాన్ని పూర్తిగా హరించి వేస్తాయి.

"మ్రింగు వారిచే హాయిగా మ్రింగుడు పడి
మ్రింగువారి చేవను మెల్లమెల్లగనది
మదిర మదిరాక్షి రెండును మధురములని
హద్దు మీరి సేవించిన నలువులూడ్చు"

తోడి మానవున్ని రక్షించాలన్న తపన, సమాజాన్ని ఉద్ధరించాలన్న ఆకాంక్ష, మద్యపాన నిషేదం వలని ప్రయోజనాలను చాటాలన్న ఆశయం

కలిగియున్న నాయిక సీత, మదిరాపానమత్తుడై మదిరాక్షి పొందుకై తపించి హద్దుమీరి ప్రవర్తించిన పాపారావుకు ప్రబోధం చేస్తుంది.

"దుర్వ్యసనావభూతుడైన జమిందారు లోక కంటకుడు, మదమాత్సర్యాలు గలవాడు, వివేక శూన్యుడు, నీచుడు" అనే భావాలు ప్రకటింపబడే విధంగా మద్యపాన వర్ణనం గావింపబడి కావ్య ప్రయోజనం సూచితమైంది

## మహాయోగి వర్ణనం

విజయకాండలో మహాయోగి వర్ణనం మహాద్భుతంగా చిత్రితమైంది. రైతురాముని బంటు హనుమప్ప సేనాని సీత క్షేమాన్ని అరసుటకు జమీందారు కోటలోకి ప్రవేశించి, మహాయోగి వేషంతో అందరినీ నమ్మించాడు. కుంకుమ విభూతులు మెయినలదుకొని కౌరు ధోవతులు ధరించి, యోగదండం చంకయందున్నవాడై, ఫాలభాగమున పట్టెగ కుంకుమరేఖ దీర్చి ఓం హరహరా। ఓం మహాశివమహాశివ అని అర్భటిస్తూ, ఓషధిక్రియలనొనరిస్తూ జ్యోస్యాలను చెప్పుతూ ప్రజనాకర్షించాడు. ఆ విషయం దెలిసి జమీందారు ఆ మహాయోగిని పిలిపించి కాపుసీతను తనకు వశమగునట్లు చేయుమని వేడుకొన్నాడు. చెఱనున్న సీతను చూడటానికి ఈ యోగివేషధారణం హనుమప్పకు మిక్కిలి ఉపకరించింది. జానపద జీవనంలో ప్రాధాన్యతను సంతరించుకొన్న మత విశ్వాసం, మూఢనమ్మకాల్ని, ఓషధీక్రియలు, జ్యోస్యాది ప్రక్రియల పట్ల జానపద ప్రజలకు గల అచంచల భక్తి విశ్వాసాలను, అమాయికతా భావాల్ని విశదపరచే ఈ యోగివర్ణనం హనుమప్ప బుద్ధి వైశారద్యాన్ని, దౌత్య నిర్వహణాన్ని తెలియజేస్తుంది.

## దేవీవ్రత వర్ణనం

కావ్యంలో నిర్బంధకాండలో ఈ వర్ణనం ఉంది.1 పొన్నయ్యసెట్టి సలహామేరకు జమీందారు పాపారావు నిర్బంధంలో ఉన్న కాపుసీతను వశపర్చుకోవడానికి దురాశయంతో "ఒక మహాయజ్ఞం"వలె దేవీ వ్రతాన్ని

1 రైతురామాయణం నిర్బంధకాండం-49-51 పుటలు

భక్తియుక్తుడై నిర్వహించాడు. అన్న సంతర్పణ గావించి, బ్రాహ్మణులకు భూరి దక్షిణలిచ్చి, వారిని సంతుష్టుల జేసి ఆశీస్సులు పొందాడు.

"దేవీ వరప్రసాదమునఁ బ్రాప్తించుగాక
స్వస్థతా ప్రాప్తిరంభోరు సముపభోగ
సౌఖ్య సంప్రాప్తి నందనోత్సవ శుభాప్తి
యను ద్విజాశీస్సులతనికి దనరెనంత
భావ్యనర్థ సూచనలందు బ్రస్ఫురించ"[1]

దుష్ట కామంతో కూడిన వాని ఇష్ట కామ్యార్థం సిద్ధించ కూడదన్నట్లు స్వర్గంలోని రంభోరుసుఖం పొందుమని" బ్రాహ్మలొసగిన ఆశీర్వాదం వృథా కాలేదు. రైతురామునితో జరిగిన పోరులో జమీందారు మరణించాడు. రైతు రామాయణంలో వల్లె జనుల మత విశ్వాసం, భక్తి తత్పరత, దైవ ప్రార్థనలు, దేవతార్చనలు, క్రతుకర్మ నిర్వహణాసక్తి, దీక్షానిష్టలు, బ్రాహ్మణులందు భక్త్యాదరాలు మొదలగు అంశాలు వివరించబడినాయి. దేవీవ్రతం నిర్వహణం వల్ల జమీందారులో మంచిభావం కొఱవడి, చెడునందు బుద్ధి దగిలి, మదమాత్సర్యాలు పెరిగి, అహంభావం అతిశయించి, రైతురాముని సాధించు నమ్మకం స్థిరపడింది. రైతురామునితో పోరుసల్పటానికి రంగం సిద్ధం చేయబడింది.

## ప్రయాణ వర్ణనం, యుద్ధయాత్ర వర్ణనం

విజయకాండలో రైతురాముని ఆజ్ఞను పొంది, హనుమప్ప కాపుసీత క్షేమాన్ని అరసే కార్యంపై జమీందారు కోటకు అశ్వారూఢుడై పోయే సందర్భంలోను,[2] రైతురాముడు జమిందారుపై యుద్ధం ప్రకటించి ధర్మారాట్ప్రభు, హనుమత్ప్రభృతులతో దండు వెడలే సందర్భంలో యుద్ధ యాత్రా వర్ణనం ఉంది.

---

1 రైతురామాయణం - నిర్బంధకాండ - 49-51 పుటలు

2 రైతురామాయణం - విజయకాండం - 4,24 27 పుటలు

"వింశతి సహస్ర సంఖ్యలో విఱుగబడుచు
సాస్త్రశస్త్ర సంపత్కాంతి చటుల మగుచు
వెడలె సైన్యవాహిని గంగ వెల్లువెత్తి
దీప్త విద్యుత్ప్రవాహ ప్రదీప్త సాంద్ర
ఘూర్ణమానవ లాహక కోటి యనగ"

వీర హుంకార ఘీంకారలతో, హయరాజ హేషిత ధ్వానాలతో, పణవ దుందుభి కాహళ పటహనివహాల ఘూర్ణితాలతో, చక్ర వ్యూహరాజితమై సైన్య విన్యాస తంత్ర విస్ఫారితమై హనుమప్ప సర్వ సేనానిగా ధర్మారాట్ప్రభు నేతృత్వంలో కర్షకావళి కదలింది, నాయక రాముని విజయం కోసం జమీందారుపై రైతురాముని సైన్యం దండయాత్ర సాగించింది.

సైనికార్భాటం శత్రు సైన్యాలకు భయం గొల్పేనదై, రైతురామునికి విజయం ప్రాప్తించడం తథ్యం అని చెప్పడమేగాక, వీరహుంకార ఘీంకారాలు శత్రు పక్షాన్ని రెచ్చగొట్టు చున్నవై భీషణమైన పోరు జరగడానికి కారణాలౌతున్నాయి. ఈ విధంగా భీభత్స భయానక వీరాలుద్బుద్ధాలై కావ్యానందాన్ని ఆస్వాదించే యోగ్యతను ప్రసాదించాయి.

## దౌత్య వర్ణనం

విజయకాండలో హనుమప్ప దౌత్యం వర్ణింపబడింది.1 ధర్మారాట్ప్రభువు సేనాని హనుమప్ప రైతురాముని అనుమతితో సీత క్షేమాన్ని తెలిసికొని వచ్చే కార్యానికి నియోగింపబడ్డాడు. హనుమప్ప యోగివేశం ధరించి తన జ్యోతిశ్శాస్త్ర మహిమచే జమీందారు నాకర్షించాడు. అతనిచే ప్రార్థితుడై సీతను జమీందారునకు వశం గావించే పనికి నియుక్తుడౌతాడు. చెఱయందున్న సీతను గాంచి, ఆమె క్షేమం దెలిసికొన్నాడు అంతేగాక రైతు రాముడు దండు వెడలి రానున్నాడనియు, సీతను చెఱవిడిపించి, జమీందారును యుద్ధంలో ఓడిస్తాడని దెలిపి, ఆమె నుండి సెలవు పొందాడు కోట గోడలపై జమీందారు పావని దురాగతాలను, సీతను నిర్బంధించిన విషయాన్ని రైతురాముడు ససైన్యంగా దండెత్తనున్నాడనే విషయాలనుబొగ్గుతో

---

1 రైతురామాయణం-విజయకాండం-12-28 పుటలు

వ్రాసి జమీందారును హడలెత్తించాడు. శ్రీరామపురం జేరి రైతురామునకు సీతక్షేమసమాచారాన్ని తెలియపరచాడు.

రామాయణ కథాబలాలున్న రైతురామ కథలో హనుమప్ప దౌత్యం హనుమద్దౌత్యాన్ని పోలినదై కథార్థాన్ని సువ్యక్తం చేయుచున్నది.

## యుద్ధ వర్ణనం

కృషికాండంలో రైతుల దండయాత్ర[1] విజయకాండలో జమీందారు పాపారావుతో రైతురామునకు జరిగిన పోరాటం[2] రససోస్ఫోరకంగా ఉన్నాయి

వీరహుంకార హయహేషలతో భేరీభాంకారాలతో కదలిన రైతురాముని సైన్యం జమీందారు పాపారావు కోటను చుట్టుముట్టి అతని సైన్యంతో యుద్ధానికి తలపడింది.

"వీరోత్సం సములారం సాగుడు రణోర్వి స్నైతుర్ దీర్ఘాజ్యపుం
ధారాపాతముగాగ శత్రుభట మేధస్సారముల్ హవ్యముల్
గా రూపొందం బశువృత్తి గల పాఖండుండుం దాం బావడా
క్రూరాస్త్రానలవేది యాగవశు వైరూపిల్ల యుద్ధాధ్వర
ద్వారా మారణకర్మ హోమము నొనర్పన్‌జేయ పూర్ణాహుతిన్"

మారణకర్మ హోమంతో పాపి పావడు యజ్ఞ పశువుగా పూర్ణాహుతి జేయడానికి సైనికులను హెచ్చరించడంతో శత్రుపక్షంతో పోరు ఘోరమై పోయింది. ఇరువఖాల సేనానులు హనుమప్ప కొండడు ఇద్దరు తలపడి ద్వంద్వ యుద్ధం జేశారు. కొండడు నేలకొరిగాడు. జమిందారు సైన్యాలు చెల్లాచెదురై వెన్నిచ్చి పలాయనం చిత్తగించాయి. అణచడానికి వచ్చిన భారత యూనియన్ సైన్యాలచే త్రొక్కబడి జమీందారు మరణించాడు. భీభత్సభయానక వీరరసాల అవిష్కృతి ఈ యుద్ధవర్ణనంలో జరిగింది. కావ్యనాయకుని లక్ష్యాదర్శాలు ఫలవంతమవడానికి దోహదమైంది.

---

1 రైతురామాయణం-కృషికాండం-4, 5 పుటలు

2 ,, - విజయకాండం – 24-34 పుటలు

## నాయకాభ్యుదయం

విజయకాండంలో రైతురాముని నాయకాభ్యుదయం నిర్వహింపబడింది.[1]

జమీందారు పాపారావుతో జరిగిన భీషణ సమరంలో కావ్యనాయకుడు రైతురాముడు విజయం సాధించాడు.

"జయజయ నినాదముల్ మ్రోగె సర్వదిశల
రామమూర్తినిఁ దద్ధర్మరాట్ప్రభువును
రాచయేనుంగుపైన నలంకరించి
వీధులందు నూరేగింపు విధులు సల్పి
రఖిల మంగళ వాద్య నీరాజనముల"

జమీందారు పాపారావు మరణంతో రైతురాముడు విజయోత్సాహంతో సీతను చెఱవిడిపించి, నిష్కళంకమైన సీతాసాధ్విని పరిగ్రహించాడు. జమీందారు పత్నిని కనికరించి ఓదార్చాడు. ద్రోహం జేసిన సుందరమ్మను క్షమించి విడిచాడు. జమీందారు అధీనంలోనున్న 100 ఎకరాల మాగాణిని కైవసం జేసికొని ధర్మరాట్ప్రభువు దానిని నాయక రామున కొసగి శ్రీరామపురానికి రైతు నాయకునిగా పట్టం గట్టాడు. ఈ విధంగా జమిందారీ వ్యవస్థ నశించి కర్షకాభ్యుదయం సాధింపబడింది. రైతురాముని నేతృత్వంలో గ్రామరాజ్యం రామరాజ్యంగా వెలసింది. కావ్యప్రయోజనం నెరవేరింది.

---

1 రైతురామాయణం – విజయకాండం – 34–35 పుటలు

# కావ్యమందలి పాత్రలు

కావ్యంలో పాత్ర పోషణమే ప్రధానాంశం. పాత్రల మూలంగా రసావిష్కరణం జరుగుతుంది. విభావాదులు సాధారణీకరింపబడి రసానందం అను భావ్యమవుతుంది. సహృదయుని రసాస్వాదనానికి ఆయా వ్యక్తులు పాత్రలుగా ఉపయోగపడటం వల్ల కావ్యంలో వారికి "పాత్రలు" అని వ్యవహారమేర్పడింది. ఇవి ఆదర్శ రూపాన్ని భావింపజేసి నీతిని ప్రబోధిస్తాయి.1 కావ్య నాయకునికి నాయిక ప్రతినాయక సహాయకాది పాత్రలు కథా ఫలప్రాప్తి పర్యంతం సహకరిస్తారు. కావ్య కథార్థాన్ని అనుసరించి యున్న సజీవ పాత్ర పోషణం, కథాగమనానికి, వర్ణనాలంకారాది రస-నిర్వహణానికి, అన్వయింపబడి కావ్య గౌరవాన్ని పెంచి, కావ్య ప్రయోజనాన్ని సాధిస్తుంది.

రైతు రామాయణ కావ్యంలో నాయికా నాయకాది పాత్రల యొక్క స్వరూప స్వభావరీతులు, సమకాలీన సామాజికాంశాలకు అద్దం పట్టే విధంగా చిత్రింపబడినాయి. పల్లె జీవన విధాలు కర్షక ప్రాభవాలు, హాలిక జీవితాశయాలు పరిశీలనాత్మకమైన విశ్లేషణతో, వివేచనతో ఆయా వ్యక్తుల రూపు రేఖల్లో, వేశభాషల్లో, గుణ శీలాల్లో అభివ్యక్తం జేయబడినాయి. రైతు జీవన సంగతమైన పాత్రలు రామాయణ కథానుసరణయంగా సజీవ శిల్పంతో తీర్చబడినాయి.

## కావ్యంలోని పాత్రలు:—

1) రైతు రాముడు — ధీరోదాత్త కావ్య నాయకుడు-సాగరయ్య పుత్రుడు
2) సీత - కావ్యనాయిక - సాధ్వి
3) లక్ష్మణుడు — ఉపనాయకుడు - రైతు రాముని సోదరుడు,
4) ఊర్మిళ — సహనాయిక — లక్ష్మణుని భార్య,
5) జమీందారు పాపారావు — ధీరోద్ధతుడు — ప్రతినాయకుడు,

1 "రామాదివద్వర్తితవ్యం, నతురావణాదివత్" రామాయణ కథా సూక్తి.

6) సాగరుడు - కథానాయకుని తండ్రి,

7) గంగమాంబ – మంగమాంబలు – సాగరుని భార్యలు,

8) ధర్మారాజ్పృభువు – భీమవరం సంస్థానాధీశ్వరుడు- రైతురామునకు సైన్య సహకారం చేసిన వాడు.

9) హనుమప్ప – సేనాని, రైతురాముని నమ్మిన బంటు,

10) పొన్నయసెట్టి – సీత నిర్బంధానికి కారకుడు.

11) వృద్ధస్త్రీ - నిర్బంధంలో నున్న సీతను ఓదార్చిన అవ్వ.

12) సుందరమ్మ – జమీందారు సోదరి, సీతను నిర్బంధించడానికి కారకురాలు.

13) కాపు మల్లన్న, నాగమ పటేలు, సెట్టి భార్య.

14) పాలికాపులు - రంగన్న, కొమురయ్య, శివయ్య.

15) వరినాటు కత్తెలు, కొండడు, భటులు.



# రైతురామాయణం కావ్యోపదేశం

"ఘన ప్రయోజనాత్మికమగు కావ్యసృష్టి
కళకేగాక సమాజ వికాసమునకు
మధుర లలిత పయోధర మంజు సృష్టి
రక్తికేగాక మాతృత్వ సాహితి కొఱకును

రైతురామాయణం (మున్నుడి)

కావ్య ప్రయోజనం కీర్తిని ధనాన్ని లోకవ్యవహార శుభపరంపరలను ప్రాపింప జేయడానికే పరిమితం కాకూడదు. చతుర్వర్గ ఫలస్పృహను కోరుతూ, "ఆనందోపదేశాలను" పార్యంతిక ఫలాలుగా రసహృదయులకు అందివ్వాలి. సంస్కార భావ సంపత్తితో సామాజిక స్పృహతో, ప్రజలగాధ రైతురామాయణం రసమయ కావ్యమై ప్రజాకోటి కోసం రచింపబడింది. ఇంద్రియ లౌల్యానికి, భోగాభిలాషకు గురికాని రీతిలో ఉత్తమ మానవా ధర్మాలుగల రైతురాముని చరిత్రం ధీరోదాత్తంగా శాంతి విప్లవ పథంలో సాగి, ధర్మాన్ని ప్రతిష్ఠించి సమాజానికి కర్తవ్య ప్రబోధం జేసింది.

కొడవలి కర్షకుడి ఆయుధం, సుత్తి కార్మికుడి ఆయుధం నినాదం రాజకీయవాది ఆయుధం. అట్లాగే కవిత్వం కవి ఆయుధం[1] ఈ కావ్యంలో కవిలోని తీవ్రానుభూతులు స్వచ్ఛందంగా విజృంభించి వాస్తవిక దృష్టితో శాస్త్ర సమ్మతంగా గ్రామ వికాసాన్ని కాంక్షించాయి. నిజాం పాలననాటి పాశవికత, హింస వాటి రూపాంతరమైన సమాజంలో నున్న అధర్మాన్ని నిర్మూలింప సమకట్టి—ప్రేమ, కరుణ, స్నేహం, ఐక్యత, సత్యం, ధైర్యం ఇత్యాది జాతీయాభిమానం గల భావ బీజాలను ఉత్పన్నం జేసి జనజాగృతి జేయబడింది.సమాజంలో గూడు కట్టుకొని ఉన్న ఆకలి దారిద్ర్యం అసమాన భావం కర్షకుల శ్రామికుల కష్టనష్టాలు ఈ కావ్యంలో కవితావస్తువులైనాయి గ్రామ రాజ్యంలో వర్గరహిత ప్రజాస్వామ్య స్వర్గం స్థాపించవలెనను సదా శయంతో సాంప్రదాయికత వాస్తవికతలు ఈ కావ్యంలో ప్రతిఫలించాయి.

---

1 గుంటూరు శేషేంద్రశర్మ—ఆధునికశాస్త్రం-కవిసేన-మానిఫెస్టో-పుట-10

ధర్మం, అర్థం, కామం, మోక్షం ఈ నాలుగు పురుషార్థాలు మానవ కళ్యాణ మంటపానికి మూలస్తంభాల వంటివి. వీనిలో కామం అర్థంచే సాధింపబడుతుంది. అర్థం ధర్మంచే సాధింపబడుతుంది. అనగా ధర్మాచరణమే మొదటిదన్నమాట. సత్తునుండి అసత్తును వేరుచేసి వేదవిహితంగా ఉత్తమ మానవుని స్వవిధులను నిర్దేశించేది ధర్మం. ధరాన్ని రక్షించినచో అది రక్షిస్తుంది. శాంతి స్థాపనం సద్ధర్మ కర్మాచరణం వల్ల సాధ్యమౌతుంది. ఇట్టి ధర్మమున కాటంకం కలిగినచో అధర్మం రాజ్యమేలుతుంది. లంచగొండితనం ప్రపంచమేలుతుంది. ముడుపుల చెల్లింపులు, వచ్చిమోసం చలామణ్ణి ఔతుంది. సతీత్వశీల భంగం, దోపిడి, కుట్రలు కుతంత్రాలు, మద్యపానం జూద , పరదారావహరణం, అసత్యం, పరధనావహరణం, గృహ దహనాలు మారణ హింసాకాండ, దౌర్జన్యం, అక్రమార్జనం, నిరంకుశాధికారం విశృంఖలంగా విహారం జేస్తాయి. ఇట్టి అధర్మం పరప్రభుత్వ పాలనలో విజృంభిస్తుంది. తాము పోగొట్టుకొన్న ధర్మపె హక్కులను సాధించి రక్షించుకోవడానికి ప్రతి పౌరునికి హక్కు ఉంటుంది నిజాం నిరంకుశ పాలనలోని జమీందారీ ఫ్యూడల్ వ్యవస్థలోని సంస్థానాలను విముక్తం జేసి వ్యక్తి స్వేచ్ఛతో గ్రామ రాజ్యాన్ని, దేశ స్వాతంత్ర్యాన్ని సాధించాలన్న దృక్పథం రైతు రామాయణంలో ప్రతిపాదితమైంది. కావ్యనాయకుడు రైతురాముడు గ్రామ ప్రజలను సమీకరించి, సంఘాలేర్పరచి ప్రతినాయకుడు జమీందారుపై విజయం సాధించటంతో ప్రజాశక్తి ముందు ఎట్టి నిరంకుశ బలం నిలువజాలదని నిరూపితమైంది. వ్యక్తి స్వేచ్ఛ సంఘ శక్తి దేశంలోని ప్రజాస్వామ్య పటిష్ఠత పరిరక్షణకు సోపానాలని ఈ కావ్యం ప్రబోధిస్తుంది.

"మన యీ సంపదలెల్ల సత్యమతయున్ మట్టిని సచాపిండి స్వ
ర్ణ నిధుల్ బాణగజేయు కర్షకులమేల్ రక్తమ్ము దానొండె బు
ట్టిన గోతెన్ తమ యుక్కుడెక్కలను బిండింగొట్టి ప్రాకారశ్రే
ణినిగా గట్టు శ్రమైక జీవముల క్రొన్నెత్తుండె యోచింతకున్

రైతురామాయణము

దేశ సౌభాగ్యం సంపద అంతా కర్షకుల, శ్రమైక జీవముల ఉక్కు రెక్కలపై ఆధారపడిఉంది. రైతులు పండించిన పంట పెట్టుబడి వడ్డీలకు పరి

పోతుంది. కరువు కాటకాలేర్పడినచో అతని బ్రతుకు దుర్భరమౌతుంది. అతని కృషిఫలం అంతా చీకటి బజారు దోపిడులకు గురి అవుతుంది. రేయి పవలు సేద్యం పనుల్లో తలమునకలుగా ఉండే రైతు పొరుగువారి సిరి సంపదలకు ఆశపడని నిర్మల చిత్తుడు. లోకానికి జీవరక్ష. ఇట్టి అన్నదాత యైన కర్షకుడు బలహీన పడినచో దేశం సుస్థిరత చెడుతుందని శిశుశిక్షణ కృషి కాండలలో కావ్యంలోనిపలుతావులందుసన్నివేశాత్మకంగాఋజువుచేయ బడింది. కర్షక ప్రాధాన్యం చాటబడింది.

"మనకు ప్రాణము కార్మికుడతని యామాత్రంపు తోడే లభిం
చనిచో నెక్కడి దక్కడే నిలిచి స్తంభించు నేనాడొ యీ
పనివారల్ పని చేయునంతవరకే పైమేడలెన్నైన్ పునా
దని నాధారము చేసికొన్నవె శ్రమాధీనమ్ము లీ లోకమ్ముల్

రైతురామాయణము

కర్షకుడు, కార్మికుడు, శ్రామికుడు దేశానికి ప్రాణం వంటివాళ్ళు, ధన వంతులు పెట్టుబడిదార్లు తమ అవసరాలకు పోగా మిగలిన సంపదను ధర్మ ధర్మ కర్తృత్వ సిద్ధాంతానికి అనుగుణంగా పెట్టుబడిదార్లు, పనివారలు ఉమ్మడి భాగస్వామ్యంగా వ్యవహరించి గ్రామాలలో పలు అభ్యుదయ కార్యక్రమాలు నిర్వహించవలసి ఉంటుంది. ఇట్టి పరస్పర సహకార కార్యా చరణంతో ప్రతి గ్రామం స్వయం పోషకమై తన వ్యవహారాలు తానే నిర్వ హించుకోగల సమర్థను కలిగియుంటుంది గ్రామ పునర్నిర్మాణ కార్య క్రమం తాత్కాలిక సూత్రాలపై గాక శాశ్వత పునాదుల మీద జరుగాలి. కావ్యంలో రైతురామునిచే ఇప్పలవాగుపై సేతు నిర్మాణం గావింపబడి శాశ్వత నీటి వనరులతో, నూతన వ్యవసాయ పద్ధతులతో గ్రామాలు సస్య శ్యామలాలౌతాయి. గ్రామాలు సర్వాంగీన వికాసంపైన దేశ సమగ్ర వికాసం ఆధారపడి ఉంటుందన్న హెచ్చరిక చేయబడింది. కర్షకాభ్యున్నతి సాధింపబడినపుడే దేశం నిత్యకళ్యాణ పచ్చతోరణంగా విరాజిల్లుతుందన్న ప్రబోధం ఈ కావ్యంలో ప్రకటింపబడింది.

లోకపుటన్యాయాల్లో, బాధల్లో పడి నిమగ్నుడైన మానవునికి చిత్తా కర్షణ కలిగించి ప్రకృతి బ్రహ్మానందాన్ని ప్రసాదిస్తుంది. భూమి, ఆకాశం

సూర్య చంద్రులు, చెట్లు చేమలు, శుకపికాదులు, ఉదయాస్తమయాలు, రేయింబవళ్లు వెన్నెలలు మొదలగు ప్రకృతి దృశ్యాలు కావ్య కథలోని పాత్రల కష్టసుఖాలతో సహాను భూతితో పాలుపంచు కొన్నట్లు పలు సందర్భాల్లో అభివర్ణించబడినాయి. కావున ప్రకృతిని ఆరాధించాలను ఆశమమే గావ కృతజ్ఞతాభావంతో ప్రకృతి సంపదకు హాని తలపెట్టరాదను హితోపదేశం కావ్యంలో పరిస్ఫుటమౌతుంది.

చతుర్విధ పురుషార్థాల సాధనకు యోగ్యమైనది గృహస్థ ధర్మం. స్త్రీ పురుషుల ప్రేమానుబంధాన్ని ఆదర్శ సూత్రంలో ముడివేసి వారనొక యింటి వారిగా నిలబెట్టేది వివాహ బంధం ఒక ఇల్లాలని ఉండి ఉన్ననే అది ఇల్లు, ఇల్లు దీర్చే ఇల్లాలున్నచో గడ్డిపాకకు కూడ తేజం తెల్పి కలుగుతుంది. ఈడు జోడుగల ఉత్తమ గృహిణితో కాపురం స్వర్గ సుఖాల్ని మరపిస్తుంది. సంసార జీవికి ఇంటికి దీపమైన ఇల్లాలు, భుక్తికి కర్వేలేని మాగాణి ఉంటేచాలు. గృహస్థ ధర్మంతో లోకసేవాపరాయణమగు సంతానాన్ని పొందాలి తల్లిదండ్రులు ఏ గుణకర్మలను ఆచరింతురో బిడ్డలును అదే యొనర్తురు. కావ్యంలో సాగరయ్య గంగ మంగమలు ఆదర్శ గృహస్థ ధర్మాన్ని నిర్వర్తిస్తారు. వారి కుమారులు రామలక్ష్మణులు తండ్రినిమించిన కొడుకులనిపించు విధంగా తమ విధులను ధర్మాలను నిర్వర్తించి కావ్యఫలాన్ని సాధించారు.

"దేశ సౌభాగ్య సౌష్ఠవాలకు కర్షకుడెట్లు ముఖ్యుడో అట్లే మానవ సంఘ సౌష్ఠవానికి గృహస్థుడు అంతటి ముఖ్యడను విధంగా కావ్యంలో సీతారాముల, ఊర్మిళ లక్ష్మణుల దాంపత్య జీవితాలు ఆదర్శవంతములై ఉపదేశాన్నిస్తాయి. రైతు రాముని మాతా పితృ భక్తి అనంతమైనది. కనిపించిన తల్లిదండ్రులపట్ల భక్తి ప్రేమలతో వ్యవహరించాడు. తండ్రికెదురాడక నమ్రతతో తండ్రి తలపెట్టిన ప్రజోపయోగ కార్యాలను సాధించాడు. తనకై ప్రాణాలనర్పించిన తల్లి మంగమ లేని జీవితం పాపఫలమని భావించి అమ్మ ప్రేమ దైవందయకన్న మిన్నయని చాటినాడు. కావ్యంలో భ్రాతృప్రేమ అనన్యాదృశంగా లక్షింపబడింది. కాపు రామలక్ష్మణుల అపూర్వ సోదర మైత్రితో ఒకరి మాటను

ఒకరు కాదనక ఒకకుదురులోని మొలకలట్లు ఒకరిపై నొకరు ప్రాణాలనిత్తురు లక్ష్మణుడు వదిన సీతను తల్లికి మారుగా భావించి ఆదరిస్తాడు. అన్నదమ్ముల, వదినామరదళ్ళ, భావబంధ్యం గృహస్థధర్మ పతిష్ఠకు మూలమని ఈ కావ్యం ఉపదేశిస్తుంది.

గృహస్థ జీవితంలో సతీధర్మం పవిత్రమైంది. కులపాలికా ప్రేమ ఈ కావ్యంలో పరాకాష్ఠత నందుకొన్నది. శిశు శిక్షణ కాండలలో గంగ మంగ సాగరయ్యల దాంపత్యం, కళ్యాణకాండలో సీతారాముల దాంపత్య శృంగారం అభివర్ణితమై చక్కని సతి పతి ధర్మాలు చిత్రితమైనాయి. పతి సతికి ఏడు గడయై రక్షించుకొనున నట్లే ఉత్తమ గృహిణి తన భర్తను ప్రేమతో ఆకర్షించుకొంటుంది. మోక్షప్రాప్తికి భగవంతుడు ప్రసాదించిన శరీరాన్ని ఫలావ్యాప్తికి అనుగుణంగా ఒక సృజనశక్తిగా ప్రేమానురాగంతో ఏకీభావం పాశనికమైన కామ ప్రవృత్తికి గాక సత్కామతో కులపాలికా ధర్మాన్ని నిర్వర్తించుతుంది. భోజన వేళలో మాతృమూర్తిగా వ్యవహరిస్తుంది. పుత్ర మమతాబంధపాశంతో సంతానాన్ని ఇంటిని చక్కదిద్దుతుంది. కావ్యంలో మంగమాంబ సీత పాత్రలు ఇందుకుదాహరణములై సతీ ధర్మాన్ని ప్రబోధిస్తున్నాయి.

ఉత్తమ సతిస్వార్థత్యాగానికి ప్రతీక శీలకవచంతో నున్న స్త్రీని ఎవరు అగౌరవ పరచలేరు. ఉత్తమసతిని కామవాంఛతో చూచిన పురుషుడు మృగప్రాయుడై పట్టు పురువు విధంగా తనను బంధింప త్రాళ్ళను తానే సమకూర్చుకొని నశిస్తాడు. అట్లే కట్టుబాటు దప్పి నీతిబాహ్యంగా కామవాంఛాప్రవృత్తి పరితృప్తికి స్త్రీ పూనుకున్నచో ఇహపరాలకు దూరమౌతుంది కావ్యంలో సీతను బంధించిన జమీందారు పాపారావు అతని సోదరి సుందరమ్మ పాత్రలు ధర్మభ్రష్టులుగా, లోకనింద్యులుగా చిత్రింపబడినాయి. అందువల్ల గృహస్థాశ్రమ ధర్మాన్ని పాలిస్తూ, ఫలాపేక్ష రహితమైన బుద్ధితో సత్కర్మల నాచరించువాడు జన్మబంధ విముక్తి పొంది ఉన్నత స్థానం పొందగలడని ఈ కావ్యం ప్రబోధిస్తుంది.

కావ్యంలో గురు శిష్యుల అనుబంధం ఆదర్శవంతంగా తీర్చిదిద్ద

బడింది. తిరువేంగళప్ప వద్ద రామలక్ష్మణుల విద్యాభ్యాసం ఇందుకుతార్కా-ణం. బాధ గురువుగా గాక బోధ గురువుగా బాధ్యతతో శిష్యవాత్సల్యంతో బోధన జరుగునపుడు గురు శిష్యపరంపర ఉత్తమ సంస్కృతికి తరతరాలకు అందిస్తుందను ఉత్తమాదర్శ ప్రబోధం ప్రతిపాదించబడింది.

సజ్జన దుర్జన పద్ధతులు చక్కగా విశ్లేషించబడినాయి. సౌజన్యాన్ని పాటించని దుర్మార్గులు రావణాదుల వలె నశిస్తారని కుత్సితులు జాతి వ్యక్తి నికి చీడపుర్వులై సంఘ వినాశానికి పాల్పడుతారని, సజ్జనులు ధర్మాన్ని రక్షించి ధర్మంచే రక్షింపబడుతారని ఈ కావ్యంలో ప్రతినాయక నాయక పాత్రలచే ప్రబోధించబడింది. రైతురాముని పరోపకారరం, దాతృత్వం, త్యాగం లోక కళ్యాణానికి హేతువులు ధర్మారాట్ప్రభువు కరువుబాధితులకు అన్నసత్రాలు పెట్టించి రైతుసోదరులను రక్షిస్తాడు. రైతురాముడు నిల్వ ధాన్యాన్ని దానంచేసి తోడి కర్షకుల బాధలను నివారిస్తాడు. ఇట్టి ఉదాత్త గుణములను ఈ వర్యాం వ్యంజితంజేసి, పరస్పర సహకార భావం మానవ-త్వాన్ని నిలుపుతుందని చాటింది. ధనసంపత్తి గల భాగ్యవంతులు పేద ప్రజల అవసరాలను తీర్చుటకు తగునిధిని వితరణం జేసి దేశహితైకాపాద-కాలైన కార్యాలలో వినియోగించ వలయును. ఆర్థిక స్వాతంత్ర్యం అన్యా త్రం గాక ప్రజాసామాన్యం యొక్క ఆధీనంలో ఉండాలన్న ఆర్థిక విధా-నం సూత్రం ఈ కావ్యంలో ఇప్పలవాగుపై సేతు నిర్మాణ ఘట్టంలో సూచింపబడింది.

సంఘ సంస్కరణాభిలాష కావ్య కథకు ప్రాణసదృశంగా భావింప బడింది. బాల్య వివాహ న్నిరసనం, వరకట్న నిర్మూలనంమద్యపాన నిషేధం, నిరక్షరాస్యతా న్నిర్మూలనం, రైతురాముడు తలపెట్టిన సంఘ సంస్కరణలు విశ్వసించిన దానిని వెంటనే ఆచరణలో పెట్టనివాడు సంఘ సంస్కర్త కానే రడు. రైతురాముడు లక్ష్మణుడు వరకట్నం లేకుండ సీతను ఊర్మిళను పెండ్లాడుతారు. అట్లె దొంగతనం కంటె వ్యభిచారం కంటెతాగుబోతు తనం మరిదుర్మార్గమైందని సీత తప్ప తాగిన జమీందారునకు ఉపదేశిస్తుంది.

కావ్యంలో భక్తి వైరాగ్యం, తాత్త్వికబోధ గావింపబడింది సాగరయ్య

దేవుని వరప్రసాదంతో రామలక్ష్మణులను పుత్రులుగా పొందిన ఘట్టంలోను సాగరుని పాత్ర చిత్రణంలోను తాత్త్విక బోధచేయబడింది. ఇహపరాలకు దూరం కాని రీతిలో ఉత్తమమైన మానవుని ధర్మాన్ని జీవిత పరమార్థాన్ని ఈ కావ్యం తెలియజేస్తుంది.

"ఏమగర్వింతు తెలుగు మగాణ మందు
తెలుగు మొలకనై పుట్టినందులకుఁ దెలుగు
వెలుగునీడలఁ బెరిగినందులకును తెలు
గమ్మ పదసేవ నోచికొన్నందులకును"

రైతు రామాయణము

నాదు దేశము, నాదు జాతి, నాదు భాష ఈ త్రిసూత్రాల్ని జీర్ణించు కొన్న ఆచార్యులు పల్లెప్రజలనోళ్ళల్లో జీవద్భాషగా బ్రతుకుచున్న కమ్మని జాను తెనుగు నుడికారపు వోహళింపులతో కావ్యరచన జేసినారు. మాతృ భాషాభిమానం, మాతృ దేశాభిమానం వృద్ధిపరచు అంశాలెన్నో ఈ కావ్యం నిండావండాయి. తెలుగువారి పెండ్లి ఆచారాలు, జాతకర్మలు, బారసాలలు, అపరకర్మలు, దైవభక్తి, గృహస్థ ధర్మాలు. పండుగలు, వేడుకలు, వినోదాలు. పల్లె కాపువడికట్లు, ఆహార విహారాదులు తెలుగుదన, తెలుగు సంస్కృతి తరతరాలకు అందించే విధంగా ధర్మవీర రసప్రధానంగా రైతు రామాయణ కావ్యం రచింపబడి రసానందాన్ని సహృదయులకందింది సమాజానికి కర్తవ్యాన్ని ఉపదేశిస్తుంది.

ఓం

# శ్రీమాన్ వానమామలై జగన్నాథాచార్యుల గారి ఇతరకృతులు

## రెండవ భాగం  మొదటి అధ్యాయము

### శ్రీవ్రతగీతి కావ్య వైశిష్ట్యం

శ్రీమాన్ వానమామలై జగన్నాథాచార్యులవారు 'విష్ణుభక్తి ప్రచార నిమిత్తం తిరుప్పావై ద్రావిడ ప్రబంధాన్ని "శ్రీవ్రతగీతి" అను పేరుతో ఆంధ్రీకరించారు. విష్ణుచిత్తుడను నామాంతరం గల పెరియాళ్వారునకు వర ప్రసాదంగా భూదేవి అంశముతో లభించిన శ్రీగోదాదేవి, శ్రీరంగనాథ స్వామిని దినమునకొక పాశురముతో ముప్పది దినములు ఆరాధించింది. విష్ణువును వ్రజాంగనా మధురభక్తితో తన గాన మాధుర్యంతో ప్రబోధితుని జేసి. అనన్య భక్తితో మెప్పించి అతని ప్రేమాదరాలకు పాత్రురాలైంది' శ్రీరంగేశుని పెండ్లాడి స్వామి యందు ఐక్యం పొందింది. శ్రీవైష్ణవ భక్తి పరిపూర్ణమైన ఈ శ్రీవ్రతగీతి కావ్యం మధురభక్తిని విధానమై కవితారమణీయకంతో అలరారుచున్నది.

### విశిష్టాద్వైతం

చేతనాచేతనములచే విశిష్టమైనది బ్రహ్మము. దాని అద్వైతము భగవంతునికి జీవుడు శరీరం. జీవునకు ప్రకృతి శరీరం. జీవ ప్రకృతులకు ఆత్మ శ్రీమన్నారాయణుడు. ఆత్మ లేనిదే శరీరం లేదు. కావున శరీరమాత్రులైన జీవుడు, ప్రకృతి పరమేశ్వరు నుండి వేరుపడజాలవు. అనగా ఈశ్వ

రుడే నియామకుడు. నాయకుడు శేషి, శరీరి, ఆధారుడు. మిగిలినది శేషము శరీరము, ఆధేయము, నియామ్యము. జ్ఞానాశ్రయ రూపమైన "చిత్తు" మరియు సత్త్వరజస్తమోగుణాశ్రయ రూపమైన "అచిత్తు"లని సూక్ష్మావస్థ యందును ఈశ్వరుడు విశిష్టుడు గావున విశిష్టాద్వైతమై పరగుచున్నది.1

"భూమ్యంతరిక్షాది సకలలోకము లందున్న చేతనాచేతన రూపమగు సకల వస్తువులకును శేషియై, సకల జగత్తులకు ఆత్మయై, వాని యందలి దోషములు తనను తాకకుండునట్లు ఉండువాడై, తనకు శరీరమగు జగత్తును నియమించునట్టి ఐశ్వర్యము గలవాడై తనకంటే నితరమగు సమస్త చేతనాచేతనములకు అసమానుడై సర్వేశ్వరుని మనము పొందితిమి"2 వైష్ణవ నిత్యానుసంధానంలో చెప్పబడింది. శ్రీమన్నారాయణుడే చిద చిత్తులతో కూడిన తత్త్వము కావున విశిష్టాద్వైతమైనది.3

భగవానుడు పరవ్యూహ, విభవ, అంతర్యామి, అర్చారూపములతో లైదు విధాలుగా విరాజిల్లుతూ కృపావర్షాన్ని కురిపించుచున్నాడు.4 పర రూపము పరమపదమునందే గాని లీలావిభూతికి సంబంధించినది కాదు కావున దుర్లభమైనది. క్షీరసాగర శయిత్వము వ్యూహరూపము. దేవతల ఆర్తిని బాపుటకు రామకృష్ణాది అవతారముల ఈశ్వరుని రూపము విభవ రూపము సత్తును కాపాడుటకు చరాచరములందంతర్యామిగా నున్న ఈశ్వరుడు అంతర్యామి రూపము ఇదియును అగమ్య గోచరమైనట్టిది. ఇక లీలా

---

1 ఇలదుండుడై యని దెనని నై వరియవన్
నిలనిడై విశుంబిడై యురువివనరు వినన్
పులనొండు పులనొళి వీలన్ వరందన
న్నలనుడై యొరువనై ననుగిన నామ్నామె"
—నమ్మాళ్వారు - కోయిల్ తిరువాయ్ మొళి.

2 నిత్యానుసంధానము - 280వ పుట.

3 "శ్రీమన్నారాయణ ఏవ చిద చిద్విశిష్టాద్వైతమ్ తత్త్వమ్"
విశిష్టాద్వైత మత సంగ్రహము-శతావధాని కృష్ణమాచార్యులు

4 ఈశ్వరః పంచధా-

విభూతితో జగత్తును సృజించి భక్తులకు దృష్టి గోచరుడై అర్చనకు యోగ్యుడై యున్న భగవంతుని రూపము అర్చారూపము ఇట్టి భగవత్స్వరూపుడు జ్ఞాన బలైశ్వర్య వీర్యశక్తి తేజ సౌశీల్య షడ్గుణైశ్వర్యాదులతోనే గాక, వాత్సల్య, మార్దవ, ఆర్జవ, సౌహార్ద సౌమ్య కారుణ్య మాధుర్యగాంభీర్య ఔదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్యసంకల్ప కృతిత్వ కృతాది1 అనంతమైన కళ్యాణ గుణములకు ఆకరుడై, చిదచిత్తులందు వ్యాపించి యుండివానికి చైతన్యమును కలిగించు జగత్కారణుడైనవాడు విష్ణువు. అతడు సర్వాంతర్యామి సృష్టి స్థితిల యాదులు సర్వమును ఈశ్వర కృపచే నిర్వహింపబడునని2 నిర్ధరించునది విశిష్టాద్వైతము. ఇట్టిది దాక్షిణాత్యమున శ్రీవైష్ణవ సంప్రదాయంగా విలసిల్లినది.

## శ్రీవైష్ణవ ప్రపత్తి మార్గం:

వేదవేద్యుడు, పురుషోత్తముడు, వాసుదేవుడు జగజ్జన్మాది కారణుడైన శ్రీమన్నారాయణుడు సేవ్యుడు అని తెలిసికొని దాసభావంతో, అనన్య భక్తితో ఆత్మసమర్పణంతో శరణాగతిని వేడుకొనుట ప్రపత్తి భక్తిమార్గము. భగవత్ప్రాప్తికి కర్మజ్ఞాన భక్తి మార్గాలున్ననూ, సులభోపాయమైన శరణాగతితో మోక్షఫలంసాధించుట ప్రపత్తి. ద్వయానుసంధానంతో భగవంతుడొక్కడే దిక్కని యెంచి భగవచ్చరణార విందాలపై బడి నమస్కరించి శరణు వేడుట ప్రపత్తి3 శ్రీమన్నారాయణుని సర్వలోకారాధ్యత్వాన్ని, సర్వవ్యాపిత్వ లక్ష

---

1 యతీంద్ర మత దీపిక—

2 యతోవా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి।
యత్ప్రయంత్యభి సంవిశంతి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మ
తైత్తరీయోపనిషత్తు – భృగువల్లి

3 శ్రీమతేరామానుజాయనమః, శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే
ద్వయాను సంధానం అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ।
తాస్మాత్ కారుణ్య భావేన రక్షరక్ష జనార్దన
— ప్రతి ప్రతపూజయందు ఆత్మ నమస్కార శ్లోకము

ణాన్ని, పతితపావనత్వాన్ని 1 స్తోత్రం చేసి, విష్ణువే మోక్షప్రదాతయని విశ్వసించి స్వామి నిర్హేతుక కటాక్ష మందలి విశ్వాసంతో సర్వస్వాన్ని అర్పించి శరణాగతిని పొందుట ప్రపత్తి మార్గము.

భగవదనుగ్రహానికి హేతువు లేదు. ఉన్నచో నది దివ్యము కాదు. కాపున నిర్హేతుక జాయమాన కటాక్షమే మోక్ష హేతువు. భగవంతుడు తనంతట తానే జీవుడి ననుగ్రహించునను నమ్మకంతో ప్రపత్తి కలిగి, ఈశ్వరునకు తాను శేషభూతుడనని, కైంకర్యమే తన ధర్మమని, శరణాగతియే తన కుపాయమని, తాను నారాయణునకు అనన్య భోగ్యత్వ, అనన్య శరణత్వ అనన్య శేషత్వాలను కలవాడనని తెలిసికొని జీవుడు శ్రీమన్నారాయణుని సేవించి ముక్తి పొందువలెనని శ్రీవైష్ణవ ప్రపత్తి భక్తి మార్గం ప్రబోధిస్తుంది. 1) అనుకూల్య సంకల్పం, 2) ప్రాతికూల్య వర్జనం, 3) రక్షించునను విశ్వాసం, 4) గోప్తృత్వ వరణం, 5) ఆత్మ నిక్షేపం, 6) కార్పణ్యం అనేవి ప్రపత్తికి ఆరు అంగాలు2 జీవుడు నిత్యానుసంధానంతో, భగవదర్చనయందాసక్తి కలిగి, భగవంతునికభిముఖుడై, నాస్తిక భావం లేక హింసాభావాన్ని విడనాడి, సమత్వ బుద్ధి చింతనంతో భగవంతుడే రక్షకుడని సర్వస్వాన్ని భగవదర్పితం గావించి దీనుడయి అనన్య భక్తిచే శ్రీమన్నారాయణుని శరణు వేడుట ప్రపత్తి మార్గం. స్వస్వరూప జ్ఞానం, పరస్వరూపజ్ఞానం పురుషార్థ స్వరూప జ్ఞానం, ఉపాయ స్వరూప జ్ఞానం, విరోధి స్వరూప జ్ఞానం. అనే అర్థ పంచక జ్ఞానంతో జీవుడు తనను తాను తెలిసికొని, పరమపదానికి వాసుదేవుడధిష్ఠాతయని తెలిసికొని ముక్తిని కోరి జితేంద్రియుడయి విష్ణుసాయుజ్యాన్ని పొందగలుగును. అర్థ పంచక జ్ఞానంలో ఉపాయ స్వరూప జ్ఞానమే ప్రపత్తి. భగవంతుని పూజనీయుడుగా దలంచి పరమ స్నేహ ప్రేమానురక్తి పూర్వకంగా ధ్యానించుట వలన సాయుజ్య ప్రాప్తి

---

1 వాసు దేవాశ్రయో మర్త్యో వాసుదేవ పరాయణః
సర్వపాప విశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనః
భారతము - విష్ణుసహస్రనామ స్తోత్రం శ్లో॥ 10 అనుశాసనికపర్వం

2 "ఆనుకూల్యం సంకల్పః ప్రాతి కూల్య స్యవర్జనమ్
రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వ వరణం తథా
ఆత్మ నిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతిః"।
--యతీంద్రదీపిక

కలుగుతుందని1 సర్వధర్మాలను పరిత్యజించి భగవంతుని శరణు వేడిన పాపాలు హరింపబడి మోక్షం ప్రసాదింపబడుతుందని2 ప్రపత్తి భక్తి తత్త్వాన్ని ప్రవచించిన వారు వైష్ణవ మత ప్రచారకులు ఆళ్వారులు.

## ఆళ్వార్లు — ఆచార్యులు

ఆళ్వారాది వైష్ణవాచార్యులు భగవన్మూర్తులుగా పూజలందుకొన్నారు. ముక్తులగు ఆళ్వార్లు ఆచార్యుల మూలముగా శ్రీమన్నారాయణుడు లోకోద్ధరణ గావించుకొన్నాడని విశ్వసించునది శ్రీవైష్ణవ భక్తి తత్వం "ఆళ్వారు"3 తమిళ శబ్దానికి జ్ఞాన సముద్రమందు మునిగిలేచిన వాడని అర్థం. వీరు పన్నిద్దరు. ఏడు నుండి తొమ్మిది శతాబ్దాలలోనివారు4 వీరు ద్రావిడ ప్రబంధాలను రచించారు. వేదోపనిషత్తులతో పాటు ద్రావిడ ప్రబంధాలు కూడా ప్రమాణాలుగా గ్రహింపబడటంవల్ల వైష్ణవ తత్త్వం"ఉభయవేదాంతంగా" ప్రసిద్ధి పొందింది.

---

1 "స్నేహ పూర్వమను ధ్యానం భక్తి రత్యభిధీయతే"

అ) శ్రీమద్రామానుజాచార్యులు–గీతాభాష్యము–అధ్యా. 7వ అవతారిక

ఆ) సాత్వస్మిన్ పరమప్రేమరూపా–నారద భక్తిసూత్రములు సూత్ర-2

ఇ) "పరానురక్తి రీశ్వరి" శాండిల్య భక్తి సూత్రములు - సూత్ర-2

2 "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

భగవద్గీత-అధ్యాయం - 18 - శ్లోకం 66

3 అ) "తన్ గురువిన్ తాళినైగళ్ దన్నిలన్బొట్టిల్లాదార్
అన్బుతన్బాల్ శెమ్ దాలుమంబు యైకోన్
ఇన్నమిగు విణ్ణాడు తావళిక్క వేణ్ణుయిరాన్
ఆదలాల్ వణ్ణారవర్‌గళ్ తిరునాడు"

ఉపదేశరత్నమాల--మణవాళ్ళ మహామునులు

ఆ) ఆచార్యుల యందు భక్తి లేనివారు శ్రీయఃపతి యందు భక్తి కలిగియున్నను పరమపదము ప్రాపింపరు. అతడు ననుగ్రహించడు"

నిత్యానుసంధానము-510-పుట

నమ్మాళ్వారు తిరుమంగై ఆళ్వార్లు రచించిన తిరువిత్తము, తిరువాశిరియము, పెరియ తిరువందాది, తిరువాయ్‌మొజి అనే ద్రావిడ చతుర్వేదాలను "నాలాయిర ప్రబంధం"గా సంచయం జేసి. ఆళ్వార్ల అనుభూతులకు సంప్రదాయ సిద్ధమైన లక్షణాన్ని కల్పించిన వైష్ణవ ప్రథమాచార్యులు 10వ శతాబ్దంలోని నాథమునులు.వీరిచే అంకురించి, అతని మనుమడు యామునమునులచేచిగుళ్ళెత్తి, శ్రీమద్రామానులచే పుష్పించి ప్రవర్తితమైన శ్రీవైష్ణవ భక్తి తత్త్వ బోధాపరిమళాలు పిళ్ళలోకాచార్యులు వేదాంత దేశికులచే లోకపరివ్యాప్తమై గుభాళించాయి. ఆళవందార్ (యామున ముని) రచితమైన సిద్ధిత్రియము, ఈశ్వరజీవ ప్రకృతులను త్రివిధ తత్త్వాలను ప్రవచించిన మొదటి విశిష్టాద్వైత గ్రంథము1 శ్రీమద్రామానుజులు (1019-1139) వేదోపనిషత్తులతో పాటు పాంచరాత్ర్యద్యాగమములు పురాణములను రచించి ఆళ్వార్ల ప్రబంధాలతో సమన్వయించి శ్రీవైష్ణవాన్ని కేవలం ఆళ్వార్ల సంప్రదాయంగా ప్రవచించి నైతిక ప్రపత్తి మార్గదర్శనం జేశారు.ఆళ్వార్ల దివ్యప్రబంధాను సంధానంతో దక్షిణభారతం పులకరించి పోయింది. దీనితో ప్రభావితులైన యతీంద్రులు శ్రీభాష్యాన్ని రచించి ఉభయవేదాంత ప్రవర్తకులైనారు2 శ్రీవైష్ణవంలో తెంగలై శాఖకు ప్రథమాచార్యులు నాథమునులవంటి పిళ్ళలోకాచార్యులు శ్రీవచన భూషణం రచించారు. పిదప అపర రామానుజులు మణవాళ మహాముని ప్రవర్తకంతో విశిష్టాద్వైతం ఉన్నత శిఖరాల నధిరోహించింది.

విష్ణువు జగజ్జన్మాది కారణుడు, జన్మము రెండు విధాలు. కర్మాయత్త జన్మం. భగవంతునిది ఇచ్ఛాయత్త జన్మం. భగవదవతారాల్లోని అర్చారూపాన్ని సేవించి భక్తులను తరింప జేసిన వారు ఆళ్వార్లు. వీరు భగవద్దర్శనం తరించిన మహాభక్తు. తద్దర్శన లక్షణాన్ని ప్రవచించి లోకారాధన చేసి తరించిన మహా పురుషులు ఆచార్యులు.

"ఆళ్వార్లు సంసార మగ్నులు కాగా భగవంతుడు వారిని ప్రబోధించెను. అంతవారు భగవంతుని కన్నులారా గాంచి తరించిరి. గోదాదేవియట్లు

1 విజ్ఞాన సర్వస్వము 7వ వ్యాఖ్యానం - 691వ పుట

2 ,, ,, ,, - 663వ పుట

గాదు. తనకు తాను స్వామి సన్నిధికేగి దివ్యప్రబంధమగు తిరుప్పావై పాడి వానిని ప్రబోధించి తన మనోరథమును పొంధ్గగలిగెను. కావున ఆళ్వార్ల కంటె ఆండాళమ్మ అత్యంత విలక్షణము"1 "ఆళ్వార్లు మహర్షులవంటివారు. వారిలో పెరియాళ్వార్లు వారికంటే శ్రీగోదాదేవియు గొప్పవారు."2

## భూదేవి అంశగా గోదాదేవి

శ్రీమన్నారాయణుడు చిద చిద్విశిష్టాత్మకుడు. శ్రీ లేక నారాయణుడు లేడు. నారాయణుని విడిచి శ్రీలేదు. ఇది నిత్యద్వంద్వము. శ్రీవిశిష్టుడైన నారాయణుడే ముక్తిప్రదుడు. శ్రీకి శేషిత్వములేదు. అనన్యార్హశేషత్వమే. ఆమె కృపామూర్తి. భగవంతుని న్యాయపాలనను తన సౌందర్యంచే జయించి భాగవతోద్ధరణము చేయించును. ఆమె పురుషకార స్వరూపిణి. రక్షకుడైన శ్రీమన్నారాయణుడు రక్ష్యుని రక్షించునట్లుజేయు మధ్య వర్తిత్వమే పురుషకారము. శ్రీదేవి భూదేవి నీలాదేవి నారాయణుని దివ్య పత్నులు. పురుషకార స్వరూపిణులు.

శ్రీమన్నారాయణుని దివ్యపత్ని భూదేవి శ్రీవిష్ణుచిత్తులకు (పెరియాళ్వారుకు) ఆషాఢ ఫల్గుణనక్షత్రయుక్త వాసరమున కుమార్తెగా అవతరించింది. గోదాదేవి తిరునక్షత్రం పవిత్రదివసం3 "గోదా" అనగా భూమిచే దత్తమైనదని అర్థం.4 అది వరాహస్వామి మహిషి భూదేవి దయాస్వరూపిణి

---

1 తిరుప్పావు పీఠిక తిరుపతి దేవస్థానం వారి ప్రచురణము
ముప్పాయిరప్పడి వ్యాఖ్యాత పెరియవాచ్చాన్‌పిళ్ళగారు.

2 తిరుప్పావు పీఠిక-తిరుపతి దేవస్థానంవారి ప్రచురణ.

3 పెరియళ్వార్ పెన్ బిళ్లైయామ్ ఆండాళ్ పిఱంద
తిరువాడిప్పూరత్తన్ శీర్మై ఒరునాళై
క్కుండో మనమేయుణర్‌న్దుపార్
ఆండాళుక్కుండాగిలొప్పి దుక్కుముండు"
ఉపదేశ రత్నమాల

4 Life of Sri Ramanuja – P – 22

గోదగా అవతరించి శ్రీరంగేశుని సేవించి, కామధేనువై జీవులను కరుణతో లాలించి, క్షమామూర్తియై శరణాగతులను రక్షించి తరింపజేయుచున్నది1 శ్రీగోదాదేవి క్రీ॥శ॥ 716లో జన్మించి క్రీ॥శ॥ 731లో తిరుప్పావుపాడి స్వామిలో లీనమైనది.2

## శ్రీగోదాదేవి స్తవము

పాండ్యదేశం లోని శ్రీవిల్లి పుత్తూరు నందు విష్ణుచిత్తుడను (పెరియాళ్వారు) నొక వైష్ణవ బ్రాహ్మణుడు నిత్యం శ్రీరంగేశునికి తోమాల కైంకర్య సేవలొనర్చువాడు. అతనికి కటకపూర్వఫల్గుణి శుభఘటికలందు తులసి వనంలో ముకుందుని వరప్రసాదమున, విశ్వంభరాంశమున శిశువు లభించింది. గోదాదేవియను పేరుతో పెరిగింది. తమిళమున "కోద" యని పిలిచెదరు. కోదై అనగా మాల. పూబోడి గావున ఆ పేరు పెట్టబడింది. సంస్కృతంలో వాఙ్మాలిక సమర్పించినది. అని అర్థము గోదాదేవికి కృష్ణభక్తి వెన్నతో బెట్టిన విద్య. ఆటపాటల్లోను ముకుందుని గాథలను కీర్తనం చేసెడిది. యౌవన ప్రాదుర్భావంతో విష్ణువునందు లగ్నమనస్కయైనది, పూలమాలలను తనకేశపాశము నందలంకరించుకొని మురిసి, అ ముడిచి తీసిన పూలమాలలను భగవంతునికి కైంకర్యంగా అర్పించి, భక్తిచే ప్రేమచే శ్రీరంగేశుని చొక్కించి వశముజేసికొన్నది. ప్రేమపురస్సరమైన మాలికా కైంకర్యంతో స్వామి ప్రసన్నుడై దర్శనమొసంగిన విషయం

1 శ్రీవిష్ణుచిత్తకుల నందన కల్పవల్లీ

అ) శ్రీరంగరాజ హరిచందన యోగదృశ్యాం
సాక్షాత్ క్షమాం కరుణ యా కమలామివాన్యాం
గోదామనన్య శరణశ్శరణం ప్రపద్యే।

ఆ) సంకల్ప కల్పలతి కామవధిం క్షమాయాః
(మాయా) స్వేచ్ఛావరాహ మహిషీం సులభానుకంపామ్
విశ్వస్యమాతర మకించన కామధేనుమ్
విశ్వంభరామ శరణం శరణం ప్రపద్యే" — భూస్తుతి
— వేదాంత దేశికులు

2 Life of Sri Ramanuja – P – 239

తెలిసిన విష్ణుచిత్తుడు తన జన్మ ధన్యమైనదిగా మురిసిపోయెను. గోదాదేవి హరిచరిత్రలు చెప్పుమని ప్రార్థించెను. విష్ణుచిత్తుడు శ్రీమన్నారాయణుని వైభవాన్ని వర్ణిస్తూ శ్రీరంగపతియే సాక్షాద్విష్ణువని చెప్పెను. ఆమె శ్రీరంగపతి యందు మనస్సు నిల్పి ధ్యానించి భగవంతుని నాథునిగా పొందుట ఎట్లని తండ్రి నడుగగా అతడు గోపికలవలె ధనుర్మాసవ్రతము పాటింపుమనెను. గోదాదేవి వ్రజాంగనాదీక్ష బూని నీలాతుంగ ఘనస్తనాద్రితటిపై నిద్రించు భద్రాత్మకుడైన గోపాలుని మధుర భక్తి పారవశ్యంతో, శ్రుతి దీప్త స్తోత్ర పాశురాలతో గానం జేసింది. జగత్పతియైన సర్వేశ్వరునకు నిదురమత్తును వదిలింపజేసి కర్తవ్య ప్రబోధంతో "నేను నీ సొమ్మును, నీకే అంకితమైన నా జీవితమును నీవు మరచియుండుట నీకు తగదు, నేను నీకిది పాదము బెట్టి నేర్పవలయునేమి? అని శ్రీయఃపతిని వేడుకొన్నది. మార్గళి నోములో దినమునకొక్క పాశురమును భక్తి భావంతో స్వామి ఆశ్రయణమునకు కావలసిన పురుషకార సామాగ్రిని సంతరించుకొని ప్రేమ గీతాంజలులతో గానం జేసి, ముగ్ధమోహన సౌందర్యంతో శ్రీయఃపతిని ప్రసన్నం జేసికొన్నది.

శ్రీరంగేశుని అజ్ఞానుసారంగా, పాండ్య దేశాధిపతి అధ్వర్యంతో శ్రీ గోదాదేవి వివాహం ఆళ్వారాదుల సమక్షంలో శ్రీరంగనాయకునితో మహా వైభవంగా జరిగింది. అంత్యమున ఈమె స్వామిలో లీనమై సాయుజ్యమొందింది.

ద్రావిడ పద్యసాహితీ బిక్ష నొసగే శ్రీగోదాదేవి ప్రణయ వాసనాపూర్ణమైన ప్రసవ మాలలను, ప్రణవ యోజనాకీర్ణమైన పాద్యమాలలతో జత పరచి శ్రీరంగేశునికి కైంకర్యంగా భక్తి ప్రేమ పురస్సరంగా అర్పించి, ఆముక్త మాల్యదగా ప్రత్యక్ష దైవంగా వెలసింది. శ్రీయఃపతి మనసు శ్రియఃదేవి నిత్యానుపాయిని1 శ్రీ గోదాదేవి శరణాగతి కోరిన భక్తులను

1 శ్రీమన్నారాయణాభిమతాను రూప స్వరూప గుణవైభవైశ్వర్యశీలాద్య నవధి కాతిశయా సంఖ్యేయ కళ్యాణ గుణగణామ్। పద్మావనాలయాం, భగవతీం, శ్రియం దేవీం। నిత్యాయిపాయనీం, నిరవద్యాం దేవదేవ దివ్య। మహిషీం, అఖిల జగన్మాతరం,అస్మన్మాతరం। అశరణ్య శరణ్మా మనన్య శరణం శరణంప్రపద్యే। -శరణాగతిగద్య

తరింప జేయుచున్నది. జగన్మాత గోదాదేవిని శరణని నారాయణుని శరణు వేడుచు భక్తులు తరించుచున్నారు.

## వ్రజాంగన మధుర భక్తి

పరమాత్ముడు, ఆత్మకు గల భర్తృ భార్యా సంబంధం మిక్కిలి విశిష్ట మైనది. "పరునకు ఉపయోగించుట శేషత్వం. పరునకు అధీనమైయుండుట పారతంత్ర్యము. ఈ రెండును స్త్రీకి ఉండే లక్షణాలు. కావున ఆత్మలన్నీ స్త్రీ ప్రాయములు1 పరమాత్మ స్వతంత్రుడు. శేషి కావున పరమ పురుష డొక్కడే పురుషుడు2 ఈశ్వరుడు భరించువాడు. ఆత్మలు భరింపబడునవి. "భగవంతుని ప్రియునిగా భావించుకొనుటయే మధురభక్తి" రాధాకృష్ణులు గోపికాకృష్ణులు జీవాత్మ పరమాత్మల మధురభక్తికి పర్యాయ పదములై పోయినవి. మధురభక్తిలో సర్వాత్మ సమర్పణము, భగవద్వియోగ దుస్స హత్వము ముఖ్యములు. గోపికలు కృష్ణభగవానుని తమ ప్రియుడుగా భావించుకొని ఆత్మ సర్వస్వమాతని కప్పనపెట్టిరి. అతడు సాక్షాత్కరించగా పరవశులై పాడిరి. అతడు దూరమైనప్పుడు దుర్భర వియోగాగ్నిలో తుక తుక ఉడికిపోయిరి. శ్రీకృష్ణుని వేణుగానము వినగానే పతులను సుతులను విడిచి యమునానదీ తీరమునకు పరుగెత్తిరి. గోపికల క్రీడలన్నియు అంత కరణ సంబంధములే కాని కామజములు కావు. రాసక్రీడలట్టివే. సమస్త కర్మ బంధములను ద్రెంచుకొని వారి జీవాత్మలు ఈశ్వరేచ్ఛానుసారముగా జేసిన దివ్య నృత్యమే రాసక్రీడ3 జన్మాంతర మహా పుణ్యఫలముగా గోపికాదుల

---

1 విశిష్టాద్వైతమత సంగ్రహము. శతావధాని శిరిశినహల్ కృష్ణమా చార్యులు – మధురభక్తి 44వ పుట.

2 అ "పరమాత్మైవ పురుషః స్త్రీ ప్రాయమితరం జగత్"

ఆ వాసుదేవః పుమాన్ ఏకః నార్యశ్చ సకలం జగత్"

ఇ గోవింద ఏక పురుషో బ్రహ్మాద్యాః స్త్రియ ఏవచ"

అని మన ప్రాచీనుల అభిప్రాయం

3 ఆధునికాంధ్ర కవిత్వము–సంప్రదాయములు–ప్రయోగములు

డా॥ సి. నారాయణరెడ్డి – పుట – 462

వలె భగవంతునిపై సహజముగా కలిగిన ప్రేమ క్రమక్రమంగా అహంకార విదూరమైన పరాభక్తిలో పర్యవసిస్తుంది. భక్తి నవ విధములు1 భగవద్వి భవ శ్రవణార్చన సేవన కీర్తనస్మరణ వందన దాస్య సఖ్యమాత్మ నివేద నాది భక్తి తత్త్వంచే ఆళ్వారాదులవలె, రాధిక—గోపికలవలె మనస్సమర్పణ చేసి, భగవంతుని భర్తగా ధ్యానించి తరించుట వ్రజాంగన మధురభక్తి యని శ్రీవైష్ణవ తత్త్వం ప్రబోధిస్తుంది. శ్రీగోదాదేవి వ్రజాంగనామధుర భక్తితో శ్రీరంగేశుని జేరింది.

## ధనుర్మాస వ్రతాచరణం

ధనుర్మాస వ్రతధారి ప్రత్యూషమున నియతి మేల్కొని, చన్నీట స్నానమాడి, స్వామి యిల్లూడ్చి, కలయంపి జల్లి, నిత్యకర్మమాచరించి గోఘృత దీపంవేసి గోక్షీర పరమాన్నంతో శర్కరాజ్యయుక్త కదళీఫలాళి నైవేద్యమిచ్చి, కప్పురపు సుగంధయుక్త తాంబూలమొసంగి, కోవెలకు ప్రదక్షిణము చేసి, శఠగోపము, చరణతీర్థము ప్రసాదమాల్యము గొని, భగ వంతుని ముప్పది దినములు వ్రతదీక్షతో సేవించుట ధనుర్మాస వ్రతాచరణ నియమము.2

శ్రీ గోదాదేవి ధనుర్మాస వ్రతాన్ని బూని శ్రియఃపతిని సంసేవించి సాయుజ్యాన్ని పొందింది. ఆమె నిత్య కైంకర్యంగా పాడిన ముప్పది పాశు రములు కలుషములడంచును. పరమేశ్వర పాదారవిందములు చూపును. ఉపనిషద్రహస్యాలకు, పరమ తత్త్వార్థాలకు, వేదాలన్నిటికి బీజము ఇట్టి మృదుమధురములగు పాశురముల నెర్గంగని వ్యక్తిని భూమి మోయుట వ్యర్థము."3 తిరుప్పావై శ్రీమద్రామానుజులచే నిత్యం అను సంధింపబడి

1 శ్రవణం—కీర్తనం, విష్ణుస్మరణం, పాద సేవనం, అర్చనం, వందనం దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదనం.

2 అధర్వణ రహస్యమగు కపింజల సంహితలో బ్రహ్మనారద సంవాదం ఆముక్తమాల్యదా సౌందర్యము డా॥ కోటేశ్వరరావు - పుట - 122

3 తిరుప్పావు అనువాదం—శ్రీమాన్ సుదర్శనాచార్య శిరోమణి పాదగంగళ్ తీర్కుం పరమనడికాట్టుం। వేదమనైత్తుకుం విత్తాగుం-కోదై తమిళ్। ఐమ్మైందు మైందుం అఱియాదమానిడరై। వైయంశు ముప్పదుంవందు

ద్రావిడ ప్రబంధమై మధురభక్తి విలసితమై వెలసింది.

## శ్రీవ్రతగీతి-వస్తువరణం

శ్రీవిల్లి పుత్తూరులో శ్రీగోదాదేవి యదుపతిని పొందుటకై ధనుర్మాస వ్రత మాచరించింది. రేపల్లె సిరులపంట నిలువలైన చెలువలు వ్రజాంగనల భావ స్ఫూర్తితో జగత్పతి సర్వేశ్వరునకు నిదురమత్తు వదిలింపజేసి, కర్తవ్యం ప్రబోధంజేసి తన జీవిత సర్వస్వాన్ని అతనికర్పించింది. "హరినిగూర్చి నోమునోము అపురూపపుమా నోము" - "ఆశించిన ఫలము నొసగు నపురూపపుమన వ్రతమ్ము" "అందరమును కూడి నోము నపురూపపు మననోము అను మకుటాలతో రచన సాగింది. ఈ కావ్యంలో "29" ఖండికలు వ్రతాచరణ వివరణంతో, భక్తియుక్తంగా వేదాంత తత్త్వజ్ఞాన ప్రబోధాత్మకంగా వర్ణనా వైవిధ్యంతో రచింపబడినాయి.

## శ్రీవ్రత గీతికల నిర్వహణం

1. శ్రీః :- "మాగి దినపు తొలి నెలలో మంచుగురియు వెన్నెలలో
......................హరిని గూర్చి నోమునోము అపురూపపు మా నోము"

శ్రీమన్నారాయణుడు తొలకరి కారు మొగిళ్ళను పలుకరించే మేని వాడు. శశి సూర్యులు అతనికి కళ్ళు. నంద యశోదల ముద్దుబిడ్డడు, యదు సింహ కిశోరం. ఇట్టి శ్రియఃపతిని గోదాదేవి ధనుర్మాస దీక్ష వహించి వ్రజాంగనా మధుర భక్తితో సేవిస్తుంది. నిండుకున్న చందమామ మంచు గురిసే తొలి వెన్నెలలు గల మార్గశిర మాసపు మాగి దినములలో ప్రత్యూష మున మౌనని యతి మేల్కొని, చన్నీట తానమాడి, కురుల సరుల తురుము కొని "నారాయణుడు భేరి నిడును" "నారాయణుని సేవించరారండి" అని వ్రజాంగనలను దీక్షకు సమాయత్త పరిచింది.

2. వైయత్తు :- "తొలి వరువము లిగురించుచుతల యెత్తెడి చెలువలారా!
...................... ఆశించిన ఫలము నొసగు నపురూపపు మన వ్రతమ్ము"

ఈ గీతికలో వ్రతాచరణం కొఱకు విధులు వివరింపబడినాయి. పాల కడలిపై శేషతల్పమున పవళించిన శ్రీమన్నారాయణుని సేవించి స్తోత్ర గానం జేయుటకు పెందలకడనే లేచి చన్నీట స్నానమాడవలెను. కేశ సంస్కారం, కజ్జల ధారణం మాలాలంకారణాదులు పరిత్యజించి భగత్సేవ యందు నిమగ్నులై యుండవలెను. ఇతరులపై కొండెములు చాడీలు చెప్పక అసత్యమాడక పరిశుద్ధమైన మనస్సుతో సద్ధర్మ కార్యాలను నిర్వ ర్తించవలెను. పాలు నేయి భక్షింపక నిరతదాన శీలంతో ప్రశస్త జీవితాన్ని గడుపుతూ ధనుర్మాస వ్రతాన్ని విధి నియమావళితో నిర్వహిస్తున్నామని గోదాదేవి చేతులతో విన్నవించింది.

**3. ఓంగి :-** "కొండెత్తున బెరిగి జగము గొలిచిన యుత్తమును బాడి ...................... ఆశించిన ఫలము నొసగు నపురూపపు మనవ్రతమ్ము."

జగత్స్రష్టుడు, వామనావతారమూర్తి శ్రీకృష్ణుని జలకములాడి దీక్షతో అందరు కలిసి కీర్తించినచో నెలకు మూడు వానలు కురిసి, వరిచేలు, పంట పొలాలు కంకి గొలుసులు అణువంచి గాలులలు యేలలూగును. గంగి గోవులు బుడ్లకొలది పాలనిచ్చును పాడిపంటలు సమృద్ధిగా పండును. అపురూపపు నోము నోమిన ఆశించిన ఫలితం సిద్ధించునని గోదాదేవి గానం జేసింది.

**4. మాయనై :-** "మాయల మారిని నుత్తర మధురాపురి యధికారిని... ఆశించిన ఫలము నొసగు నపురూపపు మన వ్రతమ్ము" మధురాధిపతి, జగ న్నాటక సూత్రధారి, పావన యమునానదీ సైకత విహారుడు యదువంశ మణి దీపం దామోదరుని పరమ శుచీభూతులై పుష్పాలచే అర్చించి కీర్తించి నచో, కాలాగ్నిలో కాలిన దూది పింజలవలె భవభయ దురితాలు నశించి పోవును. భగవదర్చనతో శుభఫలితాలు కలుగునని నాల్గవ పాశురంలో గానం జేయబడింది.

**5. ఆళి :-** "గరువదనపు వరుణదేవ........
వర్షించుము లోకమెల్ల హర్షించు విధాన"

ఈ గీతికలో కరుణాసాగరుడు శ్రీమన్నారాయణుని అంతర్యామిత్వాన్ని దయాళుత్వాన్ని కీర్తించబడింది.

సప్తసాగరాల జలాన్ని తాగి మత్తిల్లిన వరుణదేవుడు కాయమేను పెంచి, శ్రీమన్నారాయణుని మేనుకాంతిని పోలిన మేఘ మాలికలను విరజి చక్రకాంతులే మెఱుపులుగా, పాంచజన్య గర్జనలు మేఘ గర్జనలుగా శార్ఙ్గ మ్ముతూ ధనూయుక్త శరధారలు వర్షధారలుగా లోకమెల్ల హర్షించు విధాన వర్షించు మని వరుణదేవుని స్తోత్రం జేయుచున్నది. ధనుర్మాసవ్రతాచరణం వల్లసకాల వృష్టిజరిగి కరువుకాటకాలేర్పడవని శ్రీగోదాదేవి ప్రబోధించుచున్నది

**6. పుళ్ళుమ్ :-** "పులుగు జతలు కలరవముల
తొలి ప్రభాతగీతి బాడె.........చెల్లెల"

నిద్రింతువటే చిలిపి వలపు కలలు గనుచు" శరణాగతి మధుర భక్తి గీతమిదివిషం పాలు దాగి మాయ పూతనను మర్దించి, శకటాసురునినిర్జించి ఖడలికతో అదిశేషునిపై పవ్వళించిన స్వామినిమునులు మేల్కొల్పుచున్నారు. రకరకాల పులుగుజతలు ప్రభాతగీతి పాడుచున్నవి. గరుడ వాహనుని కోవెలలో ప్రాభాత భేరి శంఖనాదాలు నినదిస్తున్నాయి. జగత్తు సమస్తం మేల్కొన్ననూ, హరియుల్లాన్ని కొల్లగొని చిలిపి వలపుల కలలతో చొక్కి నిద్రించు శ్రీదేవిని మేల్కొల్పుచున్న గీతమిది. పురుషకార స్వరూపిణి శ్రీదేవిని ప్రార్థిస్తూ శరణాగతులను రక్షించి బ్రోవుమని శ్రీరంగనాదునితో చెప్పి తమను తరింపజేయుమని వేడికోలు చేయుచున్న పద్యరత్నమిది.

**7. కీశుకీశు :-** "గిల్లురుమను కేరింతల కీచుకీచు రవములెసగ.............
ఎబ్బే! పడుకున్నావటె ఇకనైన తలుపు తెఱవు! ఓ శ్రీదేవి! మా అజ్ఞాన తెరలను తొలగించి శ్రీమన్నారాయణుని పొందు మార్గం జూపుమని శరణువేడుట ఈ గీతంలో వ్యజ్యమానమగుచున్నది. నల్ల పిచ్చుకల కీచుకీచు మనే కలకల రవం వినిపిస్తున్నను, చల్ల చిలికే గొల్లభామల చెలువపు కవ్వపుగాజుల ఘలంఘలల మ్రోతలు వీనులకు విందులు జేస్తున్నను, శ్రీదేవి నిద్రనుండి మేల్కొనలేదు. స్వామిని దర్శించడానికి తలుపులు తెఱవలేదు. శ్రీదేవిని స్వామిని ప్రబోధించే భక్తి గేయమిది.

**8. కీళ్వానమ్ :-** "తూరుపు బయలై తెలతెలవాఱుచునుండెనునడుగో-
అరెరేయరెరేయని వెన్నెల జావైన కరిగి పోవు-ఆశాలతలన్ని పూచు

అందాల వ్రితము ఫలించు। బిరబిర మేల్కొని భేరిని గొనిరమ్మని శ్రీదేవిని స్తుతించే గీతం. భళ్లున తూర్పు తెల్లవారింది. ఆవుల మందలు మేతకై చేలకు వెళ్ళినవి. పడచులెల్ల త్రోవలుగాచుచు స్వామికి కొరకు వాకిలిలో నిలిచి పిలుచుచున్నారు. తురగాసురుని, కంసచాణూరులను మర్ధించిన కన్నయ్యను కరువుదీర సేవించినచో వ్రితం ఫలించి భక్తి మరందాలు వర్షించి వెన్న జున్నులవలె స్వామి హృదయం కరిగి బ్రోచునని ఈ పాశురంలో కీర్తించబడింది.

9. తూమణి :- "పవడపుమణిమేడచుట్టు దివెల వెలుగులలురువాల---- సామిని బాడిన పలుకదు సరసము జిలుకదు నులుకదు" కృష్ణుని ప్రసన్నం జేసికోవడానికి సహకరించుమని శ్రీదేవిని ప్రార్థేయ పడిన విధం భక్తిరసా విష్కృతిని కలిగిస్తున్నది.

పరిమళ ధూప ధూమములు చెలగినను, మంగళహారతుల వెలుగులు విరజిమ్మినను, శ్రీదేవి మేల్కొనలేదు. వైకుంఠవాసా।మాధవా అని స్వామితో మొరపెట్టుకొను దీనాలాపములను వినిపించుకొనక, గొల్ల చేడియల ఆర్తిని బాపుటకు శ్రీదేవి దయారసాన్ని చిలుకదు, పలుకదు, ఉలుకదు. గుఱకనిద్ర నుండి మేల్కొని రక్షించుమని శ్రీదేవిని స్తుతిస్తూ పాడిన గీతం.

10. నోత్తు :— "నోచి స్వర్గసుఖ సంపద దొచెడి యో దొరసానీ। లేచి తలుపు తెఱవవే। కాఱాచివి నీవేకానీ!----మేలిమెయి తొడవుదానా। మెయి పొలపు విడుము బిరాన।

వనమాలిని, శిఖిపింఛమౌళిని కనులారా సేవించుటకు ఉవ్విళ్ళూరు చున్న గోపికా భక్త బృందానికి, నిద్రలేచి, తలుపు తెఱచి వాతెఱ దెఱచి మాటాడి రక్షించు మనియు, కుంభకర్ణ నిద్ర వలదనియు శ్రీదేవికి కర్తవ్య ప్రబోధం జేయబడినది. నీలమేఘశ్యాముని నోరెత్తక నిద్రించే కారణం నిగ్గ దీసి అర్థించింది. లేగటాల నురుగు పాలు పితికే పుణ్యమూర్తులైన గోపా లుర ముంగిళ్ళలో లక్ష్మీకటాక్షంతో సిరిసంపదలు తులతూగునని ధనుర్మాస నోము ఫలం కీర్తించబడింది.

**11. కనైతు :—** "అరులు గొనుచుఁ బసిదూడల నాత్మదలచి కనికరించి ——————ఒకరేమిటి అందరిండ్లసకులిట వచ్చిరిటు చూడు!" వాత్స ల్యంతో మొఱనాలకించి బో్రవుమని గానం జేసిన గీతమిది.

వేకువలో ఆవులు లేగలకు, గేదెలు తమ దూడలకు ప్రేమతో బరువు చనుగుత్తుల నుండి సంతత క్షీరధారలు కురిపిస్తున్నాయి. వ్రేపల్లె చెలు లందరు కదలి వచ్చి చల్లని మంచు గురియు వేకువలో నిల్చి ఎన్ని జాములు వేచియున్నను, రావణ సంహారకుడు, అపురూపపు కోడెకాడు. స్వామిని వద లక మేల్కొనక తమమొఱ నాలకించుట లేదని శ్రీదేవిని ఆర్తితో శరణు వేడుతూ గానం జేయుబడింది.

**12. పుళ్ళిన్ :—** "పులుగుపేరి యసుర నోరు సెలగినయ్య————కపటము విడి లేచిరమ్ము కలసిపాడు శుభదినాలు."

ధనుర్మాస దీక్షగొన్న గోపికలు బకాసురుని చీల్చిన కంసుని మర్దిం చిన పురుషోత్తముని వీర రసోదంచితమైన ఆర్తాత్రాణ గాథలను గానం చేస్తూ తమ విన్నపాలను నివేదించినను, వినక ప్రొద్దుపొడుచుచుక్క ఉద యించువరకు నిద్రవీడని శ్రీదేవితో—కపట నిద్ర వీడి తమతో కలిసి జగన్మం గళాకారుని శ్రీకృష్ణుని స్తోత్రం జేయుమని పురుషకార స్వరూపిణి శ్రీదేవిని వేడుచున్నది.

**13. ఉంగళ్ :—** "నీదు పెరటి తోటబావి పూదీవియ మొక్కలలో———— శంఖచక్రముల సామిని పంకజనయనుని బాడగ"—

కలువలు చిన్నవోయి కెందమ్ములు వికసించి ఉషోదయమైన తణి కాషాయాంబరధారులు, తులసి మాలాలంకృతులునైన మునులు జగత్కా రణుడైన సర్వేశ్వరుని మేల్కొల్పుటకు చలి పూటనేతెంచిరి. స్వామిని నిదుర లేపుదునను వాగ్దాన మిచ్చిన శ్రీదేవియే నిదురించుట పాడిగాదు" అని ప్రార్థయ పడుతూ గానం జేసిన ప్రబోధగీతం.

**14. ఎల్లే :—** "ఏమబ్బా! లే జిలుకా! యింకను నిదురింతువటే———— పడివంచిన మాయలదొర పడిబాడుగఁ బలుకవటే"

ఆత్మ ప్రబోధాత్మక గీతం సంవాద రూపంతో సంకేతాత్మకంగా భాసించుచున్నది. శ్రీదేవి మేల్కొననందున ఆమె చేతి యందలి లేజిల్కను ప్రబోధించగా ఆచిలుక ఇదో వచ్చి తినీయుటల బిగ్గరగానఱచి అట్టడిచేయకు డనగా ఆ గోపికలు తాము అఱచు వారమా అని అడిగిరి. అంతట దిట్టలు మీరే దెప్పుచున్నారని పల్కింది. గొల్ల భామినులు గజాసురుని గూల్చిన యదుపతి లీలలను గానము చేయుమని వేడుకొనిరి. పురుషకార ప్రణుతి వ్యజ్యమానమైనది.

**15. నాయకనాయ్ :–** "నాయకుడై నిలిచిన శ్రీనందగోపు మంది రమును------చెలిమి నిలువలొ తలుపులు చిన్నగ దెఱవుము స్వామి"

సర్వేశ్వరుని పరివారం అందరు పురుషకార స్వరూపులని చాటుగీతం. తమకు భేరి నొసగుటకు మాట యిచ్చిన నాయకుడు కృష్ణుని సేవించి తరిం చుటకు పరిశుద్ధమైన మనస్సుతో వచ్చిన గోపకాంతులు, గద్దించక కవాటం తెఱచి స్వామి దర్శనం జేయుమని నందగోప మందిరం వాకిటనుండు కావ రిని ప్రార్థించిరి. శ్రీదేవి చక్రం, శంఖం, విశ్వక్సేనుడు, శేషుడు శ్రీమన్నా న్నారాయణుని పరివారమంతా పురుషకార స్వరూపులు భగవంతుని సన్ని ధిని జేర్చువారు. అందువల్ల ద్వారపాలకు నర్థించుచున్నారు. విష్ణుభక్తి ప్రపత్తి ఈ గీతంలో ధ్వనితమైంది.

**16. అంబరమే :-** "కొల్లలు పీతాంబరములె చల్లని పానీయమ్ములె.... ..................తో బుట్టువు నీవును బిరాన నిట్ట లేచిరావయ్యా"

నందగోపుని, యశోదను, బలరాముని నిద్ర నుండి మేల్కొనుడనియు నందగోపాలుని నిదురలేపి పూజలందుకొనుడని గోపికలు వారిని ప్రార్థించిరి పీతాంబరాలు, చల్లని పానీయాలు, రుచి వంటకాలను దానము చేయుచు గోపికలు హరివ్రత గీతాలు పాడిరి.

**17. ఉన్దు :-** "బంధుర గంధమదోద్ధత సింధుర బలవిక్రముడగు నంద గోపు కోడలి। యో నప్పిన్నా। రాచపడుచ।------వచ్చి ద్వారమును దెఱ వుము పచ్చని సిరి దొరసాని।"

నంద గోపుని కోడలు నప్పిన్నైను స్తోత్రం జేస్తూ ద్వారం తెఱవుమని వ్రజాంగనలు వేడి పాడిరి. శ్రీ భూ నీలలు శ్రీరంగేశుని సేవిస్తూ ఆశ్రితులకు సద్గతిని కలిగించు పురుషకార స్వరూపిణులని గానం జేయుట విష్ణుభక్తి పారమ్య లక్షణం. నప్పిన్న చిక్కని చక్కని సామిని చిక్కించుకొన్న దొర సాని. పతిని సేవించుటకు, శ్రీమన్నారాయణుని పావన చరితను పాడుటకు అనుజ్ఞనొసగుమని గోపికలు ఆమెను ప్రార్థించిరి.

**18.** కుత్తు :- "పుత్తడి సమ్మెల దివ్వెల గుత్తులు వెలుగెత్తిపోయ-----
నీ వగల నిదుర తెలియునులే। తగవు ధర్మ మిటులుండదు।"

శ్రియఃపతితో మధ్య వర్తిత్వం నెఱపి ఆశ్రితుల వ్రతం ఫలవంతం జేయుమని నప్పిన్నను శరణవేడి పాడిన గీతం.

భక్తుల హృదయాలలో నివసిస్తూ, నప్పిన్న యురస్థలి మీద మత్తుగా నిదురించే కన్నయ్యను నిదిరలేపి పెదవి వలుకుమని వ్రజాంగనలు మన సారా వేడుచున్నారు. అంతేగాక క్షణమైనను జోడుబాయని నప్పిన్న వగల నిదురమాని సహకరించి బోధించుమని వేడుకొనిరి.

**19.** ముప్పత్తు :- "ముప్పది ముక్కోటి వేల్పు ముఖ్యులకును ముందు నడచి ముప్పు భయము బాపిన కరియప్పా। వేలుపుగొప్పా।-----ముద్దుల పెనిమిటి నిపుడే సిద్ధ పరచు నీరాడగ సింగారపు నిదురలేపి"

ఈ గీతంలో దాస్య భక్తి అభివ్యక్తమైంది. ముప్పది ముక్కోటి వేల్పులకు ముప్పు భయం బాపి రాక్షస శత్రు మూకలను చెండాడిన వీరసింహ కిశోరం శ్రీకృష్ణుని ప్రాణేశుని మేల్కొల్పి స్నానమాడించుమని ముగ్ధమోహన సౌందర్యరాశి నీలాదేవిని వ్రజాంగనలు శరణువేడిరి.

**20.** ఏత్త :- "ఎత్తిన బంగరుటడ్లల కెక్కివచ్చు నురుగుపొంగు అంచుల బడి క్రిక్కి రాగనతి చిక్కని క్షీరధార---- జవ్వను లందరును గూడి నివ్వాళులు బట్టిబాడ।"

గొల్లపడుచులందరు నివాళులెత్తి జగజ్జ్యోతి గోపాలుని షడ్గుణైశ్వర సంప

త్రిని కొనియాడిరి. క్షీరధారలు కురిపించే ఆలమందలు గల గోవిందుని మేల్కొల్పుచు పాడిన గీతం.

**21. అంగణ్ :–** అందమ్ములు తొలికి పాలు నతి విశాల భూమండల —————పొగను కనులిరెండింటిని సగము విప్పి తిలకించిన మగువలమగు మావయిగల మిగులు శాపములు తొలగును."

కోరివచ్చిన మగువలపై కిృగంట దయావర్షం గురిపించి తరింప జేయుమని వేడుచున్న గీతం. భూమండల మందలి రారాజులందరు స్తోత్రం చేయుచుండగా సూర్యచంద్రులను నేత్రాలతో కటాక్షవీక్షణాలను ప్రసరింప జేస్తూ పాపాలను పటాపంచలు జేయుమని, భూభర్త సర్వేశ్వరుని గోపికలు ప్రార్థించిరి.

**22. మారి :-** "వానకారు నందు———— వచ్చిన కార్యము నరయగ్గ వలను పడదు కరుణించుచు" ఉగ్రసింహ రూపాన్ని శాంతింప జేసి, అఖిసె పూవెన్నె రూపంతో కరుణించి, సిరి బిగువుల రత్న సింహాసనంపై నధివ సించు ఓ హరీ! అని ప్రార్థిస్తూ గోపికలు తాము వచ్చిన పనిని నెరవేర్చు కొనుటకు స్వామిని శరణాగతి వేడిరి.

**23. అన్టిప్పు లగమ్ :–** "అల నాడీలోకపు పరిధులు గొలిచిన పురు షోత్తమ అడుగడుగున నీ చక్కని అడుగుదోయికి నివాళి————భేరిని గొని వచ్చిన మా ప్రేమకు కప్పుర నివాళి".

భగవంతుని ఆర్తత్రాణ పరాయణత ప్రేమమీర స్తుతింపబడింది. సర్వే శ్వరుని వీరచరితానికి నివాళులెత్తిన గీతం. లోకోద్ధరణం గావించిన వారికి లంకేశుని హతమార్చిని స్వామికి, శకటాసుర వత్సాసురులను తృణమటుల ధ్వంచిన స్వామికి, గోవర్ధన గిరిధారికి గోపకాంతులు ప్రేమమీద నివాళు లర్పించి, శ్రీహరి పాదసేవలొనర్చి తన్మయంతో స్తుతిస్తూ గానం జేసినారు.

**24. ఒరుత్తి :–** "ఒక తల్లికి బిడ్డడుగా నుదయించినదే రేయిం। కొక తల్లికి బిడ్డడుగా నొప్పిడాగిడాగి పెరుగ————వగ దొలంగి యరు సమ్మున బరవశించి పోపురితి"

దేవకి వసుదేవుల ముద్దు బిడ్డడై, నంద యశోదల పెంపుడు బిడ్డడై కంసుని మడయించిన కన్నయ్యను తమ మధుర ప్రణయ పరాభక్తిని స్వీకరించి వ్రతభేరిని ప్రసాదింపుమని వ్రజాంగనలు శ్రీకృష్ణుని వేడుచు పాడిరి.

25. మాలే :– "మరులురూపు గొన్నన్నా! మణివర్ణా! యోకనా——— వటపత్ర శయనా యధ్వర్యము నీదుండవలయు"

పెద్దలు జెప్పిన మార్గళి నోమునకు సర్వేశ్వరుని విశ్వవిశాలతను చాడెడు పెద్ద భేర్ని, మేలగు మంగళ దీపాలను, మేలగు కట్టు టెక్కాలను చాలినన్ని సంభారాలను సమకూర్చి ధనుర్మాస వ్రతాన్ని ఫలవంతం జేయుమని వ్రజాంగనలు వటపత్రశాయి శ్రీకృష్ణుని వేడుకొనిరి.

26. కూడారై :– "కూడని మొరకులు గెలిచెడి గుణములు గల గోవిందా ——— అందరము గూడి అరగింత మందము సింగార మొలకంజల చల్లగ" గోపికాంతుల ప్రణయ సింగారం అభివర్ణితమైంది. చెవి పువ్వులు, ముక్కెరలు, తల పువ్వులు, ఒడ్డాణములు మొదలగు ఆభరణములను అలంకరించుకొని, పట్టుపీతాంబరాలు ధరించిన కన్నె గోపికలు, కలమాన్నములు, పాయసములు, ఘృతావసాలను సర్వేశ్వరునకర్పణం జేసి అందరం గూడి అరగింతమని గోవిందుని ప్రార్థించిరి.

27. కరవైగళ్ :– "పసుల వెంటబడి పోవుచు బావురుమను కానకోన| అణిమర లేకెప్పుడు తిరుగుచు బ్రతికెడి వారము——— కన్నెల భేరి నొసంగుమి వన్నెల చిన్నలసామి"

తెలిసీ తెలియని మూర్ఖతచే వలచి పిలిచిన గొల్లభామలను, చెలిమి కలిమి బలిమి కోరివచ్చిన గోపికలను ఆగ్రహింపక అరమరలు లేక ఏలు కొమ్మని వన్నెల చిన్నెల సామి గోవిందుని మనసార వేడుకొనిరి.

28. శిత్తం శిఱు :– "తొలివేకువజామునననిను డొలుతొలుతగ బుద్ధిదీర సేవించుచు నీ బంగరు చిన్ని యడుగులకు నిత్తెము| జయపెట్టిడి మా

యుద్ధేశ్యము పట్టింపుగ వినుమీ———— ఏకాలమనక సేతుము పోకార్చ మితర కాంక్షలు.

ఈ గీతంలో ఆత్మనివేదన అంచులు దాటిమధురభక్తి రసావిష్కృతిని జేసింది ఏడేడు తరాలకు కూడ శ్రీకృష్ణుని పాద సేవలు చేసే భాగ్యం ఉండాలని సర్వస్వం ఆ శ్రియఃపతికి కైంకర్యంగా అర్పణజేసి గొల్ల కులంలో బుట్టిన గోపకాంతలు ధనుర్మాస దీక్ష బూని శ్రీకృష్ణుని శరణాగతి వేడిరి. వ్రజాంగనలు సేవాదీక్షా ఫలంగా జీవన్ముక్తిని ప్రసాదించురుని ముకుందుని చరణారవిందులను సేవించి అనుజ్ఞబడసిరి.

## 29. వంగక్కడల్ :- "నౌకల రాకల పోకలు నలువైపుల సాగిపోవు ..................కరుణ వడసి సుఖియింతురు కళ్యాణముఁ బ్రాపింతురు హరిని గూర్చి నోమునోము అపురూపపు మా నోము"

ఈ గీతంలో శ్రీవ్రతగీతి ఫలం వివరింపబడింది. విష్ణుచిత్తుని (పెరియాళ్వారు) పుత్రిక శ్రీగోదాదేవి ధనుర్మాస వ్రతసిద్ధిని పొంది సర్వేశ్వరుడు మాధవుని కరుణతో భేరినిగొన్న వార్త విని విల్లు పుత్తూరు నందు వేడుకలు జరుపుకొనిరి. తమిళమున శ్రీగోదాదేవి రచించిన ముప్పది పాశురాలను భక్తితో మార్గశి దీక్షతో దినము అనుసంధించినచో చతుర్భుజుడు శ్రియఃపతి కరుణబడసి తరింతురు. లోకము సమస్తం సుఖించును. శ్రీవ్రతగీతి కావ్య ఫలం సద్గతి ప్రాప్తిని, అనంత శుభఫలావాప్తిని కలిగిస్తుందని కవయిత్రి ఆశసంగా ఆచార్యులవారు మంగళానుశాసనము గావించారు.

## నవవిధ భక్తి ప్రబోధకావ్యం

వ్రజాంగనల మధురభక్తి శ్రీగోదాదేవి ఆత్మ నివేదన క్రమంగా నవ విధభక్తి మార్గంలో అంతర్భవిస్తుంది. జగత్కారణుడు వాసుదేవ తత్వాన్ని శ్రీరంగేశుని అర్చారూపంలో పదిలపరచుకొని, అనుష్టించి, హరిని గూర్చి నోమునోచి, ముకుందుని పాదసన్నిధిలో సర్వస్వం కైంకర్యంగా సమర్పించి, కైవల్యాన్ని పొందిరి. కావ్యంలో వ్రజాంగనలు సర్వేశ్వరుని

ధర్మ వీర చరితం పలుమార్లు స్మరించటం వల్ల స్మరణ భక్తి పరిప్లావిత మైంది. తెలుగుభాష జగినందుకొంది.

1. శశి సూర్యులు పొడుచు మొగమువాడు 6వ పేజి
2. పాలకడలి కోడెనాగు పానుపమరి పవళించిన పచ్చని దొర 7వ పేజి
3. కొండెత్తు ఔరిగి జగము గొలిచిన యుత్తముడు 8వ పేజి
4. కాల చక్రమునకు మూల కారణుడు-10వ పేజి
5. పద్మనాభుడు-చక్రిపాణి
6. దుష్టుల మల్లుర డుల్చిన దొరల దొర-13వ పేజి
7. పులుగు పేరియసుర నోరు సెలగినయ్య-18వ పేజి
8. తుంటరి కంసుని నిల్వున తూటాడినయయ్యదండి-18వ పేజి
9. గోపాలుడు - జగజ్జోతి-26వ పుట
10. కొండను గొడుగు నెత్తినవాడు-29వ పేజి
11. శకటాసురుదన్నిన పొగడిత-29వ పేజి
12. వత్సాసురుడు తృణమటు తల వచ్చిన చిమ్మువడి 29వ పేజి
13. మధుర ప్రణయమూర్తి-మంగళస్ఫూర్తి - 30వ పేజి
14. వటపత్రశయనుడు - 31వ పేజి
15. కేశవుడు, మాధవుడు, శౌరి, చతుర్భుజుడు, కమలాపతి-35వ పేజి

సర్వేశ్వరుని రూపాలు పరవ్యూహ అంతర్యామిత్వాలను స్మరిస్తూ శ్రీమన్నారాయణుని లీలా విభూతి విభవ సంపత్తిని శ్లాఘిస్తూ, పలు అవతారాలు అర్చారూపంతో మనసార స్మరించి, ధ్యానించి, నమస్కరించి, కీర్తించి, భగవత్పాదసేవనం గావించి శ్రీగోదాదేవి శ్రీరంగేశుని ధనుర్మాస దీక్ష బూని వ్రజాంగనా మధుర భక్తితో అరాధించింది. భగవంతునితో కలసి మెలసి ప్రేమానురాగాల సంఖ్యతో జీవించే సౌభాగ్యం పొందింది. వ్రజాంగనల ఆత్మలు పరమాత్మునితో అనుసంధించాయి.

---

(1) శ్రీవతగీతి-కావ్యంలో-1- (6) పే-2 (7) 3 [8] పేజి 4 [10] పే 6-13, 7-8, 8-16, 9-26వ పుట, 10, 11-12లు-29వ పుట, 13-30, 14-31, 15-35

"పసులవెంట బడి బోవుచు బావురు మనుకానకోన అరమర లేకెల్లప్పుడు తిరుగుచు బ్రతికెడి వారము అసి నుసి దెలియని గొల్లలమైన మాకులమున నిన్ను అల్లరి బిడ్డగ బడసిన నదురుష్టముల వారము కొఱత యొకటి కాన రాని గోవిందా! నీతోడుత నెఱపిన యీ చుట్టరికము నీకు మాకునేనాటికి త్రోసి వేయమాత్రము పాసిపోవునది గాదిది"1

అని ఆత్మకు పరమాత్మకు గల బంధం విశిష్టంగా అనుసంధింప బడింది.

పరమాత్ముడు సృష్టి అనంతరం చరాచరములకు అంతర్యామిగను, ప్రళయకాలంలో వానితో ఏకీభూతుడై ఉంటాడు. కావున ఆత్మ పరమాత్మల సంబంధం అనాది సిద్ధం. ఈ అనుస్యూతమైన ఆత్మ పరమాత్మల అవినా భావ సంబంధం నవవిధమని శ్రీవైష్ణవ భక్తి తత్త్వం పేర్కొంది. అవి

1. జన్యజనక, 2. రక్ష్యరక్షక, 3. శేషశేషి, 4. భార్యాభర్తృ, 5. జ్ఞాతృ జ్ఞేయ, 6. స్వస్వామి, 7. ఆధార ఆధేయ, 8. శరీర శరీరి, భోక్తృభోగ్య సంబంధములు2 వీన్నిలో భార్యాభర్తృ సంబంధం ప్రపత్తికి శరణాగతికి అనువైంది. భగద్వైభ భగశ్రవణాను రాగం, భగవద్వైభవ కథనానురాగం భగవన్నామ స్మరణం, భగవత్పార సేవనం షోడశోపచారులచే భగవదారా ధనం, సకల విధ సేవలొనర్చి నమస్కరించడం, స్నేహ మొనర్చి గోపి కల వలె శ్రీకృష్ణునకు శ్రీరంగేశునకు ఆత్మ సమర్పణం జేయడం శ్రీగోదాదేవి ధనుర్మాస దీక్షలో భక్తి క్రమ వికాసం పొంది సమస్తాన్ని భగవత్కైంకర్యంగా సమర్పించి శ్రీరంగేశునిలో ఐక్యం పొందింది. ప్రపత్తి భక్తితో ఆత్మాను సంధానం జేసికొన్న గోపికలతో కలిసి శ్రీగోదాదేవి శ్రీరంగేశుని ఆత్మ సమర్పణం జేసికొన్న భక్తి నవవిధ భక్తి మార్గంగా భాసిల్లింది. శ్రీఆండాళుతాయారు శ్రీరంగేశుని సతియై పురుషకార స్వరూపిణియై మధుర భక్తితో మార్గళి దీక్షా పూజలందుకొంటూ భక్తులను తరింపజేయుచున్నది.

---

1. శ్రవ్రతగీతి-38వ పుట.
2. పితా చరక్షక శ్శేషీ భర్తాజ్ఞేయో రమాపతిః
స్వామ్యాధారో మమాత్మాచ భోక్తాచాద్యమనూదితః అభాణక శ్లోకం

## కావ్యంలో పల్లీయ వర్ణనం

కావ్యానువాదం మూల తత్త్వాన్ని భాసింపజేస్తూ కమ్మని తెలుగు నుడికారంతో, కపర్షిపపల్కులు కలకండవంటి తెలుగు పలుబళ్ళతో ఒప్పింది. ఈ కావ్యంలో ఆధ్యాత్మిక తాత్త్విక వైష్ణవ భక్తి చింతనంతో బాటు పల్లీయ వర్ణనం నిసర్గరమణీయంగా వెలార్చబడింది. నెలకు మూడు వానలు గురిసి పొంగారెడి వరిచేలు, పొలాల నీటిలో తిరుగాడెడి వీలులేక బెడసి ఎగయు పడు చేపల మిడిమిడిసి పాట్లు, విచ్చిన కలువ బాలల సోయగాలు, అఙ్ఞువంచి గాలి తడలను యేలలూగునట్టి కంకి గొలుసుల ప్రకృతి సన్నివేశాలు, కడవల కొలది పాలనిచ్చు గంగిగోవులు, కారు మబ్బుల పాంచజన్య గర్జనలు, శరధారావర్షాలు, పులుగు జతల కలరవాలు, పాత్రిభాత ప్రబోధ గీతికలు, కోడిపుంజుల నిక్కిరాగాలు, నల్ల పిచ్చుకల కీచుకీచు కేరింతల నాట్య కలకలాలు, చల్లగిలకొట్టు చెల్లభామల కవ్వపు మువ్వపు గాజుల ఘలంఘలల మ్రోతలు, పూరిమేయు వరిపొలాలకు గదలు గేదెల కదపులు, లేగటాల లేపి నురుగుపాలు పిదుకు గోపాలురు, కలువ బాలల మూతి ముడుపులు, కెందమ్మిలు మొగ్గ మోము విప్పునట్టి ఉషోదయాలు, క్షీరధారలు కురిపించే లేగటాలు, కానుల పేర్లు బంగారు గాజులు, దండెగడెమ్మిలు, చెవిపూవులు, ముక్కెఱలు, ఒడ్డాణం, అందియలు, పావుడాలు మొదలగు అంశాలు తెలుగు నుడికాలపు సొంపుతో కావ్యంలోని మధుర భక్తికి ఉపస్కారకములుగా అభివర్ణితమైనది. పల్లీయ చిత్రిణం కావ్యంలో సాక్షాత్కరించింది.



# శ్రీఆదివరాహస్వామి అష్టోత్తర శత పద్యకృతి

## రెండవ అధ్యాయము

### తెలుగులో శతక ప్రశస్తి

ఆంధ్ర వాఙ్మయంలో శతకం ఒక దివ్యమైన సాహితీ ప్రక్రియ "శతకాలు భగవన్నుతి రూపకములైన ముక్తక కావ్యములు. ఇందు వంద పద్యములుండును."1 ప్రతిపద్యము చివర సమానమైన"మకుటముంటుంది" భగవన్నామ సంకీర్తనం, లీలా విభూతి వర్ణనం, ఆముష్మిక చింతనం, క్షుభితక్షమనోద్దగ్ధ బాధలను ఆర్తిని భగవంతునకు నివేదించడం, నీతి బోధతో పాటు సామాజిక స్పృహ గల రచనలు శతకంలో ప్రతిబింబిస్తాయి. సాధనకు, ఆరాధనకు, వేదనకు, నివేదనకు శతకం నిలయమై ఉంటుంది. ఇందు కవి ఆలంబనంగా భక్తి, పశ్చాత్తాపం, ఆత్మోద్ధరణాయత్నం, లోకంలోని సుఖఃదుఖాలు ఆత్మాశ్రయ పద్ధతిలో చిత్రితమౌతాయి. ఇందు వస్తు ప్రాధాన్యం లేక తత్కాలీన స్థితిగతులు మిక్కిలి వైవిధ్యంతో అభివర్ణింపబడుతాయి పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకం తెలుగులో మొదటి శతకం. సామాన్యంగా శతకాలు శైవవైష్ణవ భక్తి తత్వాలకు నిలయాలై ఉంటాయి. శ్రీకాళహస్తీశ్వర, సర్వేశ్వర, కృష్ణ దాశరథి నారసింహ సింహాద్రి మొదలైన శతకాలు భక్తి రసావేశ పూరితాలైనవి. సుమతి, భాస్కర వంటి కొన్ని శతకాలు సమాజ సంస్కరణను అభిలషించి రచింపబడినాయి.

---

1 విజ్ఞాపన సర్వస్వము VI సంపుటము – 386 పుట
దివాకర్ల వేంకటావధాని

శ్రీ ఆదివరాహస్వామి అష్టోత్తర శత పద్యకృతి "ఆదివరాహ వేశ ప్రణతార్తి వినాశ। కమాన్ పురేశ్వరా। అను మకుటంతో 08 ఉత్పలమాలలతో కూడి శతక లక్షణంతో రచింపబడింది. దకారైక ప్రాసతో పంచపాది ఉత్పలమాలలు గల ఈ పద్యకృతి సర్వేశ్వరునికి సమర్చనంగా సమర్పితమైంది. సంప్రదాయ నిరతితో కమాన్‌పురం పుణ్యక్షేత్రంలోని శ్రీఆదివరాహస్వామి అర్చారూపం భగవద్విభవ రూపావతారాలతో సంస్తుతి జేయబడింది. భగవంతుని భవతార కోపాయ హేతువుగా దర్శించి శరణాగతి ప్రపత్తి భక్తితో ఆర్తిని ఆవేదనను సర్వేశ్వరునకు నివేదించడమైంది.

"నాదు దరిద్ర దుస్థితిని నాథ। హరించు మటంచు గాదు కాం
తాదిక సౌఖ్య సంపదల కబ్బులు సాచెడి బుద్ధిగాదురా
జ్యాది వరాధి కారములయాశ మనమ్మున నుండికాదు నీ
పాదములంటి వేడుటలు ప్రస్తుత పీడితలోక రక్షకే"।

కావ్యంలో 97వ పద్యం

సమాజంలోని పీడిత వర్గాన్ని ఉద్ధరించాలనే తపన సమ సమాజ స్థాపనం, సంఘ సంస్కరణం లక్ష్యాలతో భక్తి పారమార్థికభావం ఆవేదనావేశంతో తేనెలూరు పలుకుబళ్ళతో నిరుపేదల పాట్లను వారి దైన్యస్థితిని అభివర్ణిస్తూ సమాజశ్రేయం ఆశించి శ్రీఆదివరాహస్వామి అష్టోత్తర పద్యశతకృతిని ఆచార్యులవారు ప్రబోధాత్మకంగా రచించారు.

## 2 శ్రీఆదివరాహస్వామి అర్చారూపం

శ్రీతిరుమల క్షేత్రంలోను, కమాన్‌పురంలోను శ్రీమన్నారాయణుడు శ్రీ ఆదివరాహస్వామి అర్చారూపంతో వెలసి భక్తులను తరింప జేస్తున్నాడు. గౌతమి నదీతటసీమ కమాన్ పురంలో వెలసిన శ్రీఆదివరాహస్వామి వారి క్షేత్రం గొప్ప పుణ్యక్షేత్రం. శ్రీమన్నారాయణుడు "శ్రీదొరసానిపై అలిగి వచ్చి భూసతీ హృదాహ్లాద కరాంగసంగ వివశాత్మతో బిడ్డలను రక్షించు కొనుటకు దివినుండి భువికి వచ్చి ఇచట వెలసినాడు." 1వ పద్యం) ఆర్తజనుల మొఱ విని సద్గతి జూపుటకు వేంచేసి భక్తులను బ్రోచుచున్నాడు. స్వామి

వారికిచట ఆలయంగాని, అపూర్వమైన అచ్ఛాదనంగాని నిర్మింపబడలేదు. "నాప్రజలు నిరుపేదలు నిలువ బెత్తెడు నీడలేనివారు. నాకు నీడ పందిరి మాత్రమేచాలు. నిరుపేదలకు లేని ఆలయం నాకక్కరలేదు" (20వ పద్యం) అని ఒక గ్రామ ముఖ్యునికి స్వప్నమున సాక్షాత్కరించి స్వామివారు అదేశించటం వల్ల నేటికిని స్వామివారికి ఆలయం లేదు. "దీనజనోద్ధరణంకోసం శ్రియఃపతి నాలుగైదు దొనరాళ్ళు అడ్డంగా నున్న నడిగండ శిలపై భూదేవిని పొంగుటురమున పువు బంతిగ బెత్తియాడు ఆదివరాహస్వామివారు అర్చారూపంతో వెలసియున్నారు (21వ పద్యం) స్వామివారికి సమీపంలోని కొడిసెపాల నీడవృక్షం ఆదిశేషుడుగాగరుడాళ్వార్లవలె సేవిస్తూఉంది. స్వామివారి అజ్ఞతో శ్రీనివాస భక్తుడు నిర్మింపజేసిన అర్ధచంద్రాకార వలయంతో నున్న గచ్చు గద్దెలు భక్తులు ఆసీనులగుటకు అమరియున్నాయి. సర్వాంతర్యామి ఐన స్వామివారికి ఆకాశమే శిఖరం. అదిశేషుడే సౌధం. రోదసి తారకలే మణి దీపికలు. విశ్వంభరునికి కృత్రిమాచ్ఛాదనమైన ఆలయం అవసరం లేదు. (18వ పద్యం) చేతులు చాచి యున్నా స్వామివారి పార్శ్వమునందు ఆదిలక్ష్మి యుండిన బాగుండునని తలచిన కవి భక్తిపారవశ్యంతో - "మీకును మాకును నొకహద్దుగ, కనుచాటుగ నొక దేవళముండుట మేలనియు,ఆదిలక్ష్మి కొఱకైనను కుటీరము చిన్నదొకటించు కొనుట న్యాయమని[1] ఆలయ నిర్మాణానికి ఆజ్ఞ ప్రసాదించమని స్వామివారిని వేడుకొంటూ భగవంతుని లీలా విభూతిని ప్రస్తుతించారు. ఆచ్ఛాదనాన్ని అంగీకరించని ప్రత్యక్ష దైవం శ్రీఆదివరాహస్వామి వారి అర్చారూపాన్ని సంసేవిస్తూ భక్తులు తరిస్తున్నారు.

## విభవరూప వర్ణనం

భగవంతుని పర, వ్యూహ, విభవ, సర్వాంతర్యామి, అర్చారూపాల్లో "విభవరూపం" భగవంతుని పలు అవతారాల రూపంలో సంసేవింపబడు

---

1 "లేదలిరాకు మొగ్గల వలీలత శ్రీదొరసానిలేక నీ
కేదియు నున్న నున్న ఫలమేమిర। యిల్లని నొక్కడున్నాడురా
దా। దొరసాని యామె కొరకైన కుటీరమ్ము చిన్నదుంచుకో
రాద। యిదేమి జిద్దు। సిరిరాణియె సంపద నీకు మాకుడున్"
21వ పద్యం

తుంది. షడ్గుణైశ్వర్య సంపత్తి గల భగవంతుడు శిష్ట రక్షణ కొఱకు దుష్ట శిక్షణ జేసి ధర్మాన్ని స్థాపించడానికి ఆయా కాలాలకు అనుగుణంగా "స్వప్రకృతికి అధిష్టించి[1] స్వేచ్ఛగా స్వశక్తిచే జన్మాలను కలిగించుకొంటాడు."[2] ఇట్టివే భగవంతుని అవతారాలు. అవతారాలందు. పరత్వశక్తి పరిపూర్ణంగా ఉండి జగద్రక్షణ గావిస్తుంది.[3] శతకం ప్రారంభంలో భగవత్సంకల్పాలైన దశావతారాలు వరుసగా 10 పద్యాల్లో అభివర్ణింపబడినాలు. ఈ భగవన్నుతిలో భగవత్తత్త్వ నిరూపణం భగవల్లీలావిభూతితో పాటు సర్వేశ్వరుని ధర్మ వీరోచితమైన ధర్మ ప్రతిష్ఠాపన కార్య నిర్వహణం ప్రస్తుతింపబడింది.

"అంబుధిడాగిన సోమకాసురుని బూది మొనర్చి వేదభారతిని ప్రోది మొనర్చిన మీనమూర్తి,1 పాల సముద్ర మథనంలో మంధరాద్రిని దృఢ పృష్ఠ మధ్యమున నిల్పి అమృతాన్ని దేవతలకు ప్రసాదించిన కమఠమూర్తి 2వ పద్యం, మదోగ్రహిరణ్యుని దుంచి మేదిని ఉద్ధరించిన ఆది వరాహమూర్తి (3వ పద్యం) భక్త ప్రహ్లాదుని బ్రోచుటకు దుష్ట హిరణ్య కశిపు జీల్చిన నృసింహమూర్తి (4వ పద్యం) బలిని పాతాళమునకు ద్రొక్కి బ్రహ్మాండం నిండిన త్రివిక్రమూర్తిని(5వ పద్యం) గండ్ర గొడ్డంట హైయజుల ముయ్యేడు మార్లు నరికిన పరశురామమూర్తి (6వ పద్యం) దశాస్య నిశాచరేంద్రుని గూల్చి ధరణిగాచిన శ్రీరామమూర్తి, (7వ పద్యం) కంసు నృశంసును మర్ధించిన యదుసింహ కిశోరం గీతాచార్యుడు శ్రీకృష్ణుడు. (8వ పద్యం) అహింసామూర్తి బుద్ధ భగవానుడు, (9వ పద్యం) అధర్మపు కాలినడ్డుకొను కల్క్యవతారమూర్తి,(10వ పద్యం) ఇట్టి దశావతారమూర్తులు దుర్విషయ రోగతతిని తెగటార్చుటకు. దశేంద్రియాసుర ప్రమాదము

---

1 ప్రకృతిం స్వామధిష్టాయ-సంభవామ్యాత్మమాయయా
-భగవద్గీత _ అధ్యాయం _ 4 శ్లోక _ 6

2 "ఇచ్చా గృహీతాభిమతోరుదేహః"
-విష్ణుపురాణము _ అంశము 6వ అధ్యాయ-5_శ్లోక-84

3 పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే _ఈశావాస్యోపనిషత్తు శాంతి పాఠః

దుష్ఠించుటకు, భవాసుర జాతిని గూల్చుటకు, శరణు వేడబడినారు. భక్తులు రక్షింపబడి తరించడానికి భగవంతుని విభవావతారములు ప్రవృత్తితో శతకంలో ప్రస్తుతించ బడినాయి.

## భక్తిరస నిర్వహణం

"అలంకార శాస్త్రవేత్తలు దేవాది విషయికమైన రతిని భావంగా పేర్కొన్ననూ, పరమాత్మ స్వరూపుడగు శ్రీకృష్ణుని రతి పరమానంద సంధాయకమగును. కాంతాది విషయకములగు ఏ రసములందును భగవద్రతియందు వలె పూర్ణానందము లభించదు. మిణుగురు పురుగుల కంటె సూర్యకాంతి బలవత్తరమైనట్లు అనుభవ సిద్ధమైన, రస్యమానమైన భక్తిరసము అనుభవ మాత్రములైన శృంగారాది రసములకన్న శ్రేష్టతమమైనది." అని భక్తి రసం నవరసాలందు శ్రేష్ఠమైనదని నిరూపించబడింది.1

భక్తిరసానికి ఆలంబన విభావం భగవంతుడు భగవదాకార చిత్తవృత్తి స్థాయీ భావం. అదియే భగవద్రతి. తత్కాల జనితాలైన నేత్రాది వికారము లనుభవాలు, నిర్వేదశంకాహర్షాదులు వ్యభిచారులు భగవదాకార చిత్తవృత్తి రూపమైన భగవద్రతి విభావాదులచే పోషింపబడి భక్తిరసం నిష్పన్నమౌతుంది.

కావ్యంలో శ్రీఆదివరాహస్వామి అర్చారూపం ఆలంబన విభావం. భగవదాకార రూపగుణ స్తోత్రం అనుభావాదులు. భగవంతుని శిష్టరక్షణం దుష్టశిక్షణం కొఱకు ఆది దేవుడెత్తిన రూపావతార విభవరూప వర్ణనం మత్స్యకూర్మ వరాహ నృసింహ వామన శ్రీరామాది దశావతార చరితాలను కవి స్తుతించుటతో చిత్తం స్థాయికి చేరి భగవంతుని రూపగుణ షడ్గుణైశ్వర్యాదులందు అనన్యాగ్రహమైన ప్రేమ జనించి సర్వేశ్వరుని అనంత కళ్యాణగుణలందు అనురక్తిభావం అంకురించింది.

"నీదయ కోసమై భువన నేతలు మేశ చతుర్ముఖాదులు లింద్రాదులు

---

1 మధుసూదన సరస్వతి-భగవద్భక్తిరసాయనము-శ్లో. 74 నుండి 79 శ్లో

బద్ధహస్తులయి యాదలవంచి సహస్రనామ పూజాదులు సేతురట్టిదొరవు. (కావ్యంలో 32వ పద్యం) బ్రహ్మాది దేవతలకు అధిష్ఠాత శ్రీమన్నారాయణు నందు విశిష్టమైన విశ్వాసం ఎనలేని ప్రేమ స్థిరపడింది.

"నీదుఃపదాల సన్నిధిని నిల్చి యనన్య మనస్కతన్ భవన్
గాథల పాడియాడుచును గద్గదకంఠము జీరవోవ స
మ్మోదభరాశ్రు సంతతులు బుగ్గలపైబడి ధారగట్టనా
పాద శిరమ్ము మేను గఱపాఱగ నిల్చుట లెన్నడోగదా"!

భగవద్విషయాలను స్మరించి గానం జేయుటం వల్ల గాద్గద్యం రోమాంచం అశ్రుపాతాది సాత్త్వికభావాలతో చిత్తం భగవదాత్తమైంది. పిదప "హృదంబోధిని డాగు కుత్సితకుబుద్ధి నిశాచరు బట్టి దుంచవే, మాదు దశేంద్రియాసుర ప్రమాదము ద్రుంచవే మాదు దుర్విషయ రోగగతిన్ దెగ టార్చవే" అని హృదయంలోని ఆర్తినిఅవేదనతో భగవంతుని మ్రోల నివే దించినది.సమస్త భూములు నీసువిహార సీమలే, నీ బోధలు విశ్వమంతటను మ్రోతలు మ్రోగెను విశ్వగీతలై నీదగు పుట్టు పూర్వోత్తములు నిండుగ జెప్పినవారు లేరు" అని శ్రీమన్నారాయణుని జగత్కారణత్వాన్ని విశ్వం ఉపాయ స్వరూప జ్ఞానంతోబరత్వాన్ని తెలిసికొనుట జరిగింది.

"ఏదురాత్మకేను యఘమీదగ చక్కటి మార్గమేదియేన్
మేదిని నున్ననది నిల్వన గ్రాగి తపించుటొక్కటే
సాధు నుసంగతిన మసలి త్వచ్చరణాగతుడౌట యొక్కటే
ఈ దినములందు మార్గములనేకములందున మిన్న యుద్ధియే"

(36వ పద్యం)

భగవత్సేవ్యలను సేవించి భవసాగర మీదడానికి తరుణోపాయమని కృపావిశిష్టుడైన సర్వేశ్వరుడొక్కడే సద్గతికి దిక్కు అన్ని, మోక్ష ప్రదాతయని దృఢ విశ్వాసంతో ప్రేమ స్వరూపుడు స్వామి చరణారవిందాలకు తన స్వరూపాన్ని కైంకర్యం చేయడమైనది. ఈ విధంగా భగవంతుమలంబ నంగా భక్తుని హృదయం గ్లాని నిర్వేదాది సంచారీ భావాలతో హర్షపులక

సాత్త్వికాదుల సంయోగంతో చిత్తద్రుతి కలిగి భగవద్రతి స్థాయిని పొంది రస నిష్పన్నమైంది.

"నీదు పదారవిందముల నీడన దప్ప జగత్పితామహేం
ద్రాదుల దాచికోదగిన యేయొక ఠేవును లేదులేదు"

అని ఆత్మ పరమాత్మకు అంకితమైంది. (42వ పద్యం) అర్చామూర్తి శ్రీ ఆదివరాహస్వామి పాదపద్మాలందు పారవశ్యంతో మనస్సు సంలగ్నమై అద్వైతసిద్ధిని పొంది విశిష్టమైన భక్తిరసం రసహృదయములచే అనుభూయమాన మౌతుంది

## సంఘ సంస్కారణం

సాహిత్యానికి సంఘానికి సన్నిహిత సంబంధం ఉంటుంది. సాహితస్యభావః సాహిత్యమ్" సాహిత్య జగత్తు వైశాల్య పరిధుల నెఱింగిన సత్కవి సంఘ పరిస్థితులను అవగతం జేసికొని, దానిని సంస్కరించి సన్మార్గానికి నడిపించడానికి ప్రయత్నిస్తాడు సంఘ క్షేమం కోరితే విశ్వశ్రేయం కాంక్షించినట్లే ఔతుంది.

భారతదేశం అనేక దేశాల ఏలుబడికిలోనై బహుళజాతి సంస్కృతులను జీర్ణించుకొన్నట్టిది, భిన్నత్వంలో ఏకత్వం సాధింపబడినను, సమాజం దురాచారాలు, మూఢ విశ్వాసాలు, అరాచకాలకు తావలమగుటవల్ల సంస్కరణం అవశ్యకమైంది. భూతభవిష్యద్వర్తమానాలకు కవి ప్రతినిధి. కావున సమాజాన్ని సంస్కరించే ఉద్దేశం కల్గి ఉండటం సహజం. ఆచార్యులు సమకాలీన సమాజంలోని స్థితి గతులను చూపి ప్రబోధం జేశారు. ఏ దెస జూపిచి వచ్చి మోసమే నరేశ్వరిగా నిరంకుశత్వం నెరపుచున్నది. గుర్తింపు లేదు సూటిగా పొదగు కాలం కాదు. ప్రతి వ్యక్తి నేనే దండి మొనగాడనని దంభపుకూతలు కూయువాడే, జూదరులకు అసత్యవాదులకే కాలమయ్యింది. అది రావణ రాజ్యమో రామరాజ్యమో అనునట్లు అరాచకం ప్రబలింది. మానవుడో నరుడు బ్రహ్మనేని లక్ష్యపెట్టక మింటినాడు ప్రవృత్తిగలవాడైనాడు. సాధుత చచ్చిపోయింది. అపసవ్య వర్తనము హెచ్చిపోయింది. స[illegible]

సనాలు ఎల్లెడల వ్యాపించినాయి. లంచగొండితనం ప్రబలి, అంటువ్యాధిలా పిన్న నుండి పెద్దవరకు ప్రాకింది. ధరలు ఆకాశాన్నంటాయి. మద్యపానం, స్త్రీ పరాభవం, బాల్య వివాహాలు. బాల్యసంతులు, మారణాస్త్రాలు, మారణ హోమం, జనాభా పెరుగుదల మొదలగుసమస్యలుఎత్తిచూపబడి,సమాజాన్ని పట్టి పీడించు దుర్మార్గుల దురాచారాలను నిరసించి నిర్మూలించాలని కర్తవ్య ప్రబోధం జేయబడించి. (44 నుండి 49 పద్యాలు) పేద మరింత పేద యౌచు కుబేరుడు నంతకు కుబేరుడౌట తిరస్కరింపబడి పైసకు సలాము సేయు గులాములను గర్హించుట జరిగింది. బడుగు ప్రజలు గోదల వంటి వారు. వయివారి చేతిలోని కీలుబొమ్మలు. వారిలో అంతర్లీనంగా ఉన్న క్షుధార్తి క్షుధాగ్నిగోళాలు విప్లవించకముందే ధనమదాంధులు సమతా భావంతో సహాయ సంపత్తిని ఇవ్వనిచో భావిపరిణామాలను చవి చూడవలసి వస్తుందని హెచ్చరిక జేయబడింది. (62వ పద్యం)

సభ్య సమాజంలో స్త్రీ శీల సంరక్షణ లేకుండా పోయింది.

"వీధికి వెళ్ళిన యట్టి యలివేణి శుభమ్ముగ నిల్లు జేరుటే
యో దొర! పెద్ద గండమయి యొప్పుదినాలివి పట్టణాలలోన్
ఏదె సముచ్చులె! సతులకెందును రక్షణ సున్న శ్రీహరీ!
సాధుల పుణ్యవేశముల చాటున మేల్ జవరాండ్ర వేటలున్
(49వ పద్యం)

స్త్రీని ఆట బొమ్మగా నర్తింపజేసే దురాచారం, జవరాండ్ర వేటజేయు పెద్దరికపు ముసుగులను పటాపంచలు చేసి సమాజానికి సవాలుగా నిల్చిన ఈ పాశవికతను ఛేదించాల్సిన అవసరం నొక్కి చెప్పబడింది.

"పాపం పెరిగి భూమి ప్రకంపమాన మౌతుంది. ఓ దామోదరా! జనాభ! యెటులో మయింత జనాభ నీదుటల్"అని నేలయీనినట్లున్న జనాభ పెరుగుదల సమస్య భూమికి భారమగుటయే గాక కరువు కాటకాలకు కారణ మౌతుందని ప్రతిభారతీయుని ప్రబోధించుట జరిగింది. ఇట్లే ఉన్మాదాన్ని పెంచే మాదక ద్రవ్య సేవనం కూడదని ప్రకటించబడింది. "నాదుదేశం, నాదుజాతి, నాదుభాష అను జాతీయాహంకారం వర్ధిల్లాలని ఆశింపబడింది.

విశ్వాన్ని, విశ్వాంతరాళాల్ని "దిగమ్రింగ నాచికొని హొంచెడివేల మారణా స్త్రములు రోదసి మాడిమంటలుగ లోకము భగ్గున మండి పోవునా" అను ఆవేదనతో అణ్వాస్త్రాలను సదుపయోగమునకుపయోగించాలన్న ఉన్నతా శయం ప్రతిపాదితమైంది.

## నీతి ప్రబోధం

సాధనలేని శక్తి, బుధసన్నుతిసేయని వాక్ప్రసక్తి, ఆరాధనలేనిభక్తి అనురాగములేని రతి, ప్రయుక్తి, సంపాదనలేని వ్యక్తి, జనమాన్యతలేని భలోక్తి, మానసాహ్లాదములేని భుక్తి, గృహస్తుని విరక్తి, వ్యర్థములని ప్రబోధించబడింది. వేదములురాని బ్రహ్మణము, వేశము చాలని నాట్యవిద్య, సన్నాదం లేని గానం, నవ్యతలేని కవిత్వధార, సరసగాబల్కని గొంతు, స్వాదువుగాని కవి వచస్సు నిష్ప్రయోజనం, సభ్యతనేర్పని పెంపకం, ఉత్పాదన లేని సాగుబాటు, పరిపాలన చక్కగాలేని పెత్తనం పనికిమాలినవి. కళలుకళల కొఱకు కాక సమాజ వికాసానికి దోహదపడే విధంగా ఉండాలని సాహిత్య ప్రయోజనం చాటబడింది.

## తత్త్వ బోధ

"ఏదినమే ముహూర్తమునకిచ్చట నుండి ప్రయాణ భేరియో
మా దినచర్య కెన్నడు సమాప్తికి శాశ్వత శాంతి పాఠమో
అదిన మా ముహూర్తమున కిన్ని పనుల్ నెరవేరునొ ప్రభూ(88 పద్యం)

మానవులు శరీరమున్నంతవరకు భగవదాజ్ఞా విహితములైన కర్మలను ఆచరించి తీరవలెను. సంసార చక్రంలో సంచితములు, ఆగామి కర్మలు ప్రారబ్ధములను కర్మలుంటాయి. పూర్వ జన్మల నుండి అనుభవింపక ప్రస్తుత జన్మకు సంక్రమించు పాపపుణ్యాలు సంచితకర్మలు, ప్రకృతి వశమున తెలియజేయునవి ఆగామి కర్మలు ఇక ఏ కర్మతో ఈ శరీరం వచ్చి సుఖదుఃఖాలు అనుభవించడానికి ఆరంభింపబడిందో ఆ కర్మ ప్రారబ్ధం అనబడుతుంది. ఇట్టి కర్మలతో కూడిన సంసార చక్రం నుండి విముక్తిపొంది

శాశ్వతానంద ప్రాప్తికి పరితపించు జీవుని వేదన వ్యజ్య మానం జేయ బడింది. ఇందు మానవ జీవన ప్రమాణం, సాఫల్యం, సద్ధర్మ కర్మాచరణం గురించి తత్త్వబోధ ఉంది. సర్వేశ్వరుడు సృష్టి స్థితి లయకారుడు, అనంత కాల స్వరూపుడు. త్రిగుణాతీతుడు. వేదవిహితమైన కర్మల నాచరింప జేయుచు జీవాత్మలకు సార్థక్యం జేయుచునడిపించువాడు.సంసార చక్రంలో పడిన జీవాత్మలను ఆయా కర్మలననుసరించి ఉద్ధరించువాడు. కావున మానవుని సుఖదుఃఖాలు భగవంతుని కృపాఫలములని శ్రీ ఆదివరాహస్వామి అష్టోత్తర శతపద్యకృతి ప్రబోధిస్తుంది.



# తెలుగుబిడ్డ - ముక్తక కావ్యం

## మూడవ అధ్యాయం

### III. తెలుగుబిడ్డ దేశభక్తి కావ్యం

ఆచార్యులు రచించిన మరొక ముక్తక కావ్యం తెలుగుబిడ్డ. సుమారు నూటాయాబది పద్యాలు "తెలుగుబిడ్డ" అనుమకుటం కలిగి శతకముక్తక కావ్య లక్షణంతో దేశభక్తి, జాతీయభావ స్ఫురణ పరివ్యాప్తమై తెలుగుబిడ్డ కావ్యరచన సాగింది. వీనిలో ఏబది పద్యాలు విద్యార్థుల గుణశీల సంపత్తికి మార్గదర్శనం జేస్తూ బాల సాహిత్యానికి ప్రకృష్టతను ప్రసాదించాయి. దేశ ప్రజలు- వారి భాష-పతాకం, జాతీయ నాయకులు. దేశభక్తులు – వారి మహత్తర కార్య సాధనలు పేర్కొనబడి జాతికీర్తి పతాక ఎగురవేయబడింది. ఆచార వ్యవహార సంపత్తి, నాగరికత సంస్కృతులు, కులమత వర్ణ రహిత మైన సమాజం ఏకత్రితం జేసే భావచిత్రణం ఈ కావ్యమందు కనిపిస్తుంది. జాతీయ కవుల దేశభక్తి సాహిత్యానికి విశిష్టమైన పార్శ్వాన్ని ప్రసాది స్తుంది. ప్రజలను ఉత్తేజితులనుజేసి, నవవికాస శకానికి నాంది పలుకు తుంది. ఆచార్యులు తమ ప్రతిభచే కవిత్వాన్ని సాధనంగా గ్రహించి సమాజ సంస్కరణకు. పరివర్తనకు నిలయంగా ఈ కావ్యరచన జేశారు. తాముజన్మించిన తెలంగాణసీమనుగాకయావద్భారతదేశంపై త్రికరణశుద్ధిగల ప్రేమతో దేశ గౌరవాన్ని అన్ని కోణాల్లో చక్కదిద్దడానికి ప్రయత్నించారు. చైనా పాకిస్తాన్‌ల దురాక్రమణం జేసిన సందర్భాలు తెలంగాణా విముక్తి పోరాట చైతన్యం ఆంధ్రోద్యమస్ఫూర్తి, స్వాతంత్ర్య సమరం, గ్రంథాల యోద్యమం, తెలుగు సాహిత్య వికాసం, మాతృదేశ నైసర్గిక స్వరూపం, పూర్వ వైభవ [illegible] దేశభక్తి పరిమళం గుబాళింప చేయబడింది.

మాతృభూమి సేవకు పునరంకితంగావలసిన ఉద్యమభావం నినదింపబడి జాతీయ భావన ఊపిరులు పోసికొన్నది.

## మాతృదేశ సంకీర్తనం

జనని జన్మభూమి స్వర్గం కన్న మిన్న అను ప్రేమభావంతో భరత మాతను కన్నతల్లిగా పూజించు ఉదాత్త భావన జాతీయ జీవితానికి పరాకాష్ఠ

"భరతమాత వంటి బంగరు తల్లికి
మంచుకొండ వజ్రమణి మకుటము
వింధ్య శైలమదియె విలుపైన మొలనూలు
తీర్థ సేతువందె తెలుగుబిడ్డ" (3వ పద్యం)

మాతృదేశంపైగల ప్రణయంతో దేశభక్తి కవిత్వం పుట్టుకొస్తుంది. మాతృభూమి పట్ల అచంచలమైన ప్రేమ ఆదర విశ్వాసాలు ప్రస్ఫుటమౌతాయి.

"ఎవ్వరేని నీది ఏ దేశమనినచో
భరతదేశమనుచు బదులు పలుకు
మీరలెవ్వరనిన భారతీయులమని
తెలుప వలయునెపుడు తెలుగుబిడ్డ" (బాలనీతి 1వ పద్యం)

ఈ భావన "భరతభూమిపై జన్మించినందురకు భరతమాతను భక్తితో ప్రేమించి నందులకు అదృష్టవంతుడుగా భావించిన" విశ్వకవి రవీంద్రుని ప్రబోధం స్ఫురణకు వస్తుంది1 భారతదేశం నా మాతృదేశం, నేను భారతీయుణ్ని అని గర్వంగా చెప్పుకోవలసిన బాధ్యత ప్రతి పౌరునికి ఉండవలెనను ప్రబోధం గావింపబడింది. భారతమాతకు గంగా యమునలు కంఠహారాలు, పాశ్చిమ ప్రాచ్యోద్రులు బాహుభూషణాలు,ఎఱ్ఱకోట సింధూర తిలకం.

---

1 "Blessed am I that Iam born to this land and that I had the Luck to Love her." –Poems: Vishva Bharathi Publications 1946.– Page – 54

ఎందరో త్యాగధనుల ఆత్మార్పణ ఫలితం నేటి మన స్వాతంత్ర్యం ప్రజాస్వామ్యంలో ఎఱ్ఱకోటపై రెపరెపలాడు జాతీయజెండా భారతమాతకు సింధూర తిలకం వలె భారత సౌభాగ్యాన్ని కాపాడుతుంది. ఇక భారతమాత అంతస్స్వరూపం రూపు కట్టించిన విధం అపురూపమైంది.

"భారతమాత సాధుస రస హృదయ
సస్యసుశ్యామల మధుర గాత్ర కాంతిమ
చ్చరిత్ర, సకలలోక మిత్ర నిఖిల పుణ్య
క్షేత్ర, దివ్యమైన ఆమె పవిత్రామల పుణ్య
చరిత్రం విశ్వవిఖ్యాతమైనది" (6వ పద్యం)

ఇట్టి భవ్యదివ్యమాత కన్నబిడ్డలు బహుశాంత శూరులు, ధర్మవీరులు అత్మ తత్త్వ విదులు, సకలశాస్త్ర నిధులు, శాంతి ప్రియులు, మేరుధీరులు, సత్యధనులు, విశ్వ సంక్షేమకారులు, ఆర్త రక్షకులు, ఆస్తికులు, ఆర్యవరులు భగవదవతార దివ్య పవిత్ర కర్మాచరణంతో పునీతమైంది భరతభూమి. "సత్యం ధర్మం త్యాగం రూపొందిన మహాపురుషుల మరువబోకుము" ధర్మ కర్మవీరులను కన్నతల్లి భారతభూమిని మరువబోకుము అను ప్రబోధం జేయబడింది.

"ప్రాణ విత్తములకు పైది జాతి పతాక
జాతి విజయములకు సత్ప్రతీక
జాతి దృక్పథైక జాగృతి జయరేఖ
నిలుపు నీ పతాక తెలుగుబిడ్డ" (10వ పద్యం)

విభిన్న మతాల వారినీ, విభిన్న భాషలు మాటాడువారినీ భేదభావం మాన్పి, ఒకేగొడుగు నీడలోకి తెచ్చే మహారూపం జాతీయత, భారతదేశంలో అందరికీ ఒకేకులం, ఒకేమతం, ఒకేపాలనం, ఒకేనీతి, న్యాయం, చట్టం. జాతిని ఐక్యపరచేది జాతీయ పతాకం. అదే త్రివర్ణ పతాకం.

హక్కులను సాధించి, బాధ్యతలను నిర్వర్తించి సత్వర లక్షణంతో జాతినీతి ఖ్యాతిని నిలుపడానికి జాతీయ పతాక గగన సీమలో రెపరెపలాడ

టానికి ప్రతి పౌరుడు బాధ్యతతో ప్రవర్తించి పురోగమించాలని పతాక స్థాయిలో మాతృదేశ సంకీర్తనం జేయబడింది,

## ఆంధ్రాభిమానం

"తెలుగుబిడ్డ" కావ్యనామౌచిత్యం ఆంధ్రాభిమాన పురస్సరమని స్పష్టమౌతుంది.

"తెలుగునాడు లలిత కళలకు నిలయమ్ము
తెలుగుజాతి తెలివి-వెలుగుజాతి
ఆంధ్రదేశమాంధ్రులని వయిపేరులున్
కలవు తెలియుమయ్య తెలుగుబిడ్డ" (2వ పద్యం)

తెలంగాణం, రాయలసీమ, కోస్తా ప్రాంతం కలసి త్రిలింగదేశం. తెలుగునాడు ఆంధ్ర శాతవాహనులేలిన త్రిలింగదేశమే ఆంధ్రప్రదేశం. చరిత్ర ప్రసిద్ధమైన ఆంధ్రజాతి ఖ్యాతి నిలుపటం ప్రతి ఆంధ్రుని ప్రథమ కర్తవ్యమని ప్రబోధింపబడింది.

"శాలివాహనుడను శక పురుషుడును, ఆంధ్ర
విష్ణుకాకుళాంధ్ర దేవుడాది విదిత భారతావనీ
శులు మన తెలుగువీరులయ్య తెలుగుబిడ్డ (47వ పద్యం)

ఆంధ్ర శాతవాహనుల, కళా ప్రవీణమైన పాలనావైభవం, తెలుగువీరుల పరాక్రమ ప్రశస్తి పలుమార్లు స్మరింపజేయడం వల్ల ఆంధ్రాభిమానం అంచులు దాటి ప్రబోధిస్తుంది.

"ఆంధ్రరాష్ట్ర సిద్ధికై తీవ్ర ప్రాయోపవేశ
దీక్షబూని విలువ ప్రాణములను కానుకబెట్టి
పొట్టి శ్రీరాములు కలను మఱువ వద్దు తెలుగుబిడ్డ" (39వ పద్యం)

ఆంధ్రరాష్ట్రావతరణోద్యమ ఫలమును పొంది పునరంకితం జేసే ఆకాంక్ష ప్రకటితమైంది. శాంతి భద్రతలకు భంగం లేని జాతిచిరకాలం మనగలుగుతుంది. ప్రశాంత స్థితిలో దేశసమగ్రతకు శత్రువుల వల్లగ్లాని

గలిగే సమయంలో దేశ ప్రజలను వీరరసావతార మూర్తులగానొనర్చి వారిలో [illegible] తేజ పరచి కర్తవ్య ప్రబోధం జేయడం కవికి లక్ష్యమైంది.

## గత వైభవ స్మరణం

గతమను పునాదిపై వర్తమాన సౌధం స్థిరంగా ఉంటుంది. గతాన్ని వర్తమానానికి సంధానించి భవిష్యత్తుకు బంగారు బాట వేయాలను సంకల్పంతో కావ్యంలో పూర్వవైభవం పునరాలోకితమై ప్రస్తుత కర్తవ్యాన్ని ప్రబోధింప జేయుచున్నది.

హైందవ రాజ్య నిర్మాత ఛత్రపతి శివాజీ, పృథ్వీరాజు, రాణా ప్రతాప సింహుడు, చాణక్య చంద్రగుప్తుల ప్రశస్తితోపాటు, ఆంధ్రదేశ చరిత్రలో స్వర్ణయుగాలను సృష్టించిన ఓరుగల్లు కాకతీయ ప్రభువులు, విజయ నగరాధిపతులు ప్రస్తుతింప బడినారు.

"ఘనత నోరుగల్లు కాకతి సామ్రాజ్య
వీర విజయభేరి వైరితతికి
గుండెవోటుగా మిగులు ప్రతాపుడు
కాకతీయ నృపతిఁ గొలువుఁ దెలుగుబిడ్డ" (24వ పద్యం)

ఢిల్లీ పాదుషాల నెదిరించి పోరాడి ఆంధ్ర పౌరుషాన్ని చాటిన కాకతి ప్రభువు ప్రతాపరుద్రుని వీరగాధలు విజయపరంపరలు ఆంధ్రదేశ చరిత్రలో గర్వకారణాలు.

విజయనగర ప్రభువులు బహమనీ సుల్తానుల నెదిరించి శత్రువులకు గుండెకాలమై స్వర్ణ యుగాన్ని స్థాపించారు. ఆంధ్ర వైభవాన్ని అభిమానంతో కాపాడటం తెలుగుబిడ్డల కర్తవ్యం.

"కత్తులొరసి యాడ కంఠముల్ తెగిపడ
నెత్తుటేర్లు పొంగి యొత్తిపాఱ
పోరు పాపరాయ బొబ్బిలి బెబ్బులిన్
దలపు తెలుగువీర తెలుగుబిడ్డ (21వ పద్యం)

వీరరసాకృతి తాంండ్రపావయ్య కరవాల స్వనంతో జాతిను త్తేజ పరు స్తుంది ఈ కావ్యం.

స్వాతంత్ర్య సమరయోధులు, జాతీయోద్యమాధినేతలు లాలాలజపతి రాయ్, బిపిన్ చంద్రపాల్, బాలగంగాధరతిలక్, సుభాష్‌చంద్రబోస్, భగత్ సింగ్, ఆంధ్రరత్న దుగ్గిరాల, ఆంధ్రకేసరి టంగుటూరి, కాశీనాధుని, గాంధీజీ, నెహ్రూజీ, శాస్త్రీజీ, పటేల్‌ల పంస్మరణం స్వాతంత్ర్యోద్యమ చరిత్రత లపునకు తెప్పించి స్వాతంత్ర్య విలువ అవగతం జేయబడింది.

ఝాన్సీరాణి, రాణి రుద్రమ, మాంచాల, చాంద్‌బీబీ, సరోజినీదేవి, విజయలక్ష్మి పండిట్ ఇందిరాగాంధి భారత వీరనారీమణుల వ్యక్తిత్వాలు ఉన్నత ఆశయాలకు ప్రేరణలుగా చిత్రింపబడినాయి. 1955-1962 చైనా దండయాత్ర 1965 లోని పాకిస్తాన్ దండయాత్రలను కూడ పేర్కొనడం జరిగింది.

"పొరుగు మిత్రరాజ్యములగు పాక్ చైనాలు
కెలికి కయ్యమునకు బిలుచునెపుడు
భారతీయ శాంతి పారీణకిది యం
తిమ పరీక్షయేమొ తెలుగుబిడ్డ (13వ పద్యం)

పాకు నాయకత్వ పట్ట భద్రులగు భు
ట్టో యఃయూబుకును టుంగునకును
గుండె గాలమైన గురుని శ్రీశాస్త్రిని
ధీ ప్రధాని నెంచుః తెలుగుబిడ్డ (4వ పద్యం)

పాక్ చైనాల దురాక్రమణ శీలం, పంచశీల సిద్ధాంతం కాలదన్ని శాంతికి భగ్నం కలిగించడం భారతీయుల్ని ఆగ్రహపరచినాయి. భారత దేశం ఆ దాడులను త్రిప్పికొట్టింది. యుద్ధానికి శాంతికి సర్వ సమర్థ మైందన్న భావం భారతం బుజువు పరచింది. ఈ రెండు యుద్ధాల్లో దేశ భక్తి పటిష్ఠ పడింది. బయట నుండి ఏర్పడే విపత్కర పరిస్థితిలో శత్రు మూకలను చెండాడు ఆత్మధైర్యం కలిగి యుండవలెనను ప్రబోధం సర్వ కాలాలకు వర్తించేదిగా కావ్యం ప్రబోధించింది.

## సంప్రదాయ సంస్కృతి ప్రబోధం

సంస్కృతి సంప్రదాయాలకు జీవభూతమైన శక్తి ఆధ్యాత్మిక భావన కుంటుంది. జగద్గురు శంకరాచార్యులు, శ్రీమద్రామానుజా చార్యులు, వల్లభ చైతన్యులు, రామకృష్ణ వివేకానందులు కశ్యపాత్రి భారద్వాజ గౌతమ విశ్వామిత్ర వశిష్ట జమదగ్న్యులు,ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాం బరీషులు, భీష్మ రుక్మాంగాదులు, తులసీ సూరక బీరుదాసులు, అరుంధతీ అనసూయ, సావిత్రి, సుకన్య, చంద్రమతి, దమయంతి, సక్కుబాయి మొదలగువారు ఆధ్యాత్మిక జగత్తులో మెరిసే ఉజ్జ్వల బింబాల ప్రకాశం దర్శితమైంది. భరతనాట్యం, కూచిపూడి నృత్యం కళాసౌందర్యం కావ్యంలో ప్రసక్తమైంది. పూర్వార్వాచీన సంస్కృతాంధ్ర కవులు పేరుపేరున ఉల్లే ఖింపబడి విలక్షణమైన సమ్యక్ ప్రధానమైన సంప్రదాయం సంస్కృతి తరతరాలకు అందింపబడవలెనని కావ్యం ఉపదేశిస్తుంది.

### బాలనీతి

కుటుంబ మర్యాద కాపాడ వలసిన నీతిని విద్యార్థులు పిన్ననాటనే అలవరచుకోవాలి. పూలతోటలోన పూదీగ కడముద్దు. పూవుదివలోన పూవు ముద్దు. పూవులో గులాబిపూవు ముద్దు, తెలుగుబాలముద్దు. తెలుగుబిడ్డ (2వపద్యం) ముద్దులొలుకు తెలుగు బాలలు గడ్డు పనులు చేయక, తిరుగు బోతులుగాక శీలగుణ సంపత్తి గలవారుగా ఎదగాలి.

ఆహార విహారాల్లో, చదువు సంధ్యల్లో, ఆటపాటల్లో క్రమశిక్షణతో అహింసతో జీవితం అలవర్చుకొన్న విద్యార్థి సత్పౌరుడుగా రాణిస్తాడు. ధూమపానాది దురలవాట్లకు దూరంగా ఉండి, శరీరదార్ఢ్యతను, మానసికా రోగ్యాన్ని సంతరించుకొన్న విద్యార్థి ఆదర్శ మానవుడుగా రూపొందుతాడు. జంకు గొంకు బొంకులేని సత్యబద్ధ జీవితం అలవర్చుకొన్న విద్యార్థి దేశ ప్రగతికి కారకుడౌతాడు.

"చదువుకొన్న జ్ఞాన సంపద యొదవును
చదువుకొన్న బుద్ధి చక్కబడును

చదువుకొన్న దొడ్డ సంస్కార మొదవును
తెలిసి చదువుకొనుము తెలుగుబిడ్డ  (26వ పద్యం)

విద్యార్థి తప్పులు చేసి శిక్షలు పొందక గురువు బోధతో జ్ఞాన సంపద పొంది సంస్కార వంతుడు కావలెనను ప్రబోధం గావింపబడింది.

"కండ బలమ్ము తోడ గుండె బలమ్మును
గుండె బలమ్ముతో నఖండ ప్రతిభ
ప్రతిభ వెంట దైవభక్తి సేవాసక్తి
దేశభక్తి వలయు తెలుగుబిడ్డ  (37వ పద్యం)

నేటి బాలురు రేపటి పౌరులు. కావున విద్యార్థులు చదువులో, సంస్కారంలో, కండ బలంలో, గుండె బలంలో సంపూర్ణ మూర్తిమత్వంతో తీర్చి దిద్దబడాలి అప్పుడు వారియందు దైవభక్తి, సేవాసక్తి, దేశభక్తి అనివార్యంగా వర్థిల్లుతుంది. గురుశిష్య బంధం, గురువు గురుతర బోధన బాధ్యత, శిష్యుని క్రమశిక్షణాయుత విద్యార్జన దేశ సర్వతోముఖాభివృద్ధికి సోపానాలని ఈ కావ్యం ప్రబోధిస్తుంది.



# అనుబంధం

## ఉపయుక్త గ్రంథాలు - వ్యాసాలు - పత్రికలు

1. అప్పకవీయము-అప్పకవి
2. అగ్నిధార-డా॥ దాశరథి
3. ఆధునికాంధ్ర కవిత్వము- సంప్రదాయములు-ప్రయోగములు
డా॥ సి. నారాయణరెడ్డి
4. ఆంధ్ర సర్వస్వము-మాగంటి బాపినీడు. 1961 రాజమండ్రి
5. ఆధునికాంధ్ర కవితా సమీక్ష-కాకర్ల వెంకటరామ నరసింహం
6. ఆంధ్రుల జానపద విజ్ఞానం-డా॥ ఆర్.వి.యస్. సుందరం
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 1983
7. ఆధునిక కావ్య శాస్త్రము కవిసేన మానిఫెస్టో
గుంటూరు శేషేంద్రశర్మ
8. ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ-సాంప్రదాయకరీతి
డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు
9. ఆంధ్ర ప్రబంధ వాఙ్మయము-డా. పల్లా దుర్గయ్య
10. ఆంధ్ర శబ్ద రత్నాకరము- చెలమచర్ల రంగాచార్యులు
(ద్వితీయ సంపుటము)
11. ఆంధ్ర మహాభారతము-విరాటపర్వం-తిక్కన
12. ఆంధ్ర కవుల చరిత్ర 1వ భాగం-కందుకూరి వీరేశలింగం
13. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము- చెలమచర్ల రంగాచార్యులు
14. ఆంధ్ర ధ్వన్యాలోకము-తిరువేంగళాచార్యులు
15. ఆముక్తమాల్యదా సౌందర్యం-డా. టి. కోటేశ్వరరావు
16. ఆధునిక కవిత్వ సమాలోచనం-పరిశోధన-స్వరూపం
ఆచార్య మాదిరాజు రంగారావు
17. ఆముక్త మాల్యద- శ్రీకృష్ణదేవరాయలు
18. ఆంధ్రావళి-రాయప్రోలు
19. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర-దివాకర్ల వేంకటావధాని

20. ఈశావాస్యోపనిషత్తు
21. ఉత్తరరామ చరిత్రము-భవభూతి
22. ఉపదేశ రత్నమాల-మనవాళ మహామునులు
23. కవి శిరో భూషణము-అహోబల పండితుడు
24. కావ్యాలంకార సూత్రవృత్తి-వామనుడు
25. కావ్యాలంకారము-భామహుడు
26. కావ్యదర్శము-దండి
27. కావ్యాలంకార చూడామణి-విన్నకోట పెద్దన
28. కావ్యాలంకార సంగ్రహము-సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి
29. కావ్యదర్శనము-మమ్మటుడు
30. కుమార సంభవము-నన్నెచోడ కవిరాజు
31. కృషీవలుడు-దువ్వూరి రామిరెడ్డి
32. కోయిల్ తిరువాయ్‌మొళి నమ్మాళ్వారు
33. గాంధీ-గాంధీ తత్త్వం-రెండవభాగం
డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య అనువాదం కొడాలి ఆంజనేయులు
34. గాంధీ మహాత్ముడు-నూరేళ్ళు-సంపాదకుడు - డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ-తెలుగుసేత-పొత్తూరు వుల్లయ్య
35. గాంధీ దర్శనము-సంకలనము-అనువాదం
ఉప్పులూరి వేంకట సుబ్బారావు
36. గాంధేయ విలువలు-20వ శతాబ్దపు సవాళ్లు
అనువాదం-కె.వి. సత్యనారాయణ
37. తిక్కన కావ్యశిల్పము-డా. కేతవరపు రామకోటిశాస్త్రి
38. తెలుగు సామెతలు-సాహిత్య అకాడమి
39. తైత్తరీయోపనిషత్తు-భృగువల్లి
40. తిరుప్పావై-అనువాదం-శ్రీమాన్ సుదర్శనాచార్య శిరోమణి
41. దశరూపకమ్-ధనంజయుడు
42. ధ్వన్యాలోకము-ఆనంద వర్ధనుడు
43. ధ్వని-మనుచరిత్రము-డా. రాజన్నశాస్త్రి
44. నవ్యాంధ్ర పంచకావ్య పరిశీలనము-నరసింహ దేవర ఉమామహేశ్వరశాస్త్రి

